# శ్రీరామ మంత్రానుష్ఠానము




గ్రంథకర్త :

శ్రీరామశరణ్

కుందుర్తి వేంకటనరసయ్య

సంపాదకుఁడు : 'మోక్షసాధని'





ప్రకటన

శ్రీ రామ శరణ మందిరము

నామప్రయాగ – బుద్దాం.

( యాజలి పోస్టు — గుంటూరు జిల్లా )

1953

వెల రు. 2-8-0

బైండు 3-0-0

గ్రంథములు దొరకుచోట్లు:-

శ్రీరామశరణ మందిరము, బుద్దాం. (యాజలి పోస్టు)

శ్రీ రామనామ క్షేత్రము, గుంటూరు.



★

విజయ - కార్తికము

★

జానకిరాం ప్రెస్, తెనాలి.

ఓమ్

# శ్రీ రామ మంత్రానుష్ఠానము

## తొలిపలుకు

శ్రీరామచంద్రమూర్తి యనుగ్రహమునుబొంది వాల్మీకి, అగస్త్య, నారద వసిష్ఠ, అత్రి, వ్యాస, శుక, జటాయు, శబరి, విభీషణ, సుగ్రీవ, హనుమ, అంగద, జాంబవంత, అహల్యా, గుహ, జనక, తులసీదాసు, తుకారాం, కబీరు, రామదాసు, సమర్థరామదాసు, త్యాగరాజు, నరసింహదాసు, వాసుదాసస్వామి ఇత్యాదులందఱును తరించిరి. వీరందఱును ఆ నామములోని రుచిని గ్రహించి, మనసార జపించి, స్మరించి, ధ్యానించి, కీర్తించి దానిలోఁగల రసమునంతను అనుభవించిరి. ఇంత కారుచి ఆ శ్రీరామచంద్రునిలోను, ఆతని నామములోను గలదు. 'రామో విగ్రహవాన్ ధర్మః' అని కదా శాస్త్రము. శ్రీరామచంద్ర మూర్తి కేవలము ధర్మస్వరూపుఁడు. కల్యాణ గుణము లన్నియు నాయనలోఁ గలవు. అతని నామము భవతారకము. ఆనామ మహిమ అనంతమైనది. శ్రీరామ తత్త్వ మద్భుతమైనది.

## శ్రీరాముఁడు పరబ్రహ్మ

శ్రు॥ రామ ఏవ పరం బ్రహ్మ రామ ఏవ పరం తపః,
రామ ఏవ పరం తత్త్వం శ్రీరామో బ్రహ్మ తారకమ్॥

రాముఁడే పరబ్రహ్మ. రాముఁడే పరమ తపము. రాముఁడే పర తత్త్వము. శ్రీరాముఁడే తారక బ్రహ్మము.

శ్రు॥ రమంతే యోగినోఽనంతే – నిత్యానందే చిదాత్మని,
ఇతి రామపదే నాసౌ – పరం బ్రహ్మాభిధీయతే॥

— రామపూర్వతాపిన్యుపనిషత్.

ఏ యనంత నిత్యానంద చిదాత్మ పరబ్రహ్మమునందు యోగులు రమింతురో యా పరబ్రహ్మమే రామ పదవాచ్యుఁడై యున్నాఁడు.

శ్రీరాముఁడు బ్రహ్మ విష్ణు మహేశ్వరులకంటె విలక్షణుఁడుగఁ జెప్పఁడినాఁడు. నిర్వాణఖండములో శ్రీరామునితో శివుఁడిట్లనెను–

శ్లో॥ భ్రాతరస్తే త్రయోరామ - బ్రహ్మ విష్ణు రహంతథా,
త్వత్తో వినిర్గతా హ్యేతే - త్వయ్యేవ విలయం గతాః॥

త్వమేవ పరమం గుహ్యం - త్వమేవ పరమం పదమ్,
త్వమేవ పరమం బ్రహ్మ - త్వమేవ శరణం హినః॥

ఓ రామా! బ్రహ్మ, విష్ణువు, నే (రుద్రుఁడ) ను మేము ముగ్గుర మన్న దమ్ములము. వీరు నీనుండి బయలు వెడలిరి. నీలోనే లీనమగుదురు. నీవు పరమ గుహ్యుఁడవు. నీవే పరమ పదము. నీవే పరబ్రహ్మవు. నీవే మాకు శరణము.

శ్లో॥ త్వం రజోగుణతో బ్రహ్మ - జగతస్సర్వకారణమ్
సత్త్వాద్విష్ణు స్త్వమేవాసి - పాలక స్సద్భి రుచ్యతే॥

లయే రుద్ర స్త్వమే వాస్య - త్వన్మాయా గుణభేదతః
తాసాం విలక్షణ స్సాక్షీ - రామ స్త్వం చిన్మయోఽవ్యయః॥

— అధ్యాత్మ రామాయణము.

నీవు రజోగుణము ననుసరించి సర్వజగత్కారణమగు బ్రహ్మ వగుదువు. సత్త్వము నాశ్రయించి పాలకుఁడగు విష్ణుఁడవైనది నీవే. లయమొనర్చుటకు రుద్రుఁడవు నీవే. ఇదంతయు నీమాయా గుణ భేదము వలననే. చిన్మయుఁడవు. అవ్యయుడవు. రామా! నీవు వానికి విలక్షణుఁడవును, సాక్షివియునై యున్నావు.

శ్లో॥ త్వం విష్ణు ర్జానకీ లక్ష్మీః - శివ స్త్వం జానకీ శివా
బ్రహ్మత్వం జానకీవాణీ - సూర్య స్త్వం జానకీప్రభా
రుద్రాణీ జానకీ ప్రోక్తా - రుద్ర స్త్వం లోకనాశకృత్॥

ఓరామా! నీవు విష్ణుఁడవు. జానకియే లక్ష్మి. నీవు శివుఁడవైన జానకి పార్వతి. నీవు బ్రహ్మవైన జానకి సరస్వతి. నీవు సూర్యుఁడవైనప్పుడు జానికిదేవి నీకాంతి. జానకిదేవి రుద్రాణియైన నీవు లోకనాశకుఁడగు రుద్రుఁడ వగుదువు.

## శ్రీరాముఁడు విష్ణువు

శ్లో॥ రమతే రమయా సార్థం - తేన రామం విదు, ర్బుధాః
రమాణాం రమణ స్థానం - రామం రామ విదోవిదుః॥

రాచేతి లక్ష్మీవచనో - మశ్చాపీశ్వర వాచకః
లక్ష్మీ గణపతిం రామం - ప్రవదంతి మనీషిణః॥

— బ్రహ్మవైవర్త పురాణము.

లక్ష్మీదేవితో రమించువాఁడు కావున రాముఁడని బుద్ధిమంతులు తెలిసి కొనుచున్నారు. సంపదలకుఁ బ్రియమైన స్థానము కావున రాముఁడను పేరు కలిగినది.

'రా' అనఁగా లక్ష్మికి పేరు. 'మ' యనఁగా ఆమెకు ప్రభువు. సంపదలకు ప్రభువైనవాఁడు రాముఁడని బుద్ధిమంతులు చెప్పుదురు.

## శ్రీరాముఁడు శివుఁడే

శ్లో॥ అహం మానుషరూపేణ - రామో భూత్వాహరామితం,
రామో దాశరథిశ్చాహం - కౌసల్యానంద వర్ధనః॥

— పద్మపురాణము - ఉత్తరఖండము.

నేను (శివుఁడు) మనుష్య రూపముతో రాముఁడనై వానిని (రావణుని) జంపెదను. కౌసల్యానంద వర్ధనుఁడగు దశరథ రాజకుమారుఁడగు రాముఁడను నేనే.

శ్లో॥ రామో మమాంశ సంభూత - స్సీతాచ గిరిజాంశజా॥

శ్రీరాముఁడు నా ( శివ ) అంశ సంభూతుఁడు. సీత గౌరీదేవి యంశముగఁ బుట్టినది.

శ్లో॥ శివం మాం ప్రతిజానీథ । నావయో రంతరం ద్విజాః,
ఆవయో రంతరం జ్ఞానం । తదేవాజ్ఞాన మిష్యతే॥

ఓ బ్రాహ్మణోత్తములారా! నన్ను (రాముని) శివునిఁగఁ దెలిసికొనుఁడు. మా యిద్దరకును భేదము లేదు. మా యిద్దరకును భేదము కలదను జ్ఞానమునే అజ్ఞానమందురు.

శ్లో॥ రామ ఏవ హరో జ్ఞేయః । శివ ఏవ రఘూత్తమః,
ఉభయో ర్నాంతరం జ్ఞేయం । భేదకృన్నారకే నరః॥

శ్లో॥ రామ శంకరయోర్మధ్యే । భిన్నత్వం యేన మానితమ్,
అజాగళ స్తన మివ । తస్య జన్మ నిరర్థకం.

— దుర్వాస రామాయణము.

రాముడే శివుడు. శివుడే రాముడు. వీరిద్దరకును భేదమెంచువాడు నరకవాసి కాగలడు. రామునకు శివునకు భేదమెంచు మానవుని జన్మ మేక మెడక్రింది చన్నులవలె నిరర్థక మగును.

శ్లో॥ కాలాత్మా సర్వదేవాత్మా । సర్వకాలేషు మాం సదా,
శివ విష్ణ్వాత్మకః పాయా । చ్ఛ్రీరామో భక్తవత్సలః.

నన్నెల్లప్పుడును కాలాత్మునిగను, సర్వదేవతాత్మునిగను దెలియ వలయును. శ్రీరాముడు శివవిష్ణ్వాత్మకుడు.

ఈ శ్రీరామ మంత్రమును శైవులు, వైష్ణవులు కూడ జపింతురు. ఈ మంత్రము వైష్ణవులకు ముఖ్యమంత్రమగు నారాయణ అష్టాక్షరిలోని 'రా' యను నక్షరమును, శైవులకు ప్రధానమంత్రమగు శివపంచాక్షరిలోని 'మ' యను నక్షరము కలిసి 'రామ' అయినది. కావున నీ మంత్రము నుపాసించుట కెవరికిని బాధ అవసరము లేదు.

శ్లో॥ తథైవ చక్రతూ రాజన్ రామో హరి హరాత్మకః
శివ రూపేణ సంహారం విష్ణు రూపేణ పాలనమ్॥

— స్కాందపురాణము.

శ్రీరాముడు హరిహరాత్మకుడు. శివరూపమున సంహారమును, విష్ణు రూపమున బాలనమును జేయును.

## శ్రీరాముడు ఆదిత్య స్వరూపుడు

శ్లో॥ ఆదిత్యాది గ్రహా స్సర్వే - త్వమేవ రఘునందన!

రామచంద్రా! సూర్యాది గ్రహములన్నియు నీవే. 'సూర్యో గ్రహపతి శ్శ్రీమాన్' అని రాముని కన్వయించుటచే సూర్యస్వరూపుడుకూడ రాముడే.

# శ్రీరాముఁడు శక్తి స్వరూపుఁడు

శ్లో॥ శ్రీకృష్ణః శ్యామలాదేవీ శ్రీరామో లలితాంబికా॥

— దేవీమంత్రరహస్యము.

శ్రీకృష్ణుఁడు శ్యామలాదేవి స్వరూపమనియు, శ్రీరాముఁడు లలితాంబ యనియు శాస్త్రము.

గాయత్రీ మంత్ర సంపుటిచే శ్రీమద్రామాయణ ముండుటయు, కాళికా పూజ సమయమున రామాయణ పారాయణము చేయుచుండుటయు గమనింప నగును.

# శ్రీరాముఁడు గణపతి స్వరూపుఁడు

శ్లో॥ గాణాపత్యాది మంత్రేషు కోటికోటి గుణాధికః॥

అనుటచే గణపతి మంత్రములలో ననేక కోట్లరెట్లధిక మైనది రామ మంత్ర మనియు శాస్త్రము కలదు.

ఇట్లు శ్రీరామచంద్రమూర్తి పంచదేవతా స్వరూపుఁడగుటయేగాక కేవల ఆత్మారామ స్వరూపుఁడునై యున్నాఁడు. కావున నీస్వామిని భజించుట కేమతము వారికి నేవిధమగు ప్రతిబంధకమును లేదు.

వేయేల? నీమంత్రమును శివుఁడు నిరంతరమును జపించు చుండును. ఇది ప్రణవముతో సమాన మైనదియే కాదు, దానికంటె నుత్తమైనది.

కావుననే శాస్త్రములు రామమంత్రమునకు మించినది లేదని చెప్పు చున్నవి. సంసారమును దరింపఁజేయు మంత్ర మిదియే. అందుకనియే దీనికి తారకమను ఖ్యాతి కలిగినది.

శ్లో॥ సంసారార్ణవ సంమగ్నం నరం య స్తారయే, న్మనుః
స ఏవ తారక స్తత్ర రామమంత్రః ప్రకథ్యతే॥
రామనామాత్పరో మంత్రో నభూతో నభవిష్యతి॥

సంసార సముద్రములో మునిఁగి యున్న మానవుని దరింపఁ జేయు మంత్రము కావున రామమంత్రమునకు తారకమను ఖ్యాతి కలిగినది. రామ మంత్రమునకంటె శ్రేష్ఠమైన మంత్రము ఇదివఱకు లేదు. ఇఁక నుండఁబోదు.

శ్లో॥ మంత్రరాజ ఇతి ప్రోక్త - స్సర్వేషా ముత్తమోత్తమః॥

దైనం దినంతు దురితం - పక్షమాసర్తు వర్షజం।
సర్వం దహతి నిశ్శేష - మూర్నాచల విహానలః॥

బ్రహ్మహత్యా సహస్రాణి - జ్ఞానాజ్ఞాన కృతానిచ।
స్వర్ణస్తేయ స్సురాపాన - గురుతల్పాయుతానిచ॥
కోటికోటి సహస్రాణి - హ్యుపపాతకజా న్యపి।
సర్వాణ్యపి ప్రణశ్యంతి - రామమంత్రాను కీర్తనాత్॥

భూతప్రేత పిశాచాద్యాః - కూష్మాండ గ్రహరాక్షసాః।
దూరాదేవ ప్రధావంతి - రామమంత్ర ప్రభావతః॥

మాలిన్యమపి సాంకర్యం - సందుష్టం యచ్చదూషితం
సర్వం విలయ మాప్నోతి - రామమంత్రాను కీర్తనాత్॥

ఆ బ్రహ్మబీజ దోషశ్చ - నియమాతి క్రమోద్భవాః।
స్త్రీణాంచ పురుషాణాంస్స్య - ర్మంత్రేణానేన శాపితాః॥

యేషు యేష్వపి దేశేషు - రామః పరముపాస్యతే।
దుర్భిక్షాది భయం తేషు - న భవేత్తు కదాచన॥

శాంతః ప్రసన్నో వరదోఽ - క్రోధనో భక్తవత్సలః।
అనేన సదృశో మంత్రో - జగత్స్వపి నవిద్యతే॥

అనేనా రాధితో దేవః - ప్రసీదత్యేవ సత్వరమ్।
దదాత్యాయుష్య మైశ్వర్యం - సమానోత్తమతామపి॥

య ఏవ ముక్త మార్గేణ - మంత్రారాధన తత్పరః।
స కామో భుక్తి మాప్నోతి - నిష్కామో ముక్తిమేవచ॥

ప్రాప్నోత్యుభయ కామశ్చే - ద్భుక్తిం ముక్తిం నసంశయః॥

— అగస్త్యసంహిత.

ఈ మంత్రమునకు మంత్రరాజమను పేరు గలదు. ఇది అన్నిటికంటె ఉత్తమమైనది. దినదినము చేసిన పాపమును, పక్షములందును, మాసములందును, ఋతువులందును జేసిన పాపములన్నియును దూదికొండలో నగ్నిపడిన నది భస్మమైనట్లు భస్మము కాఁగలదు. తెలిసిగాని, తెలియకగాని చేసిన వేలకొలఁది బ్రహ్మహత్యలును, బంగారు దొంగిలించుట, సారాయముత్రాగుట, గురుభార్యా సంగమము ఇట్టి మహాపాతకములు పదివేలు చేసినను, కోటానుకోట్ల ఉప పాతకములు చేసినను ఇవన్నియును శ్రీరామమంత్రాను కీర్తనము వలన నశించి పోఁగలవు. రామమంత్ర ప్రభావము వలన భూతప్రేత పిశాచాదులును, కూష్మాండాది గ్రహరాక్షసులును దూరముగాఁ బారిపోవును. దుష్టమాలిన్యము గాని, దూషిత సాంకర్యముగాని రామమంత్ర కీర్తనమువలన నశించిపోవును. నియమాతిక్రమణమున బ్రాహ్మణుల మొదలుకొని కలిగిన బీజదోషములు స్త్రీలకు గాని, పురుషులకుఁగాని కలిగిన నీ మంత్రము వలన నశించిపోవును ఏయే ప్రదేశ ములలో రాముఁడుపాసింపఁబడుచున్నాఁడో, అచ్చట దుర్భిక్షాది భయము లెన్నటికిని సంభవింపవు. శ్రీరాముఁడు శాంతుఁడు. ప్రసన్నుఁడు. వరము లొసఁగువాఁడు. కోపము లేనివాఁడు. భక్తవాత్సల్యము కలవాఁడు. ఇట్టి మంత్రము జగములలో నెచ్చటను లేదు. దీనిచే నారాధించినచో త్వరగా ప్రసన్నుఁడై ఆయుష్యము, ఐశ్వర్యము, నొసంగును. చెప్పిన చొప్పున మంత్రారాధన చేయువాఁడు సకాముఁడైన భుక్తిని బొందును. నిష్కాముఁ డైన ముక్తిని బొందును. అభయకాముఁడైన భుక్తిముక్తుల రెంటిని బొందును.

శ్లో॥ రామ మంత్రాస్తు విప్రేంద్ర — శీఘ్రం ముక్తిప్రదాశ్శృణు,
విసైవ దీక్షాం విప్రేంద్ర — పునశ్చర్యాం విసైవహి॥
విసైవ న్యాస విధినా — జపమాత్రేణ సిద్ధిదాః॥ — అగస్త్యసంహిత.

రామమంత్రము త్వరగా ముక్తి నొసంగును. దీక్షలేకయే పురశ్చర్య లేకయే, న్యాసవిధి లేకయే జపము చేతనే సద్ధింపఁగలదు.

ఇట్టి రామ మంత్రమున కందఱు నధికారులే.

శ్లో॥ స్త్రియః పతివ్రతాశ్చాన్యే — ప్రతిలోమానులోమజాః,
లోకే చండాల పర్యంతం — సర్వేప్యత్రాధి కారిణః॥
— అగస్త్యసంహిత.

పతివ్రతలగు స్త్రీలును, ప్రతిలోములును, అనులోములును, లోకములో చివరకు చండాలుర వఱకు నందఱు ఈ మంత్రమున కధికారులే.

మంత్రశక్తి అద్భుతమైనది అవి కేవలము అక్షరముల కూడిక యనుకోవ కాదు. దానిలో నిగూఢమగు శక్తి కలదు. క్షుద్రములగు తేలు, పాము మంత్ర ములే శరీరములోని కెక్కిన విషమును విఱిచి వేయుచుండ కేవలము సైని కమై, మహాత్ములచే నుపాసింపఁబడినదైన రామమంత్రముయొక్క శక్తి యేమని వర్ణింపవలయును. రామమంత్రశక్తి బాహ్యోపయోగములకు వినియోగింపరాదు. ఆ మంత్రము కేవలము శరీరము, ఇంద్రియముల మీఁదగాక, అంతఃకరణము, ఆత్మ వీనిమీఁద దాని ప్రభావమును జూపించుచుండును. కావుననే దానిశక్తి మనకు క్షుద్రమంత్రములకు వలె త్వరగా దృగ్గోచరము కాదు. అది ఆత్మలోని అనేక జన్మసంచిత కర్మలన్నిటిని క్రమక్రమముగాఁ దుడిచి పాఱవేయును. అంత ఆత్మను ప్రారబ్ధక్షయము కాఁగానే ఆత్మారాముని కడకు జేర్చును. దీనికి పరమ విశ్వాసమున్న ఫల మధికమగును శీఘ్రముగను గలుగును.

శ్లో॥ మంత్రే తీర్థే ద్విజే దైవే దైవజ్ఞే భేషజే గురౌ,
యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ॥

మంత్రము నందును, తీర్థము నందును, బ్రాహ్మణుని యందును, దైవము నందును, జ్యోతిష్కుని యందును, వైద్యునియందును, గురువునందును ఎట్టి భావముండునో అట్టి సిద్ధియే కలుగును.

కావున విశ్వాసము చాల ఆవశ్యకము. ఇట్టి విశ్వాసముతోడనే ఈ మంత్రానుష్ఠానమును జేయవలెను. అది చేయు విధానమును దెలిసికొన వల యును. నేను కవిసార్వభౌమ, ఆంధ్రవాల్మీకి సద్గురు వాసుదాస దేశికస్వామి వారివద్ద శ్రీరామ మంత్రము నుపదేశమును బొంది వారి వలనఁ గొన్ని విషయ ములను దెలిసికొంటిని. నేనును, నా స్నేహితులు కొందఱు శ్రీ శ్రీ శ్రీ ప్రభు దత్త్త బ్రహ్మచారిగారు చేయుచున్న విరాట్ సంకీర్తన యజ్ఞమునకు ప్రయా గకు వెళ్ళగా నచ్చట మాకు ఒక స్వామి (శరీరముతో నంతర్ధానమైన సిద్ధపురు షుఁడు) దర్శన మొసంగుటయే సేవలొసంగి అనుగ్రహించెను. శ్రీరామ మంత్ర మును, మంత్రార్థమునుగూడ ప్రసాదించిరి. మఱుసంవత్సరము ప్రయాగ, కాశీ,

అయోధ్య, బృందావనము, గోవర్ధనము, హరిద్వారాము వీనిలో నొక్కొక పురశ్చరణము చేయఁబోతిని. అట్లు చేయు సమయమున మరల నా యంతర్ధాన మైన స్వామి దర్శన మొసంగి కొన్ని సాధన రహస్యములను ప్రసాదించెను. అయోధ్యలో స్వర్గద్వారమున సరయూ తీరప్రదేశమునఁ గూర్చుండి పురశ్చరణ జపము చేయుచుండ నచ్చట నొక మహంతు మహాశయులు అనుగ్రహించి కొన్ని మంత్రరహస్యములను ప్రసాదించిరి. అట్టి రహస్యములు కల కొన్ని గ్రంథములను జెప్పిరి. కొన్నిటిని బంపిరి. అచ్చట దీక్ష నొసంగి సీతాహనుమ ల్లక్ష్మణ, భరత, శత్రుఘ్న మంత్రముల నొసంగి, దీక్షా నంతర మరియొక జన్మయేయని శాస్త్రముండుటచే నా సాధువుంగవుఁడు వీనికి 'శ్రీరామశరణ్' అను దీక్షా నామకరణము కావించెను. అమ్మహాత్ముని యనుగ్రహమునను, ముఖ్యముగ నాకు ఏడుగడయు, సద్గురువును, పరదైవతమునగు శ్రీ వాసుదాస దేశిక స్వామి కృతచేతనే నాకు తెలిసిన యీ స్వల్ప విషయములను సాధకులకు పరమోప యోగముగ నుండునను తలంపుతో నీ పుస్తక రూపమున వెలువఱచు చున్నాను. పండితుడను గాకఁపోవుటచే నన్వయ దోషములును, భాషాదోష ములును, సాంప్రదాయిక విజ్ఞానము నెఱుకపఱచుటలోగల లోపము లనేకము లుండవచ్చును. పండితులు, గురువులు, సాంప్రదాయకులు వాటిని దెలిపిన రెండవ ముద్రణములో సవరించుకొనఁగలను. ఇందు లోకమునకుఁ దెలియని విశేషము లేవైన నున్నచో నవియన్నియు నా గురువుల అమృత వాక్కులేకాని నా ప్రయోజకత్వమేమియులేదని సవినయపూర్వకముగ విన్నవించుకొనుచున్నాను.

ఇంక ననేక విషయములు మంత్రవిషములోఁ జెప్పవలసినవి కలవు. కాని యిప్పటికే గ్రంథము చాలవిస్తరమైనది. ఈ మంత్రయోగమునఁ జర్చింపబోవుఁ పదునాఱంగములు ఒక్కొక్కటి ఒక్కొక్క గ్రంథముగఁ జెప్పవలసిన అవ సరమును గలదు. కాని యిది స్థలము కాదు. ముఖ్యముగ మంత్రానుష్ఠానమునకు గావలసిన విషయములను కొన్నిటిని కొంచెము విపులముగఁ జర్చించితిని. దీనిని వ్రాసి షుమారు నాలుగు సంవత్సరములైనది. కాని మోక్షసాధని కార్యములు, భాగవతి కథానుసారము, ఇతర రచనలు, భగవద్భక్తి నామప్రచారము' అను ష్ఠానము, స్వంతమందిర కార్యములు, అన్నిటికంటె ఉద్యోగ ప్రతిబంధము ఎక్కువగ నుండుటచే దీనిని శుద్ధప్రతి వ్రాయ వీలులేక పోయెను. కొందఱు స్నేహితులు ఇది చాల ముఖ్యమని వత్తిడి చేయుటచే నవకాశము చేసికొంటిని.

నా బాధ్యత తీరినది. దీనిని జదివి యనుష్ఠానములోఁ బెట్టుకొన వలసిన బాధ్యత మీది.

సత్పురుషులు, శ్రీ బొలిసెట్టి సీతారామయ్యగారు, ఈ గ్రంథ ముద్రణకు తగురీతిగా సాయమొనర్చి తోడ్పడినందులకు వారికి, వారి కుటుంబమునకు శ్రీరామచంద్రుడు ఆయురారోగ్య ఐశ్వర్యములిచ్చి రక్షించుగాక! యని ప్రార్థించు చుంటిని.

శ్రమకోర్చి గ్రంథము సరిచూచియు, ప్రూఫులు చూచియు తోడ్పడిన సాధన గ్రంథ మండలి, తెనాలి. వ్యవస్థాపకులు, విద్వాన్ శ్రీ బులుసు సూర్యప్రకాశ శాస్త్రిగారికిని, సమయమునకు సర్వాంగసుందరముగ నచ్చువేసి యిచ్చిన జానకిరాం ప్రెస్ వారికిని నా కృతజ్ఞతలు.

వికృతి<br>విజయ దశమి. }

శ్రీ రా మ శ ర ణ్

—*—

# విషయసూచిక

—*—



గ్రంథకర్త :
'శ్రీరామశరణ్' కుందుర్తి వేంకట నరసయ్య

ఓమ్

# శ్రీరామ మంత్రానుష్ఠానము

## మంత్రయోగాంగములు

### ౧. భక్తి

శ్లో॥ భవంతి మంత్రయోగస్య – షోడశాంగాని నిశ్చితమ్,
యథా సుధాంశోర్జాయంతే – కలాః షోడశ శోభనాః॥

భక్తిః, శుద్ధిశ్చాసనంచ, – పంచాంగస్యాపి సేవనమ్,
ఆచార, ధారణే, దివ్య – దేశ సేవన మిత్యపి ॥

ప్రాణక్రియా, తథా ముద్రా, – తర్పణం, హవనం, బలిః,
యోగో, జపస్తథా, ధ్యానం – సమాధిశ్చేతి షోడశ ॥

చంద్రునకు పదునాఱు కళలువోలె మంత్రయోగమునకును బదునాఱు అంగములు కలవు. ౧. భక్తి, ౨. శుద్ధి, ౩. ఆసనము, ౪. పంచాంగ సేవనము, ౫. ఆచారము, ౬. ధారణ, ౭. దివ్యదేశ సేవనము, ౮. ప్రాణక్రియ, ౯. ముద్ర, ౧౦. తర్పణము, ౧౧. హవనము, ౧౨. బలి, ౧౩. యాగము, ౧౪. జపము, ౧౫. ధ్యానము, ౧౬. సమాధి.

పైనఁ జెప్పిన పదునాఱు అంగములను అనుష్ఠానములోనికిఁ బెట్టుకొనక మంత్రసిద్ధి కావలయుననినఁ గాఁజాలదు. అనుష్ఠానములోనికిఁ బెట్టుకొనుటకు వివరముగ తత్ప్రక్రియలను దెలిసికొని యుండవలయును. తెలిసియుండిన నేనాఁటికైన ననుష్ఠానములోనికి రాఁగలవు. కావున శ్రీరామమంత్రోపాసకుల సౌకర్యము కొఱకై ఈ పదునాఱు మంత్రాంగములను గూర్చి క్లుప్తముగ నీగ్రంథమునఁ జెప్పఁబడును.

—శ్రీరామశరణ్

భక్తి యనఁగాఁ బ్రేమ. "సాపరానురక్తి రీశ్వరే" అను సూత్రము ప్రకారము భగవంతుని యందు గల ఉత్తమ ప్రేమకు భక్తి యని పేరు. భగవంతుఁడు ప్రేమస్వరూపుఁడు. ప్రేమయే భగవంతుడు.(God is Love Love is God) అట్టి ప్రేమ స్వరూపుని నిరంతరము పరమ ప్రేమతోఁ బ్రేమించుటయే భక్తి. భగవానుఁడగు శ్రీకృష్ణుఁడును 'మన్మనాభవ మద్భక్తోఁ మద్యాజీ మాం నమస్కురు' నాయందు మనస్సు నుంచుము. నాకు భక్తుఁడ వగుము. నన్నుఁ బూజింపుము. నాకు నమస్కరింపుము అన్నాడు. ఇంకను

శ్లో॥ యోగినామపి సర్వేషాం _ మద్గతే నాంతరాత్మనా
శ్రద్ధావా౯ భజతే యోమాం _ సమే యుక్త తమో మతః॥ గీత.

నాయం దంతరాత్మనుంచు యోగులందఱిలో శ్రద్ధగా నన్ను భజించు వాఁడే (భక్తుఁడే) సర్వోత్తముఁడని నామతము. 'భక్తి వశః పురుషః' భగవంతుఁడు భక్తికి వశుఁడు. 'భక్తిరేవ గరీయసీ' భక్తియే గొప్పది. 'భక్తిరేవైనం గమయతి' భక్తియే భగవంతుని జేర్చును. అను శాస్త్రములు మనకుఁ బరమ ప్రమాణములు. శ్రీ శంకర భగవత్పాదులును 'మోక్షకారణ సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ' మోక్షమును జెందించు సాధన సామగ్రులలో భక్తియే గొప్పది.

"సృష్టేరతీతో బుద్ధేశ్చపరః స భక్తి లభ్యః"

—అంగిరాదైవీమీమాంస దర్శనము. రసపాదము.

సృష్టి కతీతముగను, బుద్ధికి పరముగనున్న పరమాత్మ భక్తిచే లభించును.

'మయి భక్తిర్హి భూతానా మమృతత్వాయ కల్పతే'

—శ్రీ మద్భాగవతము.

నాయందు భక్తియే భూతముల కమృతత్వమును గల్పించును.

'న మే భక్తః ప్రణశ్యతి' —గీత.

నా భక్తుఁడు నశింపఁడు.

'తద్భక్తి ర్నిశ్రేయస కరీమ్' అం. దై. మీ. రసపాదము. ౨౨

ఆభక్తి మోక్షము నొసంగును. ఇట్టి భక్తిచేయుట కందఱు నధికారులే.

'నాస్తి తేషు జాతి విద్యా రూప కుల ధనక్రియాది భేదః'

—నారద భక్తి సూత్రములు.

అట్టి భక్తులకు జాతి, విద్య, రూప, కుల, ధన, కర్మలలో నుచ్చనీచాది భేదములు లేవు.

శ్లో॥ వ్యాధస్యాచరణం ధ్రువశ్యచ వయః విద్యాగజేంద్రస్య కా
కుబ్జాయాః కిమునామరూపమధికం కింవా సుదామ్నః ఫలమ్,
వంశః కో విదురస్య యాదవపతే రుగ్రస్య కిం పౌరుషమ్
భక్త్యా తుష్యతి కేవలైర్నచగుణైః భక్తిప్రియో మాధవః॥

ధర్మవ్యాధుని ఆచరణ మెట్టిది? [మాంసమునుగోట్టి అమ్ముటే కదా] ధ్రువుని వయస్సెంత? [అయిదు సంవత్సరములవాడేకదా] గజేంద్రుని వి... యెట్టిది? [గజానాం మందబుద్ధిశ్చ అనినట్లు అది తెలివితక్కువ జంతువు క... కుబ్జయొక్క నామరూపము లెట్టివి? [గూనిది కదా] కుచేలుఁడిచ్చిన ధనమేది [అటుకు లిచ్చిన దరిద్రుఁడుకదా!] విదురుని వంశమేది? [పుత్రుఁడగు కంసునికే లోఁబడి బందిలో పడెనుగదా?] దీనినిబట్టి భగవంతుఁడు భక్తికి సంతోషించును గాని, కేవలము గుణముల కుబ్బిపోఁడు.

శ్లో॥ పుంస్త్వే స్త్రీత్వే విశేషోవా జాతీనా మాశ్రయాదయః
నకారణం మద్భజనే భక్తిరేవ హి కారణమ్॥

—అధ్యాత్మ రామాయణము

పురుషుఁడనియు, స్త్రీ యనియు, జాతి ఆశ్రమాదులు నా భజనమునకుఁ గారణములు కావు. భక్తియే కారణము.

భక్తియే అన్నిటికంటె సులభము. 'అన్యస్మాత్ సౌలభ్యం భక్తౌ' (నారదభక్తి సూత్రములు) ఇతర సాధనములకంటె భక్తి సులభమైనది. దీని కితర సాధనాపేక్షలేదు. భక్తిలో ననేక రకములు కలవు.

శ్లో॥ సా భక్తిః సాధనం భావః ప్రేమాతిచేతి త్రిధోదితా॥

—భక్తిరసామృతసింధువు.

భక్తి సాధన భక్తి, భావ భక్తి, ప్రేమభక్తి యని మూఁడు విధములు.

సాధన భక్తి వైధీభక్తి యనియు, రాగానుగభక్తి యనియు రెండు రకములు.

'విధి సాధ్యమానా వైధీ సోపాన రూపా' అం. దై. మీ.

శాస్త్రవిధిచే సాధ్యమగు భక్తికి వైధీ భక్తి యని పేరు. వైధీ భక్తి తొమ్మిది విధములు.

* శ్లో॥ శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం – సఖ్యమాత్మ నివేదనమ్॥

శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనమని భక్తి తొమ్మిది విధములు.

## ౧. శ్రవణ భక్తి

'శ్రవణం నామ చరిత గుణాదీనాం శ్రుతిర్భవేత్' శ్రవణ మనఁగా నామములను భగవచ్చరిత్రలను, గుణములను వినుట. నామ శ్రవణమును ఫలము నిచ్చును.

### నామ శ్రవణము:–

శ్లో॥ సంసార సర్ప సందష్ట – నష్ట చేష్టైక భేషజమ్
కృష్ణేతి వైష్ణవం మంత్రం – శ్రుత్వా ముక్తో భవేన్నరః॥

— గరుడపురాణము

సంసార సర్పముచేఁ గఱువఁబడి స్పృహదప్పి పడినవాఁడు, శ్రీకృష్ణ యనెడు విష్ణు మంత్రమును విని ముక్తుఁడగును.

### చరిత్ర శ్రవణము:–

శ్లో॥ తస్మిన్ మహన్ముఖరితా మధుభిచ్చరిత్ర
పీయూష శేషసరితః పరితః స్రవంతి

* నవవిధ భక్తులను గూర్చి విపులముగాఁ దెలియ వలయు నని 'నవవిధ భక్తులు' అను గ్రంధము జదువుఁడు. వెల రు. 1-8-0

తాయే పిబ స్త్వ వితృషో నృప! గాథకర్ణై
స్తాన్న స్పృశ స్త్యశన తృడ్భయ శోక మోహాః॥

ఓ రాజా! మహాత్ములనోటం జెప్పంబడిన భగవచ్చరితామృతము నెవండు చెవులనెడు దొప్పలతో త్రాగునో వాని కాంకలి దప్పులు గాని, భయ, శోక, మోహాదులు గాని స్పృశింపవు.

## గుణ శ్రవణము:-

శ్లో॥ యస్యోత్తమ శ్లోక గుణాను వాదః
సంగీయతేఽభీక్ష్ణ మమంగళఘ్నః
తమేవ నిత్యం శృణుయా దభీక్ష్ణం
కృష్ణేఽమలాం భక్తి మభీప్సమానః॥

ఉత్తమ శ్లోకుని గుణానువాదము నెవండు గానము చేయునో వానికి వెంటనే యమంగళములు నశింపం గలవు. అట్టి గుణాను వాదము నెవడెల్లప్పుడును వినుచుండునో ఆతనికిం గృష్ణునియందు అమలమగు భక్తి కలిగి తీరును.

## ౨. కీర్తన భక్తి

కీర్తన భక్తి యనంగా భగవంతుని కీర్తిని వెల్లడించుట. కీర్తనము నాలుగు రకములు. గుణసంకీర్తనము, భావసంకీర్తనము, లీలాసంకీర్తనము, నామ సంకీర్తనము.

## గుణ సంకీర్తనము :-

శ్లో॥ ఇదం హి పుంస స్తపసః శ్రుతస్య వా
స్విష్టస్య సూక్తస్య చ బుద్ధి దత్తయోః
అవిచ్యుతోఽర్థః కవిభిర్నిరూపితో
యదుత్తమశ్లోక గుణాను వర్ణనమ్॥

పురుషునకు తపస్సు, శ్రవణము, సంత్సంకల్పము, చక్కనివాక్కుం బుద్ధి, దానము ఉన్నందులకు ప్రయోజనము పవిత్ర యశముగల భగవంతుని గుణములను వర్ణించుటకే యని కవులు చెప్పిరి.

## భావ సంకీర్తనము :-

భగవంతుని శాంత, దాస్య, వాత్సల్య, సఖ్య, మధురభావములతో గీర్తించుటకు భావసంకీర్తనమని పేరు. ఋషులు (శాంత) హనుమదాదులు (దాస్య) కౌసల్యా యశోదలు (వాత్సల్య) అర్జున కుచేలాదులు (సఖ్య) గోపికలు (మధుర) ఈ భావ సంకీర్తనసే చేసిరి.

## లీలా సంకీర్తనము :-

శ్లో॥ సోఽహం వరస్య సుహృదః పరదేవతాయా
లీలాకథాస్తవ నృసింహ! విరించిగీతాః
అంజస్తితర్మ్యనుగృణన్ గుణవిప్రముక్తో
దుర్గాణి తే పదయుగాలయహంససంగః॥ భాగవతము. ౧_౯_౧౭

పరమ సుహృదుఁడవును, పరదేవతవు నగు నో నృసింహా! బ్రహ్మాదిదేవతలచే గానము చేయఁబడు కథలను గీర్తించి గుణబంధములనుండి విడివడి, నీ చరణారవిందములందు మనస్సుగల మహాత్ముల సాంగత్యముబొంది నేను ఘోరములగు దుఃఖములను దాఁటెదను.

## నామ సంకీర్తనము :-

శ్లో॥ ఏ తన్నిర్విద్యమానానా మిచ్ఛతా మకుతో భయమ్
యోగినాం నృప నిర్ణీతం హరేర్నామాను కీర్తనమ్॥

—భాగవతము. ౨_౧_౧౧

ఓ రాజా! మిక్కిలి వైరాగ్యము కలిగి మోక్షమును గోరువారు సమస్త భయములను విడనాడుటకు శ్రీహరి నామకీర్తనము నిర్ణయింపఁబడినది.

ఏ సంకీర్తనము గావించినను భగవంతుఁడచ్చటనే యుండుననని నేతా చెప్పియున్నాఁడు.

శ్లో॥ నాహం వసామి వైకుంఠే_యోగినాం హృదయే రవౌ
మద్భక్తా యత్ర గాయంతి_తత్రతిష్ఠామి నారద॥

ఓ నారదా! నేను వైకుంఠములోఁగాని, యోగుల హృదయములోఁగాని, సూర్యునియందుగాని యుండను. నాభక్తు లెచ్చట గానము చేయుదురో అచ్చట నుందును.

## ౩. స్మరణ భక్తి

స్మరణము మూఁడు విధములు. రూప స్మరణము, నామ స్మరణము, స్వరూప స్మరణము. నిరంతరము ఇష్టదైవముయొక్క దివ్యమంగళ విగ్రహమును హృత్పద్మమందు ధరించి ధ్యానింపవలయును. 'నామస్మరణా దన్యోపాయం నహి పశ్యామో భవతరణే.' అని యనుటచే భగవన్నామమును నిరంతరము స్మరించుటయు, లేదా జపము చేయుటయు సాధకున కవసరము. స్వరూప స్మరణము కూడ చేయవలయును. స్వరూపస్మరణ మనఁగా ఆత్మవిచారణ. జీవాత్మ యన నేమి? పరమాత్మ యన నేమి? ఈ యిద్దరకును గల సంబంధ మేమి? అను విచారణ చేయవలయును.

అన్నిటికంటె నీ స్మరణ భక్తి చాల గొప్పది. పైనఁ జెప్పిన శ్రవణకీర్తనములకు పరుల సహాయము కావలయును. ఈ స్మరణభక్తి కట్టిది అవసరము లేదు. ఏకాంతమున నొక్కఁడే కావించు సాధన యిది. దీనివలన సాధకుఁడు బాగుపడును. ఇచ్చట కేవలము భగవంతుఁడును తాను ఇద్దరు నుందురు. ఇట్లు స్మరణము చేయువానికి పాపము లన్నియు నశించును. 'స్మరణాన్ముక్తిః' యని యుండుటచే స్మరణము వలన ముక్తియు లభించుననుట నిస్సందేహము.

శ్లో॥ అనన్య చేతాస్సతతం _ యోమాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః॥

— గీత ౮ అ. ౧౪ శ్లో॥

అనన్య చిత్తముతో నిరంతరము నిత్యము నన్నెవఁడు స్మరించునో, అట్టి నిత్యయుక్తుఁడైన యోగికి ఓ అర్జునా! నేను సులభుఁడను.

## ౪. పాదసేవన భక్తి

శ్లో॥ యత్పాద సేవాభిరుచి స్తపస్వినా
మశేష జన్మోపచితం మలం ధియః

## ౬. వందన భక్తి

శ్లో॥ ఏకోఽపి కృష్ణస్య కృతః ప్రణామో
దశాశ్వమేధావ భృథైర్న తుల్యః
దశాశ్వమేధీ పునరేతి జన్మ
కృష్ణప్రణామీ న పునర్భవాయ॥ — నారదీయ పురాణము.

శ్రీకృష్ణుని ఒక్కసారి నమస్కరించిన ఫలము పదిసార్లు అశ్వమేధయాగము చేసి అవభృథస్నానము చేసిన ఫలమొక్కటికాదు. పది అశ్వమేధములను జేసినవాఁడు మరలఁ బుట్టును. శ్రీకృష్ణునకు నమస్కరించినవాఁడు మరలఁ బుట్టఁడు.

కేవలము భగవంతునకు నమస్కారము చేయుటయేగాక సాధువులకును, గురువులకును గూడ నమస్కారము చేయవలయును.

## ౭. దాస్య భక్తి

'దాస్యం కర్మార్పణం తస్య కైంకర్యమపి సర్వథా'

సర్వకర్మను భగవంతున కర్పించుటయును, సమస్త విధముల సేవచేయుటయును దాస్య మగును.

'చతుర్ధాఽమీ అధికృతాశ్రితాపారిషదానుగాః'

—భక్తిరసామృత సింధువు.

అధికృతదాసులు, ఆశ్రిత దాసులు, పారిషదులు, అనుగులు అని దాసులు నాల్గు రకములు.

బ్రహ్మాదు లధికృత దాసులు. ఆశ్రితులు, శరణ్యులు, జ్ఞానిచరులు, సేవానిష్ఠులని మూఁడు రకములు. జరాసంధాదులచే బంధింపఁబడినవారు శరణ్యులు. మోక్షమునైన నొల్లక భగవంతునే ఆశ్రయించిన శౌనకాదులు జ్ఞానిచరులు. 'మూలతో భజనాసక్తాః సేవా నిష్ఠా ఇతీరితాః' సమక్షముననున్న భజనాసక్తులగు చంద్రధ్వజ బాహులాశ్వాదులు సేవానిష్ఠులు. పారిషదులు ఉద్ధవదారుకాదులు. అనుగులు లక్ష్మణాదులు.

## ౬. వందన భక్తి

శ్లో॥ ఏకోఽపి కృష్ణస్య కృతః ప్రణామో
దశాశ్వమేధావభృథైర్న తుల్యః
దశాశ్వమేధీ పునరేతి జన్మ
కృష్ణప్రణామీ న పునర్భవాయ॥ — నారదీయ పురాణము.

శ్రీకృష్ణుని ఒక్కసారి నమస్కరించిన ఫలము పదిసార్లు అశ్వమేధ యాగముచేసి అవభృథస్నానము చేసిన ఫలమొక్కటికాదు. పది అశ్వమేధము లను జేసినవాఁడు మరలఁ బుట్టును. శ్రీకృష్ణునకు నమస్కరించినవాఁడు మరలఁ బుట్టఁడు.

కేవలము భగవంతునకు నమస్కారము చేయుటయేగాక సాధువులకును, గురువులకును గూడ నమస్కారము చేయవలయును.

## ౭. దాస్య భక్తి

'దాస్యం కర్మార్పణం తస్య కైంకర్యమపి సర్వథా'
సర్వకర్మను భగవంతున కర్పించుటయును, సమస్త విధముల సేవచేయుటయును దాస్య మగును.

'చతుర్ధాఽమీ అధికృతాశ్రితాః పారిషదానుగాః'

—భక్తిరసామృత సింధువు.

అధికృతదాసులు, ఆశ్రిత దాసులు, పారిషదులు, అనుగులు అని దాసులు నాల్గు రకములు.

బ్రహ్మేంద్రు లధికృత దాసులు. ఆశ్రితులు, శరణ్యులు, జ్ఞానిచరులు, సేవానిష్ఠులని మూఁడు రకములు. జరాసంధాదులచే బంధింపఁబడినవారు శరణ్యులు. మోక్షమునైన నొల్లక భగవంతునే ఆశ్రయించిన శౌనకాదులు జ్ఞానిచరులు. 'మూలతో భజనాసక్తాః సేవానిష్ఠా ఇతీరితాః' సమక్షముననున్న భజనాసక్తులగు చంద్రధ్వజ బాహులాశ్వాదులు సేవానిష్ఠులు. పారిషదులు ఉద్ధవదారుకాదులు. అనుగులు లక్ష్మణాదులు.

## ౮. సఖ్య భక్తి

'యేస్యుస్తుల్యా ముకుందస్య తే సఖ్యాః సతాం మతాః॥

—భక్తిరసామృత సింధువు.

ఎవరు భగవంతునకుఁ దుల్యులో వారు సఖ్యులని సాధుల మతము. 'విశ్వాసో మిత్రవృత్తిశ్చ సఖ్యం ద్వివిధమీరితమ్' భగవంతుని యందు విశ్వాసము, మైత్రి యని సఖ్యము రెండు విధములు.

అర్జునుఁడు, కుచేలుఁడు మొదలైనవారు సఖ్యభక్తి గావించినవారు. భగవంతునితో సామ్యము, మైత్రి, విశ్వాసము కలిగియుండ వలయును. ఆయన గుణములవంటి కల్యాణ గుణములు కలిగి యుండుటకుఁ బ్రయత్నింప వలయును.

## ౯. ఆత్మనివేదనము

శ్లో॥ మర్త్యో యదా త్యక్త సమస్త కర్మా
నివేదితాత్మా విచికీర్షితో మే
తదామృతత్వం ప్రతిపద్యమానో
మయాత్మభూయాయ చ కల్పతే వై॥ — భాగవతము.

మనుజుఁ డెప్పుడు సమస్త కర్మలను వదలి, ఆత్మ సమర్పణము గావించి, సమస్తము నాయారాధనమే నను చు చేయుచుండునో వాఁడు జీవన్ముక్తుఁడై నావంటి యధికారమునకు యోగ్యుఁడగును.

ఆత్మనివేదన మనఁగా అహంకార మమకారములను వదలుట. అహంకారమున కాస్పదమైనది జీవాత్మ; మమకారమున కాస్పదమైనది దేహాత్మ. ఈ రెంటిని వదలుటయే ఆత్మనివేదనము. ఇట్టి వానికి దుఃఖముండనే యుండదు.

'లోకహానౌ చింతా నకార్యా నివేదితాత్మ లోకవేదత్వాత్'

— నారద భక్తిసూత్రములు.

తన సర్వస్వము నీశ్వరునకు నివేదనము చేసిన భక్తుఁడు ప్రపంచము నశించినను జింత నొందఁడు.

పైవానిలో దాస్య, సఖ్య, ఆత్మనివేదనములు మూఁడును రాగాత్మిక భక్తిలోఁ బరిసమాప్తి చెందును.

పైనఁజెప్పిన విధముననే గౌణ గుణభేదమును బట్టియు భక్తి యుండును. తమోగుణ భక్తుఁడార్తుఁడు. రజోగుణ భక్తుఁ డర్థార్థి. సత్త్వగుణ భక్తుఁడు జిజ్ఞాసువు. జ్ఞాని గుణాతీతుఁడు. పైన వ్రాయఁబడిన భక్తి యంతయును గౌణ భక్తికి సంబంధించినది.

## రాగానుగ భక్తి:-

'రసాను భావికానంద శాంతిదా రాగాత్మికా'

— భ. ర. సింధువు.

రసానుభావికానందమును, శాంతిని ప్రసాదించునది రాగాత్మిక భక్తి.

ఇది పరాభక్తికి సంబంధించినది. సిద్ధావస్థకుఁ జెందినది. రాగాత్మికా భక్తి స్వాభావికముగా పూర్వజన్మ సంస్కారమును బట్టి వచ్చును. దీనికి ప్రత్యేక సాధనలవసరము లేదు. స్వాభావికముగ భావము ఉప్పొంగుచుండును. కావున దీనిలో భావభక్తియు నిమిడియున్నది. భావభక్తినిగూర్చి తంత్రములలో నిట్లు చెప్పఁబడినది.

శ్లో॥ ప్రేమ్ణస్తు ప్రథమావస్థా భావ ఇత్యభిధీయతే
సాత్త్వికాః స్వల్పమాత్రాః స్యురత్రాశ్రు పులకాదయః॥

ప్రేమయొక్క ప్రథమావస్థకు భావమని పేరు. ఇట్టి భావ ముదయించి నప్పుడు స్వల్పమాత్రముగా నశ్రువులు, పులకాంకురాది సాత్త్విక భావములు కలుగును.

ఈ రాగాత్మిక భక్తిలోనే రసోదయ మగును. పైన జెప్పఁబడిన భావ భక్తికి సంబంధించిన శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర రసములు ముఖ్య రసములు. శృంగార, హాస్య, కరుణ, రౌద్ర, వీర, భయానక, బీభత్స, అద్భుత, శాంతరసములు తొమ్మిది గౌణరసములు. ఇది ఆయా వ్యక్తులనుబట్టి యుండును.

### ముఖ్య రసములు (శుద్ధ రసములు) :-

| | | |
|---|---|---|
| శాంత రసము | — | సనకాది మహాయోగీంద్రులు. |
| దాస్య రసము | — | హనుమంతుఁడు. |
| సఖ్య రసము | — | సుగ్రీవుఁడు. |
| వాత్సల్య రసము | — | కౌసల్యా దశరథులు. |
| మధుర రసము | — | శ్రీ సీతాదేవి (కృష్ణావతారమున గోపికలు) |

## గౌణరసములు (మలిన రసములు) :-

| | | |
|---|---|---|
| శృంగార రసము | — | గోపికలు, కుబ్జ. |
| హాస్య రసము | — | గోపాల బాలకులు. |
| కరుణ రసము | — | దశరథుఁడు |
| రౌద్ర రసము | — | ఇంద్రుఁడు (రాళ్లవాన కురిపించు నపుడు) |
| వీర రసము | — | భీష్ముఁడు. |
| భయానక రసము | — | కంసుఁడు. |
| భీభత్స రసము | — | అఘాసురుఁడు. |
| అద్భుత రసము | — | బలి, యశోద, అర్జునుఁడు (విశ్వరూప సందర్శనమున) |
| శాంత రసము | — | అక్రూరుఁడు |

పైన జెప్పిన రసము లన్నియు స్వాభావికముగ నుద్భవింపవి. శుద్ధరసములలో నేదో ఒక రసము ననుభవించి భగవంతున కాత్మనివేదనము గావింపవలయును. తర్వాత భగవద్గుణాను కీర్తనమో, భగవత్తత్త్వ జిజ్ఞాసయో గావించి తన్మయాసక్తిని బొంది భగవంతునిలో నైక్యమగును.

పైనఁజెప్పఁబడిన రాగాత్మిక భక్తిలోఁగల్గు లక్షణమిట్లు చెప్పఁబడినది.

శ్లో॥ వాగ్గద్గదా ద్రవతే యస్యచిత్తం
రుదత్యభీక్ష్ణం హసతి క్వచిచ్చ
విలజ్జ ఉద్గాయతి నృత్యతే చ
మద్భక్తి యుక్తో భువనం పునాతి॥ — భాగ. ౧౧_౧౪_౨౪.

శ్లో॥ ఏవం వ్రతః స్వప్రియ నామ కీర్త్యా
జాతానురాగో ద్రుత చిత్త ఉచ్చైః
హసత్యథో రోదితి రౌతి గాయ
త్యున్మాద వన్నృత్యతి లోక బాహ్యః॥ — భాగ. ౧౧_౨_౪౦.

శ్లో॥ క్వచిద్రుద న్త్యచ్యుత చింతయాక్వచిత్
హసంతి నందంతి వద న్త్య లౌకికాః

నృత్యంతి గాయ న్త్య ను శీల య న్త్యజం
భవంతి తూష్ణీం పరమేత్య నిర్వృతాః॥ —భాగ. ౧౧-3-3౨.

సీ॥ శ్రీవల్లభుఁడు దన్ను జేరిన యట్లైన
జెలికాండ్ర నెవ్వరిఁ జేరమఱచు
ససురారి దనమ్రోల నాడిన యట్లైన
నసుర బాలురతోడ నాడ మఱచు
భక్తవత్సలుఁడు సంభాషించి నట్లైన
బర భాషలకు మారు పలుక మఱచు
సురవంద్యుఁ దనలోనఁ జూచిన యట్లైన
జొక్కి సమస్తంబుఁజూడ మఱచు

గీ॥ హరి పదాంభోజ యుగ చింతనామృతమున
నంతరంగంబు నిండి నట్లైన నతఁడు
నిత్య పరిపూర్ణుఁడగుచు నన్నియును మఱచి
జడత లేకయు నుండును జడుని భంగి॥

సీ॥ వైకుంఠ చింతా వివర్జిత చేష్టుఁడై
యొక్కఁడు నేడుచు నొక్కచోట
నశ్రాంత హరిభావనారూఢ చిత్తుఁడై
యుద్ధతుఁడై పాడు నొక్కచోట
విష్ణుఁడింతియె గాని వేఱొండు లేదని
యొత్తిలి నగుచుండు నొక్కచోట
నలినాక్షుఁడను నిధానము గంటి నేనని
యుబ్బిగంతులువైచు నొక్కచోట

గీ॥ బలుకు నొక్కచోటఁ బరమేశుఁ గేశవుఁ
బ్రణయ హర్ష జనిత బాష్ప సలిల
మిళితపులకుఁడై నిమీలిత నేత్రుఁడై
యొక్కచోట నిలిచి యూరకుండు॥

పైనఁజెప్పిన లక్షణములుగల రాగాత్మిక భక్తి, పరాభక్తిలోనికి దిగును. వీఁడే జ్ఞానియనెడు భక్తుఁడు. వీనికిని భగవంతునకును భేదములేదు. 'జ్ఞానీత్వాత్మైవ మే మతమ్' అను భగవద్వాక్యము ననుసరింమనది.

'స్వరూపజ్ఞానాపర పర్యాయా సా'

అం. దై. మీ. సూ. ౨౫.

పరాభక్తియు, స్వరూపజ్ఞానము రెండు నొక్కటియే.

పరాభక్తి, స్వరూపజ్ఞానము, నిర్వికల్ప సమాధి, పరవైరాగ్యము ఇవన్నియును పర్యాయ పదములే. ఇట్టి పరాభక్తుఁడు సమస్త బ్రహ్మాండములందుఁగల చరాచర మంతయు వాసుదేవ మయముగాఁ జూచును. 'అహం బ్రహ్మాఽస్మి', 'తత్త్వమసి', 'సర్వం ఖల్విదం బ్రహ్మ' 'అయమాత్మాబ్రహ్మ' 'ప్రజ్ఞానం బ్రహ్మ' మొదలగు మహావాక్యములు అనుసంధింప వలసిన స్థలమిదియే.

శ్లో॥ సర్వభూతేషు యః పశ్యే ద్భగవద్భావ మాత్మనః
భూతాని భగవత్యాత్మ న్యేషభాగవతోత్తమః॥

—భాగవతము.

సర్వ చరాచర భూతము లన్నిటి యందును భగవద్భావముంచిన వాఁడు భాగవతోత్తముఁడని భావము.

శ్లో॥ సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥

—గీత ౬-౨౯

యోగయుక్తాత్ముఁడగు వాఁడు సర్వభూతముల యందుఁదన్ను, తన యందు సర్వభూతములును ఉన్నట్లు తెలిసికొని సమదర్శనుఁ డగుచున్నాఁడు.

మంత్రయోగమున కిట్టిభక్తి ప్రధానమైనది. ఇది పదునాఱంగములలో మొట్టమొదటిది.



# ౨ శుద్ధి

శుద్ధులు నాలుగు రకములు. ౧. శరీరశుద్ధి. ౨. మనశ్శుద్ధి. 3. స్థానశుద్ధి. ౪. దిశాశుద్ధి,

## ౧. శరీర శుద్ధి.

శుద్ధుఁడు కానిది జపసిద్ధి కలుగదు. కావున శుద్ధి విషయమున జాగ్రత్త. కలిగియుండవలయును. ప్రతి శరీరికిని బహిర్మలము, అంతర్మలమని రెండు రకము లైన మలములు గలవు. కావున బహిశ్శుద్ధియు, నంతశ్శుద్ధియు నత్యావసరములు.

మలమూత్ర విసర్జనము చేసినప్పుడు శాస్త్రవిధిని శుద్ధి చేసికొనవలయును. సాధారణముగ మనలో చాలమంది మూత్ర విసర్జనము చేసినపుడు నీరు తీసి కొనిపోవుటలేదు. మూత్రవిసర్జన చేసి ఆమూత్రము తోడలకును, వస్త్రములకును పూసుకొనరాదు. మూత్రవిసర్జన స్థానమును చల్లని నీటితో కడుగ వలయును. అంత కాళ్లు చేతులు కడుగుకొని నాలుగుసార్లు పుక్కిలించి, యాచమనము చేయవలయును. మలవిసర్జనము చేసి మృజ్జలాదులతో శుద్ధిచేసికొని, కాళ్లు చేతులు కడుగుకొని, యెనిమిదిసార్లు పుక్కిలించవలయును. తర్వాత కంఠ స్నానముగాని, నడుమువఱకు గాని స్నానము చేయవలయును.

స్నానము :-

శ్లో॥ దీపనం వృష్య మాయుష్యం స్నానమూర్జాబలప్రదమ్
కండూమల శ్రమస్వేద తంద్రాతృడ్దాహపాప్మజిత్॥

స్నానము దీపనమును, పుంస్త్వమును, ఆయువును, ఓర్పును, బల మును గలుగఁ జేయును. జిలను, మలమును, శ్రమను, చెమటను, అలసటను, తృష్ణను, దాహమును, పాపమును బోఁగొట్టును.

స్నానము బాహ్యము మానసికమని రెండు విధములు.

శ్లో॥ మల నిర్మోచనం స్నానం - మలంచ ద్వివిధం స్మృతమ్
బాహ్యం మానసికం చేతి - స్నానం చ ద్వివిధం తథా॥

శ్లో॥ అజ్ఞానమూలకం కామ - క్రోధాద్యం చ మనోమలమ్
మనోమల నివృత్త్యర్థం స్నానం మానసికం చరేత్॥

స్నానము మలమును దొలఁగించును. మలము బాహ్యమల మనియు, మానసిక మలమనియు రెండు విధములు. అట్లులే స్నానములును బాహ్యస్నాన మనియు, మానసిక స్నానమనియు రెండు విధములు. అజ్ఞానమూలకమైన కామ క్రోధాదులు మనోమలము. మనోమలము పోవుటకు మానసిక స్నానము చేయ వలెను.

బాహ్యస్నానము ఐదు విధములు :- ౧. గోధూళికా స్నానము. ౨. మంత్ర స్నానము. ౩. వారుణస్నానము. ౪. వర్షపాత (అమృత) స్నానము. ౫. విభూతిస్నానము.

శ్లో॥ బాహ్యస్నానేషు సర్వేషు స్నానం వారుణ ముత్తమం

బాహ్య స్నానము లన్నిటిలోను వారుణ (నీటితోఁజేయు) స్నాన ముత్తమము.

మానసిక స్నానము ఐదు విధములు :- ౧. ధ్యానమయ స్నానము. ౨. బోధమయ స్నానము. ౩. యోగమయ స్నానము. ౪. తపోమయస్నానము ౫. వైరాగ్యమయ స్నానము.

## ౧. ధ్యానమయ స్నానము :-

శ్లో॥ ముఖ్యం మానసికస్నానే - కీర్తితం విష్ణుచింతనమ్॥

అనుటచే మానసిక స్నానములలో విష్ణుచింతనమే గొప్పది. వేదాంత శ్రవణము, సద్గ్రంథ శ్రవణము, భజన, జపము, ధ్యానము ఇవి యన్నియు ధ్యానమయ స్నానములోఁ జేరును. మానసిక ధ్యానము నిట్లు చేసి స్నానము కావింపవలయును.

శ్లో॥ ఖండితం పుండరీకాక్షం మంత్రమూర్తిం హరింస్మరేత్
అనంతాదిత్యసంకాశం - వాసుదేవం చతుర్భుజమ్
శంఖ చక్ర గదా పద్మ - ధారిణం వనమాలినమ్
కేయూరహారిణం దేవం సువర్ణమకుటోజ్జ్వలమ్
ధ్వజవజ్రాంకుశాలక్ష్య - పాదపద్మం సునిర్మలమ్
తత్పాదాంగుష్ఠజాం గంగాం - నిపతంతీం స్వమూర్ధని
చింతయే ద్బ్రహ్మరంధ్రేణ - ప్రవిశంతీం స్వకాం తనుమ్

తయా సంక్షాళయే త్సర్వం బాహ్యామాభ్యంతరం మలం
తత్క్షణా ద్విరజా మర్త్యో - జాయతే స్ఫటికోసమః॥

అనంత సూర్యకాంతితో సమానమైన కాంతి గలిగి, నాల్గు భుజములు గలిగి, శంఖచక్రగదాపద్మములను, వనమాలను ధరించి కేయూరహారములను, మెఱసెడు బంగారు కిరీటమును ధరించి, ధ్వజవజ్రాంకుశ రేఖలతో నొప్పు నిర్మల పాదపద్మములు గల వాసుదేవుఁడగు విష్ణుమూర్తిని స్మరించి, తత్పాదాంగుష్ఠమునఁ బుట్టిన గంగ తన తలపైఁ బడుచున్నట్లును, బ్రహ్మరంధ్రము గుండా తన శరీరములోఁ బ్రవేశించినట్లును భావింపవలెను. దీనివలన బాహ్యాభ్యంతర మలములను దొలఁగించుకొని వెంటనే రజోగుణమును విడిచినవాఁడై మనుష్యుఁడు స్ఫటికమువలె స్వచ్ఛమగుచున్నాఁడు.

## ౨. బోధమయ స్నానము :-

అనఁగా ఏకాదశి, అమావాస్య మొదలగు దినముల నుపవాసము లుండి జ్ఞాన మార్జించుట.

## ३ యోగమయ స్నానము :-

ప్రాణాయామాది యోగ సాధనములు గావించి మనస్సును ఏకాగ్రముగఁ జేసికొనుటకు యోగమయ స్నానమని పేరు.

## ४. తపోమయ స్నానము :-

'ఋతం తపస్సత్యం తప శ్శ్రుతం తప శ్శాంతం తపో దమ స్తప శ్శమ స్తపో దానం తపో యజ్ఞం తపో భూర్భువస్సువ ర్బ్రహ్మైతదుపాస్యైతత్తపః' అను శ్రుతి ననుసరించి, భగవంతుని ఉపాసించుటయును, సత్యమును బలుకుటయును, సత్కథా వేదాంతశ్రవణము కావించుటయు, శాంతముగ నుండుటయు, బాహ్యేంద్రియ నిగ్రహము, అంతరింద్రియ నిగ్రహము, దానము చేయుట, గాయత్ర్యుపాసనము- ఇవి యన్నియును తపములే.

## ౫. వైరాగ్యమయ స్నానము :-

వైరాగ్యము కలిగియుండుట. పుత్రమిత్ర కళత్ర ధన క్షేత్రాదులందు మమతను వీడి భగవంతుఁ డొక్కఁడే తనకు దిక్కని భావించుట.

మంత్రయుక్తముగా స్నానము నాచరించి దేవ, ఋషి, పితృతర్పణము లాచరించిన మీఁదట ధౌతవస్త్రమును ధరింపవలయును. తెల్లని వస్త్రము శ్రేష్ఠము. లేదా పట్టుబట్టయో ధావళియో కట్టుకొని అనుష్ఠానము కావించుకొనవచ్చును. ధావళి సర్వదా పవిత్రమైనది.

తర్వాత పుండ్రమును సాంప్రదాయము ననుసరించి ధరింపవలయును. తర్వాత సంధ్యావందనము, గాయత్రీ మంత్రమును జపింపవలయును. గాయత్రీ జపము చేయక ద్విజులు అన్యమంత్రమును జపింపరాదు.

శ్లో॥ గాయత్రీం తు పరిత్యజ్య హ్యన్యమంత్ర ముపాసతే
సుసిద్ధాన్నం పరిత్యజ్య భిక్షామటతి దుర్మతిః॥

— మార్కండేయ పురాణము.

గాయత్రిని విడిచి యితర మంత్రము నుపాసించుట సుసిద్ధాన్నమును వదలి భిక్షకై బయలుదేరి నట్లుండును.

శ్లో॥ విహాయ తాంతు గాయత్రీం విష్ణూపాస్తి పరాయణః
శివోపాస్తి రతో విప్రో నరకం యాతి సర్వథా॥

ఏ బ్రాహ్మణుఁడు గాయత్రిని వదలి విష్ణూపాసనము, శివోపాసనమును జేయునో వాఁడు సర్వవిధముల నరకమును బొందును.

## ౨ మనశ్శుద్ధి

మనస్సును శుద్ధిగావించుకొనవలెనన్న గీతలోఁ జెప్పఁబడిన దైవాసుర సంపద్విభాగయోగమును జదివి, అందులోని దైవీసంపద్గుణముల నభ్యసింప వలయును. ముఖ్యము ఇంద్రియ నిగ్రహము, నిర్భయత్వము, చిత్తప్రసన్నత, యజ్ఞ దాన, తపస్స్వాధ్యాయముల నొనర్చుచు అహింసా సత్య శౌచాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహాదుల నలవఱచుకొనుచు, కామక్రోధ లోభ మోహ మదమాత్సర్య, అహంకార, మమకార త్యాగము కావించి, మనశ్చంచలతను మాని చిత్త శాంతి గలిగి, అవిరోధము, ధీరత్వము, దయా, క్షమల నలవఱచు కొనుచుండిన అంత శ్శుద్ధి కలుగును. ఇన్ని చెప్పనేల? కల్యాణ గుణముల నన్నిటిని అలవఱచుకొన వలెను. సాత్త్వికాహారమును గొనవలయును. బాహ్యశుద్ధిచే నారోగ్య సౌభాగ్య

మును, ఆత్మప్రసాదము కల్గును. భగవంతుని యనుగ్రహము కలుగును. అంత శ్శుద్ధి వలన భగవద్దర్శన మగును. దానివలన సమాధి ప్రాప్తించును.

## ౩. స్థాన శుద్ధి

జపము ఇష్టము వచ్చినచోటఁ గూర్చుండి చేయరాదు. శుద్ధస్థలమై యుండవలయును. ప్రత్యేకముగ గది యుండుట శ్రేష్ఠము. దానిని గోమయముతో నలకవలయును. దానిలో రాళ్లు, ముండ్లు, పల్లేరుకాయలు, చీమలు, చెదలు, మిణ్ణల్లులు, దోమలు, గోమారులు మొదలైనవి యుండరాదు. ఆహ్లాదకరముగ భగవచ్చిత్రములతో నలంకరింపఁబడి యుండవలయును. గురుసన్నిధి, బిల్వవృక్షము, తులసీసన్నిధి, పవిత్రవనము, దీపసన్నిధి, సాధుసన్నిధి, దేవాలయము, గోశాల, నదీతీరము, నదీసంగమము, పుణ్యక్షేత్రము, పర్వతశిఖరము, మఱ్ఱి, రావి, అశోకము, బిల్వము, ఉసరిక చెట్లు (వీనినే పంచవటము లందురు) ఉన్నచోట జపసాధన చేయుటకు అనుకూలములు. సద్బ్రాహ్మణుని గృహమైనను బనికి వచ్చును. ఇంటి కంటె గోశాల ద్విగుణఫలమును. అరణ్యము శతగుణమును, సరస్సు సహస్రగుణమును, నదీతటము లక్షగుణమును, పర్వతశిఖరము కోటి గుణితమును, శివాలయము అర్బుద గుణితమును, గురుసన్నిధానము అనంత గుణమును ఫలము కలుగును. ఏ ప్రదేశమైనను మ్లేచ్ఛాది దుష్టజన రహితము గను, సర్పాది దుష్టజంతుభయ రహితముగను, అన్యోపద్రవ రహితముగను, దుర్భిక్ష బాధాశూన్యముగను, విఘ్నబాధా రహితముగను సాధుసమ్మతమైన స్థలము జపమునకు చాల యోగ్యమగు స్థానమని గ్రహింపవలయును. స్వంత యింటిలోనైనను కూర్మ చక్రమును వేసికొని జపింపవలయును (కూర్మ చక్రము 14 వ. ప్రకరణాంతమున పురశ్చరణ విధానములోఁ జూపఁబడినది.)

## ౪. దిశా శుద్ధి

జపాది అనుష్ఠాన కార్యములకు తూర్పు, ఉత్తర, ఈశాన్య దిశ లుత్తమములు.

శ్లో॥ యత్ర దిఙ్నియమో నాస్తి జప యజ్ఞాది కర్మసు
త్రిస్తత్ర దిశః ప్రోక్తా ఐంద్రీ సౌమ్యాఽపరాజితా॥

— కాత్యాయనుఁడు.

జపయజ్ఞాది కర్మలలో దిజ్నియమము లేనిచోట మూఁడు దిక్కులు ముఖ్యముగఁ జెప్పఁబడినవి. అవి తూర్పు, ఉత్తరము, ఈశాన్యము (అపరాజితా)

శ్లో॥ త ఉదీచ్యాం ప్రాచ్యాం దిశ్యయతంత తే తతో
నపరాజయస్త్సైషా దిగపరాజితేతి॥

ఆ దిక్కులు ఉత్తరము, తూర్పు, మూఁడవది యెవ్వరిచేతను పరాజితము కావింపఁబడనిది కావున నపరాజిత (ఇది ఈశాన్యము) ఈ మూఁడు దిక్కులును ముఖ్యములు.

## ద్వాదశ శుద్ధి :-

ఇవిగాక ద్వాదశశుద్ధి యని మఱియొకటి గలదు, భగవంతుని దేవాలయములకు నిత్యయాత్రాప్రదక్షిణాదులు గావించుట వలన పాదశుద్ధియు, భగవంతుని పూజకై పత్రపుష్పాదులను గొనివచ్చుటయు, గంధాదులను సిద్ధము చేసియుంచుటయు కరశుద్ధి యగును. భగవన్నామ కీర్తనము చేయుటయు, భగవత్కథా పఠనము చేయుటయు వాక్శుద్ధి యగును. భగవన్నామ కీర్తన, కథా శ్రవణము గావించుట శ్రవణ శుద్ధి యగును. తదుత్సవ దర్శనము, దైవవిగ్రహ, సాధుదర్శనము నేత్రశుద్ధి. భగవంతుని ముందు తలవంచుటయును, చరణోదక నిర్మాల్యములను శిరస్సున ధరించుట శిరశ్శుద్ధి. భగవన్నిర్మాల్య పుష్పగంధ సౌరభము నాఘ్రాణించుట నాశికాశుద్ధి. వీటికి ద్వాదశశుద్ధి యని పేరు. ఇవిగాక భగవత్ప్రసాదమును గ్రహించుటయు, భగవంతుని చిహ్నములను గదను లలాటమునను. ధనుర్బాణములను శిరస్సునను, నందకమును హృదయనను, చేతుల యందు శంఖచక్రములను గోపీచందనముతో ధరించుటయు శరీరశుద్ధికి ముఖ్యము.

# 3. ఆసనము.

'స్థిర సుఖమాసనమ్' పతంజలి.

కూర్చుండిన స్థిరముగనుండి, సుఖము నిచ్చునది. ఆసనము.

ఆసనము వలన సాధకుఁడు శీతోష్ణ సుఖదుఃఖముల నుండి విడివడి, మనస్సును వశపఱచుకొనఁగలఁడు. రోగములు నశించును.

"ఆసనం విజయం యేన జితం తేన జగత్త్రియమ్"

ఆసనమును జయించినవాఁడు మూఁడు లోకముల జయించినవాఁడగును.

శ్రు॥ ఏకం సిద్ధాసనం ప్రోక్తం ద్వితీయం కమలాసనమ్॥

— యోగచూడామణ్యుపనిషత్.

సిద్ధాసనము, పద్మాసనము అనునీ రెండాసనములే ముఖ్యములు.

జపయోగమునకు స్వస్తిక పద్మాసనములు పరమావశ్యకములు.

శ్లో॥ జానూర్వోరంతరే సమ్య - క్కృత్వా పాదతలే ఉభే
ఋజుకాయః సమాసీనః స్వస్తికం తత్ప్రచక్షతే॥

— హఠయోగ ప్రదీపిక

పిక్కలకును తొడలకును మధ్య రెండు పాదములఁ జొనిపి శరీరమును చక్కగా నిక్కించుటకు స్వస్తికాసనమని పేరు,

శ్లో॥ వామోరూపరి దక్షిణం చ చరణం సంస్థాప్య వామం తథా
దక్షోరూపరి పశ్చిమేన విధినా ధృత్వా కరాభ్యాం దృఢమ్
అంగుష్ఠౌ హృదయే నిధాయ చిబుకం నాసాగ్రమాలోకయే
దేతద్వ్యాధి వినాశకారి యమినాం పద్మాసనం ప్రోచ్యతే॥

— హఠయోగ ప్రదీపిక

ఎడమ తొడమీఁద కుడి పాదమును, కుడితొడమీఁద ఎడమ పాదము నుంచి, వెనుక ప్రక్కగా కుడిచేతితో ఎడమ తొడపైనుండు కుడికాలి పెద్ద వ్రేలిని, ఎడమచేతితో కుడితొడపైనుండు ఎడమకాలి పెద్దవ్రేలిని పట్టుకొని హృదయమునకు సమీపమున ఱొమ్మున గడ్డమునుంచి, నాసికాగ్రమును వీక్షించుటకు పద్మాసన మనఁబడును. ఇది యోగులకు వ్యాధులను నశింపఁజేయును. (ఇది బద్ధపద్మాసనము.)

చేతులతో వ్రేళ్ళను పట్టుకొనకుండ చేతులను అఱచేతులు వెల్లకిలత్రిప్పి నాభివద్ద పాదములపైఁ బెట్టుకొననలయును. మిగిలిన పద్ధతి పై పద్మాసనము వలెనే.

ఇట్లు స్థిరాసనమున నుండి జపము చేసిన భగవత్సాన్నిధ్యము కలుగును.

# ౪. పంచాంగ సేవనము

మంత్రానుష్ఠానములో నాలుగవయంగము పంచాంగసేవనము. పంచాంగ సేవనము కానిది మంత్రి (రామ) మూర్తి ప్రసన్నుఁడు కాఁడు. ఈ పాఠమును ప్రతిదినము చేయుచుండవలయును.

స్తవము, గీత, సహస్రనామస్తోత్రము, కవచము, హృదయము ఈయైదును పంచాంగములు. ఇందులో హృదయమును జపమునకు ముందును, కవచమును జపానంతరము నను చేయవలయును.

## ౧. శ్రీరామ మంత్రరాజ స్తవము.

శ్లో॥ యద్వా హను మతా ప్రోక్తం మంత్రరాజాత్మకం స్తవమ్
సంప్రదాయ ప్రదీపం యత్తుస్వీత్యైవ రఘూద్వహమ్॥ ౧

శ్రీ హనుమా నువాచ.

శ్లో॥ తిరశ్చామపి చాఽఽరాతి - సమవాయం సమేయుషామ్
యతః సుగ్రీవ ముఖ్యానాం - య స్తముగ్రం నమామ్యహమ్॥

సకృదేవ ప్రపన్నాయ - విశిష్టామైరయ చ్ఛ్రియమ్
విభీషణా యాఽర్థితే - యస్తం వీరం నమామ్యహమ్॥

యో మహా న్పూజితో వ్యాపీ - మహా న్స్యే కరుణామృతమ్
శ్రుతం యేన జటాయోశ్చ - మహావిష్ణుం నమామ్యహమ్॥

తేజసా ప్యాయితా యస్య - జ్వలంతి జ్వలనాదయః
ప్రకాశతే స్వతంత్రో య - స్తం జ్వలంతం నమామ్యహమ్॥

సర్వతో ముఖతా యేన లీలయా దర్శితా రణే
రక్షసాం ఖరముఖ్యానాం తం వందే సర్వతో ముఖమ్॥

నృభావం యః ప్రపన్నానాం - హినస్తిచ తథా నృషు
సింహః సత్వేష్వివో త్కృష్ట - స్తం నృసింహం నమామ్యహమ్॥

య స్మాద్బిభ్యతి వాతార్క - జ్వల నేంద్రాః సమృత్యవః
భియం తనోతి పాపానాం - భీషణం తం నమామ్యహమ్॥

పరస్య యోగ్యతా పేక్షా - రహితో నిత్యమంగళమ్
దదాత్యేవ నిజౌదార్యా - ద్యస్తంభద్రం నమామ్యహమ్॥

యో మృత్యుం నిజదాసానాం నాశయత్యఖి లేష్టదః
తత్రో దా హృతయే వ్యాధో - మృత్యుమృత్యుం నమామ్యహమ్॥

యత్పాద పద్మప్రణతో - భవత్యుత్తమ పూరుషః
తమజం సర్వదేవానాం - నమనీయం నమామ్యహమ్.

అహంభావం సముత్సృజ్య - దాస్యేనైవ రఘూత్తమమ్
భజేఽహం ప్రత్యహం రామం - స సీతం సహలక్ష్మణమ్॥

నిత్యం శ్రీరామ భక్తస్య - కింకరా యమకింకరాః
శివ మయ్యో దిశస్తస్య - సిద్ధయ స్తస్యదా సికాః॥

ఇమం హనూమతా ప్రోక్తం - మంత్రరాజాత్మకం స్తవమ్
పఠ త్యనుదినం యస్తు - సరామే భక్తిమాన్ భవేత్॥

(ఇతి శ్రీ హనుమత్రోప్రోక్తో మంత్రరాజాత్మకః స్తవః)

## శ్రీ రామ గీత

శ్లో॥ నీలోత్పల నిభో రామో - లక్ష్మణః కైరవోపమః
మానసేరాజతాం మే తౌ - బోధవైరాగ్య విగ్రహౌ॥

జ్ఞాన వైరాగ్య స్వరూపులగు నల్లకలువవంటి శరీరముగల శ్రీరాముఁడును, తెల్ల కలువవలెనుండు లక్ష్మణుఁడును నామనస్సునందు భాసింతురుగాక!

## ఉపోద్ఘాతము

శ్రీ మహాదేవ ఉవాచ — శివుఁడు పలుకుచున్నాఁడు.

శ్లో॥ తతో జగన్మంగళ మంగళాత్మనా
విధాయ రామాయణ కీర్తి ముత్తమామ్।
చచార పూర్వాచరితం రఘూత్తమో
రాజర్షి వర్యై రభిసేవితం యథా॥ ౧.

ఓ పార్వతీ ! తర్వాత రఘుకుల శ్రేష్ఠుఁడైన రామచంద్రమూర్తి జగన్మంగళము కొఱకు ధరించిన తన దివ్యమంగళ దేహముచే రామాయణ రూపమైన అత్యుత్తమ కీర్తిని స్థాపించి పూర్వము రాజర్షి శ్రేష్ఠు లెట్లాచరించిరో అట్లు తానుగూడ ఆచరించుచుండెను.

శ్లో॥ సౌమిత్రిణా పృష్ట ఉదార బుద్ధినా
రామః కథాః ప్రాహ పురాతనీః శుభాః
రాజ్ఞః ప్రమత్తస్య నృగస్య శాపతో
ద్విజస్య తిర్యక్త్వ మథాహ రాఘవః॥ ౨

ఉదారబుద్ధియగు లక్ష్మణుఁ డడుగుటచే రామచంద్రమూర్తి పురాతనమైన యుత్తమ కథలను జెప్పుచుండెను. ఈ ప్రసంగములో రాఘవుఁడు నృగ మహారాజు ప్రమాద వశమున బ్రాహ్మణశాపమున తిర్యగ్యోని ప్రాప్తించుటను గూర్చికూడ చెప్పెను.

శ్లో॥ కదాచి దేకాంత ఉపస్థితం ప్రభుం। రామం రమాలాలిత పాదపంకజమ్
సౌమిత్రి రాసాదిత శుద్ధభావనః। ప్రణమ్య భక్త్యా వినయాన్వితో ఽబ్రవీత్॥

ఒకానొక దినమున లక్ష్మీదేవిచే సేవింపఁబడు పాదపద్మములు గల రామచంద్రమూర్తి యేకాంతమునఁ గూర్చుండి యుండఁగా శుద్ధభావన గల లక్ష్మణుఁ డాయన దగ్గఱకువెళ్లి భక్తిపూర్వకముగ నమస్కరించి అతి వినయ భావముతో నిట్లనెను.

శ్లో॥ త్వం శుద్ధ బోధోఽసి హి సర్వదేహినాం
ఆత్మాఽస్య ధీశోఽసి నిరాకృతిః స్వయమ్
ప్రతీయసే జ్ఞాన దృశాం మహామతే
పాదాబ్జ భృంగాయిత సంగసంగినామ్॥

ఓ మహామతీ ! నీవు శుద్ధజ్ఞాన స్వరూపుఁడవు. సమస్త దేహధారులకు నాత్మవు. అధీశుఁడవు. నిరాకారుఁడవు. నీ చరణకమలములకు భ్రమరరూపులగు పరమభాగవతుల సాంగత్యమున నుండు రశికులకే నీవు జ్ఞానదృష్టిచేఁ దెలియఁబడెదవు.

శ్లో॥ అహం ప్రపన్నోఽస్మి పదాంబుజం ప్రభో
భవాప వర్గం తవ యోగి భావితమ్

యథాంజసా జ్ఞాన మపారవారిధిం
సుఖం తరిష్యామి తథాను శాధిమామ్॥ ౫

ఓ ప్రభూ! యోగిజనులచే నిరంతరము భావింపఁబడుచు సంసార విముక్తిని జెందించు నీ చరణ కమల శరణు వేఁడుచున్నాను. నేను సుఖముగా నజ్ఞాన రూపమైన అపార సముద్రమును తరింపఁ గలుగునట్టి ఉపదేశము జేయుము.

## ఉపదేశారంభము

శ్లో॥ శ్రుత్వాఽథ సౌమిత్రి వచోఽఖిలం తదా
ప్రాహ ప్రపన్నార్తి హరః ప్రసన్న ధీః
విజ్ఞాన మజ్ఞాన తమః ప్రశాంతయే
శ్రుతి ప్రపన్నం క్షితిపాల భూషణః॥ ౬

లక్ష్మణుని యీ వాక్యములను విని శరణాగతార్తి హరుఁడును, భూపాల శిరోమణియు భగవానుఁడునైన రామచంద్రమూర్తి వినుట యందు త్సాహము వహించు లక్ష్మణునకు, అతని అజ్ఞానాంధకారమును నాశనము చేయుటకొఱకై ప్రసన్నచిత్తముతో జ్ఞానోపదేశము చేయసాగెను.

శ్లో॥ ఆదౌ సవర్ణాశ్రమ వర్ణితః క్రియాః । కృత్వా సమా సాదిత శుద్ధమానసః
సమాప్య తత్పూర్వ ముపాత్త సాధనః సమాశ్రయే త్సద్గురుమాత్మ లబ్ధయే॥

ఇఁక రాముఁడు చెప్పుచున్నాఁడు :- మొదట స్వవర్ణాశ్రమోచితమగు కర్మలన్నిటిని యథావిధిగాఁ జేయుటచే శుద్ధమైన మనస్సుగలవాఁడై, తర్వాత నాకర్మలను వదలి శమదమాది సాధనచతుష్టయ సంపన్నుఁడై ఆత్మజ్ఞాన ప్రాప్తి కొఱకు సద్గురువు నాశ్రయింప వలెను.

## జ్ఞాన కర్మల మీమాంస

శ్లో॥ క్రియా శరీరోద్భవ హేతురాదృతా।ప్రియా ప్రియౌ తౌ భవతః సురాగిణః
ధర్మేతరౌ తత్ర పునః శరీరకం।పునః క్రియా చక్రవదీర్యతే భవః॥ ౭

కర్మలు దేహాంతరప్రాప్తికి మాత్రమే కైకొనఁబడినవి. ఏలననఁగా వాటి యందు ప్రీతినుంచువారలకు నిష్టానిష్టములను రెండు రకములైన క్రియలుండును.

వానివలన ధర్మాధర్మములు రెండును ప్రాప్తించును. వానివలన మరల కర్మల కాధారమగు శరీరము ప్రాప్తించును. ఈ విధముగ నీ సంసారము చక్రమువలెఁ దిరుగు చుండును.

శ్లో॥ అజ్ఞాన మేవాస్య హి మూలకారణం తద్ధాన మేవాత్ర విధా విధీయతే
విద్యైవ తన్నాశ విధౌ పటీయసీ।న కర్మ తజ్జం స విరోధమీరితమ్॥ ౯

సంసారమునకు మూలకారణ మజ్ఞానమే. ఈ శాస్త్రీయ విధి వాక్యము లందు అజ్ఞాన నాశనమై తద్ద్వారా సంసారమునుండి ముక్తినొందు ఉపాయమే చెప్పఁబడి యున్నది. అజ్ఞాన నాశము గావించుటకు జ్ఞానమే సమర్థమైనది. కాని కర్మకాదు. ఏలననఁగా నజ్ఞానము వలన నుత్పన్నమైన కర్మ దానికి విరోదము కానేరదు.*

శ్లో॥ నా జ్ఞాన హాని ర్న చ రాగ సంక్షయో
భవేత్తతః కర్మ స దోషము ద్భవేత్
తతః పునః సంసృతి రప్యవారితా
తస్మాద్బుధో జ్ఞాన విచారవా న్భవేత్॥ ౧౦

కర్మద్వారా అజ్ఞాన నాశనము, రాగ సంక్షయము కానేరదు. కాక పోఁగా దానివలన నింకొక దోషయుక్తమగు కర్మ యుత్పత్తి యగును. దాని వలన మరల సంసారప్రాప్తి కలుగుట అనివార్యమే యగును. కాఁబట్టి బుద్ధి మంతుఁడగు వాఁడు జ్ఞాన విచారమందే తత్పరుఁడు కావలయును.

శ్లో॥ నను క్రియా వేదముఖేన చోదితా । తథైవ విద్యా పురుషార్థ సాధనమ్
కర్తవ్యతా ప్రాణ భృతః ప్రచోదితా । విద్యా సహాయత్వ ముపైతి సాపునః॥

శ్లో॥ కర్మాకృతౌ దోషమపి శ్రుతిర్జగౌ।తస్మాత్సదా కార్యమిదం ముముక్షుణా
నను స్వతంత్రా ధ్రువకార్య కారిణీ, విద్యా న కించన్మన సాఽప్య పేక్షతే॥

శ్లో॥ స సత్య కార్యేఽపి హి యద్వదధ్వరః
ప్రకాంక్షతేఽన్యానపి కారకాదికాన్

* 'సన్నిపాత లక్షణో విధిరనిమిత్తం తద్విఘాతస్య' ఏ కార్యము ఏ కారణము వలన నుత్పన్నమైనదో అది దానికి నాశకారణము కాఁజాలదు. కావున నజ్ఞానముచే నుత్పన్నమైన కర్మద్వారా అజ్ఞానము నాశము కాఁజాలదు.

తథైవ విద్యా విధితః ప్రకాశితై
ర్విశిష్యతే కర్మభిరేవ ముక్తయే॥ ౧౩

కొందఱు వితర్క వాదులిట్లు పలుకుదురు :-

వేదము ప్రకారము జ్ఞానము పురుషార్థ సాధనమైనట్లు కర్మకూడ వేద విహితమైనదే. ప్రాణధారులు కర్మలు తప్పక చేయవలయునని చెప్పఁబడి యున్నది. కావున నవి (కర్మలు) జ్ఞానమునకు సహకారి యగుచున్నవి. శ్రుతులలో కర్మలు చేయకున్న దోషమని కూడ చెప్పఁబడి యున్నది. కాఁబట్టి ముముక్షువులు కర్మలను సదా చేయుచుండవలయును. జ్ఞానము స్వతంత్రము, నిశ్చయముగా దాని ఫల మది యిచ్చుననియు, దానికి మనస్సుతో నైనప్పటికిని మఱియొక సహాయ మవసరము లేదని యెవరైన ననుచో అది సరిగాదు. ఏలననఁగా వేదోక్తమగు యజ్ఞము సత్యకర్మ మైనప్పటికి అన్యకారకాది అపేక్ష కలదు. అట్లే విధ్యుక్త కర్మములద్వారా మాత్రమే జ్ఞానము ముక్తి సాధకమగుచున్నది. (కావున కర్మత్యాగము గావించుట ఉచితము గాదు.)

శ్లో॥ కేచిద్వంతీతి వితర్కవాదిన, స్తదప్య సద్దృష్ట విరోధకారణాత్
దేహాభిమానా దభి వర్ధతే క్రియా, విద్యా గతాఽహంకృతితః ప్రసిద్ధ్యతి॥

పై విధముగఁ గొందఱు వితర్కవాదులు పలుకుదురు :-

దానిలోఁ బ్రత్యక్ష విరోధముండుటచే నది సరికాదు. కారణ మేమనఁగా కర్మ దేహాభిమానముచేఁ గలుగుచున్నది. జ్ఞానమా కేవల మహంకార నాశమగుటచే సిద్ధించుచున్నది.

శ్లో॥ విశుద్ధ విజ్ఞాన విరోచ నాంచితా, విద్యాఽఽత్మ వృత్తిశ్చ రమేతి భణ్యతే
ఉదేతి కర్మాఖిల కారకాది భి, ర్నిహంతి విద్యాఽఖిల కారకాదికమ్॥

(వేదాంత వాక్య విచారము చేయుచు) విశుద్ధ విజ్ఞాన ప్రకాశముచేత నుద్భాసితమైన చరమ ఆత్మవృత్తికి ఆత్మజ్ఞానమని పేరు. కర్మ యిట్లుకాక సంపూర్ణముగా కారకాది సహాయత వలన నగును. కాని విజ్ఞానము సమస్త కారకాదులను (అనిత్యత్వ భావన ద్వారా) నాశనము గావించును.

శ్లో॥ తస్మాత్త్యజేత్కార్య మశేషతః సుధీ
ర్విద్యా విరోధాన్న సముచ్చయో భవేత్

ఆత్మానుసంధాన పరాయణః సదా
నివృత్త సర్వేంద్రియ వృత్తి గోచరః॥ ౧౬

కాఁబట్టి సమస్తేంద్రియ విషయములనుండి నివృత్తి జెంది నిరంతరము ఆత్మానుసంధానమునందు మగ్నుఁడైన బుద్ధిమంతుఁడు సంపూర్ణముగ కర్మల నన్నిటిని వదలవలెను. ఏలననఁగా విద్యకు విరోధి యగుటచేఁ గర్మకు దానితో సముచ్చయము కలుగదు.

శ్లో॥ యావచ్ఛరీరాదిషు మాయ యాఽత్మధీ
స్తావద్విధేయో విధివాద కర్మణామ్
నేతీతి వాక్యై రఖిలం నిషిధ్య త
జ్జ్ఞాత్వా పరాత్మాన మథ త్యజేత్క్రియాః॥ ౧౭

మాయా మోహితమగు దేహాత్మ భావన యుండునంతవఱకు వైదిక కర్మానుష్ఠానము విధిప్రకారము చేసి తీరవలయును. ఇది కాదు ఇది కాదని సమస్త యనాత్మ పదార్థములను నిషేధించి పరమాత్మ స్వరూపము తెలిసి కొనిన పిమ్మట సమస్త కర్మలను వదలి వేయవలయును.

శ్లో॥ యదా పరాత్మాత్మ విభేద భేదకం
విజ్ఞాన మాత్మ న్యవభాతి భాస్వరమ్
తదైవ మాయా ప్రవిలీయ తేఽంజసా
స కారకా కారణ మాత్మ సంసృతేః॥ ౧౮

పరమాత్మ జీవాత్మల భేదమును బోఁగొట్టు ప్రకాశమయ విజ్ఞాన మంతఃకరణమందు స్పష్టముగా భాసించినప్పుడు ఆత్మ సంసారములోఁ బడుటకు కారణమైన మాయ అనాయాసముగానే కారకాది సహితముగా లీనమై పోవుచున్నది.

శ్లో॥ శ్రుతి ప్రమాణాభి వినాశితా చ సా, కథం భవిష్యత్యపి కార్య కారిణీ
విజ్ఞాన మాత్రాదమలా ద్వితీయత, స్తస్మాదవిద్యా న పునర్భవిష్యతి॥ ౧౯

శ్రుతి ప్రమాణముచే దానిని నష్టపఱచిన మీఁదట నది దాని పని అది చేయుటకెట్లు సమర్థమగును? కాఁబట్టి అట్టి ఏకైక నిర్మల జ్ఞానమును బొందిన మీఁదట అవిద్య మరల నుద్భవింపదు.

శ్లో॥ యది స్మ నష్టా న పునః ప్రసూయతే
కర్మాఽహ మస్యేతి మతిః కథం భవేత్
తస్మాత్స్వతంత్రా నకిమప్య పేక్షతే
విద్యా విమోక్షాయ విభాతి కేవలా॥ ౨౦

అవిద్య నాశనమైన తర్వాత మరల పుట్టకున్నచో జ్ఞానికి 'నేను కర్తను' అను బుద్ధి యెట్లుండఁగలదు? కాఁబట్టి జ్ఞానము స్వతంత్రము. జీవుని మోక్షము కొఱకు దానికింకొక (కర్మాది) అపేక్ష లేదు. అది ఒక్కటే దానికి సమర్థమైనది.

శ్లో॥ సా తైత్తిరీయ శ్రుతి రాహ సాదరం
న్యాసం ప్రశస్తాఖిల కర్మణాం స్ఫుటమ్
ఏతావ దిత్యాహ చ వాజినాం శ్రుతి
ర్జ్ఞానం విమోక్షాయ నకర్మ సాధనమ్॥ ౨౧

ఇదిగాక తైత్తిరీయ * శ్రుతికూడ కర్మలను త్యాగము చేయుటే మంచిదని చెప్పుచున్నది. 'ఏతావదరే ఖల్వమృతత్వమ్' అను వాజసనేయ శ్రుతి కూడ మోక్ష సాధనము జ్ఞానమే కాని కర్మకాదు అని చెప్పుచున్నది.

శ్లో॥ విద్యాసమత్వేనతు దర్శిత స్త్వయా
క్రతుర్న దృష్టాంత ఉదాహృతః సమః
ఫలైః పృథక్త్వా ద్బహు కారకైః క్రతుః
సంసాధ్యతే జ్ఞానమతో విపర్యయమ్॥ ౨౨

నీ చేతఁ బ్రదర్శింపఁబడిన జ్ఞాన, యజ్ఞములు రెండును సమానమనునది సరియైనది కాదు. ఏలననఁగా వాటి రెంటియొక్క ఫలములు వేఱుగా నున్నవి. యజ్ఞము, హోత, ఋత్విక్, యజమానాది కారక బహుళముచే సిద్ధించును. జ్ఞానము దీనికి విపరీతము. అనఁగా నిది కారకాది సాధ్యమైనది కాదు.

శ్లో॥ స ప్రత్యవాయో హ్యహ మిత్య నాత్మ ధీ
రజ్ఞ ప్రసిద్ధా నతు తత్త్వ దర్శినః

---

* 'నకర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః' (తైత్తి) కర్మలచేఁగాని, సంతానముచేఁగాని, ధనము వలనగాని, మోక్షము కలుగదు. కేవల మొక్క త్యాగముచేతనే మోక్షము బొందఁగలఁడు.

తస్మాద్బుద్ధై స్త్యాజ్య మవిక్రియాత్మ భి
ర్విధానతః కర్మ విధి ప్రకాశితమ్॥ ౨౩

కర్మత్యాగము కావించుట చేత నేనవశ్యము ప్రాయశ్చిత్త భాగి నగుదునను ననాత్మతబుద్ధి అజ్ఞానులకు కలుగును. గాని తత్త్వజ్ఞానికి కలుగదు. కాఁబట్టి వికార రహిత చిత్తముగల బుద్ధిమంతుఁడు విధ్యుక్తకర్మలను గూడ విధ్యుక్తముగఁ ద్యజింప వలయును.

## మహావాక్య విచారము

శ్లో॥ శ్రద్ధాన్విత స్తత్త్వమసీతి వాక్యతో, గురోః ప్రసాదాదపి శుద్ధమానసః
విజ్ఞాయ చైకాత్మ్య మథాత్మ జీవయోః, సుఖీ భవేన్మేరు రివా ప్రకంపనః॥

తర్వాత శుద్ధచిత్తము గలవాఁడై శ్రద్ధాపూర్వకముగ గురు ప్రసాదముచే 'తత్త్వమసి' మహావాక్యముద్వారా పరమాత్మ జీవాత్మల ఏకత్వమును దెలిసికొని మేరు పర్వతమువలె నిశ్చలుఁడై సుఖియై యుండవలయును.

శ్లో॥ ఆద్యౌ పదార్థావగతిర్హి కారణమ్, వాక్యార్థ విజ్ఞాన విధౌ విధానతః
తత్త్వం పదార్థౌ పరమాత్మ జీవకా, వసీతి చైకాత్మ్య మథానయోర్భవేత్॥

ప్రత్యేకము వాక్యార్థమును తెలిసికొనుటకు, ముందు పదార్థజ్ఞానమే కారణము. ఈ 'తత్త్వమసి' అను మహావాక్యములో 'తత్' 'త్వం' 'అసి' అని మూఁడు పదములు కలవు. 'తత్' అనునది పరమాత్మను, 'త్వం' పదము జీవాత్మను, 'అసి' పద మారెంటికి నేకత్వమును దెలుపును.

శ్లో॥ ప్రత్యక్పరోక్షాది విరోధమాత్మనో, ర్విహాయసంగృహ్యతయోశ్చిదాత్మ తామ్
సంశోధితాంలక్షణయాచలక్షితాం,జ్ఞాత్వాస్వమాత్మానమథాద్వయోభవేత్॥

ఈ రెంటిలో ననఁగా జీవాత్మ పరమాత్మలలో జీవాత్మ ప్రత్యక్ (అంతఃకరణపు సాక్షి) యై యున్నది. పరమాత్మ పరోక్ష (ఇంద్రియాతీత) మై యున్నది. ఈ వాచ్యార్థరూపమైన విరోధమును విడిచి లక్షణావృత్తిచే లక్షితమైన వానిలోని శుద్ధ చైతన్యమును గ్రహించి దానినే తన యాత్మయని తెలిసికొని యేకీభావమును జెందవలెను.

శ్లో॥ ఏకాత్మకత్వా జ్జహతీ న సంభవేత్, తథాఽజహల్లక్షణతా విరోధతః
సోఽయం పదార్థావివ భాగలక్షణా, యుజ్యేత తత్త్వం పదయో రదోషతః॥

## ఆత్మ - ఉపాధి

శ్లో॥ రసాది పంచీకృత భూత సంభవం, భోగాలయం దుఃఖ సుఖాది కర్మణామ్
శరీరమాద్యంత వదాది కర్మజం, మాయామయం స్థూల ముపాధి మాత్మనః॥

శ్లో॥ సూక్ష్మం మనో బుద్ధి దశేంద్రియైర్యుతం
ప్రాణై రపంచీకృత భూత సంభవమ్
భోక్తుః సుఖాదే రను సాధనం భవే
చ్ఛరీర మన్యద్విదురాత్మనో బుధాః॥ ౨౯

పృథివ్యాది పంచభూతములతోఁ బుట్టినదియు, సుఖదుఃఖాది కర్మభోగముల కాశ్రయమైనదియు, పూర్వోపార్జిత కర్మఫలము వలన ప్రాప్తించిన యీ మాయామయాద్యంతమైన శరీరము ఆత్మకు స్థూలోపాధి యనియు, మనస్సు బుద్ధి, దశేంద్రియములు, పంచప్రాణములతోఁ (మొత్తము పదునేడు తత్త్వములు) గూడి, అపంచీకృత భూతములచే నుత్పన్నమై భోక్తకు సుఖదుఃఖాది అనుభవమునకు సాధనమైన సూక్ష్మశరీరము ఆత్మకు రెండవ దేహమనియు విజ్ఞుల మతము.

శ్లో॥ అనాద్యనిర్వాచ్య మ పీహ కారణం
మాయాప్రధానం తు పరం శరీరకమ్
ఉపాధి భేదాత్తు యతః పృథక్ స్థితం
స్వాత్మాన మాత్మన్యవధారయే త్క్రమాత్॥ ౩౦

ఇవిగాక అనాదియు, వనిర్వాచ్యము, మాయామయమైన కారణ శరీరమే జీవుని మూఁడవ దేహము. ఈ విధముగ నుపాధి భేదముచేత సర్వథా వేఱుగానున్న తన ఆత్మ స్వరూపమును క్రమముగ (ఉపాధుల నాశముచేయుచు) అంతరంగమందు నిశ్చయపఱచు కొనవలెను.

## ఉపాధి నాశము

శ్లో॥ కోశేష్వయం తేషు తు తత్త దాకృతి
ర్విభాతి సంగాత్స్ఫటికోపలో యథా
అసంగ రూపోఽయ మజో యతోఽద్వయో
విజ్ఞాయతేఽస్మిన్పరితో విచారితే॥ ౩౦

స్ఫటిక మణివలెనున్న యీ యాత్మయు అన్నమయాది భిన్నభిన్న కోశ ములందు వాటి సాంగత్యముచే వాటి ఆకారమే భాసించుచుండును. కాని దీనిని బాగుగా విచారించుటచే నిది యద్వితీయ మగుటను అసంగరూపమనియు, పుట్టని దనియు, నిశ్చితమగుచున్నది

శ్లో॥ బుద్ధే స్త్రిధావృత్తి రపీహ దృశ్యతే
స్వప్నాది భేదేన గుణత్రయాత్మనః
అన్యోన్యతోఽస్మి న్వ్యభిచారతో మృషా
నిత్యే పరే బ్రహ్మణి కేవలే శివే॥ 32

త్రిగుణాత్మకమైన బుద్ధియే స్వప్న, జాగ్రత్సుషుప్తి భేదముచే మూఁడవ స్థలు కనఁబడుచున్నవి; కాని యీ మూఁడు న్నవస్థ లన్యోన్యము ఒకదానిలో నొకటి లేనివై వ్యభిచరించుచున్నవి. కావున నివి యన్నియు కేవల మంగళ స్వరూపమైన నిత్యపరబ్రహ్మమందు మిథ్యలగుచున్నవి. అనఁగా నా పరబ్రహ్మ మందు నవస్థలు అభావము లగును.

శ్లో॥ దేహేంద్రియ ప్రాణ మనశ్చిదాత్మనాం సంఘా దజస్రం పరివర్తతే ధియః
వృత్తి స్తమో మూల తయాఽజ్ఞలక్షణా యావద్భవేత్తావదసౌ భవోద్భవః॥ 33

బుద్ధివృత్తియే దేహేంద్రియ ప్రాణ మనసులు చిదాత్మయొక్క సంఘాత రూపమును నిరంతరము పరివర్తనము చేయుచుండును. ఈ వృత్తి తమోగుణముచే నుత్పన్నమగుటచే నజ్ఞానరూపమైనది. ఇది యున్నంతవఱకు సంసారములోఁ బుట్టుట యుండనే యుండును.

శ్లో॥ నేతి ప్రమాణేన నిరాకృతాఖిలో హృదా సమాస్వాదిత చిద్ఘనామృతః
త్యజే దశేషం జగదాత్త సద్రసం పీత్వా యథాంభః ప్రజహాతి తత్ఫలమ్॥

'నేతి నేతి' యను శ్రుతిప్రమాణముచే నిఖిల సంసారమును నిరాకరించి, హృదయమందు చిద్ఘనామృతాస్వాదన చేసి, లేత కొబ్బరికాయలోని నీటిని త్రావి దానిని పాఱవైచినట్లు సంపూర్ణ జగత్తును దానిలోని సారరూపమైన సత్తు (బ్రహ్మ) ను గ్రహించి వదలవలయును.

శ్లో॥ కదాచిదాత్మా నమృతో న జాయతే న క్షీయతే నాపి వివర్ధతేఽనవః
నిరస్త సర్వాతిశయః సుఖాత్మకః స్వయం ప్రభః సర్వగతోఽయమద్వయః॥

ఆత్మ యెన్నటికిని చచ్చునది కాదు. జన్మించునది కాదు. అది క్షీణింపదు. పెరుగదు. అది పురాతన మైనది. సమస్త విశేషణ రహిత మైనది. సుఖ స్వరూప మైనది. స్వయం ప్రకాశ మైనది. సర్వగతము. అద్వితీయ మైనది.

## అధ్యాస నిరూపణము

శ్లో॥ ఏవం విశ్వే జ్ఞానమయే సుఖాత్మకే, కథం భవో దుఃఖ మయః ప్రతీయతే
అజ్ఞానతో ఽధ్యాస వశాత్ప్రకాశతే, జ్ఞానే విలీయేత విరోధతః క్షణాత్ ॥

జ్ఞానము కలిగిన మీఁదట జ్ఞానమయమును, సుఖ స్వరూపమైన ఆ పరమాత్మయందు దుఃఖమయమగు సంసార మెట్లు తోఁచుచున్నది? ఇది అధ్యాస కారణమైన యజ్ఞానముచేతనే తోఁచుచున్నది. జ్ఞానముచే నది ఒక్కక్షణ కాలములోనే విలీనమగుచున్నది. ఏలననఁగా జ్ఞానాజ్ఞానములు రెండును పరస్పరము పరమ విరోధులు.

శ్లో॥ యదన్య దన్యత్ర విభావ్యతే భ్రమా, దధ్యాస మిత్యాహు రముం విపశ్చితః
అ సర్పభూతేఽహి విభావనం యథా, రజ్జ్వాదికే తద్వదపీశ్వరే జగత్ ॥32

భ్రమచే నొకదాని యందింకొకటి భాసించుచున్నప్పుడు దాని నధ్యాస మందురు. సర్పము కానట్టి త్రాడునందు సర్పభ్రాంతి కలుగునట్లు, ఈశ్వరుని యందు జగత్తు ప్రతిభాసించుచున్నది.

శ్లో॥ వికల్పమాయారహితే చిదాత్మకేఽ, హంకార ఏష ప్రథమః ప్రకల్పితః
అధ్యాస ఏవాత్మని సర్వకారణే, నిరామయే బ్రహ్మణి కేవలే పరే॥ 33

వికల్ప మాయారహితమును, సర్వకారణమును, నిరామయమును, చిత్స్వరూపమును, అద్వితీయమునగు పరమాత్మ పరబ్రహ్మమందు మొదట నీ యహంకార రూపమైన అధ్యాసము కల్పింపఁబడినది.

శ్లో॥ ఇచ్ఛాది రాగాది సుఖాది ధర్మికాః, సదా ధియః సంసృతి హేతవః పరే
యస్మాత్ప్రసుప్తౌ తదభావతః పరః, సుఖస్వరూపేణ విభావ్యతే హి నః॥

సర్వమునకు సాక్షియైన ఆత్మయందు ఇచ్ఛాఽనిచ్ఛా రాగద్వేష సుఖ దుఃఖాది రూప బుద్ధి వృత్తులే జనన మరణ రూప సంసారమునకుఁ కారణమై యున్నది. ఏలననఁగా సుషుప్త్యవస్థలో నివి యభావమైనప్పుడు మనకు ఆత్మ యొక్క సుఖస్వరూపమే భాసించు చున్నది.

శ్లో॥ అనాద్యవిద్యోద్భవ బుద్ధి బింబితో, జీవః ప్రకాశోఽయ మతీర్యతే చితః
- ఆత్మాధియః సాక్షితయా పృథక్ స్థితో, బుద్ధ్యా పరిచ్ఛిన్న పదః స ఏవహి॥

అనాద్యవిద్యచే నుత్పన్నమైన బుద్ధియందు ప్రతిబింబితమైన చేతన ప్రకాశమే జీవుఁడని చెప్పఁబడు చున్నాఁడు. ఆత్మ, బుద్ధికి సాక్షిరూపమై వేఱుగానున్నది. ఆ పరాత్మ మాత్రము బుద్ధిచేత నపరిచ్ఛిన్నమై యున్నది.

శ్లో॥ చిద్బింబ సాక్ష్యాత్మ ధి యాం ప్రసంగత
స్త్వేకత్ర వాసాదనలాక్త లోహవత్
అన్యోన్య మధ్యాస వశా త్ప్రతీయతే
జడా జడత్వంచ చిదాత్మ చేత సోః॥ ౪౧

అగ్నిచేఁ దప్తమైన లోహమువలె చిదాభాస సాక్షియైన యాత్మయు, బుద్ధియు నొకటిగా నుండుటచేఁ బరస్పర మన్యోన్యాధ్యాసమైన కారణముచేఁ గ్రమముగా వాటియొక్క చేతనత్వ జడత్వములు తోఁచుచున్నవి. (అనఁగా నగ్నిచేఁ దప్తమైన లోహములో నగ్నికిని లోహమునకుఁ దాదాత్మ్యము కలుగుటచే లోహముయొక్క ఆకార మగ్నికిని, అగ్నియొక్క యుష్ణత లోహమునందును కనఁబడుచున్నది. ఆ విధముగనే బుద్ధి, ఆత్మ పరస్పర తాదాత్మ్యము నొందుటచే నాత్మయొక్క చేతనత్వము బుద్ధికిని, బుద్ధియొక్క జడత్వము ఆత్మయందు భాసించుచున్నది. అందు వలన నధ్యాస వశముచేత బుద్ధి మొదలుకొని శరీర పర్యంతముగల అనాత్మ వస్తువులను ఆత్మ యని యనుకొను చున్నాఁడు.)

శ్లో॥ గురోః సకాశాదపి వేదవాక్యగః, సంజాత విద్యానుభవో నిరీక్ష్యతమ్
స్వాత్మానమాత్మ స్థ ముపాధి వర్జితం, త్యజేద శేషం జడమాత్మ గోచరమ్॥

గురు సమీపమున నుండుటచేతను. వేదవాక్యముల చేతను, ఆత్మజ్ఞానానుభవము కలిగిన పిమ్మట తన హృదయములోనున్న ఉపాధి రహితమైన ఆత్మ సాక్షాత్కారము పొంది, ఆత్మగా గోచరించుచున్న దేహాది జడ పదార్థములను త్యజింప వలయును.

## ఆత్మ చింతనము

శ్లో॥ ప్రకాశ రూపోఽహ మజోఽహ మద్వయో౽
సకృద్విభాతోఽహ మతీవ నిర్మలః

విశుద్ధ విజ్ఞాన ఘనో నిరామయః
సంపూర్ణ ఆనందమయో౽హ మక్రియః॥ ౪౩

నేను ప్రకాశ స్వరూపుఁడను. అజుఁడను. అద్వితీయుఁడను. నిరంతర భాసమానుఁడను. అత్యంత నిర్మలుఁడను. విశుద్ధ విజ్ఞాన ఘనుఁడను. నిరామయుఁడను. క్రియా రహితుఁడను. సంపూర్ణ ఆనంద మయుఁడను.

శ్లో॥ సదైవ ముక్తో౽హ మచిన్త్య శక్తి మా నతీంద్రియ జ్ఞాన మవిక్రియాత్మకః
అనంత పారో౽హ మహర్నిశం బుధై ర్విభావితో౽హం హృది వేదవాదిభిః॥

నేను సదా ముక్తుఁడను. అచింత్య శక్తిమంతుఁడను. అతీంద్రియ జ్ఞాన స్వరూపుఁడను. అవికృత రూపుఁడను. అనంత పారుఁడను. వేదవాదులగు పండితులచే నహర్నిశము భావింపఁబడు వాఁడను.

శ్లో॥ ఏవం సదాత్మాన మఖండితాత్మనా విచార మాణస్య విశుద్ధ భావనా
హన్యాద విద్యా మచిరేణ కారకై రసాయనం యద్వదుపాసితం రుజః॥

ఈవిధముగ నిరంతర మాత్మచింతన మఖండవృత్తిచేఁ జేయువానియొక్క అంతః కరణమందు ఉత్పన్నమైన విశుద్ధభావన నియమానుసారముగా రసాయనౌషధమును సేవించిన రోగము నాశనమైనట్లు వెంటనే కారకాది సహితముగా నవిద్యా నాశమును గావించును.

శ్లో॥ వివిక్త ఆసీన ఉపారతేంద్రియో వినిర్జితాత్మా విమలాంతరాశయః
విభావయే దేకమనన్య సాధనో విజ్ఞాన దృక్కేవల ఆత్మ సంస్థితః॥ ౪౬.

ఆత్మ చింతన చేయువాఁ డేకాంత ప్రదేశమం దింద్రియములను విషయములనుండి నివృత్తి గావించి, అంతః కరణమును దనవశము గావించుకొని కూర్చుండి, ఆత్మయందే యుండి, వేఱొక సాధనము నాశ్రయింపక శుద్ధ చిత్తముతోఁ గేవలము జ్ఞానదృష్టిద్వారా ఆత్మ నొక్కదానినే భావింపవలెను.

శ్లో॥ విశ్వం యదేత త్పరమాత్మ దర్శనం విలాపయే దాత్మని సర్వ కారణే
పూర్ణశ్చిదానంద మయో౽వ తిష్ఠతే నవేద బాహ్యం నచ కించి దాంతరమ్॥

ఈ విశ్వమంతయు పరమాత్మ స్వరూపమని తెలిసికొని, దీనిని సర్వకారణ స్వరూపమైన యాత్మయందు లీనము చేయవలయును. ఈవిధముగ నెవఁడు పరిపూర్ణ చిదానంద స్వరూపమున నిలిచియుండునో వానికి బాహ్యాభ్యంతరములందు గల యేవస్తుజ్ఞానము నుండదు.

# ఓంకారోపాసన

శ్లో॥ పూర్వం సమాధే రఖిలం విచింతయే, దోంకార మాత్రం సచరాచరం జగత్
తదేవ వాచ్యం ప్రణవో హి వాచకో, విభావ్యతేఽ జ్ఞాన వశాన్న బోధతః॥

సమాధి ప్రాప్తించుటకు పూర్వము సమస్త చరాచర జగత్తు ఓంకార మాత్రమని భావింప వలయును. ఈ ప్రపంచమే వాచ్యము ప్రణవమే వాచకము. అజ్ఞాన కారణముననే ప్రపంచము తోఁచుచున్నది. జ్ఞానము కలిగిన తర్వాత నిది యేమియును భాసింపదు.

శ్లో॥ అకార సంజ్ఞః పురుషో హి విశ్వకో
హ్యుకారక స్తైజస ఈర్యతే క్రమాత్
ప్రాజ్ఞో మకారః పరిపఠ్యతేఽఖిలైః
సమాధి పూర్వం స తు తత్త్వతో భవేత్॥ ౯౯

(ఓంకారములో అకార, ఉకార, మకారమను మూఁడు వర్ణములు కలవు) వీనిలో అకారము జాగ్రదభిమానియగు విశ్వవాచకము. ఉకారముస్వప్నాభిమానియగు తైజస వాచకము. మకారము సుషుప్త్యభిమాని యగు ప్రాజ్ఞ వాచకము. ఈవ్యవస్థ సమాధికి పూర్వమేగాని తత్త్వదృష్టిచే నేభేదమును లేదు.

శ్లో॥ విశ్వం త్వకారం పురుషం విలాపయే, దుకార మధ్యే బహుధా వ్యవస్థితమ్
తతో మకారే ప్రవిలాప్య తైజసం, ద్వితీయ వర్ణం ప్రణవస్య చాంతిమే॥౪౦

నానా విధములుగనున్న అకారరూపుఁడైన విశ్వుని ఉకార మందు లీనము చేయవలెను. ఓంకారములో తైజసరూపమగు (రెండవ) వర్ణమును చివర వర్ణమగు మకారమందు లీనము చేయవలెను.

శ్లో॥ మకార మప్యాత్మని చిద్ఘనే పరే, విలాపయేత్ప్రాజ్ఞ మపీహ కారణమ్
సోఽహం పరం బ్రహ్మ సదావిముక్తిమ, ద్విజ్ఞాన దృఙ్ముక్త ఉపాధితోఽమలః॥

తర్వాత కారణాత్మయగు ప్రాజ్ఞరూపమగు మకారమునుగూడ చిద్ఘన రూపమగు పరమాత్మయందు లీనము చేయవలయును. ఇట్లుచేసి నిత్యముక్త విజ్ఞాన స్వరూపమును ఉపాధి హీనమునగు నిర్మల పరబ్రహ్మను నేనని భావింప వలయును.

శ్లో॥ ఏవం సదా జాత పరాత్మ భావనః, స్వానంద తుష్టః పరి విస్మృతాఖిలః
ఆస్తే స నిత్యాత్మ సుఖప్రకాశకః, సాక్షాద్విముక్తోఽచల వారి సింధువత్॥

ఈవిధముగ నిరంతరము పరమాత్మ భావవచేయుచు స్వాత్మానందములో మగ్నుఁడై, సమస్త దృశ్యప్రపంచ విస్మృతిని జెంది, నిత్యానందానుభవము చేయు జీవన్ముక్తుఁడగు యోగి నిస్తరంగ సముద్రమువలె సాక్షాన్ముక్త స్వరూపుఁడగును.

శ్లో॥ ఏవం సదాఽభ్యస్త సమాధి యోగినో నివృత్త సర్వేంద్రియ గోచరస్య హి
వినిర్జితాశేష రిపోరహం సదా దృశ్యో భవేయం జిత షడ్గుణాత్మనః॥ ౫౩

ఈ విధముగ నిరంతరము సమాధి యోగాభ్యాసము చేయుచు, సంపూర్ణముగ నింద్రియ గోచరములగు విషయములనుండి నివృత్తిని జెంది, కామక్రోధాది శత్రువులను సంపూర్ణముగ జయించి మనస్సును, జ్ఞానేంద్రియము లైదింటిని మొత్తమీ ఆరింటిని జయించిన మహాత్మునకు నిరంతరము నేను సాక్షాత్కరింతును.

శ్లో॥ ధ్యాత్వైవ మాత్మాన మహర్నిశం ముని స్తిష్ఠేత్సదా ముక్త సమస్త బంధనః
ప్రారబ్ధమశ్నన్నభిమాన వర్జితో మయ్యేవ సాక్షాత్ప్రవిలీయతే తతః॥ ౫౪

ఈ విధముగ నహర్నిశము ఆత్మచింతనము జేయునుముని సర్వదా సమస్త బంధములనుండి ముక్తుఁడై, కర్తృత్వ భోక్తృత్వాభిమానమును వదలి ప్రారబ్ధ ఫలము ననుభవించును. దీనివలన నతఁడంతమున సాక్షాత్తుగ నాలో నైక్యమగును.

## ఆత్మచింతనావశ్యకత

శ్లో॥ ఆదౌచ మధ్యేచ తథైవ చాంతతో భవం విదిత్వా భయశోక కారణమ్
హిత్వా సమస్తం విధివాద చోదితం భజేత్స్వమాత్మాన మథాఖిలాత్మనామ్॥

సంసారమున ఆది మధ్యాంతమందు గల భయశోక కారణము నెఱిఁగి, సమస్త వేదవిహిత కర్మలను వదలి సమస్త ప్రాణులయొక్క అంతరాత్మ తన అంతరాత్మగా నెంచి భజింపవలయును.

శ్లో॥ ఆత్మన్య భేదేన విభావయన్నిదం భవత్యభేదేన మయాత్మనా తదా
యథాజలంవారినిధౌ యథా పయః క్షీరే వియ ద్వ్యోమ్న్యనిలే యథాఽనిలః

సముద్రములో జలము, పాలలో పాలు, మహాకాశములో ఘటాకాశము, వాయువులో వాయువు కలిసి ఒక్కటియే యైనట్లు ఈ ప్రపంచమును తన

ఆత్మతో నభిన్నరూపముగాఁ జింతించుటచే జీవుండు పరమాత్మయగు నాయం దభిన్న భావముతో నుండును.

శ్లో॥ ఇత్థం యదీక్షేత హి లోక సంస్థితో, జగన్మృషైవేతి విభావయన్మునిః
నిరాకృతత్వాచ్ఛ్రుతి యుక్తిమానతో, యథేందు భేదో దిశి దిగ్భ్రమాదయః॥

ఈ జగత్తు శ్రుతి, యుక్తి, ప్రమాణములచే నిరాకరింపఁబడుటచే చంద్ర భేదము, దిగ్భ్రమలవలె మిథ్య యగుచున్నదను భావముతో లోక వ్యవహారమున నున్న ముని దీనిని జూచును.

శ్లో॥ యావన్న పశ్యేదఖిలం మదాత్మకం, తావన్మదారాధన తత్పరో భవేత్
శ్రద్ధాళు రత్యూర్జిత భక్తి లక్షణో, యస్తస్య దృశ్యో౽హమహర్నిశం హృది॥

సమస్త ప్రపంచము నా స్వరూపముగఁ గనఁబడునంత వఱకు నాయారాధన చేయుటయందు తత్పరుఁడు కావలెను. శ్రద్ధాళువై, గాఢభక్తి గలిగిన వాని హృదయము నందెల్లప్పుడును రాత్రిబవళ్లు నేను సాక్షాత్కరింతును.

## ఉపదేశోపసంహారము

శ్లో॥ రహస్య మేతచ్ఛ్రుతి సార సంగ్రహమ్ మయా వినిశ్చిత్య తవోదితం ప్రియ
యస్త్వేతదాలోచయ తీహ బుద్ధిమాన్ సముచ్యతే పాతక రాశిభిః క్షణాత్॥

ఓ ప్రియుఁడా! శ్రుతులలోఁగల సార సంగ్రహమును, రహస్యమైనదియు నగు దీనిని నిశ్చయించి నీకుఁ జెప్పియున్నాను. ఏబుద్ధిమంతుఁడు దీనిని మననము చేయునో వాఁడు తత్క్షణమే సమస్త పాపములనుండి ముక్తుఁ డగుచున్నాఁడు.

శ్లో॥ భ్రాతర్యదీదం పరి దృశ్యతే జగ న్మాయైవ సర్వం పరిహృత్య చేతసా
మద్భావనా భావిత శుద్ధ మానసః సుఖీ భవానంద మయో నిరామయః॥ ౬౦

సోదరా! ఈ కనఁబడు ప్రపంచమంతయు మాయ యని మనసా నిరాకరించి, నన్ను భావించుటచే బుద్ధమానసము కలవాఁడవై సుఖివియు, ఆనంద పరిపూర్ణుఁడవును క్లేశశూన్యుఁడ వగుము.

శ్లో॥ యః సేవతే మామగుణం గుణాత్పరం
హృదా కదా వా యది వా గుణాత్మకమ్
సో౽హం స్వపాదాంచిత రేణుభిః స్పృశన్
పునాతి లోకత్రితయం యథా రవిః॥ ౬౧

నన్ను గుణాతీతుఁడగు నిర్గుణునిగఁగాని పోనీ గుణాత్మకమగు సగుణ రూపముగఁగాని హృదయములో సేవించిన వాఁడు నాస్వరూపుఁడనియే తెలియవలయును. వాని పాదధూళిచే సూర్యుని వలె మూఁడులోకములను బవిత్రము చేయగలఁడు.

శ్లో॥ విజ్ఞాన మేతదఖిలం శ్రుతి సారమేకం
వేదాంత వేద్య చరణేన మయైవ గీతమ్
యః శ్రద్ధయా పరిపఠేద్గురుభక్తి యుక్తో
మద్రూపమేతి యదిమద్వచనేషు భక్తిః॥ ౬౨

ఈ యద్వైతీయ జ్ఞానము సమస్త శ్రుతుల సారము. వేదాంతవేద్య భగవత్పాదుఁడనగు నేనే దీనిని జెప్పితిని. గురుభక్తి యుక్తుఁడగు వాఁడెవఁడు దీనిని శ్రద్ధతోఁ బఠించునో, నా వచనములందు భక్తి కలవాఁడు నా రూపమును బొందును.

ఇతి శ్రీమదధ్యాత్మ రామాయణోత్తర కాండాంతర్గత శ్రీరామ గీత సంపూర్ణః.

# శ్రీరామ సహస్రనామ స్తోత్రమ్

శ్లో॥ రాజీవ లోచన శ్శ్రీమాన్ రాజేంద్రో రఘుపుంగవః
రామచంద్ర స్సదాచారో రాజేంద్రో జానకీ పతిః॥ ౧
అగ్రగణ్యో వరేణ్యశ్చ వరదః పరమేశ్వరః
జనార్దనో జితామిత్రః పరార్థైక ప్రయోజనః॥ ౨
విశ్వామిత్ర ప్రియోదాంత శ్శత్రు జిచ్ఛత్రు తాపనః
సర్వజ్ఞో వాలి మర్దీచ జ్ఞాన భావ్యో పరిచ్ఛదః॥ ౩
వాగ్మీ సత్యవ్రత సర్వదేవాది శరణ శ్శుచిః
జ్ఞాన గమ్యో దృఢ ప్రజ్ఞ ఖరధ్వంసీ ప్రతాపవాన్॥ ౪
శ్రుతిమా నాత్మవాన్వీరో జితక్రోధో౽రి మర్దనః
విశ్వరూపో విశాలాక్షః ప్రభుః పరిబృఢో దృఢః॥ ౫
ఈశః ఖడ్గధరః శ్రీమాన్ కౌసలేయోనసూయకః
విపులాంసో మహోరస్కః పరమేష్ఠి పరాయణః॥ ౬

సత్యవ్రత స్సత్య సంధో గురుః పరమ ధార్మికః
లోకజ్ఞో లోకవంద్యశ్చ లోకాత్మా లోకకృత్పరః॥ ౭

అనాది ర్భగవాన్ సేవ్యో జితమాయో రఘూద్వహః
రామో దయాకరో దక్ష స్సర్వజ్ఞ స్సర్వ పావనః॥ ౮

బ్రహ్మణ్యో నీతిమాన్ గోప్తా సర్వదేవమయో హరిః
సుందరః పీత వాసాశ్చ సూత్రకారః పురాతనః॥ ౯

సౌమ్యో మహర్షిః కోదండీ సర్వజ్ఞ స్సర్వగోచరః
కవి స్సుగ్రీవ వరదః సర్వపుణ్యాధిక ప్రదః॥ ౧౦

భవ్యో జితారి షడ్వర్గో మహోదారోఽఘనాశనః
సుకీర్తి రాది పురుషః కాంతః పుణ్యకృతాగమః॥ ౧౧

అకల్మష శ్చతుర్బాహు స్సర్వావాసో దురాసదః
స్మితభాషీ నివృత్తాత్మా స్మృతిమాన్ వీర్యవాన్ ప్రభుః॥ ౧౨

ధీరోదాత్తో ఘనశ్యామః సర్వాయుధ విశారదః
అధ్యాత్మ యోగ నిలయ స్సుమనా లక్ష్మణాగ్రజః॥ ౧౩

సర్వతీర్థమయ శ్శూరః సర్వయజ్ఞ ఫలప్రదః
యజ్ఞస్వరూపీ యజ్ఞేశో జరామరణ వర్జితః॥ ౧౪

వర్ణాశ్రమ గురో వర్ణీ శత్రుజిత్పురుషోత్తమః
విభీషణ ప్రతిష్ఠాతా పరమాత్మా పరాత్పరః॥ ౧౫

ప్రమాణ భూతో దుర్జ్ఞేయః పూర్ణః పరపురం జయః
అనంతదృష్టి రానందో ధనుర్వేదో ధనుర్ధరః॥ ౧౬

గుణాకరో గుణశ్రేష్ఠః సచ్చిదానంద విగ్రహః
అభివంద్యో మహాకాయో విశ్వకర్మా విశారదః॥ ౧౭

వినీతాత్మా వీతరాగ స్తపస్వీశో జనేశ్వరః
కల్యాణ ప్రకృతిః కల్యః సర్వేశః సర్వకామదః॥ ౧౮

అక్షరః పురుషస్సాక్షీ కేశవః పురుషోత్తమః
లోకాధ్యక్షో మహామాయో విభీషణ వరప్రదః॥ ౧౯

ఆనందవిగ్రహో జ్యోతి ర్హనుమత్ప్రభు రవ్యయః
భ్రాజిష్ణు స్సహనో భోక్తా సత్యవాదీ బహుశ్రుతః॥ ౨౦

సుఖదః కరణా కర్తా భవబంధ విమోచనః
దేవచూడామణి ర్నేతా బ్రహ్మణ్యో బ్రహ్మవర్ధనః॥ ౨౧

సంసార తారకో రామ స్సర్వదుఃఖ విమోక్షకృత్
విద్వత్తమో విశ్వకర్తా విశ్వహర్తాచ విశ్వకృత్॥ ౨౨

నిత్యోనియత కల్యాణః సీతాశోక వినాశకృత్
కాకుత్స్థః పుండరీకాక్షో విశ్వామిత్ర భయాపహః॥ ౨౩

మారీచ మథనో రామో విరాధ వధ పండితః
దుస్స్వప్న నాశనో దమ్యః కిరీటీ త్రిదశాధిపః॥ ౨౪

మహాధను ర్మహాకాయో భీమో భీమ పరాక్రమః
తత్త్వస్వరూపీ తత్త్వజ్ఞ స్తత్త్వవాదీ సువిక్రమః॥ ౨౫

భూతాత్మా భూతకృత్స్వామీ కాలజ్ఞానీ మహాపటుః
అనిర్విణ్ణో గుణగ్రాహీ నిష్కళంకః కళంకహా॥ ౨౬

స్వభావ భద్ర శ్శత్రుఘ్నః కేశవః స్థాణు రీశ్వరః
భూతాది శంభు రాదితః స్థవిష్ట శ్శాశ్వతో ధ్రువః॥ ౨౭

కవచీ కుండలీ చక్రీ [illegible] భక్తజన ప్రియః
అమృత్యు ర్జన్మరహిత స్సర్వజి త్సర్వ గోచరః॥ ౨౮

అనుత్తమో ప్రమేయాత్మా సర్వాది ర్గుణసాగరః
సమ స్సమాత్మా సమగో జటామకుట మండితః॥ ౨౯

అజేయ స్సర్వభూతాత్మా విష్వక్సేనో మహాతపాః
లోకాధ్యక్షో మహాబాహు రమృతో వేదవిత్తమః॥ ౩౦

సహిష్ణు స్సద్గతిశ్శాస్తా విశ్వయోనిర్మహాద్యుతిః
అతీంద్రియోర్జిత ప్రాంశు రుపేంద్రో వామనో బలీ॥ ౩౧

ధనుర్వేదో విధాతాచ బ్రహ్మా విష్ణుశ్చ శంకరః
హంసో మరీచి ర్గోవిందో రత్నగర్భో మహామతిః॥ ౩౨

వ్యాసో వాచస్పతి స్సర్వ శ్శకటాసుర మర్దనః
జానకీవల్లభః పూజ్యః ప్రకటః ప్రీతి వర్ధనః॥ ౩౩

సంభవోఽతీంద్రియో వేద్యో నిర్దేశో జాంబవత్ప్రభుః
మదనో మథనోవ్యాపీ విశ్వరూపీ నిరంజనః॥ ౩౪

నారాయణోఽగ్రణీస్సాధు ర్జటాయుః ప్రీతివర్ధనః
నైకరూపో జగన్నాథ స్సురకార్యహితః ప్రభుః॥ ౩౫

జితక్రోధో జితారాతిః ప్లవగాధిపరాజ్యదః
వసుద స్సుభుజో నైక మాయో భవ్యః ప్రమోదనః॥ ౩౬

చండాంశు స్సిద్ధసంకల్ప శ్శరణాగత వత్సలః
అగదో రోగహర్తాచ మంత్రవిన్మంత్ర భావనః॥ ౩౭

సౌమిత్రి వత్సలో ధుర్యో వ్యక్తావ్యక్త స్వరూపధృత్
విశిష్టో గ్రామణీ శ్రీమాన్ అనుకూలః ప్రియంవదః॥ ౩౮

అతుల స్సాత్త్వికో ధీరః శరాసన విశారదః,
జ్యేష్ఠస్సర్వ గుణోపేతః శక్తిమాన్ తాటకాంతకః॥ ౩౯

వైకుంఠః ప్రాణినాం ప్రాణః కమఠః కమలాపతిః
గోవర్ధన ధరో మత్స్యరూపః కారుణ్యసాగరః॥ ౪౦

కుంభకర్ణ ప్రభేత్తా చ గోపీ గోపాల సంవృతః,
మాయావీ స్వాపనో వ్యాపీ రైణుకేయ బలాపహః॥ ౪౧

పినాకమథనో వంద్య స్సమ్మతో గరుడధ్వజః
లోకత్రయాశ్రయో లోక భరితో భరతాగ్రజః ౪౨

శ్రీధర స్సద్గతిర్లోక స్సాక్షీర్నారాయణో బుధః
మనోవేగీ మనోరూపీ పూర్ణః పురుష పుంగవః॥ ౪౩

యదుశ్రేష్ఠోయదుపతిః భూతవాస స్సువిక్రమః
తేజో ధరో ధరోఽవ్యగ్ర శ్చతుర్మూర్తి ర్మహానిధిః॥ ౪౪

చాణూర మర్దనో వంద్య శ్శాంతో భరతవందితః
శబ్దాతిగో గభీరాత్మా కోమలాంగః ప్రజాగరః॥ ౪౫

లోకగర్భ శ్శేషశాయీ క్షీరాబ్ధినిలయోఽమలః
ఆత్మయోని రదీనాత్మా సహస్రాక్ష స్సహస్రపాత్ ॥ ౪౬

అమృతాంశుర్మహాగర్భో నివృత్త విషయస్పృహః
త్రికాలజ్ఞో మునిస్సాక్షీ వైహాయస గతిః కృతీ॥ ౪౭

పర్జన్యో కుముదో భూతా వాసః కమలలోచనః
శ్రీవత్స వక్షాః శ్రీరామో వీరహా లక్ష్మణాగ్రజః॥ ౪౮

లోకాభిరామో లోకారి మర్దనస్సేవక ప్రియః
సనాతన తమో మేఘ శ్యామలో రాక్షసాంత కృత్ ॥ ౪౯

దివ్యాయుధ ధరశ్శ్రీమాన్ అప్రమేయో జితేంద్రియః
భూదేవ వంద్యో జనక ప్రియకృత్ప్రపితామహః॥ ౫౦

ఉత్తమ స్సాత్త్వికః స్సత్య స్సత్య సంధస్త్రివిక్రమః
సువ్రత స్సులభ స్సూక్ష్మ స్సుఘోష సుఖదస్సుహృత్ ॥ ౫౧

దామోదరోఽచ్యుత శ్శార్ఙ్గీ వామనో మధురాధిపః
దేవకీనందన శ్శౌరీ మధుకైటభ మర్దనః॥ ౫౨

సప్తతాళ ప్రభేత్తా చ మిత్రవంశ ప్రవర్ధనః
కాలస్వరూపీ కాలాత్మా కాలః కల్యాణదః కవిః॥ ౫౩

సంవత్సరో ఋతుః పక్ష అయనో దివసా యుగః
స్తవ్యో వివిక్తో నిర్లేప స్సర్వవ్యాపీ నిరాకులః॥ ౫౪

రసో రసజ్ఞ స్సర్వజ్ఞో లోకసారో రసాత్మకః
సర్వదుఃఖాతిగో విద్యా రాశిః పరమ గోచరః॥ ౫౫

శేషో విశేషో విగత కల్మషో రఘునాయకః
వర్ణశ్రేష్ఠో వర్ణబాహ్యో వర్ణోఽవర్ణ్య గుణోజ్జ్వలః॥ ౫౬

కర్మ సాక్షీ గురుశ్రేష్ఠః దేవాసుర నమస్కృతః
దేవాదిదేవో దేవర్షి ర్దేవాసుర వరప్రదః॥ ౫౭

సర్వదేవ మయశ్చక్రీ శార్ఙ్గపాణిరనుత్తమః
మనో బుద్ధి రహంకారః ప్రకృతిః పురుషోఽవ్యయః॥ ౫౮

అహల్యా పావన స్స్వామీ పితృభక్తో వరప్రదః
న్యాయో నయధరశ్శ్రీమాన్ నయో నగధరో ధ్రువః॥ ౫౯

లక్ష్మీవిశ్వంభరో భర్తా దేవేంద్రో బలిమర్దనః
బాణారి ర్వర్ధనో యజ్వాఽనుత్తమో మునిసేవితః॥ ౬౦

దేవాగ్రణీః పరధ్యాన తత్పరః పరమః పరః
సామగాన ప్రియోఽక్రూరః పుణ్యకీర్తి స్సులోచనః॥ ౬౧

పుణ్యః పుణ్యాధికః పూర్వః పూర్ణః పూరయితా రవిః
జటిలః కల్మషధ్వాంత ప్రభంజన విభావసుః॥ ౬౨

అవ్యక్త లక్షణో వ్యక్తో దశాస్యద్విప కేసరీ
కళానిధిః కళారూపో కమలానంద వర్ధనః॥ ౬౩

జయో జరారి స్సర్వాఘ శమనో భవభంజనః
అలంకరిష్ణు రచలో రోచిష్ణు ర్విక్రమోత్తమః॥ ౬౪

అంశు శ్శబ్ద పతిశ్శబ్ద గోచరో రంజనో రఘుః
నిశ్శబ్దః ప్రణవో మాలః స్థూల సూక్ష్మో విచక్షణః॥ ౬౫

ఆత్మయోని రదీనాత్మా సహస్రాక్ష స్సహస్రపాత్
సనాతన తమ స్రగ్వీ పేశలో జవినాం వరః॥ ౬౬

శక్తిమాన్ శంఖభృన్నాథః గదాపద్మ రథాంగభృద్
నిరీహో నిర్వికల్పశ్చ చిద్రూపో జితసాధ్వసః॥ ౬౭

శతానన స్సహస్రాక్ష శ్శతమూర్తి ర్ఘన ప్రభః
హృత్పుండరీక శయనః కఠినో విద్రవో ద్రవః॥ ౬౮

వ్యగ్రో గ్రహపతిః కృష్ణః సమర్థోఽనర్థ నాశనః
అధర్మ శత్రు రక్షోఘ్నోఽ పురుహూతః పురుష్టుతః॥ ౬౯

బ్రహ్మ గర్భో బృహద్గర్భో ధర్మధేనుర్ధనాగమః
హిరణ్యగర్భో జ్యోతిష్మాన్ సులలాట స్సువిక్రమః॥ ౭౦

పితృపూజా రతశ్చైవ భవానీ ప్రియకృద్వశీ
నరో నారాయణో రామః కపర్దీ నీలలోహితః॥ ౨౧

రుద్రః పశుపతిః స్థాణు ర్విశ్వా మిత్రో ద్విజేశ్వరః
మాతామహో మాతరిశ్వా విరించో విష్టర శ్రవాః॥ ౨౨

అక్షోభ్యస్సర్వ జంతూనాం చండస్సత్య పరాక్రమః
వాలఖిల్యో మహాకల్పః కల్పవృక్షః కళాధరః॥ ౨౩

నిదాఘస్తపనో మోఘః శ్లక్ష్ణః పరబలాపహృత్
కబంధ మథనోదివ్యః కంబుగ్రీవశ్శివ ప్రియః॥ ౨౪

శంఖోఽనిల స్సునిష్పన్న స్సురభి శ్శిశిరాత్మకః
అసంస్పృష్టోఽతిథి శ్శూరః పరర్ధిః పాపనాశకృత్॥ ౨౫

వసుశ్రవాః కవ్యవాహో ప్రతాపా విశ్వభోజనః
రామో నీలోత్పలశ్యామః జ్ఞానస్కంధో మహాద్యుతిః॥ ౨౬

పవిత్రపాదః పాపారి ర్మణిపూరో నభో గతః
ఉత్తారణో దుష్కృతిహా దుర్ధర్షో దుస్సహో భయః॥ ౨౭

అమృతేశోఽమృత వపుః ధర్మశ్చాపి కృపా కరః
భర్గో వివస్వానాదిత్యో యోగాచార్యోదివస్పతిః॥ ౨౮

ఉదార కీర్తి రుద్యోగీ వాఙ్మయ స్సదసన్మయః
నక్షత్రమాలీ నాకేశః స్వాధిష్ఠాన షడాశ్రయః॥ ౨౯

చతుర్వర్గఫలో వర్గీ శక్తిత్రయ ఫలో నిధిః
నిదాన గర్భో నిర్వ్యాజో నిరీశో వ్యాజమర్దనః॥ ౩౦

శ్రీ వల్లభ శ్శివారంభ శాంతశ్చైవ సమంజసః
భూశయో భూతకృద్భూతి భూషణో భూత వాహనః॥ ౩౧

అకాయో భక్తకాయస్థః కాలజ్ఞానీ మహావటుః
పరార్థవృత్తి రచలో వివిక్తః శ్రుతి సాగరః॥ ౩౨

స్వభావభద్రో మధ్యస్థః సంసార భయనాశనః
వేద్యోవైద్యో వియద్గోప్తా సర్వామరమునీశ్వరః॥ ౩౩

సురేంద్ర శ్శరణః కర్మ కర్మకృత్కర్మగోఽజః
స్థైర్యోఽగ్రధుర్యో ధాత్రీశః సంకల్ప స్సర్వతీపతిః॥ ౨౪

పరమార్థ గురుర్విష్ణు శ్శుచి రాశ్రిత వత్సలః
విష్ణు ర్జిష్ణు ర్విభుర్యజ్ఞో యజ్ఞేశో యజ్ఞపాలకః॥ ౨౫

ప్రభవిష్ణు ర్గ్రసిష్ణుశ్చ లోకాత్మా లోకపావనః
కేశవః కేశిహా కావ్యః కవిః కారణ కారణః॥ ౨౬

కావ్యకర్తా కళాశేషః వాసుదేవః పురుష్టుతః
ఆదికర్తా వరాహశ్చ మాధవో మధుసూదనః॥ ౨౭

నారాయణో నరో హంసో విష్వక్సేనో జనార్దనః
విశ్వకర్తా మహాయజ్ఞో జ్యోతిష్మా న్పురుషోత్తమః॥ ౨౮

వైకుంఠః పుండరీకాక్షః కృష్ణస్సూర్య స్సురార్చితః
నారసింహో మహాభీమో వక్రదంష్ట్రో నఖాయుధః॥ ౨౯

ఆదిదేవో జగత్కర్తా యోగీశో గరుడధ్వజః
గోవిందో గోపతి ర్గోప్తా భూపతి ర్భువనేశ్వరః॥ ౩౦

పద్మనాభో హృషీకేశః ధాతా దామోదరః ప్రభుః
త్రివిక్రమస్త్రిలోకేశః బ్రహ్మేశః ప్రీతివర్ధనః॥ ౩౧

వామనో దుష్టదమనః గోవిందో గోపవల్లభః
భక్తప్రియోఽచ్యుతస్సత్యః సత్యకీర్తి ర్ధృతిః స్మృతిః॥ ౩౨

కారుణ్యః కరుణో వ్యాసః పాపహా శాంతి వర్ధనః
సన్న్యాసీ శాస్త్రతత్త్వజ్ఞో మందరాద్రి నికేతనః॥ ౩౩

బదరీ నిలయశ్శాంతో తపస్వీ వైద్యుత ప్రభః
భూతావాసో గుహావాసః శ్రీనివాసః శ్రియః పతిః॥ ౩౪

తపోవాసో ముదావాసో సత్యావాస స్సనాతనః
పురుషః పుష్కరః పుణ్యః పుష్కరాక్షో మహేశ్వరః॥ ౩౫

పూర్ణమూర్తిః పురాణజ్ఞః పుణ్యదః పుణ్యవర్ధనః
శంఖీ చక్రీ గదీ శార్ఙ్గీ లాంగలీ ముసలీ హలీ॥ ౯౬

కిరీటీ కుండలీ హారీ మేఖలీ కవచీ ధ్వజీ
యోద్ధా జేతా మహావీర్య శ్శత్రుజిచ్ఛత్రుతాపనః॥ ౯౭

శాస్త్రీ శాస్త్రకరశ్శాస్తా సతతం శంకరస్తుతః
సారథి స్సాత్త్వికస్స్వామీ సామవేదప్రియస్సమః॥ ౯౮

హవన స్సాహసశ్శక్తిః సంపూర్ణాంగస్సమృద్ధిమాన్
స్వర్గదః కామదశ్శ్రీదః కీర్తిదః కీర్తినాయకః॥ ౯౯

మోహదః పుండరీకాక్షో క్షీరాబ్ధికృత కేతనః
సర్వాత్మా సర్వలోకేశః ప్రేరకః పాపనాశనః॥ ౧౦౦

సర్వదేవో జగన్నాథః సర్వలోక మహేశ్వరః
సర్గస్థిత్యంత కృద్దేవ స్సర్వలోక సుఖావహః ౧౦౧

అక్షయ శ్శాశ్వతో ఽనంతో క్షయవృద్ధి వివర్జితః
నిర్లేపో నిర్గుణ స్సూక్ష్మో నిర్వికారో నిరంజనః॥ ౧౦౨

సర్వోపాధి వినిర్ముక్తః సత్తామాత్ర వ్యవస్థితః
అధికారి ర్విభుర్నిత్యః పరమాత్మా సనాతః॥ ౧౦౩

అచలో నిర్మలో వ్యాపీ నిత్యతృప్తో నిరాశ్రయః
శ్యామో యువా లోహితాక్షో దీప్తాస్యోమితభాషణః ౧౦౪

ఆజానుబాహు స్సుముఖ స్సింహస్కంధో మహాభుజః
సత్యవాన్ గుణసంపన్నః స్వయంతేజా స్సుదీప్తిమాన్॥ ౧౦౫

కాలాత్మా భగవాన్ కాలః కాలచక్రప్రవర్తకః
నారాయణః పరంజ్యోతిః పరమాత్మా సనాతనః॥ ౧౦౬

విశ్వసృడ్విశ్వగోప్తాచ విశ్వభోక్తాచ శాశ్వతః
విశ్వేశ్వరో విశ్వమూర్తిర్విశ్వాత్మా విశ్వభావనః॥ ౧౦౭

సర్వభూత సుహృచ్ఛాంత స్సర్వభూతానుకంపనః
సర్వేశ్వ రేశ్వరస్సర్వ శ్శ్రీమానాశ్రిత వత్సలః॥ ౧౦౮

సర్వగ స్సర్వభూతేశ స్సర్వభూతాశయ స్థితః
అభ్యంతరస్యతమస శ్ఛేత్తా నారాయణః పరః॥ ౧౦౯

అనాది నిధనస్స్రష్టా ప్రజాపతి పతిర్హరిః
నారసింహో హృషీకేశః సర్వాత్మా సర్వదృగ్వశీ॥ ౧౧౦

నేతా సనాతనః కర్తా జగతస్థుషః ప్రభుః
శ్రీమాన్ ధాతావిధాతాచ సర్వేషాం ప్రభురీశ్వరః॥ ౧౧౧

సహస్రమూర్తి ర్విశ్వాత్మా విష్ణుర్విశ్వదృ గవ్యయః
పురాణ పురుషస్స్రష్టా సహస్రాక్ష స్సహస్రపాత్॥ ౧౧౨

తత్త్వం నారాయణో విష్ణు ర్వాసుదేవ స్సనాతనః
పరమాత్మా పరంబ్రహ్మ సచ్చిదానంద విగ్రహః॥ ౧౧౩

పరంజ్యోతిః పరంధామ పరాకాశః పరాత్పరః
అచ్యుతః పురుషః కృష్ణః శాశ్వతశ్శివ ఈశ్వరః॥ ౧౧౪

నిత్య స్సర్వ గత స్థాణు ఉగ్రస్సాక్షీ ప్రజాపతిః
హిరణ్య గర్భస్సవితా లోకకృల్లోకభృద్విభుః॥ ౧౧౫

అకార వాచ్యో భగవాన్ శ్రీపతిర్భూపతిః పుమాన్
సర్వలోకేశ్వరశ్శ్రీమాన్ సర్వజ్ఞ స్సర్వతో ముఖః॥ ౧౧౬

స్వామీ సుశీల స్సులభః సర్వదః సర్వశక్తిమాన్
నిత్యసంపూర్ణ కామశ్చ నైసర్గిక సుహృత్సుఖీ॥ ౧౧౭

కృపా పీయూష జలధి శ్శరణ్య స్సర్వదేహినామ్
నారాయణశ్చ స్వామీ చ జగతాంపతిరీశ్వరః॥ ౧౧౮

శ్రీశః శరణ్యో భూతానాం సంశ్రితాభీష్టదాయకః
అనంత శ్రీపతిఃరామో గుణభృన్నిర్గుణో మహాః॥ ౧౧౯

ఇతి శ్రీరామ సహస్రనామ స్తోత్రం సంపూర్ణః॥

—*—

# శ్రీ రామ హృదయము

(ఇది జపమునకు ముందుగా పఠింపవలసినది.)

శ్లో॥ తతో రామస్స్వయంప్రాహ - హనూమంత ముపస్థితం
శృణు తత్త్వం ప్రవక్ష్యామి - హ్యాత్మానాత్మపరాత్మనామ్॥

ఆకాశస్య యథా భేద - స్త్రివిధో దృశ్యతే మహాన్
జలాశయే మహాకాశ - స్తదవ చ్ఛిన్న ఏవహి॥

ప్రతి బింబాఖ్యమపరం - త్రివిధం దృశ్యతే నభః
బుద్ధ్యవచ్ఛిన్న చైతన్య - మేకం పూర్ణ మథాపరం॥

ఆభాసస్త్వపరం బింబ - భూతమేవం త్రిధాచితిః
సాభాస బుద్ధేః కర్తృత్వ - మవిచ్ఛిన్నేఽవి కారిణి॥

సాక్షిణ్యారోప్యతే భ్రాంత్యా - జీవత్వంచ తథాఽబుధైః
ఆభాసస్తు మృషా బుద్ధి - రవిద్యా కార్యముచ్యతే॥

అవిచ్ఛిన్నంతు తద్బ్రహ్మ - విచ్ఛేదస్తు వికల్పతః
అవిచ్ఛిన్నస్య పూర్ణేన - ఏకత్వం ప్రతిపాద్యతే॥

తత్త్వమస్యాది వాక్యైశ్చ - సాభాసస్యా మహస్తథా
ఐక్యజ్ఞానం యదోత్పన్నం - మహావాక్యేన చాత్మనోః॥

తదాఽవిద్యా స్వకార్యైశ్చ - నశ్యత్యేవ నసంశయః
ఏతద్విజ్ఞాయ మద్భక్తో - మద్భావా యోప పద్యతే॥

మద్భక్తి విముఖానాం హి - శాస్త్రగర్తేషు ముహ్యతామ్
న జ్ఞానం న న చమోక్షస్స్యా - త్తేషాం జన్మశతైరపి॥

శ్లో॥ ఇదం రహస్యం హృదయం మమాత్మనో
మయైవ సాక్షాత్కథితం తవానఘ
మద్భక్తి హీనాయ శఠాయ నత్వయా
దాతవ్య మైంద్రాదపి రాజ్యతోఽధికమ్॥

శ్రీ మహాదేవ ఉవాచ:-

శ్లో॥ యేతత్తేఽభిహితం దేవి శ్రీరామ హృదయం మయా
అతి గుహ్యతమం హృద్యం పవిత్రం పాపశోధనమ్.

సాక్షాద్రామేణ కథితం సర్వవేదాంత సంగ్రహమ్
యః పఠేత్సతతం భక్త్యా సముక్తో నాత్ర సంశయః.

బ్రహ్మహత్యాది పాపాని బహుజన్మార్జితానపి
నశ్యంత్యేవ నసందేహో రామస్య వచనం యథా.

శ్లో. యోఽతి భ్రష్టోఽతి పాపీ పరధన పరదారేషు నిత్యోద్యతోవా
స్తేయీ బ్రహ్మఘ్న మాతా పితృవధ నిరతో యోగిబృందాపకారీ
యస్సం పూజ్యాభిరామం పఠతిచ హృదయం రామచంద్రస్య భక్త్యా
యోగీంద్రైరప్యలభ్యం పదమిహ లభతే సర్వదేవైస్సపూజ్యమ్.

ఇతి శ్రీమదధ్యాత్మరామాయణే ఉమామహేశ్వర సంవాదే బాలకాండే
శ్రీరామ హృదయం నామ ప్రథమ సర్గః.

తదనంతరము శ్రీరామచంద్రుఁడు తన యెదుట నిలుచుండిన హనుమంతునితో నిట్లనెను:- 'నేను నీకు ఆత్మ, అనాత్మ, పరమాత్మలను గురించి చెప్పెదను సావధానుఁడవై వినుము. జలాశయములో ఆకాశము మూఁడు రకములుగ గనఁబడుచున్నది. మొదటిది సర్వవ్యాపకమగు మహాకాశమును, రెండవది జలాశయములోనే పరిమితమైన జలావచ్ఛిన్నాకాశమును, మూఁడవది జలములోఁ బ్రతిబింబించుఁ బ్రతి బింబాకాశము. ఈ విధముగ నాకాశమునకు మూఁడు విధములుగ గొప్ప భేదములు కనఁబడునట్లు చేతనము మూఁడు విధములుగ నున్నది. మొదటిది బుద్ధ్యవచ్ఛిన్న చేతనము (ఇది బుద్ధిలో వ్యాపించినది.) రెండవది సర్వత్ర పరిపూర్ణమైనది. మూఁడవది బుద్ధిలోఁ బ్రతిబింబించినదియు, దీనినే ఆభాస చైతన్యమందురు. వీనిలో కేవలము ఆభాసచైతన్యముతోఁ గూడి బుద్ధియందే కర్తృత్వము కలుగుచున్నది. అనఁగా చిదాభాసునితోఁ గూడుకొని బుద్ధియే సర్వ కార్యము లొనర్చుచున్నది. కాని అజ్ఞులు భ్రాంతివశమున నిరవచ్ఛిన్నమును, నిర్వికారమును, సాక్షిస్వరూపమైన యాత్మయందు కర్తృత్వమును, జీవత్వారోపమును కావించుచున్నారు. అనఁగా నదియే కర్తయనియు,

ఖోక్తయనియు భావించుచున్నారు. (మనము దేనినైతే జీవుడను చున్నామో) ఆ యాభాసచైతన్యమును మిథ్య యగుచున్నది. కారణమేమనఁగా ఆభాసము లన్నియును మిథ్యలే. బుద్ధి అవిద్యయొక్క కార్యమే. బ్రహ్మ పదార్థము అనఁగా పరమాత్మ వాస్తవముగ విచ్ఛేద రహితమైనది. కావుననే దాని విచ్ఛేదముకూడ వికల్పము చేతనే భావింపఁబడు చున్నది. ఈ విధముగా నుపాధులను నాశము చేయుచు సాభాస అహంకారరూపమును అవిచ్ఛిన్న చేతనము నగు జీవుని 'తత్త్వమసి' నీవు అదియై యున్నావు. మొదలగు మహావాక్యముల ద్వారా పూర్ణ చేతన బ్రహ్మతో నైక్యము జెప్పఁబడుచున్నది. మహావాక్యముల ద్వారా ఈ విధముగ జీవబ్రహ్మైక్య జ్ఞాన ముత్పన్నముకాఁగా ఆసమయమున నవిద్య దాని కార్యములతోఁగూడ నాశన మగుచున్నది. ఇందుకు సందేహ మావంతయును లేదు. నాభక్తుఁడు ఈతత్త్వమును గ్రహించి, నా స్వరూపమును బొందుటకు నర్హుఁడగుచున్నాఁడు. అయితే యెవఁడు నా భక్తిని వీడి శాస్త్ర గర్తము (గుంట) లో పడి కొట్టుకొనునో, అట్టివానికి నూఱు జన్మలకైనను జ్ఞానము కలుగదు, మోక్షమును బొందఁజాలఁడు. ఓ అనఘా! ఈ పరమ రహస్యము ఆత్మస్వరూపుఁడ నగు నా (రామ) హృదయము. స్వయముగ నేనే నీకుఁ జెప్పితిని. నీకు ఇంద్రాధిపత్యమునకు మించిన సంపత్తు లభించినప్పటికిని, నీవు దీనిని నాభక్తిహీనుఁడగు దుష్టునకుఁ జెప్పరాదు.

మహేశ్వరుఁ డిట్లనెను:_ ఓ పార్వతీ! నేను నీకు అత్యంత గోపనీయమును, హృద్యమును, పరమ పవిత్రమును, పాపనాశకమునగు 'శ్రీరామ హృదయమును' వినిపించితిని. ఇది సమస్త వేదాంతసార సంగ్రహము. సాక్షాత్తుగ శ్రీరామ చంద్రునిచేఁ జెప్పఁబడినది. దీనిని భక్తితోఁ బఠించువాఁడు నిస్సందేహముగ ముక్తుఁడు కాఁగలఁడు. దీనిని బఠించుట మాత్రము చేతనే అనేక జన్మలలో నార్జించిన బ్రహ్మహత్యాది సమస్త మహాపాపములు నిస్సందేహముగ నశింపఁ గలవు. ఏలననఁగా శ్రీరాముఁడట్లు చెప్పినాఁడు. అతిభ్రష్టుఁడును, అతిపాపియు, పరధన పరస్త్రీలయందు సదాప్రవృత్తి కలవాఁడును, చోరుఁడును, బ్రహ్మహత్య గావించినవాఁడును, తల్లిదండ్రులను జంపినవాఁడును, యోగుల కహితము గావించినవాఁడునుగూడ శ్రీరామచంద్రుని బూజించి, యీ రామహృదయమును భక్తితో పఠించుచో, నాతఁడు సమస్తదేవతలకును బూజ్యుఁడై యోగులకుఁ గూడ దుర్లభమగు పరమ పదమును బొందును.

# శ్రీ రామ కవచము

(ఇది జపాంగమునఁ బఠింప వలసినది.)

శ్లో॥ ఇదానీం రామకవచం _ శృణుష్వైవ వదామి తే
పరం గుహ్యం పవిత్రంచ _ సర్వేషాం హిత పూర్వకమ్॥

సుతీక్ష్ణస్త్వేకదా గస్త్యం _ ప్రోవాచ రహసి స్థితం
భగవన్ పరిజ్ఞానం తే _ తత్త్వజ్ఞ కరుణా నిధే॥

గురో త్వం మాంవదస్వాద్య స్తోత్రం రామస్య పావనమ్

అగస్తిరువాచ:_

శ్లో॥ ఆజానుబాహుమరవింద దళాయతాక్షం
ఆజన్మశుద్ధ రసహాస ముఖం ప్రసన్నం
శ్యామం గృహీత శరచాప ముదార రూపం
రామం సరామ మభిరామ మనుస్మరామి॥

శ్లో॥ శృణు వత్స్యామ్యహం సర్వం _ సుతీక్ష్ణ మునిసత్తమ
శ్రీరామ కవచం పుణ్యం _ సర్వకామ ప్రదాయకమ్॥

అద్వైతానంద చిద్రూప్య _ శుద్ధ సత్వైక లక్షణః
బహిరంత స్సుతీక్ష్ణాత్ర _ రామచంద్రః ప్రకాశతే॥

తత్త్వ విద్యాగ్నినా నిత్యం _ పరమం చేతస్సుఖాత్మని
ఇతి రామ పదేనాసౌ _ పరంబ్రహ్మాభి ధీయతే॥

జయరామేతి యన్నామ _ కీర్త్తయ న్నాభి వ్రజేత్
సర్వపాపవిముక్తోఽసౌ _ యాతి విష్ణోః పరంపదమ్॥

శ్రీరామేతి పరం మంత్రం _ తదేవ పరమం పదం
తదేవ తారకం విద్ధి _ జన్మమృత్యు భయాపహమ్॥

శ్రీరామేతి వదన్ బ్రహ్మా _ భావమాప్నోత్యసంశయః॥

ఓమస్య శ్రీరామ కవచస్య అగస్త్య ఋషిః అనుష్టుప్ఛందః సీతాలక్ష్మణోపేత శ్రీరామచంద్రో దేవతా శ్రీరామచంద్ర ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః—

శ్లో॥ అథ ధ్యానం ప్రవక్ష్యామి – సర్వాభీష్ట ఫల ప్రదమ్
నీల జీమూత సంకాశం – విద్యుత్పీతాంబరావృతమ్॥

కోమలాంగం విశాలాక్షం – యువానమతి సుందరమ్
సీతా సౌమిత్రి సహితం – జటా ముకుట ధారిణం॥

సాసి తూణ ధనుర్బాణ – పాణిం దానవమర్దనం
యదా చోరభయే రాజ – భయే శత్రు భయే తథా

ధ్యాత్వా రఘుపతిం క్రుద్ధం – కాలానల సమప్రభమ్
చీర కృష్ణాజిన ధరం – భస్మోద్ధూళిత విగ్రహమ్॥

ఆ కరాకృష్ట స శర – కోదండ భుజమండితం
రణే రిపూన్ రావణాదీన్ – తీక్ష్ణమార్గణ వృష్టిభిః॥

సంహరంతమహావీర – ముగ్రమైంద్ర రథ స్థితం
లక్ష్మణాద్యై ర్మహా వీరై – ర్వృతం హనుమ దా దిభిః॥

సుగ్రీవాద్యైర్మహావీరై – శ్శైల వృక్ష కరోద్యతైః
వేగాత్కరాల హుంకారై – ర్భుభుక్కార మహారవైః॥

న దద్భిః పరివాదద్భి – స్సమరే రావణం ప్రతి
శ్రీరామ శత్రు సంఘాన్మే – హన మర్దయ ఖాదయ॥

భూతప్రేత పిశాచాదీన్ – శ్రీరామాశు వినాశయ
ఏవంధ్యాత్వా జపే ద్రామ – కవచం సిద్ధి దాయకమ్॥

సుతీక్ష్ణ వజ్రకవచం – శృణు వక్ష్యామ్యను త్తమం
శ్రీరామః పాతు మే మూర్ధ్ని – పూర్వేచ రఘువంశజః॥

దక్షిణే మే రఘువరః – పశ్చిమే పాతు పావనః
ఉత్తరే మే రఘుపతిః – ఫాలం దశరథాత్మజః॥

భ్రువోర్దూర్వాదళ శ్యామ - స్తయోర్మధ్యే జనార్దనః
శ్రోత్రం మే పాతు రాజేంద్రో - దృశౌ రాజీవలోచనః॥

ఘ్రాణం మే పాతు రాజర్షి - ర్గండం మే జానకీపతిః
కర్ణమూలే ఖరధ్వంసీ - ఫాలం మే రఘు వల్లభః॥

జిహ్వాం మే వాక్పతిః పాతు - దంత పఙ్క్త్యా రఘూత్తమః
ఓష్ఠౌ శ్రీరామ చంద్రో మే - ముఖం పాతు పరాత్పరః॥

కంఠంపాతు జగద్వంద్యః - స్కంధౌ మే రావణాంతకః
ధనుర్బాణ ధరః పాతు - భుజౌ మే వాలి మర్దనః॥

సర్వాణ్యంగుళి పర్వాణి - హస్తౌమే రాక్షసాంతకః
వక్షో మే పాతు కాకుత్థ్సః - పాతు మే హృదయం హరిః॥

స్తనౌ సీతాపతిః పాతు - పార్శ్వం మే జగదీశ్వరః
మధ్యం మే పాతు లక్ష్మీశో - నాభిం మే రఘు నాయకః॥

కౌసల్యేయః కటీపాతు - పృష్ఠం దుర్గతి నాశనః
గుహ్యం పాతు హృషీకేశ - స్సక్థినీ సత్య విక్రమః॥

ఊరూ శార్ఙ్గధరః పాతు - జానునీహనుమత్ప్రియః
జంఘే పాతు జగద్వ్యాపీ - పాదౌ మే తాటకాంతకః॥

సర్వాంగం పాతు మే విష్ణు - స్సర్వ సంధీ ననామయః
జ్ఞానేంద్రియాది పాదాదీన్ - పాతు మే మధుసూదనః॥

పాతు శ్రీరామ భద్రో మే - శబ్దాదీ న్విషయానపి
ద్విపదాదీని భూతాని - మత్సంబంధీని యానిచ॥

రోమాంకురాణ్యశేషాణి - పాతు సుగ్రీవ రాజ్యదః
వాఙ్మనో బుద్ధ్యహంకారైః - జ్ఞానాజ్ఞానకృతానిచ॥

జన్మాంతర కృతానీహ - పాపాని వివిధా నిచ
తాని సర్వాణి దగ్ధ్వాశు - హర కోదండ ఖండనః॥

పాతు మాం సర్వతో రామ - శార్ఙ్గబాణ ధరస్సదా
ఇతి శ్రీరామ చంద్రస్య - కవచం వజ్ర సమ్మితమ్॥

గుహ్యాద్గుహ్యతమం దివ్యం - సుతీక్ష్ణ ముని సత్తమ
యః పఠేచ్ఛృణు యాద్వాపి - శ్రావయే ద్ధ్యానసమాహితః॥
స యాతి పరమం స్థానం రామచంద్ర ప్రసాదతః
మహాపాతక యుక్తోవా - గోఘ్నోవా భ్రూణహా తథా॥

శ్రీరామచంద్ర కవచ - పఠనాచ్ఛుద్ధి మాప్నుయాత్
బ్రహ్మహత్యాదిభిః పాపై - ర్ముచ్యతే నాత్ర సంశయః॥

భో సుతీక్ష్ణ యథాపృష్టం - త్వయా మమ పురాశుభం
తదా శ్రీరామ కవచం - మయా తే వినివేదితమ్॥

ఇతి శ్రీ శతకోటి రామచరితాంతర్గత శ్రీమదానంద రామాయణే
వాల్మీకియే శ్రీరామ కవచ వర్ణనం నామ మనోహరకాండే
త్రయోదశ సర్గః___
హరిః ఓం తత్సత్.

ఇప్పుడు పరమరహస్యమును, పవిత్రమైనదియు, సమస్త కోరికల నిచ్చునదియు నగు రామకవచమును జెప్పెదను వినుము. ఒకానొకప్పుడు సుతీక్ష్ణుడు అగస్త్యుని దగ్గఱకుఁజేరి రహస్యముగ నిట్లడిగెను. స్వామీ! ఆనంద తత్త్వము నెఱిఁగిన కరుణానిధీ! గురూ! మీరు నాకు పరమ పావనమగు శ్రీరామ స్తోత్రమును గూర్చి చెప్పవలయును.

అగస్త్యుఁ డిట్లు పలికెను:-

మోఁకాళ్లవఱకు జేతులు కలవాఁడును, పద్మపత్రాక్షుఁడును, పుట్టుకతో వచ్చిన చిఱునవ్వుగల ప్రసన్న ముఖము కలవాఁడును, మేఘశ్యాముఁడును, ధనుర్బాణములు ధరించినవాఁడును, ఉదారరూపము గలవాఁడును, లోకాభిరాముఁడునగు సీతారాములను నేను స్మరించుచున్నాను. ఓ సుతీక్ష్ణమహామునీ! పుణ్యప్రదమైనదియు, సమస్తకోరికల నొసంగునదియు నగు శ్రీరామ కవచమును జెప్పెదను వినుము.

శ్రీరామచంద్రుఁడు అద్వైతానంద చైతన్యశుద్ధ సత్త్వైక లక్షణుఁడు. శ్రీరాముఁడు లోపల వెలుపల నిండి ప్రకాశించుచున్నాఁడు. తత్త్వవిద్యార్థికి పరమంబగు నిత్య సుఖము కలుగును. రామశబ్దముచే పరబ్రహ్మ ప్రతిపాదింపఁ బడుచున్నాఁడు. ఏ మానవుఁడు జయరామయను నామమును కీర్తించునో, అభివర్ణించునో, ఆతఁడు సమస్తపాపముల నుండి విముక్తిని జెంది విష్ణుపదమును బొందును. శ్రీరామ యనునదియే పరమమంత్రము. ఆ శ్రీరామయే పరమ పదము. అదియే జననమరణ రూపమగు భయమును బోఁగొట్టు తారకమని తెలిసికొనుము. శ్రీరామ యని పలుకుటచేతనే నిస్సంశయముగ బ్రహ్మభావమును బొందును.

(ఇఁక నిక్కడనుండి శ్రీరామకవచ మారంభ మగుచున్నది.)
ఇది గురూపదిష్టమై యుండవలయును.

సర్వాభీష్ట ఫలప్రదమగు ధ్యానమును గూర్చి చెప్పుచున్నాను వినుము:_ నల్లని మేఘములను బోలినవాఁడును, మెఱుపుతీఁగవంటి పీతాంబరమును ధరించినవాఁడును, కోమలములగు నవయవములు గలవాఁడును, విశాలములగు కన్నులు గలవాఁడును, యువకుఁడును, మిక్కిలి సుందరుఁడును, సీతాలక్ష్మణులతోఁ గూడుకొనినవాఁడును, జడలనే కిరీటముగా ధరించినవాఁడును, కత్తి, అంబులపొది, ధనుర్బాణములను జేతధరించిన వాఁడును, దానవులను మర్దించినవాఁడు నగు రాముని ధ్యానించుచున్నాను. చోరభయముగాని, రాజభయముగాని, శత్రుభయముగాని సంభవించినప్పుడు కాలాగ్నితో సమానమగు కాంతిగలిగి కోపముతోనున్నట్టియు, నారచీరలను, కృష్ణాజినమును ధరించిన వాఁడును, భస్మమును బూసికొనిన శరీరము కలవాఁడును, ధనుర్బాణములను భుజముల ధరించినవాఁడును, యుద్ధమందు రావణాది శత్రువులను తీక్ష్ణబాణవర్షముచే సంహరించుచున్న వాఁడును, మహావీరుఁడును, ఉగ్రుఁడును, ఇంద్రుని రథమందుఁ గూర్చుండిన వాఁడును, లక్ష్మణాది మహావీరుల తోడను, హనుమంతుఁడును, సుగ్రీవుఁడును మొదలగు మహావీరులు కొండలు, చెట్లు చేతులతోఁ బట్టుకొని కరాళముఖములతో సింహనాదములు, భుభుక్కారములు చేయుచు రావణునిపైఁ గవియుచున్న వారిచేఁ జుట్టుకొనఁబడినవాఁడు నగు నో రామా! నా శత్రుసంఘమును చంపుము, మర్దింపుము, తినుము. భూత

ప్రేత పిశాచములను వినాశము కావింపుము. అని ఇట్లు ధ్యానము కావించి, రామకవచమును ధ్యానించిన సిద్ధి దాయకము కాఁగలదు.

ఓ సుతీక్ష్ణా! అత్యుత్తమమగు వజ్రకవచమును జెప్పుచున్నాను వినుము_

"శ్రీరాముఁడు నా శిరస్సును రక్షించుఁగాక! రఘువంశజుఁడు ముందు వైపునను, రఘువరుఁడు కుడివైపునను, పావనుఁడు వెనుకను, రఘుపతి యెడమ వైపునను, ఫాలమును ధశరథాత్మజుఁడును, దూర్వాదళశ్యాముఁడు కనుబొమ్మలను, జనార్ధనుఁడు భ్రూమధ్యమును, రాజేంద్రుఁడు నా చెవులను రక్షించుఁగాక! కన్నులను రాజీవలోచనుఁడును, రాజర్షి నాముక్కును, జానకీ పతి నా గడ్డమును, ఖరధ్వంసి నా కర్ణమూలములను, రఘువల్లభుఁడు నా ఫాలమును, వాక్పతి నా జిహ్వను, రఘూత్తముఁడు నా దంతపంక్తులను, శ్రీరామ చంద్రుఁడు నా పెదవులను, పరాత్పరుఁడు ముఖమును, జగద్వంద్యుఁడు కంఠమును, రావణాంతకుఁడు స్కంధములను,ధనుర్బాణధరుఁడు నాభుజములను, వాలిమర్దనుఁడు అన్నిప్రేళ్ల కణుపులను, రాక్షసాంతకుఁడు నా చేతులను, కాకుత్థ్సుఁడు నా వక్షమును, హరి నా హృదయమును రక్షించుఁగాక! సీతాపతి నా స్తనములను, జగదీశ్వరుఁడు నా పార్శ్వమును, లక్ష్మీశుఁడు నామధ్యమును, రఘునాయకుఁడు నా నాభిని, కౌసలేయుఁడు నాకటిని, దుర్గతి నాశనుఁడు నా వెనుక భాగమును, హృషీకేశుఁడు గుహ్యమును, సత్యవిక్రముఁడు తుంటిని, శార్ఙ్గధరుఁడు ఊరువు (తొడ) లను, హనుమత్ప్రియుఁడు మోఁకాళ్లను, జగత్ప్రభు పిక్కలను, తాటకాంతకుఁడు నా పాదములను, విష్ణువు సర్వాంగములను రక్షించుఁగాక! అనామయుఁడు సర్వసంధులను, మధుసూదనుఁడు జ్ఞానేంద్రియాదులను పాదములను రక్షించుఁగాక! శ్రీరామ భద్రుఁడు నాయొక్క శబ్దాది విషయములను,నాకు సంబంధించిన రెండుకాళ్లు గల భూతములను, రక్షించుఁగాక! సుగ్రీవరాజ్యదుఁడు అశేషములగు నా రోమాంకురములను, రక్షించుఁగాక! హరకోదండ ఖండనుఁడు మనోవాక్కాయములచేతను, బుద్ధిచేతను, అహంకారము చేతను, తెలిసియు, తెలియకయుఁ జేసినపాపములను, జన్మాంతరములోఁ జేసిన వివిధ పాపములను వీని నన్నిటిని దగ్ధము చేయుఁగాక! శార్ఙ్గధనుస్సును, బాణములను ధరించిన శ్రీరాముఁడు నన్ను బూర్తిగా రక్షించుఁగాక! ఇది వజ్రసమ్మితమగు శ్రీరామ

కవచము. ఓ సుతీక్ష్ణ మహామునీ! ఇది రహస్యములలో రహస్యమైనది. దివ్యమైనది. దీని నెవఁడైన వినినను, జదివినను, వినిపించినను ఆతఁడు శ్రీరామచంద్రుని ప్రసాదము వలన మోక్షస్థానమును బొందును. మహాపాతకిరైనను గోహత్య చేసిన వాఁడైనను, భ్రూణహత్య చేసినవాఁడైనను శ్రీరామచంద్రుని కవచమును బఠించుటచే శుద్ధుఁడు కాఁగలఁడు. బ్రహ్మహత్యా పాతకము నుండి కూడ విముక్తుఁడగుటలో సంశయము లేదు. సుతీక్ష్ణా! నన్ను నీవడిగినవిధముగ శ్రీరామ కవచమును జెప్పితిని. హరిః ఓం తత్సత్.

# * ౫. ఆ చా ర ము

ప్రతి వానికిని సదాచారము ముఖ్యము. అది లేకున్న మంత్రము సిద్ధింపదు. సమస్త శాస్త్రాచారములు ప్రతి మానవుని తానున్న వర్ణమునుండియు ఆశ్రమము నుండియు బ్రహ్మత్వమునకుఁ గొనిపోవుటకే. అది యీ జన్మకుగాని, యింకొక జన్మకుఁగాని సరిగా శాస్త్రము ననుసరించి నడచిన బ్రహ్మత్వమునకుఁ గొనిపోవు ననుటలో నేవిధమగు సందేహమును లేదు. 'ఆచారాదాయుః' ఆచారము వలన నాయువు వృద్ధి పొందునని చెప్పుటచే శాస్త్రాచారము ననుసరించి నడుచుటచే నారోగ్యముకూడ బాగుపడి ఆయుర్వృద్ధి యగుననుటలో నేవిధమగు సందేహమును లేదు.

శ్లో॥ ఆచారాద్విచ్యుతో విప్రో – న వేద ఫల మశ్నుతే
ఆచారేణతు సంయుక్తః – సంపూర్ణ ఫలభాగ్భవేత్॥ మను. ౧-౧౦౯

ఆచారమునుండి తప్పిన విప్రుఁడు వేదాధ్యయనాదుల వలని ఫలము నొందఁడు. ఆచారవంతుఁ డన్ననో సంపూర్ణ ఫలము నొందును.

శ్లో॥ ఏవమాచారతో దృష్ట్వా – ధర్మస్యమునయో గతిమ్
సర్వస్య తపసో మూల – మాచారం జగృహుః పరమ్॥

ఇవ్విధముగ నాచారములపై ధర్మముండుట నెఱిఁగి సకల తపస్సులకు నాచారమే ముఖ్యమని మునులు తెలిపిరి.

* రామ మంత్రోపాసకుని ఆచారమును గుఱించి విపులముగఁ దెలిసికొనవలెనని నాచే ననువదింపఁబడిన "శ్రీరామ పటలమును" జదువుఁడు.

పైవిషయమును బట్టి సాధకునకు ఆచారము ముఖ్యమని తేలినది. ఆచారము మూఁడు విధములు. ౧. దివ్యాచారము. ౨. దక్షిణాచారము. 3. వామాచారము. వీనిలో దక్షిణాచార వామాచారములతో మనకు పనిలేదు. మన మాచరింపఁదగినది దివ్యాచారము.

## ప్రాతః స్మరణము

ఉదయమున బ్రాహ్మ్య ముహూర్తమున నిద్రనుండి లేవవలయును. లేవఁగానే భగవంతుఁడగు శ్రీరామచంద్రుని స్మరింపవలయును. లేదా కీర్తింపవచ్చును. ఇదివఱలో అనుష్ఠానక్రమమను గ్రంథములో సాధారణముగఁ బ్రచారములో నున్న ప్రాతఃస్మరణ శ్లోకములు వ్రాయబడినవి. ఈ శ్లోకములు కూడ చాల ముఖ్యములు కావున సాధకుల కొఱకై యిచ్చట నీశ్లోకము లీయఁబడుచున్నవి. కావున వేనినైనఁ బఠింపవచ్చును.

శ్లో॥ ప్రాతః స్మరామి దిననాయక వంశభూషం
వేదాంత వేద్య మభయం కృతరాజవేషం
వైదేహీ లక్ష్మణయుతం స్వజనాభి రామం
సంసార సర్ప గరళోప శమాయ రామమ్॥ ౧

శ్లో॥ ప్రాతర్గృణామి చరితం దురితం నిహంతుం
రామస్య తస్య పలభక్షు కృతాంత కస్య
యః సింధు బంధ కథయా భవబంధ హంతా
రాజ్యం తనోతి చ విభీషణ రాజ్యరత్యా॥ ౨

శ్లో॥ ప్రాతః కరోమి కలికల్మష నాశకర్మ
తచ్ఛర్మ దం భవతు భక్తికరం పరం మే
అంతః స్థితేన సుఖభాను చిదాత్మకేన
రామేణ బాహ్యా గురుదేహవతా నియుక్తః॥ 3

శ్లో॥ శ్లోకత్రయం యః పఠతి ప్రభాతే
శ్రీరామచంద్రార్పిత చిత్త వృత్తిః
ఆయుః శ్రియం కీర్తి మనంత సౌఖ్యం
లబ్ధ్వా చిరం రామపదం సమేతి॥ ౪

శ్లో॥ గుర్వర్థే త్యక్త రాజ్యో వ్యచరదనువనం
పద్మ పద్భ్యాం ప్రియాయాః
పాణిస్పర్శా క్షమాభ్యాం మృజిత పథరుజో
యో హరీంద్రాను జాభ్యాం
వైరూప్యాచ్ఛూర్పణఖ్యాః ప్రియ విరహరుషా
రోపిత భ్రూ విజృంభ
త్రస్తాబ్ధి ర్బద్ధ సేతుః ఖలదవదహనః
కోసలేంద్రోఽవతాన్నః॥

సూర్య వంశమున కలంకార భూతుఁడును, వేదాంతములచేఁ దెలియఁబడు వాఁడును, అభయుఁడును, రాజవేషమును ధరించినవాఁడును, సీతాలక్ష్మణులతోఁ గూడుకొని యున్నవాఁడును, స్వజనులను సంతోష పెట్టువాఁడును, సంసారమను సర్ప విషమును ఉపశమింపఁ జేయువాఁడగు రాముని ప్రాతఃకాలమందు స్మరించు చున్నాను.

పాపములను బోఁగొట్టు వాఁడును, మాంసాశనులగు రాక్షసులకు యముని వంటివాఁడును, సముద్రమును బంధనకథచే సంసారబంధమును నాశము చేసినవాఁడును, విభీషణునకు రాజ్యము నొసంగిన శ్రీరాముని చరిత్రమును ప్రాతఃకాలముననే గ్రహించుచున్నాను.

లోపల కేవలము చిదానందభానుఁడై వెలుఁగొందుచు, బాహ్యముగ గురురూపముననుండి నియోగించు కలికల్మషనాశకరమును, శుభము నొసంగు నట్టి శుభకర్తలనే ప్రాతఃకాలమునఁ జేయుచుందును అట్టివి నాకు భక్తి కరము నగుఁగాక!

శ్రీరామచంద్రునిపైఁ జిత్తమును నిలిపినవాఁడై యెవఁడీ మూఁడు శ్లోకములను ప్రభాత కాలమునఁ బఠించునో ఆతనికి ఆయువు, సంపత్తు, కీర్తి, అనంతసౌఖ్యము ఇవన్నియును గలిగి రామపదమును బొందును.

తండ్రి నిమిత్తముగా రాజ్యమును వదలి, ప్రియురాలగు సీతాదేవి పాణిస్పర్శము నేని యోర్వని తామర పూలవంటి యడుగులతో, నడవికేగి సంచరించుచు, శూర్పణఖను విరూప నొనరించి, వాలిసుగ్రీవులతో సఖ్యము గావించి కొని ప్రియావిరహ రోషావేశ విజృంభితమైన భ్రూభంగమును నెరపినంత

మాత్రమున వడవడ వడకి కట్టెదుట పాడకట్టిన సముద్రునిపై సేతువునుగట్టి, దుష్టులగు రావణాదిరాక్షసులను వనములును దావాగ్నివలెగాల్చి, తిరిగి సీతతో కోసలములకేతేరి పట్టాభిషిక్తుఁడైన శ్రీరామచంద్రుడు మనలను రక్షించుగాక !

పైవిధముగఁ బ్రాతః స్మరణము గావించి భూదేవికి నమస్కరింపవల యును. "తల్లీ ! మరల నీ యందడుగిడుచున్నాను. నేను నీ బిడ్డఁడను. తల్లి వైన నీ మీఁద పాదములుంచుచు, నుమియుచు, చీదుచు, మలమూత్ర విసర్జనము కావించుచు నింక నెన్నియో పాపకార్యము లొనర్చు చున్నాను. నన్ను క్షమింపవలెను. నన్ను ధర్మ ప్రవృత్తునిఁగఁ గావింపుము." అని ప్రార్థింప వలయును.

తర్వాత మలమూత్ర విసర్జనమును శ్రీరామ స్మరణము తోడనే చేయ వలెను. మలమూత్ర విసర్జనము తూర్పు పడమరలుగ ముఖముపెట్టి చేయరాదు. పలువురు నడుచు త్రోవలందును, పచ్చిగడ్డిమీఁదను, నీటి యొడ్డునను, పవిత్ర స్థానములందును, దేవాలయములు, మందిరములు, సత్రముల ప్రక్కను, దేవా లయములకును, మహాభక్తులగు వారికిని, స్త్రీలకును, బ్రాహ్మణులకును ఎదురుగ గూర్చుండి మలమూత్ర విసర్జనము చేయరాదు. బూడిద, ఊఁక మొదలగువాని యందును, తినుటకుఁ బనికివచ్చు కూరలు, కాయలు, కాయు మొక్కలందును, పలువురు తిరుగు స్థలములందును మలమూత్ర విసర్జనము చేయరాదు. మలమూత్ర విసర్జన కాలమున మాటాడరాదు, ఉమియరాదు, తినరాదు, దిక్కులు చూడ రాదు. గోచి విప్పవలయును. ద్విజులు జందెమును కుడిచెవికి చుట్టవలయును. తలకు చెవులకు గుడ్డ కట్టుకొనవలెను. ముక్కు మూసికొన వలయును. వెంట నీటిఁ గొనిపోవలయును. మూత్రద్వారము నొక మంటియుండ తోడను, గుదము నైదు మంటియుండలతోడను, చేతిని పదియుండలతోడను మఱల రెండుచేతులను ఏడుయుండలతోడను, శుద్ధిగావించు కొనవలెను ఇది గృహస్థ నియమము. ఇతర ఆశ్రమస్థులకు ఇంతకు రెట్టింపు. రాత్రులందు దీనిలో సగమే చాలును. సంధ్యాకాలమందు మలమూత్ర విసర్జనము కావింపక కొంచెముముందు గనో, వెనుకగనో అట్లు చేయవలయును. మూత్ర విసర్జనము చేసినర్వాత కాళ్లు చేతులను శుద్ధి కావించుకొని నాల్గు పుక్కిలింతలును, మలవిసర్జనానంతరము ఎనిమిది పుక్కిలింతలను వేయవలెను.

# దంతధావనవిధి

మలమూత్ర విసర్జనానంతరమున ౧౨ లేక ౧౬ అంగుళముల పొడవును, చిటికెన వ్రేలు లావుకలిగి, వంకరలేని పలుదోముపుల్లను దీసికొని, తూర్పుగఁ గాని, ఈశాన్యముగఁగాని, కుక్కుటాసనమునఁ (గొంతుకు) గూర్చుండి చేతిని మోఁకాళ్లకు లోపలనై చికొని పలు దోమవలయును. పలుదోముటకు ముందు—

శ్లో॥ ఆయుర్బలం యశో వర్చః – ప్రజాం పశు వసూని చ
బ్రహ్మ ప్రజ్ఞాంచ మేధాంచ – త్వం నో దేహి వనస్పతే॥

"ఓ వనస్పతీ! ఆయుస్సును, బలమును, యశస్సును, వర్చస్సును, సంతానమును, పశువులను, ధనమును, బ్రహ్మజ్ఞానమును, మేధను నొసంగుము" అని మంత్రించి—

దంతధావన మంత్రస్య మార్కండేయ ఋషిః, అనుష్టుప్ ఛందః, వనస్పతి ర్దేవతా దంతధావనే వినియోగః—

అనుచుఁ గొందఱీ క్రింది మంత్రమునుగూడ చెప్పుదురు.

శ్రు॥ అన్నాద్యాయ వ్యూహధ్వగ్ం సోమో రాజా యమా గమత్,
స మే ముఖం ప్రమార్జ్యతి యశసా చ భగేన చ॥

దంతధావనకు జిల్లేడు, మఱ్ఱి, మామిడి, వేఁప, ఉత్తరేణు, నేరేడు, గానుగ మొదలగునవియు, పాలు,ముండ్లు కలవియు శ్రేష్ఠములు. ముండ్లు కలిగిన వానిలో తుమ్మ పనికిరాదు. ఆఁకుతో, గడ్డితో నైన తోమవచ్చును. తోముట యెడమ ప్రక్కన క్రింది పలువరుసలోఁ బ్రారంభింప వలయును. పాడ్యమి, షష్ఠి, అష్టమి, చతుర్దశి, ఏకాదశీ ఇతర పర్వదినములందు పలుతోము పుల్లతో పలుదోమరాదు. ఏకాదశీ, అమావాస్యలందు నేరేడు, మామిడి ఆకులతోఁ దోమవలెను. పలుదోముటకుఁ బనికిరాని పైనఁజెప్పిన దినములలో ౧౬ పుక్కిలింతలు గావింపవలయును. శ్రాద్ధదినములందును పలుదోమక ౧౨ పుక్కిలింతలతో ముఖశుద్ధి గావించుకొనవలెను. గోశాల, దేవాలయము, నది, స్మశానము, శుచిస్థలము, నీరు, యజ్ఞశాల మొదలగు వానియందు ముఖము కడుగరాదు. పుక్కిలింతకు చూపుడు వ్రేలితో తోమరాదు. నీళ్లు త్రాగరాదు. పలుదోమి ముఖము కడుగుకొనిన మీఁదట రెండుసార్లు ఆచమనము చేయవలెను.

# స్నానము

శ్లో॥ దీపనం వృష్య మాయుష్యం - స్నానమూర్జాబలప్రదమ్
కండూమల శ్రమ స్వేద - తంద్రా తృడ్దాహ పాప్మజిత్॥

స్నానము దీపనమును, పుంస్త్వమును, ఆయువును, ఓర్పును, బలమును గలుగఁజేయును. జిలను, మలమును, శ్రమను స్వేదమును, అలసటను, తృష్ణను, దాహమును, పాపమును బోఁగొట్టును.

స్నానము బాహ్యము, మానసికమని రెండువిధములు.

శ్లో॥ మల నిర్మోచనం స్నానం - మలంచ ద్వివిధం స్మృతమ్
బాహ్యం మానసికం చేతి - స్నానంచ ద్వివిధం తథా॥

శ్లో॥ అజ్ఞాన మూలకం కామ - క్రోధాద్యంచ మనోమలమ్
మనోమల నివృత్త్యర్థం - స్నానం మానసికం చరేత్॥

స్నానము మలమును దొలఁగించును. మలము బాహ్యమలమనియు, మానసిక మలమనియు రెండు విధములు. అట్లులే స్నానములును బాహ్యస్నానమనియు, మానసిక స్నానమనియు రెండు విధములు. అజ్ఞానమూలకమగు కామ క్రోధాదులు మనోమలము. మనోమలము పోవుటకు మానసిక స్నానము చేయవలెను.

బాహ్యస్నానము ఐదు విధములు. ౧. గోధూళికా స్నానము. అనఁగా గోవులు నడచునప్పుడు ఆదుమ్ము లోనికి బోవుట. ౨. మంత్రస్నానము. 'ఆపోహిష్ఠామ యో భవాది' మంత్రములతో మార్జన చేసికొనుట. 3. వారుణ స్నానము. నీటితో స్నానమంత్రములను జెప్పుచుఁ జేయుట. ౪. అమృత స్నానము. వర్షము పడునపుడు దానిలోఁ దడియుచు స్నానము చేయుట. ౫. విభూతిస్నానము. మంత్రయుక్తముగ భస్మమును శరీరమునకుఁ బూసికొనుట.

మానసిక స్నానము ఐదు విధములు. ౧. ధ్యానమయ స్నానము. భగవంతుని ధ్యానించుచుండుట. ౨. బోధమయ స్నానము. జ్ఞానముకలిగియుండుట. 3. యోగమయ స్నానము. ప్రాణాయామాదు లొనర్చుట. ౪. తపోమయ స్నానము. ఋతసత్యాది తపస్సు లొనర్చుట. ౫. వైరాగ్య స్నానము. వైరా

గ్యము కలిగియుండుట. (ఈ విషయమునుగూర్చి స్నానశుద్ధిలో ద్వితీయాధ్యాయమున విపులముగఁ జర్చింపఁబడినది.)

బాహ్యస్నానము మంత్రయుక్తముగఁ జేయవలయును. బాహ్యస్నానము చేయుటకు ముందు శ్రీరామోపాసకుఁడు మానసిక స్నానమును జేయవలెను. అది మూలమంత్రముతోఁ జేయవచ్చును. మానసికస్నాన విధాన మీ క్రింద విధముగఁ జెప్పఁబడినది.

శ్లో॥ మనసా మూల మంత్రేణ – ప్రాణాయామ పురః సరమ్,
కుర్వీత మానసం స్నానం – సర్వత్ర విహితం చ తత్॥
దివ్య చందన లిప్తాంగం – చారు హాసం శుభేక్షణమ్,
నారదాద్యైః సేవ్యమానం – భాస్వద్విపుల కంకణమ్॥
స కింకణీక కేయూర – హారిణం మణినూపురమ్,
ధ్వజ వజ్రాంకుశా లక్ష్య – పాద పంకేరు హద్వయమ్॥
తత్పాదోదక జాం ధారాం – నిపతంతీం సమూర్ధని,
చింతయే ద్బ్రహ్మరంధ్రేణ – ప్రవిశంతం స్వకాం తనుమ్॥
తయా సంక్షాళయే త్సర్వ – మంత ర్దేహ గతంమలమ్,
తత్క్షణా ద్విరజామంత్రీ – జాయతే స్ఫటికోపమః॥
ఇదం మాంత్రం పరం స్నానం – సహస్రాదధికం స్మృతమ్॥

మనస్సుతో మూలమంత్రమును స్మరించుచు ప్రాణాయామ పురస్సరముగ మానసిక స్నానము చేయవలయును. మనస్సులో దివ్యచందన లిప్తాంగుఁడును, అందమైన నగుమోము కలవాఁడును, శుభస్కారమగు చూడ్కులు గలవాఁడును, నారదాది మహర్షులచే సేవింపఁబడువాఁడును, ప్రకాశించు విపుల కంకణములు గలవాఁడును, కింకిణీ కేయూర హారములు గలవాఁడును, మణి నూపురములు గలవాఁడును, ధ్వజవజ్రాంకుశాది చిహ్నములు కల పాదపద్మ యుగళము కలవాఁడును, అగు శ్రీరామచంద్రుని పాదములనుండి బయలుదేఱిన ధార తన శిరస్సుపై బ్రహ్మరంధ్రమునఁ బడుచున్నట్లు చింతింపవలయును. అచ్చటనుండి తన శరీరమునఁ బ్రవేశించినట్లును, దానిచే నంతర్దేహమునఁగల మలమంతయుఁ గడుగఁబడినట్లు భావించిన వానికి తత్క్షణమే రాజసముడిగి స్ఫటి

కముతో సమానమగు నాత్మ కలవాఁడగును. ఈ మాంత్రిక మానసిక స్నానము సహస్రాధిక ఫలమొసంగును.

ఇట్లు మాంత్రిక స్నానమైన తర్వాత మంత్రయుక్తముగా గంగను ధ్యానించుచుఁ బవమానాది సూక్తములతో స్నానము గావించి శ్రీరామున కర్ఘ్యమిచ్చి దేవ, ఋషి, పితృతర్పణములను గావించి శరీరమును దుడిచికొని ధౌతవస్త్రమును ధరింపవలయును. పట్టుగుడ్డ అన్నము తినకుండిన పదిరోజుల వఱకు అనుష్ఠానమునకుఁ బనికి వచ్చును. అన్నమును దానిని గట్టుకొని తినిన మరల దానినుదికిననే శుద్ధి యగును. క్రొత్త పట్టు గుడ్డైన నెన్నిసాళ్లైన అనుష్ఠానమునకుఁ బనికి వచ్చును. అన్నిటికంటె ఉన్నివస్త్రము చాల పవిత్రమైనది. కావున ధావళి సర్వదా పవిత్రమైనది. కొందఱు శాస్త్రమును జూడనివారు అది భోజనము చేసిన పనికి రాదందురు. శాస్త్రము ననుసరించి అది భోజనము చేసిన మీఁదట నైనను బనికివచ్చును. ఉదక వలసిన పనిలేదు. సూర్యుని జూపి ఏడుమార్లు ఉదికినఁజాలును

శ్లో॥ స్త్రీణాం క్రీడార్థ సంభోగే - శయనీయే న దుష్యతి. భృగుః,
ఆవికంతు సదా వస్త్రం పవిత్రం రాజసత్తమ!
పితృదేవ మనుష్యాణాం క్రియాయాంచ ప్రశస్యతే॥

ధౌతాధౌతం తథా దగ్ధం సంధితం రజకాహృతమ్,
రక్తమూత్ర శకృల్లిప్తం తథాపి పరమం శుచి॥

రేతః స్పృష్టం రజః స్పృష్టం స్పృష్టం మూత్రపురీషయోః.
రజస్వలాభి సంస్పృష్ట మావికం సర్వదా శుచిః॥

స్త్రీలు క్రీడలోను, సంభోగమందును, పక్కపఱచుకొని దానిపైనఁ బరుండుట వలనను దోష మాపాదింపదు.

ధర్మరాజా! ధావళి వస్త్రము సర్వదా పవిత్రమైనది. ఇది పితృ, దేవ, మనుష్యులకు సంబంధించిన కర్మలొనర్చుటకుఁ జాల ప్రశస్తమైనది. వీనిలోఁ దెల్లనిది గాని, నల్లనిదిగాని, తగులఁ బడినదిగాని, కుట్టఁబడినదిగాని, చాకలిచే నుదుకఁ బడినదియు, రక్తము, మూత్రము, మలము తాఁకినదైనప్పటికిని అది సుచియైనదే. శుక్లము తాఁకినప్పటికిని, స్త్రీ రజస్సు తాఁకినప్పటికిని, మూత్రము

పురీషములు తాఁకినప్పటికిని, ముట్టుత యగు స్త్రీ తాఁకినప్పటికిని ధావళి సర్వదా పవిత్రమైనది.

## పుండ్రము [బొట్టు]

శ్రీరామ మంత్రము సర్వమత సమ్మతమైనదియు, సర్వదేవతాత్మక మైనదియుఁ గావున నే పుండ్రము నుంచుకొనినవారైనను శ్రీరామ మంత్రమును జపింపవచ్చును. తమసంప్రదాయము ననుసరించి యావంశములో ననుశ్రుతముగా వచ్చుచున్న పద్ధతినిబట్టి పుండ్రమును ధరింపవచ్చును. అయినను ఊర్ధ్వపుండ్రము చాల ముఖ్యమైనది. ఊర్ధ్వత్రిపుండ్రమును బెట్టినను బెట్టవచ్చును; లేదా యీ క్రింది విధముగఁ బెట్టుట శ్రేష్ఠమని బ్రహ్మాండాది పురాణములు వాక్రుచ్చు చున్నవి.

శ్లో॥ వర్తి దీపాకృతిం వాపి వేణుపత్రాకృతిం తథా,
పద్మస్య ముకుళాకారం తథైవ కుముదస్య వా॥

మత్స్యః కూర్మాకృతిం వాపి శంఖాకార మతః పరమ్.
లలాటే బాహు వక్షశ్చైవ దండవల్లగ్న పల్లవే॥

హృదయే కమలాకారం ఉదరే దీపవల్లిఖేత్,
వేణుపత్ర సమాకారం బాహ్వోర్గ్రీవ్యా లిఖేత్సుధీః॥

అథః పృష్ఠే స్కంధదేశే లిఖేజ్జంబూ ఫలాకవత్,
స్నాత్వా పుండ్రం మృదాకుర్యాత్ హుత్వాచైవతు భస్మనా॥

దేవానభ్యర్చ్య గంధేన సర్వపాపాపనుత్తయే,
ఊర్ధ్వ పుండ్రం ద్విజః కుర్యాత్ క్షత్రియస్తు త్రిపుండ్రకమ్॥

అర్థ చంద్రంతు వైశ్యస్య వర్తులం శూద్రజాతిషు,
స్వహస్త లిఖితం స్తోత్రం స్వయం ఘృష్టం చ చందనమ్॥
స్వయంచ గ్రథితా మాలా శక్రస్యాపి శ్రియం హరేత్॥

దీపము వెలిగించిన ఆదీపాకృతిగఁ గాని, వెదురు ఆకృతిగాఁ గాని, ముకుళించిన పద్మమువలెఁ గాని, ముకుళించిన కలువవలెఁగాని, చేఁప ఆకారము, తాఁబేలు ఆకారమునఁ గాని, శంఖాకారమునఁ గాని బొట్టును బెట్ట వలయును.

బొట్టును లలాటమునందును, బాహువులందును, బెట్టవలెను. కణతల యందును దండమువలెను, హృదయమున పద్మమువలెను, ఉదరమందు దీపము వలెను, బాహుమధ్యమున వెదురు ఆకులవలెను, వెనుక నడుము మీఁదను, స్కంధమునందును నేరేడు కాయవలెను ధరింపవలయును.

స్నానము చేసి పుండ్రమును మృత్తికతోడను, హోమము గావించి భస్మము తోడను, దేవతార్చనము కావించి గంధము తోడను బెట్టిన సమస్త దోషములు నశించును.

బ్రాహ్మణుఁడు ఊర్ధ్వపుండ్రమును, క్షత్రియుఁడు త్రిపుండ్రమును, వైశ్యుఁ డర్ధచంద్రాకృతిగను, శూద్రుఁడు వర్తులముగను బొట్టును బెట్టవలయును.

తాను తనచేతితో వ్రాసిన స్తోత్రమును జదివినను, తనచేతితోఁ దీసిన గంధమును ధరించినను, తనచేతితో గ్రుచ్చిన జపమాలతో జపము కావించినను దేవేంద్రునికైనను సంపత్తు నశించును.

శ్లో॥ త్రిపుండ్రం భస్మనా తిర్య గూర్ధ్వ పుండ్రం మృదాన్యసేత్
ఉభయం చందనేనైవ వర్తులం న కదాచన॥

భస్మ త్రిపుండ్రమును అడ్డముగఁ బెట్టవలయును. ఊర్ధ్వ పుండ్రమును మృత్తిక (గోపీచందనాదుల) తోఁ బెట్టవలయును. అడ్డముగను, నిలువుగను గంధముతోఁ బెట్టవచ్చును కాని వర్తులముగా దేనితోడను బెట్టరాదు.

విభూతిని నిలువుగా బెట్టినను, మృత్తిక గోపీచందన మిత్యాదులను అడ్డముగఁ బెట్టినను నరకము ప్రాప్తించును. 'శ్రీ గంధం సార్వకాలిక' మని యుండుటచే నేసమయమందైనను గంధమును ధరింపవచ్చును. అయితే అది భగవంతున కర్పింపబడినదైన శ్రేష్ఠము.

శ్లో॥ నిర్మాల్య తులసీమాలాం - శిరస్యపి నిధాయ వై
నిర్మాల్య చందనేనాంగ మంతయే త్తస్య నామభిః॥

శాలగ్రామ శిలాలగ్న చందనం ధారయే త్సదా
సర్వాంగేషు మహాపాప శుద్ధయే కమలాసన॥

భగవంతునికి వేసి తీసిన నిర్మాల్య తులసీమాలను శిరస్సునైన ధరింప వలయును. నిర్మాల్య చందనమును భగవన్నామములతో శరీరమున ధరింప

వలయును. సాలగ్రామముమీఁద నుంచిన గంధమును పాపశుద్ధికొఱకు సర్వాంగములయందును సర్వదా ధరింపవలయును.

ద్వాదశోర్ధ్వ పుండ్రములను కేశవాది ద్వాదశనామములతో ధరింపవలయును. ముఖము ౧, పొట్టపై ౩, చేతులందు ౨, కంఠమున ౩, శిరస్సున ౧, ముచ్చిలిగుంటలో ౧, నడుమున ౧ = మొత్తము పండ్రెండు. పుండ్రమును ధరించువాఁడు నమ్మిన తత్త్వమును బట్టియుండును. ఊర్ధ్వము దీపాకృతితోఁ బెట్టిన గంధము శ్రీరామచంద్రుని సూచించును. కుంకుమ సీతాదేవిని సూచించును. జగన్మిథ్యా భావము కలవారు కుంకుమను గుండ్రముగ నుంచుచుందురు. జగత్తు పరమాత్మవలెనే శాశ్వతమైనదని భావించువారు నూర్ధ్వముగ నుంచవలయును. అంత నాచమించి సంధ్యావందన మాచరింపవలయును. ద్విజేతరులు స్తోత్రములను బఠింపవచ్చును.

ద్విజులు సంధ్యావందనము చేయక యే యితర సాధన లొనర్చినను నిష్ఫలమే యగును. అర్థానుసంధానము చేయుచు, సంధ్యను వార్చవలయును. ప్రాతః సంధ్యవలన రాత్రి చేసిన పాపములను, సాయం సంధ్యవలన పగలు చేసిన పాపములును దొలఁగి పోవును. స్వరములేని కేవల సంధ్యావందన మంత్రపాఠము వ్యర్థము. స్వరముతో నభ్యసింపవలయును. సంధ్యా నియమములను బాటించుచు భక్తి శ్రద్ధలతో సంధ్యావందనముచేసిన దాని ఫల మది యిచ్చితీరును. సంధ్యాంగ తర్పణమైన తర్వాత భాగము గాయత్రీ జపానుష్ఠాన భాగము. 'న గాయత్ర్యాః పరం మంత్రం, నమాతుః పరదేవతా' అనఁగా గాయత్రీ మంత్రమునకు మించిన మంత్రమును, తల్లికంటె వేఱుదైవమును లేదు. కావున గాయత్రీ మంత్రజప విషయమున నేమఱి యుంచరాదు.

శ్లో॥ గాయత్రీంతు పరిత్యజ్య – హ్యన్య మంత్రముపాసతే,
సుసిద్ధాన్నం పరిత్యజ్య – భిక్షామటతి దుర్మతిః॥

— మార్కండేయ పురాణము.

గాయత్రిని విడిచి యితర మంత్రను నుపాసించుట సుసిద్ధాన్నమును వదలి భిక్షకై బయలుదేఱి నట్లుండును.

శ్లో॥ విహాయ తాంతుగాయత్రీం – విష్ణూపాస్తి పరాయణః,
శివోపాస్తి రతో విప్రో – నరకం యాతి సర్వధా॥

ఏ బ్రాహ్మణుఁడు గాయత్రిని వదలి విష్ణూపాసనను గాని, శివోపాసనను గాని చేయుచో నాతఁడు సర్వవిధముల నరకమును బొందును.

శ్లో॥ సహస్రం పరమాం దేవీం _ శతం మధ్యాందశావరామ్,
గాయత్రీం వైజపేన్నిత్యం _ జపయజ్ఞః స కీర్తితః॥

ప్రతి దినము వేయి గాయత్రీ మంత్రజపము చేయుట ఉత్తమము. నూఱు చేయుట మధ్యమము. పది జపించుట కనిష్ఠ పక్షము. ఇదియే జపయజ్ఞము.

గాయత్రీజపము రుద్రాక్ష, స్ఫటిక, తులసీ, పద్మాక్ష మొదలగు మాలలచేఁ జేయవచ్చును. లేదా వ్రేళ్లకణుపులమీద లెక్కించి చేయవచ్చును. అన్నిటికంటె వర్ణమాల శ్రేష్ఠమైనది.

శ్లో॥ వర్ణైర్విన్యస్తయా యస్తు _ క్రియతే మాలయా జపః,
ఏక వారేణ తస్యైవ _ పురశ్చర్యా కృతా భవేత్॥

అకారము మొదలు క్షకారము వఱకు గల ౫౦ అక్షరములను అనులోమ గతిని ఒక్కసారి జపించుట చేతనే పురశ్చరణ చేసిన ఫలము గలుగుచున్నది.

శ్లో॥ మాతృకాది యుతం మంత్రం _ ద్వాదశాబ్దంతు యో జపేత్,
క్రమేణ లభతే జ్ఞాన మణిమాది గుణాన్వితమ్॥
— యోగతత్త్వోప నిషత్

మాతృకామాలతోఁ గూడిన మంత్రమును జపించిన వానికి క్రమముగా అణిమాది సిద్ధులు గలుగును.

గాయత్రీ మంత్రజపమునకు పూర్వమును, తర్వాతను ఆయా ముద్రలను ప్రదర్శింపవలయును. అట్లు ప్రదర్శింపకున్న గాయత్రీ మంత్రజపము నిష్ఫలము. ఒక్కొక్క దేవతకు ఒక్కొక్కముద్ర యిష్టముగా నుండును. అట్టి ముద్రలను బ్రదర్శించిననే ఆదేవత ప్రసన్నమగును. లేకున్న జపము నిష్ఫలము. పిమ్మట సూర్యోపస్థానాదులను గావించి సంధ్యావందనము పూర్తి కావింపవలయును. తర్వాత శ్రీరామ మంత్రజపము గావింపవలయును. జపపద్ధతిని పదునాలవ ప్రకరణములోఁ జూడవలయును. తర్వాత ఔపాసనము, బ్రహ్మయజ్ఞము, దేవ పూజాదులు కావింపవలయును.

# శ్రీరామ మంత్రోపాసకుని వేషము

శ్రీరామ మంత్రోపాసకుడు నిరాడంబరమును, విలువ యెక్కువ కాని వియు. పరిశుభ్రమైన తెల్లని దుస్తులనే ధరింపవలయును. శిఖా యజ్ఞోపవీత ములు ద్విజుల కవసరము. మెడలో తులసీ మాలను ధరింపవలయును. గోపీచంద నముతో శ్రీరామానామ ముద్రలు వేసికొనవలెను. అట్లే గోపీచందనముతో శంఖ, చక్ర, గదా, పద్మ ముద్రలనుగాని ధనుర్బాణ ముద్రలనుగాని ధరింప వలయును.

శ్లో॥ గోపీ చందన లిప్తాంగో - రామ చంద్రాంకితో నరః,
రామనామోచ్చారకైశ్చ - తులసీకాష్ఠ మాలకః॥
శంఖచక్రగదా పద్మ - ధారకో రామ మానసః,
యస్త్వత్ర స నరో ధన్యో - నేతరశ్చ కదాచన
స ఏవ పురుషో యోగే - యో రామేతి సదా వదేత్,
స ఏవ పురుషో - నింద్య - స్త్వత్రరామం స్మరేన్నరః॥
—ఆనంద రామాయణము.

గోపీచందనముతో రామచంద్రాంకితమైన వాడును, తులసీమాల గల వాడును, శంఖ చక్ర గదా పద్మములు ధరించినవాడు నగు శ్రీరామ కీర్తన పరుడు ధన్యుడు. ఇతరుడట్లు కాదు. శ్రీరామ నామము నెల్లప్పుడును బలుకువాడు కీర్తింపఁ దగినవాడు. శ్రీరామ నామమును గీర్తింపనివాడు నింద్యుడు.

శ్రీరామ నామమును ముద్రించిన వస్త్రమును ధరింపవలయును. ఇది ముఖ్యముగ జపసమయమున నుండుట అవసరము. ఇతరసమయములందైనను దీనిని ధరించుటకు బిడియరాదు. కొందఱు తుచ్ఛులు నిందించుటయును, వ్యాఖ్యా నించుటయును, వెగతాళి చేయుటయును నిజమే. కాని వానికి లోనుకారాదు. వారు నిందించిన భయము లేదు. దోషములు గల వాడైనను దీనిని ధరించుటకు బిడియపడరాదు. దీని నెల్లప్పుడును ధరించుటవలన దోషములు పోవును. మంచి శీలము కలిగియుండుట కాతడు ప్రయత్నించును. వేషమును బట్టియే మనుష్యుని స్వభావమంతయును గనిపెట్ట వచ్చును. వేషము వలన స్వభావము మారుట అను భవములో కలదియే కావున దీనిని శ్రీరామ భక్తుడు తప్పక ధరింపవలయును.

శ్లో॥ రామముద్రాంకితం వస్త్రం - యస్యతం నేక్షయే ద్యమః,
రామ ముద్రాంకితం వస్త్రం - స ముద్రా వస్త్రముచ్యతే॥

సర్వ వస్త్రేషు తచ్ఛ్రేష్ఠం - పవిత్రం పాపనాశకమ్॥
సముద్రావసనం దేహే - బిభ్రంతం మానవోత్తమం॥

కృతం పాపం న లిప్యేత - పద్మ పత్ర మివాంభసా,
సముద్రా వస్త్ర సంయుక్తం - దృష్ట్వా భువి నరోత్తమం॥

యమదూతాః పలాయంతే - సింహం దృష్ట్వామృగాయథా,
మన్ముద్రయాంకితం వాపి - వస్త్రం సంతోషదం స్మృతం
స్నాత్వా ధార్యం సదా తచ్చ - జపకాలే విశేషతః॥

మలమూత్రోత్సర్జనేచ - శయనే క్రీడనే తథా
అశుచౌ చ క్షయే వృద్ధౌ - హట్టే రాజసభాసుచ॥

పథి దుర్జన సంసర్గే - ముద్రా వస్త్రం న ధారయేత్
తథా భోజన కాలేపి - విహారేనైవ ధారయేత్॥

స్నానకాలే వ్రతే తీర్థే - పూజాయాం పితృ కర్మణి
హోమే దానే జపే యజ్ఞే - కృచ్ఛ్ర చాంద్రాయణాదిషు॥

నిత్యకర్మసు కామ్యేషు - తథా నైమిత్తికేష్వపి
తథా తపస్సు మన్ముద్రా - వస్త్రం ధార్యం సదైవహి॥

మమ ముద్రాంకితం వస్త్రం - భిభ్రంతం మానవోత్తమం
అహం మోక్షం ప్రదాస్యామి - సత్యం సత్యం మునీశ్వరాః॥

— ఆనంద రామాయణము.

రామ ముద్రాంకిత వస్త్రమును ధరించిన యముఁడు వానిని జూడఁజాలఁడు. రామముద్రాంకిత వస్త్రము సముద్రావస్త్ర మనఁబడును. అన్ని వస్త్రములలో నిది యుత్తమము. దానిని ధరించిన వానిని తామరాకును నీళ్లవలె పాపము లంటవు. వానినిజూచి యమభటులు సింహమును జూచిన మృగముల వలెఁ బరుగిడుదురు. శంఖ, చక్ర, గదా, పద్మ, నామము అను నీయైదు ముద్రలు గల వస్త్రమును స్నానముచేసి విశేషముగ జపకాలమున నరులు కలిలో ధరిం

తురుగాక ! వీరి యింద్రియభోగవ్యాపారములలోను, అశుచి సమయంబులలోను, సభలలోను, మార్గమునను, దుస్సాంగత్యమునను, భోజనకాలమునను, విహారము లందును దానిం ధరింపరాదు. స్నాన, వ్రత, తీర్థ, దేవపూజా, పితృతర్పణ, హోమ, దాన, జప, యజ్ఞ, కృచ్ఛ్ర చాంద్రాయణాదులందును, నిత్య, కామ్య, నైమిత్తిక కర్మలందును, తపస్సునందును నాముద్రావస్త్రమును సదా ధరింప వలెను. నా ముద్రాంకిత వస్త్రమును ధరించు వానికి మోక్షము నొసంగు చున్నాను. ఇది ముమ్మాటికిని సత్యము" అని శ్రీరాముఁడే చెప్పెను.

## భో జ న ము

శ్రీరామోపాసకునకు పవిత్ర భోజన ముండవలెను. పవిత్ర భోజనము వలన మనస్సు కూడ పవిత్రమగును. ఆహారమును బట్టియు స్వభావము మాఱు చుండును. స్వభావమును బట్టియు ఆహారము రుచించుచుండును. భగవద్గీతలోని గుణత్రయ విభాగయోగమును జూచిన నెట్టి గుణము కలవాని కెట్టి ఆహారము, స్వభావము, ఉపాసన, యజ్ఞము, కర్మ, దానము మొదలగునవి కలుగుచుండునో చక్కఁగఁ జెప్పఁబడినది. సాత్త్వికాహార ముత్తమమైనది. రాజసాహారము వలన మనస్సు చంచలమగుచుండును. తామసాహారము వలన నిద్రాలస్యములు వృద్ధి యగును. ఆ యాహారమైనను న్యాయోపార్జితమైనదిగ నుండవలయును. పరాన్న మును భుజింపరాదు. భక్తులు, సాధువులు, శ్రోత్రియులు, జ్ఞానులు వీరు పరులు కారు. దుర్మార్గులు, దురాచారుల భోజనము బొత్తుగా ముట్టరాదు. పరాన్న మును దిని జపము గావించినను, సత్కర్మానుష్ఠానము గావించినను దానిలో నాల్గవవంతు ఫలము వానికిఁ బోవును. ఉపనయనము గావించిన వానికిని, గురువునకును జెటియొక పాతికభాగమును పోయితీరును. చివరకు మిగులునది ఒక పాతికభాగమే కావున సాధకుఁడు పరాన్నమును దినక న్యాయార్జిత విత్తముచే శరీరపోషణ గావించుకొనవలెను. భోజనమునకు ముఖ్యముగ మూఁడు రకములగు దోషము లాపాదించును. ఆదోషములు లేకుండ చూచుకొనవలయును. ౧. జాతి దోషము. ౨. ఆశ్రయ దోషము. ౩. నిమిత్తదోషము.

జాతిదోష మనఁగా స్వాభావికముగ నా పదార్థములలో దోషములు కలవి. ఉదా:_ నీరుల్లి, వెల్లుల్లి మొదలగునవి.

ఆశ్రయదోష మనఁగా ఆవుపాలు మంచివేయైనను రాగిపాత్రలోఁ బోసినను, కల్లు దుకాణములో నుంచినను, అపవిత్ర స్థలములో బెట్టినను ఆశ్రయము వలన దోషమాపాదించినది.

నిమిత్తదోష మనఁగా ఆవుపాలు, ఆవుపెరుగు ఇవి పరమ పవిత్రములే యైనను, పవిత్రస్థలమున దేవమందిరములోనే పెట్టినను పిల్లి, కుక్క, కాకి మొదలగునవి ముట్టిన నది యపవిత్ర మగును.

ఈ మూఁడు దోషములు రాకున్నను ఆ పదార్థములు చెడ్డచోటులో అనఁగా మలమూత్రములు విసర్జించిన స్థలములోఁగాని, అట్టివి యెఱువుగా వేయఁబడినను దోషమాపాదింపవచ్చును. పదార్థము మంచిదైనను, మంచిచోటులోనే పెరిగినను, ఆశ్రయ దోషము లేకున్నను, నిమిత్తదోషమును లేకున్నను దానిని మనకిచ్చువారును, వండిపెట్టువారును దుర్నడత కలవారైన దోషమాపాదింపఁ గలదు. జాతి, ఆశ్రయ, నిమిత్త దోషములును, స్థానదోషము ప్రదాత దోషము లేకున్నను ఆ అన్నము వేఱు ఉద్దేశ్యముతోఁ బెట్టిన నదియు దోషయుక్తమే కాఁగలదు. పైదోషము లేమియును లేని సాత్త్వికాహారము శ్రేష్ఠము. ఆ సాత్త్వికాహార మైనను భగవన్నివేదిత మైననే గ్రహణయోగ్య మగును గాని, భగవన్నివేదితముకాని శుద్ధ సాత్త్వికమైనను తామసమే కాఁగలదు. భగవన్నివేదితమైన పదార్థములతోఁ గూడిన ఆహారమైనను సాత్త్వికమే. వరి, గోధుమ, యవలు, ఆవుపాలు, నేయి, పెరుగు, మీగడ, వెన్న, పొట్ల, బీర, దోస, బెండ, రామములగ, దొండ, పెరుగుతోటకూర, మెంతికూర, చుక్కకూర, పొన్నగంటికూర, పెండలము, కంద, లేతవంకాయ, చిక్కుడు, బూడిద గుమ్మడి, మంచిగుమ్మడి, అరఁటి, టెంకాయ, నారింజ, నిమ్మ, మామిడి, బత్తాయి, సపోటా, పనస, ఖర్జూర, కమలా, దానిమ్మ, రేగు, బాదాము, ద్రాక్ష, అనాస, మారేడు పండు, వెలగ పండు, కందులు, పెసలు, మినుములు, వేరుశనగ, శనగ, అలచందలు, సొంఠి, అల్లము, లవంగాల , సైంధవలవణము, నిమ్మ, ఉసరిక, రుద్రాక్షకాయ, పంచదార, సున్నము కలువని బెల్లము ఇవన్నియు సాత్త్వికములే.

ఉప్పు, కారము, చింతపండు, నేతిబీర మొదలగునవి యన్నియు రాజసములు. సొరకాయ, ములగకాయ, ముల్లంగి, ఇంగువ, పొగాకు; (చుట్ట, బీడి, సిగరెట్టు, పొడుము) టీ, కాఫీ, కోకో, కల్లు, సారాయి, గంజాయి, భంగు,

చలిదిఅన్నము పాసినఅన్నము ఇట్టివన్నియు తామసములు. హితమగు నాహారము మితముగభుజింపవలయును. సాత్త్వికాహారమైనను అతిగభుజించిన నదితామసమే కాఁగలదు. పరాన్నము, పరద్రవ్యము, పరస్త్రీ మీఁద మక్కువ గలవానికి మంత్రసిద్ధి కలుగదని భావింపవలయును. భిక్షాధికారము గల బ్రహ్మచారికి, వానప్రస్థునకు, యతికి ఈ నియమము లేదు. కాని సత్పురుషులు, సదాచారులు నగు బ్రాహ్మణుల యిండ్లలోనే వారైనను భిక్షింపవలెను. పరస్థలములకుఁ బోయిన శ్రోత్రియులు, సాధు సజ్జనులగు వారి యిండ్లకే వెళ్లవలెను. లేదా స్వయముగ వంటచేసికొన వలయును. విక్రయాన్నమును దినరాదు. విక్రయాన్నమున నున్న మంత్రసిద్ధికూడ తొలఁగి పోఁగలదు.

## వృత్తి

శ్రీరామ మంత్రోపాసకుని వృత్తి పవిత్రమైనదిగ నుండవలయును. తన వలన నితరులకు బాధ, కష్టము కలుగరాదు. ఇతరులకు ఉపకారకరముగ నుండు వృత్తిగ నుండవలయును. అబద్ధములు, మోసము, కపటము మొదలగు గుణము లుండవలసిన వృత్తిగ నుండరాదు. శాంతిగ తన యనుష్ఠానమునకు భంగమురాని రీతిగా నుండవలయును. ఏవృత్తియైనను వృత్తమునుబట్టి దానియొక్క పవిత్రతా పవిత్రలు నిర్ణయింపఁబడుచుండును. కావున వృత్తిలో భగవద్భావము చేయుట నేర్చియుండవలెను, తీవ్ర భక్తివలనఁ గాని అట్టి నేర్పు యేర్పడదు.

## ౬. ధారణ

ధారణకు ముందుగాఁ బ్రత్యాహారము కావింప వలయును. ప్రత్యాహార మనఁగా పతంజలి యభిప్రాయము ననుసరించి—

"స్వ విషయా సంప్రయోగే చిత్తస్వరూపానుకార

ఇవేంద్రియాణాం ప్రత్యాహారః" — యోగదర్శనము ౨_౫౪

ఇంద్రియములు తమతమ విషయములనుండి మరలి చిత్తస్వరూపాకారమును బొందుట ప్రత్యాహారము.

మనలో మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనునవి అంతఃకరణ చతుష్టయము. మనస్సెల్లప్పుడును సంకల్ప వికల్పము లొనర్చుచుండును. దానికి

మంచి చెడ్డలు నిర్ణయించు స్వభావముగాని, నిశ్చయాత్మకమగు స్వభావముగాని లేదు. ఇది మంచి, ఇది చెడ్డ అని చెప్పునది బుద్ధి. ఇది మంచినే చెప్పును. అయితే ఆమంచిని మనస్సు వినిన వినవచ్చును లేకున్న వినకపోవచ్చును. చిత్తము అనఁగా నిశ్చయించునది. మంచి చేయుటకుఁ గాని చెడ్డచేయుటకుఁ నిశ్చయించునది చిత్తము. తాను చేసితినని పలుకు అహంకారమని పేరు.

ఇంద్రియములు పది. జ్ఞానేంద్రియములు అయిదు. కర్మేంద్రియము లైదు. చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు ఇవి జ్ఞానేంద్రియములు. వీనికి విషయములు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు. వాక్కు, పాణి (చేయి), పాదము, పాయువు (జననేంద్రియము) ఉపస్థ (గుదము) లు కర్మేంద్రియములు. మాటలాడుట, పనిచేయుట, నడుచుట, రతి, విసర్జించుట ఇవి కర్మేంద్రియ విషయములు.

ఈ యింద్రియము లెల్లప్పుడును ఆయా విషయములపైఁ జరించుచుండును. మనస్సు సంకల్పము చేయుట, దానిప్రకార మీ యింద్రియములు చరించుట. మనస్సు ఏకాదశేంద్రియము. ఇది యింద్రియములకు రాజు. దీని యిష్ట ప్రకార మింద్రియములు నడుచుచుండును. ఈ మనస్సును స్వాధీనము చేసికొనిన సకలేంద్రియములు స్వాధీనపడినట్లే. మనస్సు బుద్ధి చెప్పిన మార్గముననే పోవుటకు కృతనిశ్చయమై యుండవలయును. చిత్తము మంచి నిశ్చయమునే అనఁగా బుద్ధిననుసరించియే నిశ్చయము చేయవలయును. కావున చిత్తము సంస్కారముచే మంచి నిశ్చయమునే చేయునెడల, దాని ననుసరించిన మనస్సు, ఇంద్రియములు ఆస్వరూపమునే చెందును. అహంకారమును భగవంతునకే అర్పింప వలయును. ప్రేరేపించి చేయించువాఁడు భగవంతుఁడేకాని తనదేమియు లేదని భావింప వలయును. వాయువు చలించిన మనస్సు చలించును. వాయువును నిరోధించిన (కుంభకమున) మనస్సు నిరోధింపఁబడును. కావున ప్రాణాయామాభ్యాసమున మనస్సు నిరోధమై వశము కాఁగా ఆమార్గమున నింద్రియములనుగూడ వశపఱచుకొని ఆయింద్రియములనుగూడ చిత్త స్వరూపమునే చెందునట్లు చేయవలెను. అనఁగా నింద్రియ వృత్తులను ఆయా విషయముల పైకిఁ బోనీయరాదు. దీనినే ప్రత్యాహారమందురు. ఈ విషయముగూర్చి విష్ణుపురాణములో నిట్లు చెప్పబడినది.

శ్లో॥ శబ్దాది ష్వనురక్తాని – నిగృహ్యాక్షాణి యోగవిత్
కుర్యాచ్చిత్తాను కారీణి – ప్రత్యాహార పరాయణః॥

వశ్యతా పరమా తేన - జాయతే నిష్కలా మనామ్
ఇంద్రియాణామవశ్యై స్తై ర్నయోగీ యోగసాధకః॥

యోగము తెలిసిన మానవుఁడు ప్రత్యాహారపరాయణుఁడై శబ్దాది విష యములలోఁ జిక్కుకొనిన యింద్రియములను తద్వృత్తులనుండి మఱలించి, వాటిని జిత్తానుకారణముగఁ జేయవలయును. దీనివలన జితేంద్రియత్వములో దృఢత్వ మేర్పడును. ఈదృఢత్వము లేనిది వానిని యోగసాధకుఁడని చెప్పుటకవీలులేదు.

ఇట్టి స్థితికి రాలేక సౌభరి మొదలగు యోగులు పతనమైరి. కావుననే శ్రీకృష్ణుఁడు అర్జునునితో నిట్లనెను.

శ్లో॥ తాని సర్వాణి సంయమ్య - యుక్త ఆసీత మత్పరః
వశేహి యస్యేంద్రియాణి - తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ —గీత. ౨-౬౧

అట్టి క్షోభము కలుగఁజేయు సమస్తేంద్రియములను వశము కావించుకొని సమాహిత చిత్తుఁడై మత్పరాయణుఁడై ధ్యానింపలయును. ఏలననఁగా నెవని యింద్రియములు వశమునందున్నవో వాఁడు స్థితప్రజ్ఞుఁడు.

ఈ ప్రత్యాహారములో ననేక భేదములు కలవు. అవి యీ క్రింద వివ రింపఁ బడుచున్నది. నూతసంహితలో నిట్లు చెప్పఁబడినది.

శ్లో॥ ఇంద్రియాణాం విచరతాం - విషయేషు స్వభావతః
బలాదాహరణం తేషాం - ప్రత్యాహార స్స ఉచ్యతే॥

స్వభావముగా విషయములయందు చరించు ఇంద్రియములను బలవంత ముగా లాగుటకుఁ బ్రత్యాహారమని పేరు.

శ్లో॥ యద్యత్పశ్యతి తత్సర్వం బ్రహ్మ పశ్యేత్సమాహితః
ప్రత్యాహారో భవేదేషః బ్రహ్మవిద్భిః పురోదితః॥

దేనిని జూచుచున్నాఁడో దానినంతయు బ్రహ్మపదార్థముగాఁ జూచుట ప్రత్యాహారమని బ్రహ్మవేత్తలు పూర్వము చెప్పియున్నారు.

శ్లో॥ యద్యచ్ఛుద్ధ మశుద్ధం వా కరోత్యామరణాంతకమ్
తత్సర్వం బ్రహ్మణే కుర్యా త్ప్రత్యాహారోయ ముచ్యతే॥

మఱణము వఱకు తానుజేయు కార్యములు శుద్ధముగాని అశుద్ధముగాని సర్వము బ్రహ్మము నందు చేయుటకుఁ బ్రత్యాహారమని పేరు.

శ్లో॥ అథవా నిత్యకర్మాణి బ్రహ్మారాధన బుద్ధితః
కామ్యానిచ తథా కుర్యా త్ప్రత్యాహార స్స ఉచ్యతే॥

నిత్యకర్మలను కామ్యకర్మలను బ్రహ్మారాధన బుద్ధితోఁ జేయుటకుఁ బ్రత్యాహార మనఁబడును.

శ్లో॥ అథవా వాయు మాకృష్య - స్థానా త్థ్సానం నిరోధయేత్
దంతమూలా త్తథా కంఠే - కంఠాదురసి మారుతమ్॥
ఉరోదేశాత్స మాకృష్య - కుండల్యాంతు నిరోధయేత్
కుండలీ దేశతో విద్వా - న్మూలాధారే నిరోధయేత్॥
తథా పానే కటి ద్వంద్వే - తథోరు ద్వయ మధ్యమే
తథా జాను ద్వయే జంఘే - పాదాంగుష్ఠే నిరోధయేత్॥
ప్రత్యాహారోయ మిత్యుక్తః - ప్రత్యాహారపరైః పురా॥

వాయువును బీల్చి ఒక స్థానమునుండి మఱియొక స్థానములోనికిఁ గొని పోయి నిరోధింపవలయును. ముందుగా దంతమూలము, అంతట క్రమముగా కంఠము, హృదయము, నాభి, కుండలిస్థానము, మూలాధారము, అపానము, పొంటి, తొడలు, మోఁకాళ్లు, పిక్కలు, పాదములయొక్క బొటనవ్రేళ్లు వీని యందు క్రమముగా నిరోధించుటకు ప్రత్యాహారమని చెప్పుదురు.

శ్లో॥ నాసాభ్యాం వాయుమాకృష్య - నిశ్చల స్స్వస్తి కాసనః
పూరయే దనిలం విద్వా - నాపాద తల మస్తకమ్॥
పశ్చాత్పాదద్వయే తద్వ - న్మూలాధారే తథైవచ
నాభి కందేచ హృత్పద్మే - కంఠమూలే చ తాలుకే॥
భ్రువోర్మధ్యే లలాటేచ - తథా మూర్ధాని ధారయేత్
అకారం చ తథోకారం - మకారంచ తథైవచ॥

నకారంచ మకారంచ - శికారంచ వకారకమ్
యకారంచ తథోంకారం - జపేద్బుద్ధి మతాం వర॥
ప్రత్యాహారోయ మిత్యుక్తః - పండితైః పండితోత్తమ॥

ముక్కులతో గాలినిఁబీల్చి స్వస్తికాసనమున నిశ్చలుఁడై విద్వాంసుఁడు పాదతలము మొదట శిరస్సు వఱకు గాలిని బీల్చి, మీఁదట పాదములయందును, మూలాధారమునందును, నాభిస్థానముననుు, హృత్పద్మముననుు, కంఠమూలముననుు, నాలుకయందును, భ్రూమధ్యమందుననుు, లలాటముననుు, శిరస్సుననుు ధరింప వలెను. ఇట్లు అభ్యాసము బుద్ధిమంతుఁడు ఓం నమశ్శివాయ ఓం అను మంత్ర మును జపింపవలెను. దీనినిఁ బ్రత్యాహారమని కొందఱు పండితులందురు.

శ్రు॥ ఇంద్రియాణీంద్రియార్థేభ్యో యత్ప్రత్యాహరణం స్ఫుటమ్
యోగీ కుంభక మాస్థాయ ప్రత్యాహారస్స ఉచ్యతే.

— యోగతత్త్వోపనిషత్.

యోగియగువాఁడు కేవల కుంభకావస్థయందుండి విషయములను ఇంద్రియ ములనుండి చక్కఁగా మరల్చుటయే ప్రత్యాహారమని చెప్పఁబడును.

శ్లో॥ దేహాద్యాత్మమతిం విద్వాన్ సమాకృష్య సమాహితః
ఆత్మనాత్మని నిర్ద్వంద్వే నిర్వికల్పే నిరోధయేత్॥

ప్రత్యాహార స్సమాఖ్యాత స్సాక్షాద్వేదాంత వేదిభిః
ఏవ మభ్యస తస్తస్య న కించి దపి దుర్లభమ్॥

తస్య పుణ్యంచ పాపంచ నహి సత్యం బృహస్పతే
ప్రత్యాహార స్సమాఖ్యాత స్సంక్షేపేణ మహామునే॥

గోపనీయ స్త్వయా నిత్యం గుహ్యాద్గుహ్యతరోహ్యాహమ్॥

సమాహితుఁడై దేహాత్మ బుద్ధిని గ్రహించి సమచిత్తము కలవాఁడై నిర్ద్వంద్వమును, నిర్వికల్పము నైన ఆత్మయందు నిలుపుటకు ప్రత్యాహార మందు రని వేదాంతవిదులచేఁ జెప్పఁబడినది. దీని నభ్యసించినవానికి దుర్లభమైనది లేదు. ఓ బృహస్పతీ! అతనికి పుణ్యముగాని పాపముగాని నిజముగా లేదు. ఇచ్చట సంక్షేపముగఁ జెప్పిన యీ ప్రత్యాహారమును నెల్లప్పుడును దాఁచఁదగిన రహస్యకరమైనది.

ఈ ప్రత్యాహారమును సాధించుటకు కొన్ని మార్గములు కలవు. పద్మా సనమునఁ గూర్చుండి కేవల కుంభకము ద్వారా శ్వాసోచ్ఛ్వాస నిరోధము చేతను, సిద్ధాసనమునఁ గూర్చుండి నాసికాగ్రముపై స్థిరదృష్టిని నిలుపుటచేతను

మూర్ఛా ప్రాణాయామాభ్యాసముచేతను, శాంతచిత్తముతో ౧,౨౦౦౦ ప్రణవ జపము చేయుటచేతను, విపరీతకరణీ ముద్రచేతను, మనోవృత్తులను శ్వాసోచ్ఛ్వాసల యొద్భవస్థానమునందు స్థిరముగ నిల్పుటచేతను ప్రత్యాహారము సిద్ధియగును. దీనిని సాధించుటచే నింద్రియములు వశమగుటయు, మనోనిర్మలతయు, తపోవృద్ధియు, దీనతానాశనమును, శరీరారోగ్యము ధారణా ధ్యాన సమాధులందు చిత్తము ప్రవేశించుటకు యోగ్యతయుఁ గలుగును.

ప్రత్యాహారము సాధించినవానికి అభ్యాస సమయమున నింద్రియవృత్తు లెచ్చటికిని పోవక నిశ్చలముగ నుండును. ఇంద్రియములును చిత్తస్వరూపమునే చెందును. కాని బాహ్యప్రపంచములోనికి వచ్చినప్పుడు ఇంద్రియములు వాని వాని పనులను చేయుచుండును. కాని స్వాధీనములో నుండును. ఇట్టి సాధకుఁడు తక్షణము తన ఇంద్రియములను ఉపసంహరించి చిత్తములో నైక్యము చేయఁగలఁడు. ఇట్టి సమర్థత కలవాఁడే ధారణాభ్యాసమునకు యోగ్యుఁడగును.

ధారణ యనఁగా ధరించుట (Concentration). ఇది రెండు విధములు. ౧. బహిర్ధారణ ౨. అంతర్ధారణ. వీనిలో బహిర్ధారణకంటె నంతర్ధారణ యుత్తమమైనది. బహిర్ధారణ యనగా మూర్తి, విగ్రహ, చిత్రములందు ధారణ చేయుట. తనకుఁ బ్రియమైన దేవతామూర్తిని బయట ధ్యానించి చూచుచుండుట. దీని నభ్యాసము చేయునపుడు ఎదుటనుండు పదార్థము లేవియుఁ గన్నులు తెఱచియున్నను గనఁబడక కేవలము తన యిష్టదైవమే కనఁబడవలయును. ఈ యభ్యాసము చాల గొప్పది. ఇట్టి స్థితి వచ్చునప్పటికి మనస్సైకాగ్రమగుటయే గాక పూర్తి ధ్యానావస్థయుఁ బ్రాప్తింపఁగలదు. అట్లు భావించిన మూర్తిని దగ్గఱకు రప్పించుకొని సంభాషించుటకు యత్నింపవలయును. బాగుగా ధారణ స్థిరపడువరకు ఈ యభ్యాసమును కటిక చీఁకటి గదిలో రాత్రులందు ప్రశాంతి సమయమునఁ జేయుట యుచితము. ఆ గదిలో ఇతరులుకూడ పరుండినచోఁ దాను గూర్చుండి ధ్యానించుట వారు చూడఁగలరని తోఁచిన పరుండియే శ్రీరాముఁడు కోదండధరుఁడై తనవద్దకా కటిక-చీఁకటిలోఁ బ్రకాశించుచు (ఇంద్రనీలమణి వలె) వచ్చుచున్నట్లును, మంచముప్రక్కన నిలుచుండినట్లును, మంచముచుట్టును దిరుగుచున్నట్లును, తన ప్రక్కన కూర్చుండినట్లును, పరుండినట్లును భావింపవలయును. తన్ను స్పర్శించుచున్నట్లు భావించి, ఆ స్పర్శ తనకుఁ

డాఁకిన భావన చేయవలయును. ఇంతవఱకు దృఢపడిన నాయనతో మాట్లాడు టకుఁ బ్రయత్నింపవచ్చును. ఇదియు ధ్యానమునందు చేరును. ఇంతటి సాధన చేయలేనివాఁడు విగ్రహము నెదుటనుంచుకొని కన్నులతో సమస్తావయవములను బాగుగాఁజూచుచు మనస్సున ధరించుచుండవలెను. అట్టి అందమైన చిత్రమును గూడ కన్నులు తెఱచియే చూచుచుండవలయును. 'అందమెల్ల నీ సొమ్మేరా' యనుకొనుచు మనస్సున ధారణచేయువలయును. ఇట్టి ధారణనే ముందు చెప్పఁ బోవు 'దివ్యదేశ సేవన'మను ప్రకరణములోఁ జెప్పఁబడిన స్థానములలోఁ జేయు వలయును. ఇది బహిర్ధారణ.

ఇఁక నంతర్ధారణయన నంతర్విషయములందు ధారణచేయుట. బయట తాను జూచిన మూర్తిని మనస్సున నిలుపుటకు అంతర్ధారణ యనిపేరు. దీనిని భ్రూమధ్యమందునను, హృదయములోను, సహస్రారమందును ధారణ చేయ వలయును. మూర్తి నీలమణివలెఁ బ్రకాశించుచుండ వలయును. ఆ మూర్తి చుట్టును దివ్యప్రకాశమున్నట్లు భావింపవలయును. ఆ ప్రకాశము తెల్లగ నుండి పింజవలెను, ప్రకాశమున అనంతకోటి ప్రచండ సూర్యప్రభా భాసమానముగను, చల్లఁదనమునఁ జంద్రునిమించి యుండి మనస్సున నమృతము వర్షించుచున్నట్లును తన లేనగవు వెలుఁగులచే తన్నాకర్షించుచున్నట్లు భావిఁపవలయును. ఇట్లు ప్రతి యవయవమును వివరముగఁ జూచుచు మొత్తము మూర్తిని మనయెదుటనున్న మిత్రుని స్పష్టముగఁ జూచినట్లు చూడవలయును.

ధారణ అనేక ప్రకారములుగఁ గలదు. గరుడ పురాణోక్తినిబట్టి ధారణ పది విధములు.

శ్లో॥ ప్రాజ్నాభ్యాం హృదయేచాథ తృతీయేచ తథోరసి
కంఠే ముఖే నాసికాగ్రే నేత్రభ్రూమధ్య మూర్ధసు॥
కించిత్తస్మాత్పరస్మింశ్చ ధారణా దశకీర్తితా॥

మొదట ధారణ నాభియందును, తర్వాత క్రమముగ హృదయము, వక్షః స్థలము, కంఠము, ముఖము, నాసికాగ్రము, నేత్రద్వయము, భ్రూమధ్యము, మూర్థస్థానములందు చేయవలయును. ఈ పదియు దశవిధ ధారణలుగఁ జెప్పఁ బడినవి.

ధ్యేయవస్తువును ధ్యానింపకయే చిత్తము నీ పది స్థానములందు ధారణ చేయఁగలిగిన చిత్తవృత్తి నిరోధము కాఁగలదు. ఇట్టి స్థితి కలిగిన తర్వాత నా స్థానమున ధ్యేయమూర్తియగు శ్రీరామచంద్రుని నిలుపుట ధ్యానమని కొందఱి మతము. మొత్తముమీఁద నీ ధారణాభ్యాసమునకు యోగప్రక్రియలోఁ గల భూచరీ, ఖేచరీ, శాంభవీ యిత్యాది ముద్రాభ్యాసములు చాలవఱకు సహాయ పడఁగలదు. కాని యీ ముద్రాభ్యాసము చేయువారలు శుద్ధ సాత్త్వికాహార మునే తీసికొనుచుఁ, బ్రాణాయామాభ్యాసము కొలఁదిగనైనఁ జేయువారుగ నుండవలయును. లేకున్నఁ జాలహాని కలుగవచ్చును. వీటిని గురుముఖమునఁ దెలిసికొనవలెను.

# ౭. దివ్యదేశ సేవనము

దివ్యదేశములు పదునాఱు. ౧. అగ్ని ౨. జలము ౩. లింగము ౪. స్థండిలము ౫. కుడ్యము ౬. పటము ౭ మండలము ౮. విశిఖము ౯. నిత్యయంత్రము ౧౦. భావయంత్రము ౧౧. పీఠము ౧౨. విగ్రహము ౧౩. విభూతి ౧౪. నాభి ౧౫. హృదయము ౧౬. మూర్ధము.

## ౧. అగ్ని

శ్రౌతాగ్నియందు గాని, స్మార్తాగ్నియందుఁగాని సంకల్పపూర్వకముగ శ్రీరామచంద్రుని ఆహ్వానించి షోడశోపచారములకును ఘృత, చరు, సమిధాదులలో దేనినైన నాహుతిగ వేయవలెను.

## ౨. జలము

జలస్వరూపుఁడగు శ్రీరామునకు పుష్పములు, దీపములు, ఫలాదులు అర్పింపవలయును.

## ౩. లింగము

* సాలగ్రామ శిలయందు ముఖ్యముగ సీతారామ, షట్చక్ర సీతారామ ములను షోడశోపచారములతోఁ బూజింపవలెను. ఈ సాలగ్రామ లక్షణములు

* పూజనుగూర్చి విపులముగఁ దెలియవలెననిన మా 'శ్రీరామపూజను, 'సాలగ్రామపూజాసర్వస్వము'ను జూడవలయును.

తెలిసికొనుటకును, తత్పూజావిధానమును దెలిసికొనుటకును మా సాలగ్రామ పూజాసర్వస్వమును జూడవలయును.

## ౪. స్థండిలము

శ్రీరామయంత్రమును ఒక పీఠముపై పిండిముగ్గులు పెట్టి శ్రీరాము నర్చింపవలయును.

## ౫. కుడ్యము

గోడయందు శ్రీరామ విగ్రహమునుగాని, నామమునుగాని, పంగనామములనుగాని వ్రాసి దానిని షోడశోపచారములతోఁ బూజించుట.

## ౬. పటము

కాగితములు, గుడ్డలు, చెక్కలు వీనియందు శ్రీరాముని చిత్రమును జిత్రించి పూజించుట.

## ౭. మండలము

శ్రీరాముని పరివారముతో (హనుమత్సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న సుగ్రీవాంగద జాంబవ ద్విభీషణాదులు) మంత్రములతో నావాహనము ఒక మంటపము మీఁదఁగావించి పూజించుట.

## ౮. విశిఖము

శ్రీరాముని బాణముగ భావించి పూజించుట. కొందఱు నర్మదా బాణములందే శ్రీరాము నాహ్వానించి పూజించుటకే విశిఖపూజ యందురు.

## ౯. నిత్యయంత్రము

రాగిరేకునందు శ్రీరామ యంత్రమును జెక్కించి ప్రాణప్రతిష్ఠాదులు కావించి పూజింపవలయును. "యంత్రం మంత్రాత్మకం ప్రాహుః" అని యుండుటచే యంత్రము మంత్రమయము కావున దానికి శక్తి యెక్కువగఁగలదు. యంత్రములు రెండురకము లీప్రక్కపుటలో నీయఁబడినవి.

## ౧౦. భావయంత్రము

శ్రీరామ యంత్రమును హృదయమున సమస్తావరణములతో భావించు కొని పూజించుట. ఇది మానసికము. ఈ సేవనములో యంత్రమంతయు బాగుగాఁ దెలిసియుండవలయును. ఆ శ్లోకములను రాఁబట్టి దాని యర్థము ననుసరించి భావించుట యుక్తము. సులభమును.

## ౧౧. పీఠము

సర్వతో భద్రపీఠమునందు శ్రీరాము నాహ్వానించి పూజించుట. ఈ పీఠ మందర్చించిన శ్రీరాముఁడు త్వరగఁ బ్రసన్నుఁడు కాఁగలఁడు. ఇంప్రస్తుటిలో సర్వతో భద్రపీఠములను జూడవలయును. వీటిని చెక్కమీఁదఁగాని, పీటపైఁ గాని, రంగులపిండితోడనో, శాశ్వతమగు రంగుతోడనో, పట్టువస్త్రముమీఁదనో అద్దించి పూజింపవచ్చును.

## ౧౨. విగ్రహము

మట్టి, కొయ్య, ఱాయి, పంచలోహ, రాగి, వెండి, బంగారు, రత్నము లలో దేనితోనైన శాస్త్రోక్తరీతిని విగ్రహమును జేయించి ప్రతిష్ఠించిగాని, ప్రతిష్ఠింపకగాని ఆవాహనాదులొనర్చి పూజింపవలెను. 12 అంగుళముల వఱకు ఎత్తుగల విగ్రహములను గృహములలో యంత్రముతోఁ బ్రతిష్ఠించుకొనవచ్చును. దోషములేదు. అంతకు మించిన ప్రత్యేక మందిరము లేక దేవాలయ ముండవల యును. యంత్రప్రతిష్ఠ లేని విగ్రహములకు ప్రాణప్రతిష్ఠ కావించి ఆవాహన విసర్జనలతోఁ బూజింపవలెను.

## ౧౩. విభూతి

విభూతియనఁగా భగవద్విభూతులు. తన విభూతులనుగూర్చి శ్రీకృష్ణుఁడు భగవద్గీతలోఁ జెప్పియున్నాఁడు. వానిలో దేనినైన శ్రీరామునిగ భావించి పూజింపవలయును.

## ౧౪. నాభి

నాభిస్థానమున పరాశబ్దస్వరూపునిగ భావించుట. లేక యోగము తెలి సినవాఁడు అచ్చట గల మణిపూరక చక్రమున స్వామిని ధ్యానింపవలయును.

## ౧౫. హృదయము

హృదయ కమలము అష్టదళములతో నున్నట్లును, దానిమధ్యనున్న కర్ణిక యందు తేజోమధ్యమున శ్రీరామచంద్రుని నిలిపి పూజింపవలయును.

## ౧౬. మూర్ధము

మూర్ధమున సహస్రారమున శ్రీరాముని నిలుపుకొని పూజించుట. ఈ పూజయు యోగము తెలిసిన వారివలనఁ దెలిసికొని చేయవలయును. ౧౪, ౧౫, ౧౬ స్థానములలోఁగల దివ్యదేశములు యోగికి ముఖ్యములు.

దివ్యదేశములను దర్శన, స్పర్శన, వందన, హోమ, అర్చన, స్మరణ' ధ్యానములచే సేవింప వచ్చును. పైన నుదాహరించిన దివ్యదేశములలో నే సాధకున కేవేవి సులభసాధ్యముగ నుండునో వాటి నాతఁడెన్నుకొనవలయును. ఆయా దేశమును సేవించు విధానమును పెద్దలవలనఁ దెలిసికొనవలెను.

# ౮. ప్రాణక్రియ

ప్రాణక్రియ యనఁగా ప్రాణాయామము. ప్రతి యోగసాధనలోను నీ ప్రాణక్రియాసాధన కలదు. అది యీ మంత్రయోగములోను గలదు. "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అని యుండుటచే బంధమునకు గాని, మోక్షమునకుగాని, కారణము మనస్సే. మనస్సు స్వాధీనముగ నుండినచో నే యే క్రియనైనను చేయఁగలము. జప సమయమున మనస్సు విషయములందు సంచరించుచుండిన నేమిప్రయోజనము కలుగును. కావున మనస్సును జయింప వలయును. వాయువు చలించిన మనస్సు చలించును. వాయువే ప్రాణము. అనఁగా ప్రాణము చలించిన మనస్సు చలించును. మనస్సు చలించినఁ బ్రాణము చలించును. ఈ రెంటికిని ప్రగాఢ సంబంధము కలదు. కావున మనస్సును వశ పఱచుకొనుటకు బ్రాణము వశపఱచుకొన వలయును. కుంభకమునఁ బ్రాణమును జలింపనీయము కావున మనస్సును జలింపకుండును.

ప్రాణమునకును నాడులకును సంబంధము కలదు. నాడీ శుద్ధియైనఁ బ్రాణ శుద్ధి యగును. ప్రాణ శుద్ధివలన మనశ్శుద్ధి కాఁగలదు. జపమునకుఁగాని, ధ్యానము నకుఁగాని ప్రాణాయామము ముఖ్యము.

ప్రతి దినము త్రికాలములందును భోజనమునకు ఒక గంట ముందును, భోజనము చేసిన తర్వాత కనీసము మూఁడు గంటలు దాఁటిన తర్వాతను పూటకు పది చొప్పున ప్రాణాయామములు చేయవలెను. దీని వలనఁ జాల మేలు కలుగును; లేక ఉదయమున జపధ్యానములకు ముందుపదియును, సాయంకాలము పదియును, అర్ధరాత్రియందు పదియును చేయవలయును. మంత్రయోగాభ్యాసకుఁడు చేయు యీ ప్రాణాయామములకు పూర్వము హఠయోగాభ్యాసికి వలె ధౌతి, వస్తి, నేతి, నౌలి, త్రాటకము, కపాలభాతి మొదలగునవి చేయ నవసరములేదు. ఆహార విహారములందు మితమును పాటించుచు, సాత్త్వికాహారము దీసికొనినఁ జాలును. కొంచెముగ నుప్పు వాడినను వాడవచ్చును. కారమునకు బదులు శొంఠి, లవంగాలు, అల్లము వాడవచ్చును. నిమ్మకాయ పులుసు వాడవచ్చును. అతిగ దుంపకూరలు గాని, జిగురు కలిగిన బెండ, చామ వంటి కూరలుగాని, తామస పదార్థములుగాని వాడరాదు. ఈ మంత్రయోగాభ్యాసమునకు సంబంధించిన యీ ప్రాణాయామములకు యోగపట్టమును ధరింప వలసిన పనిలేదు. మూల, జాలంధర, జిహ్వోడ్యాన బంధములు వేయవలసిన పనిలేదు. ఈ క్రింద చెప్పిన విధమున జాగ్రత్తగ తొందర పడక ప్రాణాయామము గావింపవలయును.

ప్రాణాయామమునకు ముందు గోచిని బిఱ్ఱుగఁ బెట్టుకొనవలెను. పైన ధోవతిని కట్టుకొనవచ్చును. నేలపై ఆసన ప్రకరణములోఁ జెప్పఁబడిన యాసనము పఱచుకొని, దానిపై తెల్లని ఉదికిన వస్త్రమును పఱచ వలయును. దానిపై పద్మాసనస్థుఁడై కూర్చుండవలయును. ముక్కులోని గాలిని బయటకు విడిచి, కుడి ముక్కును కుడిచేతి బొటన వ్రేలితో మూసి తర్జనీ మధ్యములను ముడిచి, కనిష్ఠిక, అనామికలను పైకి యెత్తియుంచి, యెడమ ముక్కుతో శ్రీరామ మంత్రమును జపించుచు నెమ్మదిగ కుదుపులు లేకుండ, చప్పుడు కాకుండ ఒకేరకమగు వేగముతో గాలిని పీల్చవలయును. పీల్చుట అయిన తర్వాత, పైన విడిచి యుంచిన కనిష్ఠికానామికలతో నెడమ ముక్కును వత్తి బిగింపవలయును. పీల్చుటలో నెన్ని మంత్రములైనవో గుర్తుపెట్టుకొని, దానికి నాల్గురెట్లు మంత్రము లగునంతసేపు (అదే వేగముతో) కుంభించి యుంచవలయును. కుంభక కాలమున మూలబంధము, జిహ్వాబంధము, జాలంధర బంధము చేయవలయును. తర్వాత కుడి ముక్కుమీదనున్న బొటన వ్రేలిని యెత్తి యీ

బంధములను సడలించును ఉడ్యాణబంధము వేసి, లోపల కుంభించిన వాయువుసు ఒక్కసారిగ బయటకుఁ బోనీయక, యెంత వేగముతోఁ బీల్చితివో అంత వేగము తోడనే మెల్లగా చప్పుడు లేకుండ, ఎన్ని మంత్రము లుచ్చరించినంతనేపు పీల్చితివో అంతకు రెట్టింపు మంత్రములు పలుకునంతనేపు విడువవలయును. విడుచునప్పుడు కుదుపు లుండరాదు. అనఁగా మూఁడు రామమంత్రములు పలికినంతసేపు బీల్చిన, పండ్రెండు రామమంత్రములు పల్కినంతసేపు కుంభింపవలయును. ఆఱు రామమంత్రములు పలికినంతసేపు విడువ వలయును. అనఁగా నిష్పత్తి 1 : 4 : 2 గతిలో నుండవలయును. పీల్చుటకు పూరకము, నిలుపుటకు కుంభకము, విడుచుటకు రేచకము అని పేరు. ఇట్లు చేసినతర్వాత నే ముక్కుతో విడిచితివో మరల నా ముక్కు తోడనే ప్రారంభించి పైరీతిగనే పూరక, కుంభక, రేచకములు చేయవలయును. ఇట్లు చేసిన రెండు ప్రాణాయామములు కాఁగలవు. ఇట్లైదు సారులు అటునిటు చేసిన పది ప్రాణాయామములు కాఁగలవు. ఇట్లు మూఁడు పూటలందును చేయుటవలన నాడీ శుద్ధి కలుగును. ఆరోగ్యము కలుగును. మనస్సు స్వాధీనము కాఁగలదు.

ఇట్లు ప్రాణాయామములు చేయుచు అతిగ ఉప్పు, పులుసు, కారము తినిన రోగములు కలుగవచ్చును. రోగము వలన సాధనకు విఘ్నములు కలుగును. కావున గమనింపవలెను. ఇదియు గురుముఖమునఁ దెలిసికొనవలసిన సాధనయే.

## ౯. ముద్ర

ముద్రవలన భగవంతుఁడు ద్రవించును. ముద్రయను శబ్దార్థమే దానిని దెలుపును. ఒక్కొక్క దేవత కొక్కొక్క ముద్ర యిష్టము. ఆయా సమయములయం దాయా ముద్రలను బ్రదర్శించుటవలన భగవత్ప్రసన్నత కలుగును. శ్రీరామ మంత్రోపాసకులు జపసమయమున ముఖ్యముగఁ బ్రదర్శింపవలసిన ముద్ర ధనుర్బాణముద్ర. ధనుర్బాణ ముద్రను బ్రదర్శించు టెట్లనఁగా—

శ్లో॥ వామస్య మధ్యమాగ్రంతు – తర్జన్యగ్రే నియోజయేత్
అనామికాం కనిష్ఠాంచ – తస్యాంగుష్ఠేన పీడయేత్॥
దర్శయే ద్వామకే స్కంధే – ధనుర్ముద్రేయ మీరితా॥

ఎడమచేతి మధ్యమ వ్రేలిని తర్జని చివర అనఁగా చూపుడు వ్రేలిమీఁద నుంచవలెను. అనామిక, కనిష్ఠికలను బొటనవ్రేలితోఁ బీడింపవలెను. ఇట్లు వామస్కంధమునఁ బ్రదర్శించిన ధనుర్ముద్ర కాఁగలదు.

ధనుర్బాణముద్ర మంత్రజప సమయమునఁ బ్రదర్శింపఁ దగినది. ఇదిగాక పూజాసమయమునఁ బ్రదర్శింపవలసిన ముద్రలు కలవు. వాటిని బూజాకాలమున మాత్రమే ప్రదర్శింపవలయును.

## ముద్రలు

శ్లో॥ ఆవాహనీ స్థాపనీచ _ సన్నిధీ కరణీ తథా
సుసన్నిరోధనీ ముద్రా _ సమ్ముఖీ కరణీ తథా॥

సంకలీ కరణీ చైవ _ మహాముద్రా తథైవచ
శంఖ చక్ర గదా పద్మ _ ధేను కౌస్తుభ గారుడాః॥

శ్రీవత్సం వనమాలం చ _ యోనిముద్రాం ప్రదర్శయేత్
ఏతాభిః సప్తదశ భిర్ముద్రాభిస్తు విచక్షణః॥

యో రామ మర్చయే న్నిత్యం _ మోహయేత్స సురేశ్వరమ్
ద్రావయేదపి విప్రేంద్ర _ తతః ప్రార్థిత మాప్నుయాత్॥

౧. ఆవాహనీ ౨. స్థాపనీ ౩. సన్నిధీకరణీ ౪. సన్నిరోధనీ ౫. సమ్ముఖీకరణీ ౬. సంకలీకరణీ ౭. మహాముద్ర ౮. శంఖ ౯. చక్ర ౧౦. గదా ౧౧. పద్మ ౧౨. ధేను ౧౩. కౌస్తుభ ౧౪. గారుడ ౧౫. శ్రీవత్స ౧౬. వనమాలా ౧౭. యోనిముద్ర. వీటిని బ్రదర్శింపవలెను. ఈపదునేడు ముద్రలచే తెలిసినవాఁడెవఁడు శ్రీరాముని నిత్యమర్చించునో వాఁడు సురేశ్వరుఁడగు రాముని మోహింపఁజేసి, కఱఁగించి, తర్వాత కోరిన వరమును బొందఁగలుగుదురు.

## ముద్రాలక్షణములు

శ్లో॥ ఆవాహనీయా ముద్రాస్యా _ ద్దేవార్చన విధౌ మునే,
ఉత్తానాభ్యాం తు హస్తాభ్యాం _ ముద్రాచావాహనీ స్మృతా॥
విక్షేపాధోముఖీ ముద్రా స్థాపనీ త్యుచ్యతే పునః,
ఉత్తానాంగుష్ఠయోగేన _ ముష్టీకృత కరద్వయమ్॥

సన్నిధీ కరణీనామ - ముద్రా దేవార్చనా విధౌ,
అంగుష్ఠ గర్భిణీ చైవ - ముద్రా స్యాత్సన్నిరోధనీ॥

ఉత్తాన ముష్టి యుగళా - సమ్ముఖీ కరణీ మతా,
అంగైరేవాంగ విన్యాసః - సంకలే కరణీ భవేత్॥

అన్యోన్యాంగుష్ఠ సంలగ్నా - విస్తారిత కరద్వయా,
మహాముద్రేయ మాఖ్యాతా - న్యూనాధిక సమాపనీ॥

కనిష్ఠానామికా మధ్యా - త్తర్ఘాంగుష్ఠేతరే౽గ్రతః,
గోపితే౽oగుష్ఠ మూలేన - సన్నతా ముసలీ కృతా॥

కరద్వయేన ముద్రా స్యా - చ్ఛంఖాఖ్యేయం సురార్చనే,
అన్యోన్యాభి ముఖాస్పృశ్య - వృత్యా యేన తు వేష్టయేత్॥

అంగులీభిః ప్రయత్నేన - మండలీ కరణం మునే,
చక్రముద్రేయ మాఖ్యాతా గదా ముద్రా తతః పరమ్॥

అన్యోన్యాభిముఖాశ్లిష్టాంగులిః ప్రోన్నత మధ్యమా,
అథాంగుష్ఠ ద్వయం మధ్యే - దత్త్వాపి పరితః కరౌ॥

మండలీ కరణం కృత్వా - గంగులీనాం తపోధన
పద్మ ముద్రా భవేదేషా - గేసుముద్రా తతః పరమ్॥

అనామికే కనిష్ఠాభ్యాం - తర్జనీ భ్యాంచ మధ్యమే
అన్యోన్యాభి ముఖాశ్లిష్టా - తతః కౌస్తుభ సంజ్ఞకా॥
కనిష్ఠే౽న్యోన్య సంలగ్నే౽భి ముఖేపి పరస్పరమ్
వామస్య తర్జనీ మధ్యే - మధ్యానామికయోరపి॥

వామానామిక సంస్పృష్టా - తర్జనీ మధ్య శోభితా
పర్యాయేణ సతాంగుష్ఠ - ద్వయీ కౌస్తుభ లక్షణా॥

కనిష్ఠాన్యోన్య సంలగ్నా - విపరీతం తు యోజితా
అధస్తాత్ప్రాపితాంగుష్ఠా - ముద్రా గారుడ సంజ్ఞకా॥
తర్జన్యంగుష్ఠ మధ్యస్థా - మధ్యమానామి కాద్వయీ
కనిష్ఠానామికా మధ్యా - తర్జన్యగ్ర కరద్వయీ॥

ముసే శ్రీవత్స ముద్రేయం - వనమాలా భవేత్తతః
కనిష్ఠానామికా మధ్యా - ముష్టిరున్నత తర్జనీ॥

పరిభ్రాంతా శిరస్యుచ్చై - స్తర్జనీభ్యాం దివాకరః
ముద్రా యోనిః సమాఖ్యాతా - హ్యేత త్కరద్వయేరితా॥

తర్జన్యంగుష్ఠ మధ్యాంత - స్థితానామి క యుగ్మకా
మధ్యమూల స్థితాంగుష్ఠా - గ్ర్యేయం శస్త్రార్చనే మునే॥

ముదం కరోతి దేవస్య - ద్రావయే ద్దుఃఖ పాతకే
ఇతి ముద్రా నిరుక్తశ్చ - మంత్రశాస్త్రేపి శ్రూయతే॥

దేవునకు ముదమును గలిగించి, దుఃఖము కలిగినప్పుడును, పాతకము సంభవించినప్పుడును ద్రవింపఁజేయును గావున దీనికి ముద్రయని పేరు వచ్చినదని మంత్రశాస్త్రములోఁ జెప్పఁబడినది.

కావున ఈముద్రలను సాంప్రదాయము తెలిసిన వారిచేతఁ దెలిసికొని ప్రదర్శింప వలయును.

# ౧౦. తర్పణము

తర్పణము వలన దేవతాదులు తృప్తిని జెందెదరు. తృప్తిఁజెంది వారు ప్రసన్నులగుదురు. మొట్టమొదటగా స్నానసంధ్యా జపహోమాదులను గావించుకొని బ్రహ్మ యజ్ఞాంగ దేవర్షి పితృ తర్పణములను, తల్లితండ్రులు లేనివారు నిత్యపితృ తర్పణమును చేయవలయును. ఈ తర్పణములైన తర్వాత శ్రీరామ తర్పణము చేయవలయును. ఈ మూఁడు రకములగు తర్పణవిధానము లీక్రింద వ్రాయఁబడు చున్నవి.

## బ్రహ్మయజ్ఞాంగ దేవర్షి పితృ తర్పణములు

## దేవ తర్పణము

బ్రహ్మతీర్థముతో (బ్రహ్మతీర్థము చేతి నాలుగు వ్రేళ్ల మీఁదుగా నీళ్లు విడుచుట.)

౧. బ్రహ్మాదయో యే దేవాస్తాన్ దేవాన్ స్తర్పయామి.
౨. సర్వాన్దేవాన్ తర్పయామి.

౩. సర్వాన్దేవ గణాన్ తర్పయామి
౪. సర్వా దేవ పత్నీ ,,
౫. సర్వా న్దేవ పుత్రాన్ ,,
౬. సర్వాన్దేవ పౌత్రాన్ ,,
౭. భూర్దేవాన్ ,,
౮. భువర్దేవాన్ ,,
౯. సువర్దేవాన్ ,,
౧౦. భూర్భువ స్సువ ర్దేవాన్ స్తర్పయామి.

## ఋషి తర్పణము

(నివీతిరై) అనగా జందెమును దండగా వేసికొని ఋషి తీర్థముతో ఆఱచేతియొక్క యెడమ భాగముపంటగా రెండుసార్లు తర్పయామి తర్పయామి అనుచు—

౧. కృష్ణద్వైపాయనాదయో యే ఋషయః తాన్ ఋషీన్ స్తర్పయామి తర్పయామి
౨. సర్వాన్ ఋషీన్ ,, ,,
౩. సర్వాన్ ఋషి గణాన్ ,, ,,
౪. సర్వాన్ ఋషి పత్నీ ,, ,,
౫. సర్వాన్ ఋషి పుత్రాన్ ,, ,,
౬. సర్వాన్ ఋషి పౌత్రాన్ ,, ,,
౭. భూరృషీన్ ,, ,,
౮. భువర్ ఋషీన్ ,, ,,
౯. సువర్ ఋషీన్ ,, ,,
౧౦. భూర్భువస్సువర్ ఋషీన్ ,, ,,

## శాఖా కాండర్షయః

౧. ప్రజాపతిం కాండర్షిం తర్పయామి తర్పయామి
౨. సోమం కాండర్షిం ,, ,,
౩. అగ్నిం కాండర్షిం తర్పయామి తర్పయామి
౪. విశ్వాన్ దేవాన్ కాండర్షీన్ స్తర్పయామి ,,

౫. సాగ్ం హితీ ర్దేవతా ఉపనిష దస్తర్పయామి ,,
౬. యాజ్ఞికీర్దేవతా ,, ,, ,,
౭. వారుణీర్దేవతా ,, ,, ,,

## కాఠక కాండర్షయః

౮. హవ్యవాహం కాండర్షిం తర్పయామి తర్పయామి
౯. విశ్వాన్ దేవాన్ కాండర్షీగ్ ,, ,,
౧౦. బ్రహ్మాణగ్ స్వయంభువం ,, ,,
౧౧. అరుణం కాండర్షిం ,, ,,

## ఏకాగ్నికాండ కాండర్షయః

౧౨. విశ్వాన్ దేవాన్ కాండర్షీగ్ స్తర్పయామి తర్పయామి
౧౩. సదసస్పతిం ,, ,,

## పితృ తర్పణమ్

౧. సోమః పితృమాన్ యమోఽఙ్గిరస్వా నగ్నిష్వాత్తాగ్నిః కవ్యవాహనా దయో యే పితర తా న్పితౄగ్.

స్తర్పయామి తర్పయామి తర్పయామి
౨. సర్వాన్ పితౄగ్ ,, ,, ,,
౩. సర్వా న్పితృ గణాగ్ ,, ,, ,,
౪. సర్వాః పితృ పత్నీః ,, ,, ,,
౫. సర్వా న్పితృ పుత్రాగ్ తర్పయామి తర్పయామి తర్పయామి
౬. సర్వాన్ పితృ పౌత్రాగ్ ,, ,, ,,
౭. భూః పితౄగ్ ,, ,, ,,
౮. భువః పితౄగ్ ,, ,, ,,
౯. సువః పితౄగ్ ,, ,, ,,
౧౦. భూర్భువస్సువః పితౄగ్ స్తర్పయామి తర్పయామి తర్పయామి



# నిత్య పితృ తర్పణమ్

ఆచమ్య, పునరాచమ్య — భూతోచ్చాటనమ

(శ్లో॥ ఉత్తిష్ఠంతు భూత పిశాచాః)

## సంకల్పః

శ్రీః ప్రాణానాయమ్య; ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభేఽభ్యుదయ ముహూర్తే శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం అస్మత్పితౄనుద్దిశ్య అస్మత్పితృ ప్రీత్యర్థం అస్మత్పితృ తర్పణం కరిష్యే:— (ప్రాచీనావీతియై ముమ్మారు తర్పయామి అనవలయును.)

## పిత్రాది తర్పణమ్

౧. పితరం...గోత్రం...శర్మాణం...స్వధా నమస్తర్పయామి తర్పయామి తర్ప॥
౨. పితామహం " " " " "
౩. ప్రపితామహం " " " " "
౪. మాతరం " " " " "
౫. పితామహీం " " " " "
౬. ప్రపితామహీం " " " " "
౭. సాపత్నిమాతరం " " " " "
౮. మాతామహం గోత్రం శర్మాణం స్వధానమ " " "
౯. మాతుః పితామహం గోత్రం శర్మాణం స్వధానమ " "
౧౦. మాతుః ప్రపితామహం గోత్రం శర్మాణం స్వధానమ " "
౧౧. మాతామహీం గోత్రాం దాం స్వధానమస్తర్పయామి తర్పయామి తర్పయామి
౧౨. మాతుః పితామహీం " " " "
౧౩. మాతుః ప్రపితామహీం " " " "

## కారుణ్య తర్పణమ్

౧. ఆత్మపత్నీం గోత్రాం దాం స్వధానమస్తర్పయామి తర్పయామి తర్పయామి (భార్య)
౨. సుతం గోత్రం శర్మాణం " " " (కొడుకు)

౩. భ్రాతరం ,, ,, ,, ,, ,, ,, (సోదరుడు)
౪. పితృవ్యం ,, ,, ,, ,, ,, ,, (పెత్తండ్రి లేక పినతండ్రి)
౫. మాతులం ,, ,, ,, ,, ,, ,, (మేనమామ)
౬. దుహితరం గోత్రాం దాం స్వధానమ ,, ,, ,, (కూతురు)
౭. భగినీం ,, ,, ,, ,, ,, ,, (సోదరి)
౮. దౌహిత్రం గోత్రం శర్మాణం స్వధానమ ,, ,, ,, (కూతురు కొడుకు)
౯. భాగినేయకం ,, ,, ,, ,, ,, ,, ,, (మేనల్లుడు)
౧౦ పితృష్వసారం గోత్రం శర్మాణం స్వధానమశ్తర్పయామి తర్పయామి తర్పయామి పినతండ్రి లేక పెత్తండ్రి)
౧౧. మాతృష్వసారం గోత్రాం దాం స్వధానమస్తర్పయామి (పినతల్లి పెత్తల్లి)
౧౨. జామాతరం గోత్రం శర్మాణం ,, ,, (అల్లుడు)
౧౩. భావుకం గోత్రాం దాం ,, ,, (బావ)
౧౪. స్నుషాం గోత్రం శర్మాణం ,, ,, (కోడలు)
౧౫. శ్వశురం గోత్రం శర్మాణం ,, ,, (మామ)
౧౬. స్యాలకం గోత్రం శర్మాణం ,, ,, (బావమరది)
౧౭. స్వామినం గోత్రం శర్మాణం ,, ,, (యజమాని)
౧౮. గురుం గోత్రం శర్మాణం ,, ,, (గురువు)
౧౯. రిక్థినం ,, ,, ,, ,, (దాయాది)

శ్లో॥ యేకేచాస్మత్కులేజాతా అపుత్రా గోత్రిణో మృతాః
తే గృహ్ణంతు మయాదత్తం సూత్ర నిష్పీడ నోదకమ్॥

ఈ తర్పణములైన తర్వాత ఇష్టదేవతా తర్పణము చేయవలెను.

శ్లో॥ జపస్యాథ దశాంశేన - హునే దాజ్య ప్లుతం హవిః
తద్దశాంశేన - మూలేన పుష్పగంధయుతైర్జలైః॥

సాంగం రామం తర్పయామి - త్యేవం సంతర్పయేద్విభుమ్
తద్దశాంశేన తత్తోయైః - సప్తకృత్వోఽభి మంత్రితైః॥
(ఆత్మాన మభిషించేత్తు - సమూలైస్తులసీ దళైః॥)

జపము చేసిన సంఖ్యలో పదవవంతు నేతితోఁ దడుపఁబడిన హవిస్సును (అన్నము ఆవుపాలు, చక్కెర, నేయి వీనితో వండినది.) హోమము చేయవలయును. హోమము చేసినదానిలో పదవవంతు మూలమంత్రముతో పుష్పము, గంధము కలిపిన నీటితో "సాంగం రామం తర్పయామి" యనుచు భగవంతుఁడగు శ్రీరామచంద్రునకు తర్పణము చేయవలయును. దానిలో పదవవంతు జలము నేడు సార్లభిమంత్రించి శిరస్సున గఱికి పోఁచలతోను, తులసీ దళములతోను (మూలమంత్రము నుచ్చరించుచు) జల్లుకొన వలయును.

ఇట్లీ తర్పణమును ప్రతిరోజు చేసిన జపములో పదవవంతు హోమము చేసి, దానిలో పదవవంతు తర్పణము కావింప వలయును.

ఉదా:- ఒకానొక సాధకుఁడు దినమునకు 1000 (వేయి) జపము చేసినాఁ డనుకొమఁడు. అతఁడు 100 (నూఱు) మంత్రములతో హోమము కావింప వలయును. హోమమైన తర్వాత 10 (పది) మంత్రములతో తర్పణము కావింప వలయును. తర్వాత మార్జనము పైవిధముగఁజేసికొనవలయును,

# ౧౧. హవనము

అగ్ని దేవతలకు ముఖము. దేవతలకు హవిస్సులు చెందవలయుననిన అగ్ని ముఖముననే చెందవలయును. కావున హోమము ముఖ్యము. మంత్రజపములో పదివవంతు హోమము కావింపవలయును. శ్రీరామార్చనయు హోమము ద్వారముననే కావింప వచ్చును. ద్విజుఁడగు వాఁడు శ్రౌతాగ్నియందుగాని, స్మార్తాగ్నియందుగాని హోమము కావింపవలయును. ద్విజేతరులకు కేవలము జపమే చాలును. అదియే సిద్ధిపొందించును.

భార్యాగ్నియందుగాని, లేక విచ్ఛిన్నాగ్నియైనచో శాస్త్రము ననుసరించి అగ్ని నాహ్వానింప వలయును.

శ్లో॥ లక్ష్మీంమ్మృతు మతీం తత్ర - ప్రభోర్నా రాయణస్యచ
గ్రామ్యధర్మేణ సంజాత- మగ్నిం తత్రాపి చింతయేత్॥

— అగస్త్య సంహిత.

ఋతుమతియగు లక్ష్మితో నారాయణుడు సంభోగము చేయుటచే అగ్ని పుట్టినట్లు చింతింపవలయును, దానిపై శ్రాదులు వైచి ప్రజ్వలింపఁజేసి నిత్యోపాసనము, బ్రహ్మచారిమైన అగ్నికార్యము కావింపవలయును. తర్వాత-

శ్లో॥ సాంగావాహన మంత్రాగ్నౌ - పూజయే ద్రఘునాయకం
సమిధాజ్య చరూణాంచ - ప్రత్యేకం షోడశాహుతిం॥

జుహూయా న్మూల మంత్రేణ - పరివారేష్వ ఏవచ
త్రిస్త్రో వినాయకాద్యేశ్చ - సర్వేభ్యో వ్యాహృతిర్మనే॥

ద్వారాంగ పరిచారేష్వ - స్సకేభ్యో జుహుయాత్పునః
హుత్వా చాజ్యాహుతి స్తత్ర - ప్రధానా త్తత్ర దాస్త్రయే॥

రామచంద్రుని సాంగముగ నావాహనము కావించి సమిధలతోడను, నేతితోడను, చరువుతోడను ప్రత్యేకముగ నొక్కొక్కదానికి పదునాఱు చొప్పున నాహుతులు లీయవలయును. ఈయాహుతులు మూల మంత్రము తోడనే యీయవలయును. పరివారమునకు ఆయామంత్రములకు స్వాహాకారము చెప్పి హోమము చేయవలెను. వినాయకాదులకు మూడు ఆహుతులును, మిగిలిన వారందఱకును నొక్కొక్క యాహుతి యీయవలెను. తర్వాత ద్వారాంగ దేవతలకును, బరిచార దేవతలకును ఆహుతు లీయవలయును.

కామ్యములకు రాఁబోవు పదునాల్గవ ప్రకరణములోఁ జెప్పఁబడిన చొప్పున నాయా ద్రవ్యములతో హోమము కావింపవలయును. ఇట్లు హవనము పూర్తిగావించి మిగిలిన హవిస్సును భుజింపవలయును.

'హుతశేషం తతః ప్రాస్య - కుక్కుటాండ ప్రమాణకమ్' అని యుండుటచే చరువును కోడిగ్రుడ్డంత ముద్దను తినవలయును. పూజా హోమమైనతర్వాత అగ్నిని గాపాడుచుఁ బ్రతిదిన మిట్లు చేయుచుండ వలయును.

హోత కొన్ని నియమములను గమనింపవలసి యుండును. స్రుక్ స్రువము లకు మోదుగు ఆకులనుగాని, రావియాకులనుగాని వాడవలయును. సమిధలకు

మోదుగు, రావి, అత్తి, మఱ్ఱి పనికివచ్చును. కాని మోదుగు, రావి శ్రేష్ఠములు. హోమములో వేయరాని పేళ్లు వేయరాదు. రావిపేళ్లు శ్రేష్ఠములు. పిడకలు వాడవలసివచ్చిన ఆవుపేడతోఁ జేసినవే పనికివచ్చును గాని గేదెపేడవి పనికి రావు. ఆవునేయి శ్రేష్ఠము. ఆవునేయి, గేదెనేయి కలిసినను పనికివచ్చును. కేవలము గేదెనేయి అధమము. మంటమండుచున్న అగ్నిలోనే నేయి వ్రేల్చ వలెను. మంటలేని యగ్నిలో నేయిని వ్రేల్పరాదు. చరువు, సమిధలు, తండులములు మొదలగునవి అగ్నిలో మంట లేకున్నను వ్రేల్చవచ్చును. వ్రేల్చిన ద్రవ్యము హుతము కావలెను. అగ్ని ప్రజ్వలించనిది 'చత్వారిశృంగా' మంత్రములతో ధ్యానింపరాదు. హోమము చేయునప్పుడు శ్రీరామచంద్రుండే అగ్నిరూపమునను హవిస్సు, స్రుక్కు, స్రువము, కుండము మొదలగువాటి రూపముతో నున్నట్లు భావింపవలెను.

శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మహవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా॥ — భగవద్గీత.

## ౧౨ బలి

బలి వలన ఇష్టదేవతా ప్రసన్నము కలుగును. ఇందుకు సందేహము లేదు. విఘ్నములు కూడ బలి వలననే శాంతించును. దేవతల కర్పించుటకై యేర్పరించిన వస్తువులను, ఆహార పదార్థములను యక్ష, రాక్షస, పిశాచాది దుష్ట ఆసురీ శక్తులు గ్రహింప యత్నించుచుండును. అవి తామసిక శక్తులు కావునఁ బ్రకాశము గల చోటునకు రాలేవు. అందువలననే ఇష్ట ఆరాధన కార్యములందు దీప మును వెలిగించు చుందురు. వెలుఁగున్నచో నవి రాఁజాలవు కావున జ్ఞాన జ్యోతిని కలిగియున్న వానిని గూడ యీ దుష్టశక్తులు డగ్గఱఁజాలవు. ఇట్టి ఆసురీ శక్తులకుఁగూడ బలివేయు నాచారము కలదు. మనము చేయు నుపాసనా కార్యమునకు విఘ్నము కలుగకుండ నలయునని వాటికేదో ఆహారము నైచి పంపివేయు వలయును. అయితే తన యిష్టదైవమునకును, పరివార దేవతలకును బలి వేయ వలయును. ఇది ప్రసన్నతకొఱకు, అయితే యీమంత్రయోగాభ్యాసమున నితర ఆసురీ శక్తులు వచ్చుటకే అవకాశము లేదు.

బలియనఁగా జంతుబలియని యపోహపడరాదు. నైవేద్యము. పరమాత్మకు ఆత్మనివేదనము కావించిన (ఆత్మబలి) అహంకారము నశించును. ప్రపత్తియే

నిజమగు బలి. అహంకారము మన సాధనకు విఘ్నము కలిగించు నొకముఖ్య ఆసురీశక్తి. సర్వకార్యములు నేనే చేయుచున్నానను అహంకారముండరాదు. అన్నియు శ్రీరామచంద్రుని ప్రేరణ వలననే జరుగుచున్నదని భావింప వలయును. ఇట్టి భావనయే ఆత్మసమర్పణ బలి. ఇది యత్యుత్తమ మైనది. దీనినే 'ఆత్మబలి' యందురు.

కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు ఆత్మశత్రువులు. ఇట్టి శత్రువులను భగవంతుని ముందు బలి తీయవలయును. కామమును నిష్కామము తోడను, క్రోధమును శాంతము తోడను, లోభమును దానము చేతను, మోహమును జ్ఞానముచేతను, మదమును అకించత్వము చేతను, మత్సరమును సహనముచేతను బలిదీయవలయును. ఈ బలి భగవత్ప్రీతిగ జరుగవలయును. దీనినే 'రిపుబలి' యందురు.

సాధకుఁ డుత్తమ పుణ్యకార్యములను శాస్త్రవిరుద్ధములు కానివానిని శ్రీరామార్పణమస్తని శ్రీరామచంద్రున కర్పింపవలయును. గీతలోఁ జెప్పినట్లు నిష్కామకర్మ లొనర్పవలయును. కర్మలు చేసితీరవలయును. ఫలమును గోరరాదు. దీనినే 'ఫలబలి' యందురు.

పైనఁజెప్పఁబడిన బలులు ఆత్మకు సంబంధించినవి. ఇక హింసారహిత బాహ్యబలులు చెప్పఁబడు చున్నవి. ఈ బాహ్యబలులు ఇష్టదేవతలకును, ఇతర పరివార దేవతలకును, పితృదేవతలు, ఋషులు, ఆచార్యులకును, భూత, శ్వాన, కాక, శ్వపచాదులకును బలులు వేయవలెను. ఇట్లు బలులు వేయుటవలన సమస్త దేవతలు, భూతములు, జంతువులు, మనుష్యులు సంతోషించి మన యుపాసనకు విఘ్నములు చేయకుందురు. పైనఁజెప్పఁబడిన వారికి బలులు వేయునపుడు శ్రీరామ ప్రీత్యర్థముగ వేయవలయును. ఏదెట్లున్నను నీక్రిందివారికి ముఖ్యముగ బలులు వేయవలయునని శాస్త్రము చెప్పుచున్నది.

శ్లో॥ ధ్యాత్వాఽఽనీతం తు మూర్తౌ తం శ్రీరామం పీఠమాగతమ్
ముఖ్యాదీశానతః పాత్రం నైవేద్యాంశం సముద్ధరేత్॥
(శతాంశంవా సహస్రాంశ మన్యథా నిష్ఫలం భవేత్)
సర్వదేవ స్వరూపాయ _ పరాయ పరమేష్ఠినే
శ్రీరామ సేనా యుక్తాయ _ విష్వక్సేనాయతే నమః॥

వామతో రామచంద్రాయ - తీర్థక్లిన్నం సమర్పయేత్
గణేశే వక్రతుండాయ - సూర్యే చండాంశ వేర్పయేత్॥

శక్త్యావుచ్ఛిష్ట చాండాల్యై - శివే చండేశ్వరాయచ॥

ధ్యానము కావించి సేవకులోనికి వచ్చిన శ్రీరాముని దీసికొనివచ్చి, ఈశాన్యముననున్న పాత్రయందు నైవేద్య భాగమును గైకొనవలయును. 'సర్వ దేవతా స్వరూపుఁడును, పరుఁడును, పరమేష్ఠియు, శ్రీరామ సేవాయుక్తుఁడు నగు విష్వక్సేనునికి నమస్కారము' ఎడమభాగమున తీర్థముచేఁ దడుపఁబడిన శ్రీరామచంద్రున కర్పింపవలయును. వంకర తొండముగల గణపతికిని, చండ కిరణుఁడగు సూర్యునకును, చండాలురకును, శివునికిని అర్పింపవలయును.

బలికి ముఖ్యముగ శ్రీరామునకు నవాన్నమును అర్పింపవలయును. ఈ నవాన్నము చాల పవిత్రమైనది. అది తయారుచేయువిధ మిట్లున్నది—

శ్లో॥ ఏకాశీతి పలప్రాంశు గోక్షీరం తండులా స్తథా
సపాద ద్వికుడవాశ్చ ముద్గాశ్చ విశుపా స్తథా॥

కుడవ స్త్వేక ఏవాథ శర్కరా కుడవా నవ
త్రికుడవం మధుప్రోక్తం ఘృతం చ కుడవ ద్వయమ్॥

మరీచం కుడవాష్టాంశ మితం జాతీ ఫలం తథా
కుడవ స్త్వేక ఏవాథ జాతి పత్రి స్తథైవచ॥

గ్రాహ్యే మారీచ మానేన - నవాన్నం నవభి స్త్విదమ్
తోషదం రామచంద్రస్య - సాక్ష్యాకార్యం సజానసైః॥

లఘు నవాన్నం వక్ష్యామి - నైవేద్యార్థం నిరంతరం
కుడవా నవ గోక్షీరం - తండులాః కుడవస్య చ॥

చతుర్థాంశ మితాగ్రాహ్యాః - కుడవాష్టాంశ సంమితాః
గ్రాహ్యోవితు వ ముద్గాశ్చ - కుడవార్థ సితా స్మృతా,
ఘృతం ముద్గ సమం గ్రాహ్యం - తావన్మానం మధుస్మృతమ్॥

తావన్మానం శ్రీఫలం చ - మరీచం టంక సమ్మితం,
టంకార్థా జాతి పత్రిశ్చ - నవాన్నం లఘు కీర్తితమ్॥

## భావార్థము :

నవాన్నములలో రెండు రకములు కలవు. గురువు, లఘువు. దీనికి తొమ్మిది వస్తువులు కలవు. ఇది శ్రీరామచంద్రుని సంతోషింపఁ జేయును. కావున భక్తులు తప్పక దీనిని సమర్పింపవలయును. లఘునవాన్న మెప్పుడును పనికి వచ్చును.

**గురు నవాన్నము.**

| | | |
|---|---|---|
| 81 కుడవములు | — | ఆవుపాలు |
| 2 1/4 ,, | — | బియ్యము |
| 1 ,, | — | పెసరపప్పు |
| 9 ,, | — | చక్కెర |
| 3 ,, | — | తేనె |
| 2 ,, | — | నేయి |
| 1/8 ,, | — | మిరియాలు |
| 1/8 ,, | — | జాజికాయ |
| 1 ,, | — | జాపత్రి |

**లఘునవాన్నము.**

| | | |
|---|---|---|
| 9 కుడవములు | — | ఆవుపాలు |
| ,, | — | బియ్యము |
| ,, | — | పెసరపప్పు |
| ,, | — | చక్కెర |
| ,, | — | నేయి |
| 8 ,, | — | తేనె |
| 1/8 ,, | — | బిల్వపండు లేక (ఉసరిక) |
| 1 టంకము | — | మిరియాలు |
| 1/2 ,, | — | జాపత్రి |

కుడవము = 1 మానెడు

టంకము = 4 మినుపగింజల బరువు

కొన్నిచోట్ల ఆచార మిట్లున్నది. ఉత్తర దేశములో కొన్ని స్థానములలో నిట్లు చేయుచున్నారు.

బియ్యం — 2 1/4 శేర్లు (శేరు = 80 తులములు) కొలతకు మన తప్వ

ఆవుపాలు — 2 1/4 శేర్లు (కొలతకు మానెడున్నర సోలెడు)

పెసరపప్పు (పొట్టులేనిది) — 1/2 గిద్దెడు

పంచదార — 1/4 శేరు (అరసోలెడు)

తేనె — 3/4 గిద్దెడు (8 తులములు)

నేయి — 1/2 గిద్దెడు

మిరియాలు — 1/4 తులము

జాజికాయ — $\frac{1}{4}$ తులము
జాపత్రి — $\frac{1}{4}$ తులము

పైవానిని మనము నైవేద్యము చెల్లించు దానినిబట్టి దామాషాగా పెంచు కొన వచ్చును. లేక తగ్గించుకొన వచ్చును. ఇంకను అవసరమైతే ఏలకులు, లవంగములు ఇతర సువాసన ద్రవ్యములను గూడ కలుపుకొన వచ్చును. ఉత్తర దేశ సాంప్రదాయమున పచ్చకర్పూరము, ఏలకులు కలుపు కొందురు. దీనిని భక్తి పూర్వకముగఁ దయారుచేసి స్వయముగ శ్రీరామచంద్రుఁడు పరివారముతో నాహరించుచున్నాఁడని భావించుచు నైవేద్య మిడవలయును.

# ౧౩. యాగము

యాగములు ముఖ్యముగ రెండురకములు. 1. అంతర్యాగము. 2. బహిర్యాగము. ఇవిగాక ఉప యాగములు కలవు. 1. బ్రహ్మయాగము. 2. జీవ యాగము. ఈ నాలుగు యాగములును చాల ముఖ్యములైనవే. అంతర్యాగ మనఁగా మానసిక పూజ బహిర్యాగమనఁగా బాహ్య పూజ ఈ రెంటిలో నంతర్యాగము శ్రేష్ఠమైనది. ఇది మానసికము కావున కారకాపేక్షలేదు. అనఁగా నింకొక వస్తుసహాయ మవసరము లేదు.

## 1. అంతర్యాగము

శుచియై, ఈగలు, దోమలు, తేళ్లు, పాములు, నల్లులు, మిణ్ణల్లులు, ముండ్లు, రాళ్లు లేని పవిత్రస్థలమున కృష్ణాజినము, పులిచర్మము, కంబళి, చిత్రాసనము, దర్భాసనము లేక శుభ్రమైన వస్త్రమునైన పఱచుకొని దానిపైఁ బద్మాసనమునఁగాని, స్వస్తికాసనమునఁగాని కూర్చుండి పది ప్రాణాయామములు కావించి, మనస్సులోఁ గల విషయముల నన్నిటిని బయటకు పాఱఁద్రోలి హృత్పద్మమున అష్టదళపద్మమును నిర్మించుకొని, మధ్యకర్ణికారమందు మణిరత్న ఖచితమైన స్వర్ణపీఠమును గల్పించుకొని అచ్చటికి శ్రీరామచంద్రుఁడు వచ్చుచున్నట్లును వెంట హనుమత్సీతా లక్ష్మణులు కూడ నున్నట్లును భావింప వలయును. వారికెదురుగ నీవుపోయి స్తోత్రాదులచే ధ్యానము చేసినట్లును, (ఆ సమయమున నా దివ్యమంగళ విగ్రహముయొక్క రూపసౌందర్యము నంతను జూచు చుండవలయును) ఆమూర్తి నీలమణివలెఁ బ్రకాశించువాఁడును, అఖండ దివ్య

తేజమును నలుదెసలను వెదజల్లుచున్నట్లును, మహామృదువగు శరీరము కలవాఁడును, చంద్రునివలెఁ బ్రకాశించు దివ్యనఖములు నీలచ్ఛాయగల పాదములందు కలవాఁడును, ఉన్నతముగనున్న మీఁగాళ్లు కలవాఁడును, అందమగు పిక్కలు, సుందరములగు మోకాళ్లు, అరఁటికంబమువలె నునుపైన బలముగల తొడలు కలవాఁడును, పచ్చని స్వర్ణచేలము కాంతులీనుచుండ ధరించినవాఁడును, సన్నని నడుమునకు బంగారు బిళ్ళల మొలత్రాడు దానిలోఁ బొదిగిన నవరత్నములు ఇంద్రధనస్సువలె కాంతులీనుచు వింత సొబగును కూర్చుచుండ త్రివళి కలిగిన ఉదరము గలవాఁడును, నీటి సుడిగుండమువలె బొడ్డురంధ్రము కలవాఁడును, విశాల వక్షస్థలముపై అనేక రత్నహారములు ధరించినవాఁడును, మోఁకాళ్లవఱకు వ్రేలాడు ఏనుఁగు తొండములవలె బలముగల చేతులు గలవాఁడును, ఆ చేతులకు దివ్యమణి కంకణములు ధరించినవాఁడును, బాజు బందులు రెక్కలకు ధరించినవాఁడును, కంబుకంఠము గలవాఁడును, విశాలముఖమున నెఱ్ఱని పెదవులును, నిగ్గుతేరి తళతళలాడు బుగ్గలును, అందమైన చిబుకమును, కొంచెము కోల ముఖమును, మల్లెమొగ్గలవలె వరుసగా తెల్లని పలువరుస గలవాఁడును, చిఱునవ్వు నవ్వు మధ్య పండ్లకు మధ్య కొంచె మెడము గలవాఁడును, నవ్వుచే వెన్నెలలు గాయించువాఁడును, చక్కనైన ముక్కు గలవాఁడును, విశాలములగు పద్మపత్రాక్షులద్వారా కరుణారసమును చిప్పిలించు వాఁడును, మన్మథుని విల్లాయనునట్లు కనుబొమ్మలు గలవాఁడును, విశాలమగు ఫాలము కలవాఁడును, ఆఫాలముపై దివ్యపుండ్రమును ధరించినవాఁడును, ముఖపద్మముపై తుమ్మెద రెక్కలవంటి ముంగురు లుంగరములుగ శోభించుచున్నట్లును, చెవులకు దివ్యమణులు కూర్చిన మకరకుండలములు వ్రేలాడుచున్నట్లును, శిరమున దివ్యమణులును, కలికి తురాయి కలిగిన దివ్యకిరీటము వెలయుచున్నట్లును, చేతులతో శరచాపములు ధరించి వచ్చుచున్నట్లు భావింపవలెను. అంత నీవు ఎదురుగాఁ బోయి 'దయచేయుండి' యని వారినందఱ నాహ్వానించి లోపలకుఁ గొనివచ్చి హృత్కర్ణికారమందు గల దివ్యమణి సింహాసనమున నాసీనులైనట్లు భావింపవలయును. సీతారాములిద్దరును సింహాసనమందును, లక్ష్మణుఁడు విల్లునంబులు ధరించి నిలుచుండినట్లును, పవనకుమారుఁడు పాదములచెంత నున్నట్లు భావింపవలయును. అంత మణులుకూర్చిన బంగారు చెంబుతో గంగాజలములను దెచ్చి పాదములు ప్రక్షాళనము చేసినట్లును, ఆ జలములను నీ శిరస్సుపైఁ జల్లుకొనినట్లును, అట్లే సీతాదేవి పాదములనుగూడ కడిగి శిరస్సునఁ జల్లుకొనినట్లు

భావింపవలెను. చేతులు కడుగుట కర్ఘ్యమిచ్చినట్లును శ్రీసీతారాములు తమ చేతులను గడుగుకొనినట్లు భావింపవలయును. తర్వాత ఆచమనమునకు నీవు వారి చేతులలో జలమును వేసినట్లును, కేశవాది నామములను వారన్నట్లును భావించుచు నా శబ్దమును నీవు వినుటకుఁ బ్రయత్నింపవలయును. వారు జలమును మింగునపుడు గొంతులో కదలికను భావింపవలెను. భావించుట అన్నప్పుడు ఇది అంతయు సినెమా చూచినట్లు చూచుట యని తెలిసికొనవలయును. అంత శ్రమచెంది వచ్చినారు కావున పెరుగు, తేనె కలిపి యిచ్చి శ్రమాపహము కావించినట్లు భావింపవలయును. ఇదియే మధుపర్కము. అంత స్వామిని స్నానమునకు లెమ్మనినట్లును, స్నానమునకుఁ బోవునపుడు ఆ యాభరణములను, గిరీటమును దీసినట్లును, స్నాన వస్త్రమును గట్టినట్లును భావింపవలయును. అంత నొక బంగారుపీటపైఁ గూర్చుండఁబెట్టి నీవే శరీరమంతయు సువాసన ద్రవ్యములచే నలుగులు పెట్టి తర్వాత స్నానము చేయించినట్లును ఆనీళ్లు జారుటయు, శ్రీరామచంద్రమూర్తి నిన్నువారించి తోముకొనుటయు, ఆసమయమున నాతని కండర కదలికను గమనింపవలయును. అంత నీవే శుభ్రవస్త్రమున శరీరమంతయుఁ దుడిచినట్లును, - మరల కనక చేలమును వేఱొక దాని నొసంగినట్లును, ఉత్తరీయము నిచ్చినట్లును, స్వామి వెంట్రుకలను చక్కని దువ్వెనతో నీవే చిక్కుదీసి మధ్యపాపిట తీసినట్లును (పూర్వము క్షత్రియులు మాడు గొరిగించెడు వారు కారు. బ్రహ్మరంధ్రము మూఁతపడకుండుటకై మధ్య పాపిట దీసెడువారు.) క్రమముగ గుండలములు, బాజుబందులు, కంకణములు, హారములు, అంగుళీయకములు నీవే ధరింపఁజేసినట్లును, మొలకు బిళ్లల మొలత్రాటిని, కాళ్లకు కడియములను ధరింపఁజేసినట్లును భావింపవలయును. తరువాత తిలకమును ధరింపఁజేయ వలయును. అంత చక్కఁగాఁ దన రూపమును జూచుకొనుటకు అద్దమును స్వామికి చూపఁగాఁ 'చక్కఁగా నలంకరించితివిరా' అన్నట్లు భావింపవలయును

అంత దివ్యసింహాసనమునఁ బూజార్థమై సీతారాముల నిద్దరను గూర్చుండఁబెట్టవలయును. సీతాదేవి యొక్క స్నానాలంకారములు మొదలైన వాటిని నీభార్య చేసియుండినట్లు భావింపవలయును. అంత స్వర్ణయజ్ఞోపవీతమును సమర్పింపవలయును. శ్రీరాముఁడు తానే 'యజ్ఞోప వీతం పరమం పవిత్ర'మ్మని చెప్పుచు వేసికొన్నట్లు భావింపవలయును. అనంతరము చందనాగురు కర్పూరాదులచే సువాసితమైన దివ్యగంధమును శరీరమున కంఠకును బూసినట్లును, ఆ నీల

శరీరముపై నీగంధముపూఁత వేఱొక వింతరంగు నిచ్చుచున్నట్లును, శ్రీరాముఁడు చేతికి గూడ నీగంధమును దీసికొని వాసనచూచి తలయూపినట్లును, అప్పుడు కుండలాదులు కదులుచున్నట్లును, ఆకుండలములలోని రత్నకాంతులు కూడ చలించుచున్నట్లును, ఊపిరి పీల్చినపుడు బొమ్ములుబ్బిన పైనముకూడ కనఁబడ వలయును. బొమ్ములుబ్బినప్పుడు కంఠహారముల కదలిక వలనఁగలిగిన కాంతుల కదలికను భావింపవలయును. అంతసువాసనగల పుష్పమునే ను శ్రీరాముని చెవులం దును, గిరీటము చుట్టును, హృదయమువద్ద హారములలోను అలంకరించి, మంచి సువాసన పుష్పములను దాను వాసన చూచుకొనుటకు స్వామివారిచేతికి గుచ్ఛ రూపముగఁ గట్టి యీయవలయును. అప్పుడప్పుడు చిఱునవ్వుతో స్వామి వాసన చూచుచున్నట్లు భావింపవలయును. మెడలోఁ దులసీ దళములతోడను, మంచి పుష్పములతోడను కూర్చిన హారమును వేయవలయును. అంత ననేక పుష్పములతోఁ బూజచేయుచున్నట్లు భావింపవలయును. పాదములపై వివిధ పుష్పములు, వివిధవర్ణములతోఁ బడియున్నట్లు భావింపవలెను. ఇట్లు అష్టోత్తర శతమో, సహస్రమో మానసికముగ అక్షరమాలతో మూలమంత్రమును జపించుచు నీవు పుష్పము వేయుచున్నట్లు భావింపవలయును. అంత దశాంగములతోఁ గూడిన ధూపద్రవ్యమును నిప్పులయందు వైచి స్వామికి ధూపము వేసినట్లు భావింపవలయును. ఆ ధూపము లుంగరములుగ పైకి పోవుచు శ్రీరామచంద్రుని మఱుగు పఱచుచున్నట్లును లీలగ మాత్రమే ఆ ధూపము వెనుక నీలముగ మెఱయుచు హారములతో నున్నట్లును భావింపవలయును. కమ్మని వాసన కొట్టు చున్నట్లు శ్రీరామచంద్రమూర్తి ముఖభావము చూపినట్లు భావింపవలయును. శ్రీసీతారాముల కర్పించిన ధూపము హనుమల్లక్ష్మణులుకూడ తర్వాత నాఘ్రా ణించినట్లు భావింపవలయును. తర్వాత దీపమును జూపుచు శ్రీరాముని దివ్య సుందర విగ్రహమును జూడవలయును. దీపమెట్టు తీసికొనిపోయిన నచ్చట తేలిక నీలవర్ణమున్నట్లును, ఆయన ధరించిన దివ్యాభరణములు మెఱయుచున్న ట్లును, ఆభరణములలోఁ బొదిగిన మణులలో నీ దీపము ప్రతిఫలించుచు ననేక దీపకాంతులతో మిఱుమిట్లు గొలుపుచున్నట్లు భావింప వలయును. అంత బంగారు పళ్లెరములో దివ్యపదార్థముల ననేకములు తెచ్చి నివేదించినట్లును వాటి నన్నిటిని శ్రీసీతారాములును, హనుమల్లక్ష్మణులును ప్రీతితో నారగించి నట్లును భావింపవలయును. మధ్య మధ్య శ్రీరాముఁడు పదార్థములు బాగున్న

వస్నట్లు భావింపవలెను. తర్వాత ఆకులు, వక్కలు, లవంగాలు, యాలకులు, జాజికాయ, జాపత్రి, దాల్చినచెక్క, సోపు, పచ్చకర్పూరము, కాచు, కుంకుమపువ్వు ముత్యపుచూరతోఁజేసిన సున్నము మొదలైనవి తాంబూలరూపమున నిచ్చినట్లును, శ్రీరామచంద్రమూర్తి పరివారముతో సేవించినట్లును, పెదవులెఱ్ఱఁ బడినట్లును భావింపవలెను. అంతఁ గర్పూర నీరాజనమిచ్చి దీప సమయమున భావించినట్లు భావింపవలయును. తర్వాత నమస్కారము చేసినట్లును, వాత్సల్యమున స్వామి నిన్ను నిమిరినట్లును భావింపవలెను. అంత స్వామి దిరిగి ప్రదక్షిణము చేసినట్లును, అనంతరము అపరాధ క్షమాపణచెప్పి, స్వామికి నీవును, నీభార్యయు వింజామరలు వీఁచుట మొదలగు సేవలు చేసినట్లును భావించి, రథము మీఁదనో, గుఱ్ఱము మీఁదనో, ఏనుఁగు మీఁదనో స్వామికి వీడ్కోలు నివ్వవలెను. ఇట్లు మానసిక పూజను అనేక నూతన భావములతోఁ బ్రతిదినము చేయుట కభ్యసింపవలయును. దీనికి స్నానము, శౌచము అక్కఱ లేదు. ఇది ధ్యానమునకు సంబంధించిన దీనినే అంతర్యాగ మందురు. అంతర్యాగములో నాత్మ సమర్పణము కావింపవలెను.

## 2. బహిర్యాగము

బహిర్యాగ మనఁగా బాహ్యపూజ. బాహ్యపూజను దివ్యదేశ సేవనములోఁ జెప్పఁబడిన పదునాల్గింటిలో నేదైనఁ బనికివచ్చును. అన్నిటికంటె * సాలగ్రామము శ్రేష్ఠమైనది. తర్వాత యంత్రము. తర్వాత విగ్రహ పటాదులు. సాలగ్రామమునకు ఆవాహన విసర్జనాదులు లేవు. మిగిలిన వాటికి ప్రాణప్రతిష్ఠా కార్యమొనర్పవలయును. ౧౦౦౮ గాని ౧౦౮ గడులుగాని కలిగి శ్రీరామ భద్రాంకితాసనముపైఁ బూజించుట శ్రేయస్కరము. శీఘ్రఫలప్రదము. శ్రీరామ విగ్రహములను శ్రీసీతారాములు సింహాసనాసీను లైనట్లుంచవలెను. రాముని వెనుక లక్ష్మణుని, రాముని కుడివైపున భరతుని, ఎడమప్రక్క శత్రుఘ్నుని, శ్రీరాముని ముందు ఆంజనేయుని, రామునకు వాయుదిగ్భాగమున సుగ్రీవుని, ఈశాన్యమున

* శ్లో॥ సాలగ్రామ శిలాయాంచ _ తులసీదళ కల్పితా
పూజా శ్రీరామచంద్రస్య _ కోటి కోటి గుణాధికా॥

తులసీ దళములతో సాలగ్రామ శిలయందు శ్రీరామచంద్రుని బూజించిన కోటిరెట్లధిక ఫలము కలుగును.

విభీషణుని, ఆగ్నేయమున అంగదుని, నైరృతిని జాంబవంతుని స్థాపింప వలెను. పూజ చేయువాఁడు తూర్పుగాఁ దిరిగి కూర్చుండవలయును. లక్ష్మణుని చేతికి ఛత్రమును, భరతుని చేతికి బంగారుపిడిగల చామరమును, శత్రుఘ్ననకు వ్యజనమును, పవనకుమారునకు పాదుకలను, సుగ్రీవునకు జలపాత్రయు, విభీషణునకు అద్దమును, అంగదునకు తాంబూలపాత్రయు, జాంబవంతునకు వస్త్రకోశము నీయవలయును. ఇది నవాయతనము అనఁగా తొమ్మిదిమంది. ఇది ఉత్తమము.

లేదా శ్రీసీతారాములు సింహాసనమునను, లక్ష్మణుఁడు వెనుకను, పార్శ్వములందు భరత శత్రుఘ్నులును, ముందు ఆంజనేయుఁడు నుండవలెను. ఇది పంచాయతనము. ఇది మధ్యమము.

శ్లో॥ అథవా సీతయారామం మధ్యే స్థాప్య తతః పరం
రామస్య పృష్ఠే సౌమిత్రిం రామాగ్రే వాయునందనం॥
స్థాప్యైవం పూజయేద్భక్త్యా రామం ధృతశరాసనం
అథవా సీతయారామం లక్ష్మణం పరిపూజయేత్॥
సీతానుజా వినా పూజా రామస్యైకస్య నాచరేత్
కృతాచేద్విఘ్న కర్త్రీసా భవేదత్ర న సంశయః॥

లేదా సీతారాములను మధ్య స్థాపించి శ్రీరాముని వెనుక సౌమిత్రిని, రాముని ముందు వాయునందనుని పూజింపవలెను. శ్రీరాముని చేతిలో విల్లు బాణములు ధరించినట్లు భావింపవలయును. (ఇది అధమము) లేదా సీతాలక్ష్మణులతోఁ గూడిన రాముని బూజింపవలెను వీరిద్దఱు లేకుండ పూజ శ్రీరాముని కొక్కనికే చేయరాదు. ఒకవేళ చేసినా ఆమె తప్పక విఘ్నము కావింపఁ గలదు.

అర్చకుని యెడమ ప్రక్కన ఉదకకలశమును, కుడిప్రక్కన పూజాపాత్రమును, ఎదుట వెడల్పాటి పళ్లెము నుంచుకొనవలెను. పద్మ స్వస్తికాసనములలో నేనితో నైనఁ గూర్చుండి, మౌనముతో, తులసీమాలలను ధరించియుండి, జుట్టు ముడివైచుకొని, పవిత్రమును ధరించి శుద్ధ గోపీచందనముతో ముద్రలను ధరించి నామ, ధనుర్బాణ ముద్రలు ముఖ్యములు ) గణపతికి నమస్కరించి ఆచమన

పూర్వకమగు సంకల్పము కావింప వలయును. భూశుద్ధి, భూతశుద్ధులు కావింప వలెను. అంగన్యాసాదులు చేయవలెను. అంత ప్రోక్షణ పాత్రను, జలపూర్ణ పాత్రను బెట్టుకొని గంధపుష్పాక్షత దూర్వాదులచే శంఖ కలశ చేసి, ఆసీటిచే పూజాసామగ్రులను తన్నుగూడ ప్రోక్షించి, పాద్యార్ఘ్యాచమనంబులకు మూడు పాత్రలను మధుపర్కమున కొకపాత్రయు వేర్వేఱుగా నుంచుకొనవలయును. గణపతిని, వరుణునిం శంఖమును బూజించి యా యుదకముచే భూమిని పూజా ద్రవ్యములను, తనను ప్రోక్షించుకొని ధేనుముద్రను, శంఖముద్రను, చక్రముద్రను, గరుడముద్రను జూపించి తర్వాత పూజ గావింపవలయును.

## పూజా క్రమము (* ధ్యానమ్)

శ్లో॥ ద్విభుజం ధృత తూణీర చాపబాణం ధృతాయుధం
దివ్యాలంకార సంయుక్తం పీతకౌశేయ వాససమ్॥
స లక్ష్మణం స శత్రుఘ్నం భరతేన సమన్వితం
హనుమత్సేవిత పదం సింహాసన విరాజితమ్॥
సితచ్ఛత్ర సమాయుక్తం దివ్యచామర వీజితం
విభీషణ సమాయుక్తం సుగ్రీవ పరివందితమ్॥
జాంబవత్సు సమాయుక్త-మంగదేన పరిష్టుతం
అయోధ్యావాసినం రామ మేవం హృది విచింతయేత్॥

హనుమత్సీతా లక్ష్మణ పరివార సమేత శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః
ధ్యానం సమర్పయామి.

శ్లో॥ సీతారామ సమాగచ్ఛ మదగ్రే త్వం స్థిరోభవ
గృహాణ పూజాం మద్దత్తాం కృతమావాహనం తవ॥

హనుమ ... నమః ఆవాహనం సమర్పయామి.

* శ్రీరామపూజలో వేఱొక పూజావిధాన మొసంగబడినది. ఇచ్చట ఇంకొకటి యివ్వబడుచున్నది. సాధకుల రుచి ననుసరించి దేనినైనఁ జేసికొన వచ్చును.

శ్లో॥ హిరణ్మయం రత్నయుక్తం నానాచిత్ర విచిత్రితం
సింహాసనం సహస్రాంతే హ్యాసనార్థం పదామ్యహమ్॥

హనుమ ... నమః నానారత్నఖచిత సింహాసనం సమర్పయామి.

శ్లో॥ చందనాగరు సంయుక్తై ర్జలై స్తీర్థ సముద్భవైః
పాద్యం గృహాణ శ్రీరామ మయాదత్తం ప్రసీద మే॥

హనుమ ... నమః పాద్యం సమర్పయామి.

శ్లో॥ పుష్కరాదిషు తీర్థేషు గంగాదిషు సరిత్సుచ
యత్తోయం తన్మయానీతం దత్తమర్ఘ్యం గృహాణభో॥

హనుమ ... నమః అర్ఘ్యం సమర్పయామి.

శ్లో॥ సుగంధ వాసితం తోయం – బహుతీర్థ సముద్భవం
ఆచమనార్థ మానీతం గృహాణత్వం స్థిరోభవ॥

హనుమ — నమః ఆచమనీయం సమర్పయామి.

శ్లో॥ హరిద్రా కుంకుమైర్యుక్తం సుగంధ ద్రవ్యమిశ్రితం
సుగంధ స్నేహ సంమిశ్ర ముద్వ ర్తన మథాస్తుతే॥

హనుమ ... నమః ఉద్వర్తనం సమర్పయామి.

శ్లో॥ కామధేనూద్భవం క్షీరం నందిన్యాదధి సుందరం
కపిలాయా ఘృతం శ్రేష్ఠం మధు వింధ్యాద్రి సంభవం॥
సితోత్పల సమానాభం సితాయుక్తం మనోహరం
పంచామృతం మయానీతం స్నానార్థం త్వం గృహాణభో॥

హనుమ ... నమః పంచామృతస్నానం సమర్పయామి.

శ్లో॥ గంగాచ యమునాచైవ గోదావరి సరస్వతీ
నర్మదా సింధు కావేరీ సరయూ గండకీ తథా॥
తామ్రపర్ణీ భీమరథీ కృష్ణావేణీ మహా నదీ
గోమతీ సాగరా స్సప్త పయోష్ణీ భవనాశినీ॥
పూర్ణాతాపీ తుంగభద్రా క్షిప్రా వేగవతీ తథా
పినాకీ ప్రదరా సింధు షేణా సార్థత్రయా నదా॥
ఘృతమాలా కృత్తమాలా మహీ నిక్షేపికా తథా

పయోదా ప్రేమ గంగా చ చిత్రగంగా కరానదీ॥
నీరా చర్మణ్వతీవృద్ధా వంజరాచ పునః పునా
సింధుక్షీరాచ వైకుంతాఽలక నందాచ దారుణా॥
ఇత్యాది సర్వతీర్థేషు యత్తోఽయం వర్తతే శుభం
తస్మయాఽనీత మద్యాత్ర స్నానం కురు రఘూత్తమ॥

హనుమ ... నమః శుద్ధోదక స్నానం సమర్పయామి.

శ్లో॥ పునరాచమనం రమ్యం సర్వతీర్థ సముద్భవం
గృహాణ రఘునాథ త్వం దీయతే యన్మయా తవ॥

హనుమ ... నమః పునరాచమనం సమర్పయామి.

శ్లో॥ సువర్ణ తంతు భిశ్చిత్రం పీతకౌశేయ సంభవం,
వస్త్రయుగ్మం ప్రదాస్యామి గృహాణ రఘునాయక॥

హనుమ ... నమః వస్త్రయుగ్మం సమర్పయామి.

శ్లో॥ శుద్ధం హేమమయం రమ్యం నవతంతు సముద్భవం,
బ్రహ్మగ్రంథి సమాయుక్తం బ్రహ్మసూత్రం ప్రగృహ్యతాం॥

హనుమ ... నమః యజ్ఞోపవీతం సమర్పయామి.

శ్లో॥ ముకుటం కుండలే రమ్యే ముద్రికాః కంకణే తథా,
నూపురే రశనామాలాః కేయూరే రత్నమండితే॥
ఇత్యాదీ న్పరమా న్దివ్యా న్స్వర్ణమాణిక్య నిర్మితా న్,
త్వదర్థంచ మయానీతా నలంకారా న్గృహాణ భో॥

హనుమ ... నమః ఆభరణాని సమర్పయామి.

శ్లో॥ ధృతం సవ్యజనం రమ్యం చామరద్వయ సంయుతం,
త్వదర్థం చ సమానీతం గృహ్ణీష్వ రిపు సూదన॥

హనుమ ... నమః వ్యజనచామరాణి సమర్పయామి.

శ్లో॥ సుగంధ చందనం దివ్యం కృష్ణాగరు విమిశ్రితం,
రక్తచందన సంయుక్తం గృహ్ణీష్వత్వం మయార్పితం॥

హనుమ ... నమః దివ్య సుగంధం సమర్పయామి.

శ్లో॥ అక్షతాంశ్చ వరాన్ దివ్యాన్ ముక్తాఫల వినిర్మితాన్,
కస్తూర్యాకుంకుమేనాక్తాన్ గృహాణ పరమేశ్వర॥

హనుమ — నమః అలంకరణార్థం అక్షతాన్ సమర్పయామి.

శ్లో॥ మాల్యాదీని సుగంధీని మాలత్యాదీని వై ప్రభో,
మయా ధృతాని పూజార్థం గృహాణ రఘునాయక॥

హనుమ ... నమః పుష్పమాలికాన్ సమర్పయామి.

నామ పూజ (ఇచ్చట ౧౦౮ లేక ౧౦౦౮ పూజచేయవలెను.)

శ్లో॥ వనస్పతి రసోద్భూతం గంధాఢ్యం గంధముత్తమం
ఆఘ్రేయం సర్వదేవానాం ధూపం గృహ్ణీష్వ రాఘవ॥

హనుమ ... నమః ధూప మాఘ్రాపయామి.

శ్లో॥ సాజ్యం త్రివర్తి సంయుక్తం వహ్నినా యోజితం మయా,
దీపం గృహాణభోరామ త్రైలోక్య తిమిరాపహ॥

హనుమ ... నమః దీపం దర్శయామి.

శ్లో॥ భక్ష్య భోజ్యైశ్చ సంయుక్తం సపాయస ఘృతాన్వితం,
శర్కరా మధు సంయుక్తం నైవేద్యం ప్రతిగృహ్యతాం॥

హనుమ ... నమః నైవేద్యం సమర్పయామి.

శ్లో॥ ఆమ్రాదీని సుపక్వాని ఫలాని వివిధానిచ,
సమర్పితాని తే రామ గృహ్ణీష్వ రఘు నందన॥

హనుమ ... నమః పక్వఫలాని సమర్పయామి.

శ్లో॥ పూగీఫల సమాయుక్తం నాగవల్లీ దళైర్యుతం,
జాతీ చతుష్టయ యుతం తాంబూలం స్వీకురు ప్రభో॥

హనుమ ... నమః తాంబూలం సమర్పయామి.

శ్లో॥ హిరణ్యం బ్రహ్మసంభూతం వహ్నితేజ సముద్భవం,
దీయతే దక్షిణార్థం తే గృహ్ణీష్వ రఘు నందన॥

హనుమ ... నమః దక్షిణాం సమర్పయామి.

శ్లో॥ పంచవర్తి సమాయుక్తం కపిలాజ్య విమిశ్రితం,
వహ్నినా యోజితం రమ్యం గృహీష్వత్వం నిరాజనం॥

హనుమ ... నమః కర్పూరనీరాజనం సమర్పయామి

శ్లో॥ జాతీ చంపక మందారా కేతకీ తులసీ తథా,
దమనో ముని కుందేచ స్యానంతం త్వితివై నవ॥
ఏవం నవవిధైః పుష్పైః వ ... వ,
మయార్పితాని గృహీష్వ ప్రసీద పరమేశ్వర॥

హనుమ ... నమః నవపుష్పాణి సమర్పయామి

శ్లో॥ యాని కానిచ పాపాని జన్మాంతర కృతానిచ,
తాని సర్వాణి నశ్యంతు ప్రదక్షిణ పదే పదే॥

హనుమ ... నమః ప్రదక్షిణ నమస్కారం సమర్పయామి.

శ్లో॥ ఉరసా శిరసా దృష్ట్యా మనసా వచసా తథా,
పద్భ్యాం కరాభ్యాం జానుభ్యాం సాష్టాంగశ్చ నమోస్తుతే॥

హనుమ ... నమః సాష్టాంగ నమస్కారాన్ సమర్పయామి

శ్లో॥ ఆవాహనం నజానామి నజానామి విసర్జనం,
పూజాం చైవ నజానామి క్షమ్యతాం పరమేశ్వర॥

శ్లో॥ మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం రఘూత్తమ,
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తు మే॥

అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజయాచ సర్వం శ్రీరామచంద్రార్పణమస్తు.

పైనఁ జెప్పిన పూజను మనస్సంతయు భగవంతునిపై నుంచి చేయవలెను. ఏయుపచారము చేయుచున్నను శ్రద్ధాభక్తులు ప్రధానములు. పూలు, తులసీదళములు స్వయముగఁ బెంచినవి శ్రేష్ఠములు. పూలను క్రింద పడనీయరాదు. ఒక్క పారిజాతము పూలు పనికి వచ్చును. గంధమునకు శుద్ధ చందనముగాని, తులసీకాష్ఠ చందనముగాని పనికి వచ్చును. పాద్యాదులలో వేయవలసిన ద్రవ్యములు కొన్నిగలవు.

శ్లో॥ తత్రార్ఘ్య పాత్రే దాతవ్యా గంధ పుష్ప యవాక్షతాః,
కుశాగ్ర తిల దూర్వాశ్చ సర్షపాశ్చార్ఘ్య సిద్ధయే॥ —అగస్త్యసంహిత.

అర్ఘ్యపాత్రములో గంధ, పుష్ప, యవ, అక్షతలను, దర్భకొనలను, నువ్వులను, గరిక పోచలను, ఆవాలను వేయవలెను.

శ్లో॥ పాద్యపాత్రేపి దాతవ్యం శ్యామాకంచ సు దూర్వకం,
అబ్జంచ విష్ణుక్రాంతంచ ప్రయత్నాత్ పాద్యసిద్ధయే॥
— అగస్త్యసంహిత.

పాద్య పాత్రలో శ్యామాకధాన్యము, గరికపోచలు, కమలము, విష్ణుక్రాంతమును వేయవలయును.

శ్లో॥ తథాచమన పాత్రేషు దద్యా జ్జాతిఫలా మునే,
లవంగ మపి తక్కోలం శస్త మాచమనీయ తే॥ — అగస్త్యసంహిత.

ఆచమన పాత్రలో జాజికాయ, లవంగములు, తక్కోలములు వేయవలెను.

శ్లో॥ దధ్నాచ మను సర్పిభ్యాం మధుపర్కో భవిష్యతి,
స్నానం పురుషసూక్తేన శుద్ధ శంఖోదకేనచ॥
క్షీర దధ్యాజ్య మధుభిః ఖండేనచ పృథక్రమాత్,
నారికేళోదకేనాపి తథా తాళఫలాంబునా॥

గంధ ద్రవ్యైశ్చ బహుభిః తథా గంధోదకేన చ,
ఇక్షవే నోదకేనాపి సత్కర్పూరాది గంధినా॥

పెరుగు, తేనె, ఆవునేయి యీ మూఁడింటితో మధుపర్కము నీయవలయును. శుద్ధోదక స్నానము శంఖముతో పురుషసూక్తాది మంత్రములతోఁ జేయవలయును. శుద్ధోదకముతో బాటుగా ఆవుపాలు, ఆవు పెరుగు, ఆవునేయి, తేనె, చక్కెర వీనితో వేరువేరుగా చేయవచ్చును. ఇంకను కొబ్బరినీరు, తాటిముంజలలోని నీరు, సుగంధ ద్రవ్యములు, మంచి గంధోదకము, చెఱకు పానకము, కర్పూరాదులు కలిపిన నీరు వీనితో స్నానము చేయింప వచ్చును. ఇంకను బూజావిశేషము లనేకములు కలవు. వాటికిది స్థలము కాదు. వేఱు గ్రంథములోఁ జూడఁ గలుగుదురు.

ఇక నుపచారముల విషయము తెలిసికొన వలయును. అవకాశము లేనివారు పంచ (౫) ఉపచారముల తోడనో, దశ (౧౦) ఉపచారముల తోడనో చేయవచ్చును అవకాశము కలవారు షోడశ (౧౬) ఉపచారముల చేతనో, అష్టాదశ (౧౮) ఉపచారముల చేతనో, లేక ఏకవింశతి (౨౧) ఉప చారముల చేతనో, ఏకత్రింశతి (౩౧) ఉపచారముల చేతనో, చతుష్షష్ఠి (౬౪) ఉపచారముల చేతనో పూజింప వచ్చును. సాధకుల సౌకర్యార్థమై వాటి నీక్రింద నుదహరించు చున్నాను.

## (౫) పంచోపచారములు

1. గంధము, 2. పుష్పము, 3. ధూపము, 4. దీపము, 5. నైవేద్యము.

## (౧౦) దశోపచారములు

1. పాద్యము, 2. అర్ఘ్యము, 3. ఆచమనీయము, 4. మధుపర్కము, 5. స్నానము. 6. గంధము, 7. పుష్పము, 8. ధూపము, 9. దీపము, 10. నైవేద్యము.

## (౧౬) షోడశోపచారములు

1. పాద్యము, 2. అర్ఘ్యము, 3. ఆచమనీయము, 4. స్నానము, 5. వస్త్రము, 5. ఆభూషణము, 7. గంధము, 8. పుష్పము, 9. ధూపము, 10. దీపము, 11. నైవేద్యము, 12. ఆచమనీయము, 13. తాంబూలము, 14. స్తవము, 15. తర్పణము, 16. నమస్కారము.

## (౧౮) అష్టాదశోపచారములు

1. ఆసనము, 2. స్వాగతము, 3. పాద్యము, 4. అర్ఘ్యము, 5. ఆచమనీయము, 6. స్నానము, 7. వస్త్రము, 8. యజ్ఞోపవీతము, 9. భూషణము, 10. గంధము, 11. పుష్పము, 12. ధూపము, 13 దీపము, 14. నైవేద్యము, 15. దర్పణము, 16. మాల్యము, 17. అనులేపనము, 18. నమస్కారము.

## (౨౧) ఏకవింశత్యుపచారములు

1. ధ్యానము, 2. ఆవాహనము, 3. ఆసనము, 4. పాద్యము, 5. అర్ఘ్యము, 6. ఆచమనము, 7. మధుపర్కము, 8. స్నానము, 9. వస్త్రము, 10. యజ్ఞోప

పీఠము, 11. గంధము, 12. ఆభరణము, 13. పుష్పము, 14. ధూపము, 15. దీపము, 16. నైవేద్యము, 17. పానీయము, 16. తాంబూలము, 19. దర్పణము, 20. మాల్యము, 21. నమస్కారము.

## (౩౧) ఏక త్రింశత్యుపచారములు

1. ధ్యానము. 2. ఆవాహనము. 3. ఆసనము. 4. పాద్యము. 5. అర్ఘ్యము 6. ఆచమనము. 7. మధుపర్కము. 8. స్నానము. 9. వస్త్రము. 10. యజ్ఞోప పీతము. 11. గంధానులేపనము. 12. తిలకము. 13. అద్దము. 14. మాల్యము. 15. పుష్పము. 16. ఆభరణము. 17. ధూపము. 18. దీపము. 19. నైవేద్యము. 20. పానీయము. 21. తాంబూలము. 22. ముఖశోధనము. 23. కర్పూరము. 24. పుష్పము. 25. మాల్యము. 26. ప్రదక్షిణము. 27. నమస్కారము. 28. క్షమా పణ. 29. పీవన సేవ. 30. ఉపచారము. 31 రాజోచిత సేవ.

## (౬౪) చతుష్షష్ట్యుపచారములు.

1. పాద్యము. 2. అర్ఘ్యము. 3. ఆసనము. 4. సుగంధి తైలాభ్యంగనము. 5. మజ్జనశాలాప్రవేశనము. 6. మజ్జనమణిపీఠోపవేశనము. 7. దివ్యస్నానీయము. 8. ఉద్వర్తనము. 9. ఉష్ణోదక స్నానము. 10. కనక కలశస్థిత సర్వతీర్థాభి - షేకము. 11. ధౌతవస్త్ర పరిమార్జనము. 12. అరుణ (కనక) దుకూలపరిధానము. 13. అరుణ (కనక) దుకూలోత్తరీయము. 14. ఆలేప మండప ప్రవేశనము. 15. ఆలేప మణి పీఠోపవేశనము. 16; చందనాగరు కుంకుమ మృగమద కర్పూర కస్తూరీ రోచనా దివ్యగంధ సర్వాంగాను లేపనము. 17. కేశభారస్య కాలా గురు ధూప మల్లికా మాలతీ జాతీ చంపకాశోక శతపత్ర పూగకుహరీ పున్నాగ కల్హార యూథీ సర్వర్తు కుసుమ మాలా భూషణము. 18. భూషణమంటప ప్రవేశనము. 19. భూషణ మణి పీఠోపవేశనము. 20. నవరత్న ముకుటము. 21. చంద్రశకలము. 22. (సీమంత) సిందూరము. 23. తిలకరత్నము. 24. కాలాంజనము. 25. కర్ణపాళియుగళము. 26 నాసాభరణము. 27. అధరయావకము. 28. గ్రథన భూషణము. 29. కనక చిత్ర పదకము. 30. మహాపదకము. 31. ముక్తావళి. 32. ఏకావళి. 33. దేవచ్ఛందకము. 34. కేయూర యుగళ చతుష్కము. 35. వలయావళి. 36. ఊర్మికావళి. 37. కాంచీదామ కటి సూత్రము. 38. శోభాఖ్యాభరణము. 39. పాదకటక యుగళము. 40. రత్న

నూపురము. 41. పాదాంగుళీయకము. 42. వామకరమున చాపము. 43. వామ స్కంధమున తూణీరము. 44. దక్షిణ కరమున బాణము. 45. యజ్ఞోపవీతము. 46. మాణిక్య పాదుకలు. 47. అవరణ దేవతాదులతో సింహాసనారోహణము. 48. ధూపము. 49. అమృతాశనము (నైవేద్యము) 50. ఆచమనీయము. 51. కర్పూర వటికము. 52. ఆనందోల్లాస విలాస హాస్యము. 53. మంగళా రాత్రికము. 54. శ్వేతచ్ఛత్రము. 55. చామర యుగళము. 56. దర్పణము. 57. తాలవృంతము. 58. గంధము. 59. పుష్పము. 60. ధూపము. 61. దీపము 62. నైవేద్యము. 63. పానము. 64. పునరాచమనీయము.

పైఉపచారములు దేవీపూజకు సంబంధించినవి యిచ్చట కొన్దెగమార్చి శ్రీరామ సేవకుఁ దగినట్లు వ్రాయఁబడినవి.

## 3. బ్రహ్మయాగము

ఇది ఉప యాగములలోఁ జేరినది. దీనిని స్థూలముగ బ్రహ్మయజ్ఞ మనియే చెప్పవచ్చును. ఆధ్యాత్మిక విజ్ఞానము కావలెననిన దానికి సంబంధించిన శాస్త్రములను జదువవలయును. అది నిత్యము జరుగవలయును. ముందుగ స్వశాఖకు సంబంధించిన వేదపఠనము. తర్వాత మిగిలిన వేదములు. ఆయుశాస్త్రములు. స్మృతి పురాణేతిహాసాదులు మొదలగునవి చదువ వలయును. ఇట్లు చదువుచుండ నాధ్యాత్మిక రహస్యము లనేకములు లభింపఁగలవు. మామూలుగాఁ జేయు బ్రహ్మయజ్ఞము కాక ప్రతిదినము వేద స్మృతి పురాణాదులు చదువఁబడు చుండ వలయును. అందుగల అర్థమును మననము చేయవలయును. దీనినే బ్రహ్మయాగ మందురు.

## 4. జీవయాగము

జీవయాగ మనఁగా బ్రాహ్మణ భోజనము. కొందఱు ఇతర జీవులకు, జాతులకుఁ బెట్టరాదా ? యని వాదించుచుందురు. అందఱకును బెట్టవచ్చును. కాని యాగపూర్తి కొఱకు యోగ్యుఁడగు బ్రాహ్మణునకే పెట్టవలయును. బ్రాహ్మణుఁడన నిప్పటి కాలపు సంకర బ్రాహ్మణుల ననేకులను జూచి వారిని లక్ష్యములోఁ బెట్టుకొనరాదు. బ్రహ్మణ్యామూర్తు లెందఱో కలరు. అట్టి యోగ్య లక్షణములు కలవారినే పూజింప వలయును. వారందఱకును బూజ్యులే యగు

దురు. అట్టివారు సర్వలోక క్షేమమును గోరుచుందురు. 'గో బ్రాహ్మణులు క్షేమముగా నుండుగాక' యని మనము ప్రార్థించుచుందుము. కారణమేమనఁగా మనకు ముఖ్యముగ దేహము, ఆత్మ రెండు కలవు. భగవంతుఁడు దేహపోషణ మునకై గోవు నేర్పఱచినాఁడు. ఆవుపాలు త్రాగియు, దాని సంతానముచే భూమిని దున్నించి పండించుకొనుచు జీవించుచున్నాము. కావున గోవునందు భక్తి కలిగియుండ వలయును. అవి క్షేమముగనుండినను, అభివృద్ధియైనను లోక మంతయు క్షేమమే. అంతయు వృద్ధియే. అవి నశించిన లోకనాశనమే కాఁగలదు. ఇక బ్రాహ్మణులు ఆత్మపతనము కాని మార్గమును జెప్పుదురు. అనేక విధములగు శాస్త్రములను అవగాహన చేసికొని దేహాత్మ పోషణకు శాస్త్రీయకర్మలును, ఇంద్రియములు మనస్సు ఇవియు నాత్మయే కావున వీనికి నైతిక ధర్మములును, జీవాత్మ పోషణకు ఉపాసనామార్గములను జెప్పి మనలకు తోడ్పడుచున్నారు. కావున నట్టి శుద్ధ బ్రాహ్మణులను బూజించుటలో మన కెవరికి నెట్టి యభ్యంతర ముండఁజాలదు. అట్టివాని కుక్షిలో జీర్ణమైన యాహారమే సార్థకమైనది. అది అనంత ఫలము నొసంగఁగలదు. అట్టివారిని బోషించిన లోకులందఱు ఆత్మపతనము కాదు.

కాకులకు, కుక్కలకు, చండాలురకు, పశువులకు, అతిథులకు, సేవకులకు కూడ అన్నము పెట్టుము. పెట్టవలయును. మన అన్నము మీఁద వీరి కందఱకును అధికారము కలదు. ఇదియే జీవయాగము.

## ౧౪. జపము

### శిష్యలక్షణములు

గురువు దొఱకుటకు పూర్వము యోగ్యతకల శిష్యుఁడవసరము. శిష్యుఁడు క్షేత్రము వంటి వాఁడు. గురువు బీజప్రదాత. మంత్రము బీజము. ప్రతివాఁడును మంత్రోపదేశమునకు అర్హుఁడు కాఁజాలఁడు. అనుష్ఠానము చేయఁగలవాఁడు గను, గురుభక్తి గలవాఁడుగను, స్వధర్మానుష్ఠాన పరుఁడుగ నుండవలయును. శిష్యలక్షణము లివి.

శ్లో॥ శాంతో వినీతః శుద్ధాత్మా శ్రద్ధావాన్ ధారణ క్షమః
సమర్థశ్చ కులీనశ్చ ప్రాజ్ఞః సచ్చరితో ధనీ॥

ఏవమాది గుణైర్యుక్తః శిష్యో భవతి నాన్యథా॥
గురుతా శిష్యతా వాపి తయోర్వత్సర వాసతః॥

శిష్యుఁడు శాంతుఁడు, వినీతుఁడు, శుద్ధమైన మనస్సు కలవాఁడు, శ్రద్ధ కలవాఁడు, చెప్పినది ధారణ చేసికొనఁగలవాఁడు, సమర్థుఁడు, కులీనుఁడు, బుద్ధి కలవాఁడు, సచ్చరిత్రుఁడు, ధనవంతుఁడు ఇట్టి లక్షణములు కలవాఁడుగ నుండ వలయును. గురుత్వము గాని, శిష్యత్వముగాని ఒక్క సంవత్సరము ఒక్కచోట నివాసము చేయుట వలనఁ గలుగును. 'నగురుః స్వాశ్రితం శిష్యం వర్ష మేకం పరీక్షయేత్' అనుటచే శిష్యుని గురువు ఒక సంవత్సరము పరీక్షించి మంత్ర మీయవలెను. ఏలననఁగా శిష్యుఁడు చేసిన పాపము గురువును జెందుచున్నదని శాస్త్రము వచించుచున్నది.

శ్లో॥ రాష్ట్రేచామాత్య జాదోషాః సత్నీపాపాని భర్తరి
తథా శిష్యార్జితం పాపం గురుం ప్రాప్నోతి నిశ్చితమ్॥

మంత్రి దోషములు రాజునకును, భార్యాదోషములు భర్తకును, శిష్యుని పాపము గురువునకును నిశ్చయముగఁ బ్రాప్తించును.

శిష్యుఁడు గురువునకు విరుద్ధమగు నాచారముల నడువరాదు. గురువు విషయమున శిష్యుఁడు నడువ వలసిన విధుల నొక చరిత్రానుసారముగ నీక్రిందఁ జేర్కొనెద. గురువును—

క॥ దూషింపరాదు యితరులు
దూషింపఁగ వినఁగరాదు – దోషంబుల న
న్వేషింపఁగ రాదు విడఁబడి
భాషింపఁగ రాదు గురుని — భక్తుఁడు వెలుచన్॥

మ॥ నరమాత్రుండని చూడరాదు కుమతి న్వెచ్చ్యుండు గారాదు సం
కర కార్యంబులు సేయరాదు మదిలో గర్వింపఁగారాదు దు
ష్కర యుక్తిన్ బరికింపరా దతని ధూష్షన్నిం(బఁగారాదు మ
త్సరముం బట్టగరాదు సద్గురునిపై సద్భక్తుఁడై యుండినన్.

ఉ॥ నేరములుండెనేని గడు నింద యొనర్పఁగ రాదు తా నహం
కారముతో నొకింత యుపకారము సేయఁగరాదు వంచనన్

గౌరవమార్చి నల్గురిలో - కాలులు బల్కఁగరాదు నిక్కి ని
ష్ఠూరము సేయరాదు భువి - సద్గురు నాథుని పైన శిష్యుఁడున్.

సీ॥ గురుఁడేగు దెంచినఁ - గూర్చుండఁగా రాదు
కూర్చున్న యెడఁబాసి - కూడరాదు
పనులాజ్ఞ చేసినఁ - బరిహరింపఁగ రాదు
సేయవద్దను పనుల్ - సేయరాదు
బోధింప విడనాడి - పోరాదు బోధింపఁ
బడకున్న నిర్బంధ - పఱుపరాదు
దయ ననుగ్రహమీయఁ - దడవు సేయఁగ రాదు
తడవైనఁ దత్తర - పడఁగరాదు

గీ॥ ఒంటి శయ్యాసనంబున - నుండరాదు
స్నాన భోజనములు ముందు - సలుపరాదు
వినయ భయభక్తు లెదలోన - విడువరాదు
గురుని సేవించు పరమ భ - క్తునకు వత్స !

ఆ॥ గురుఁడు సుముఖుఁడైన - పరతత్త్వమును గాంచి
ముక్తి జెందు; గురుఁడు - మున్ను గురుని
సుముఖతయు గలింగి - నూఱెరాజర్షులు
బ్రహ్మఋషులు మోక్ష - పదవిఁగనుట.

ఉ॥ ఎచ్చట సద్గురుండు వసి-యించి సుఖంబుగ వెల్గుచుండ రా
నచ్చట కాశి గంగయు ప్ర-యాగ గయాదులు విశ్వనాయకుం
డచ్చట వారిధు ల్సరసు - లచ్చటనే యమునా సరస్వతుల్
నచ్చట సర్వతీర్థములు - నచ్చట దేవతి లొప్పుచుండెడున్.

వ. అట్లు గావున.

క॥ గురు పదములు సేవింపుచు
గురు వాక్యము నమ్మికొనుచు - గురునుతి గొనుచున్
గురు మంత్రము జపియించుచు
గురు సన్నిధి నుండవలయు - గురుభక్తుండున్.

క॥ అజ్ఞాన మూల నాశన
మజ్ఞ జనన మరణ కర్మ - హరణంబగు నా
త్మ జ్ఞాన గురు పదాంబువు
లాజ్ఞా నార్ధమయి గ్రోల - నసువై యుండున్.

ఆ॥ గురు పదాంబు జంబుఁ - గొని యభిషేకంబుఁ
జేసి తజ్జలంబు - శిరము నందుఁ
జల్లుకొనుచుఁ గ్రోలు - సద్భక్తుఁ డఖిల తీ
ర్థముల గ్రుంకు ఫలము - తానె పొందు.

క॥ గురు పద సందర్శనమున
గురు పద జలపానమునను - గురుపద పూజన్
గురు పద వినుతులఁ ద్రిజగ
ద్గురు పద సంప్రాప్తియగును - గురుభక్తునకున్॥

సీ॥ ఆచార్య పాద పద్మార్చనంబే జగ
దాచార్య పాద పద్మార్చనంబు
దేశిక మంత్రోప దేశమే వైకుంఠ
దేశిక మంత్రోప దేశికంబు
గురు సుప్రసాదాను కూలనంబే బ్రహ్మ
గురు సుప్రసాదాను కూలనంబు
సద్గురు నామ సంస్మరణంబె బుధహృల్ల
సద్గురు నామ సంస్మరణ తతియు

గీ॥ గురు తనూతత్త్వ భావనా పరత దేవ
గురు తనూతత్త్వ భావనా పరత యగుట
గురు తరంబైన మోక్షంబు కొదువ బడునె
గురువరుని జేరి యున్న భక్తునకుఁ దలఁప. — శుకచరిత్రము.

శ్లో॥ గురోః శయ్యాసనే యానం పాదుకాంపుక పీఠకమ్
స్నానోదకం తథా ఛాయాం లంఘయేన్న కదాచన॥

శ్లో॥ గురోరగ్రే పృథక్పూజా మద్వైతం చ పరిత్యజేత్
దీక్షాం వ్యాఖ్యాం ప్రభుత్వాది గురోరగ్రే వివర్జయేత్॥
— దేవ్యాగమము.

గురువు యొక్క శయ్యను, ఆసనమును, వాహనమును, పాదుకలను, ఉత్తరీయమును, పీటను, స్నానజలమును, నీడను నెన్నటికిని దాఁటరాదు. గురు సమక్షమున వేఱుపూజను, అద్వైతమును బరిత్యజింప వలయును. ఇతరులకు దీక్ష నిచ్చుట, వ్యాఖ్యానించుట, పెత్తనముచేయుట మొదలగునవి గురు సమక్షమున విడువ వలయును.

గురువునకుఁ జతుర్విధ శుశ్రూషలు గావింప వలయును. ౧. స్థానశుశ్రూష ౨. తనూశుశ్రూష ౩. భావశుశ్రూష ౪. ఆత్మశుశ్రూష.

## ౧. స్థాన శుశ్రూష.

గీ॥ స్థాన శుశ్రూషయన నిజాచార్య వరుల
కున్న గృహములు క్షేత్రంబు లుపవనంబు
లాదిగాఁ గల్గినవి యెల్ల ననవరతము
బ్రోది సేయుచు నరయుచు బ్రోచుటొప్పు.

వేయేల? ఆయన చెప్పిన పనులన్నియుఁ జేయవలయును.

## ౨. తనూ శుశ్రూష.

క॥ తను శుశ్రూష యనన్ గురు
తనువున కిష్టంబు గాఁగఁ దగినట్లర్ఘ్యం
గన మాతిథ్యము మొదలుగ
ఘనోపచారము లొనర్పఁ గనుగొనుటొప్పున్.

## ౩. భావ శుశ్రూష.

గీ॥ భావ శుశ్రూష యన నిజ భావమునను
దల్లియును దండ్రియును దాత దైవమేడు
గడయు నాచార్యవరుఁడని విడువకెపుడుఁ
గోరి భావించుటయు నొప్పుఁ గుటిల ముడిగి.

## ౪. ఆత్మ శుశ్రూష

గీ॥ ఆత్మ శుశ్రూషయన విను మరసి గురువు
లెవ్విగోరిన మదిలోన నెఱిఁగి భక్తి

పనర నవియెల్ల యడుగక మును పెతెచ్చి
వారి కనుకూల మొందింప వలయుటొప్పు.

ఇంతియగాక గురువడిగిన వస్తువుల నన్నిటిని సమర్పించుచు తన శక్తి కొలఁది గురువును బూజించుచుండ వలయును. తనకున్న సమస్తమును గురువున కర్పింప వలయును. దానిని గురుప్రసాదముగ గుర్వాజ్ఞచే ననుభవించుచుండ వలయును.

క॥ వినినం గురు మాహాత్మ్యమె
వినవలె, కన్గొనిన గురుని - విగ్రహమే క
న్గొనవలె మేన ధరించినఁ
దన గురు పదధూళి మేన - ధరియింపనగున్.

గీ॥ అనుభవించిన గురుని మహాప్రసాద
మనుభవింపఁగ వలయు మూర్కొనిన గురునిఁ
బూజఁజేసిన నిర్మాల్య పుష్పతతుల
మూర్కొనఁగ వలయును మది ముదము తోడ॥

క॥ వచియించిన గురుమంత్రమె
వచియింపఁగ వలయుఁ బెక్కునరుసల నెపుడున్
రచియించిన గురుసేవలె
రచియింపఁగ వలయుఁ బగలు రాత్రియు భక్తిన్.

ఆ॥ నడువ గురు ప్రదక్షిణంబుగా నడువంగ
వలయుఁ దలఁప గురుని వాక్యములు ది
లంప వలయు నిశ్చయింప సద్గురుఁడె వి
శ్వేశుఁడంచు నిశ్చయింప వలయు.

క॥ స్నానము సంధ్యయు జపమును
ధ్యానము దానంబు దేవతార్చన మాత్మ
జ్ఞానము మోక్షము మొదలగు
నా నిఖిలంబెల్ల గురుఁడె యని కనవలయున్.

క॥ గురు భార్యను గురుపుత్రుల
గురు సుతలన్ గురుని సఖుల గురుబాంధవులన్

గురువులఁ జూచిన యట్ల నె
గురుభావన జేయవలయు గురుతర భక్తిక్. — శుకచరిత్రము.

పైన చెప్పినవన్నియు నాచరింపఁగల శిష్యుఁ డుత్తమ సిద్ధిని, సద్గతిని బొందును. శ్రద్ధాభక్తుల కొలఁది ఫలము ప్రాప్తించును. గురువునే పరబ్రహ్మగా భావించి పూజించినను ముక్తి లభించును. ఈ విషయమున నారాయణస్వామి వారి వాక్యమును స్మరించుఁడు.

'భక్తి భక్త భగవంత గురు నామ చార్ వపు ఏక్'

భక్తి, భక్తుఁడు, భగవంతుఁడు, గురువు ఈ నాలుగు పేరులు వేఱు వేఱుగా నున్నవి కాని శరీరమొక్కటే.

## గురువు

పైఁజెప్పిన లక్షణములు కల శిష్యుఁడు సద్గురువును ఆశ్రయింపవలయును. సద్గురు లక్షణములు తెలిసినఁగాని గురువు నాశ్రయించుట తటస్థింపదు. గురువు లేక విద్య పట్టుపడదు. 'గురువులేని విద్య కూడదెన్నటికి' అను సామెత కలదు కదా! ఆధ్యాత్మిక విద్యకు గురువు చాల అవసరము. గురువు లేక విద్యారహస్యములు బోధపడవు. కేవలము బాహ్యశబ్దార్థమును దెలిసికొన్న మాత్రముచే విద్య పట్టుపడినదని భావింపరాదు. 'ఏవిద్యకైన గురువులేకున్న నావిద్య పట్టుపడదు. కావునను నభ్యాసికి_సద్గురువు_కావలెను నారాయణా' గురువు విద్యలో నంతర్భూతమై యున్న నిగూఢ రహస్యములను తన్ను ఆశ్రయించిన శిష్యునకుఁ బ్రసాదించును. ఆచార్యుఁడు లేనిది జ్ఞానము లభింపదు.

శ్లో॥ ఆచార్యః ప్లావితా తస్య జ్ఞానం ప్లవ ఇహోచ్యతే

ఆచార్యుఁడు నావికుఁడు. జ్ఞానము తెప్ప. జ్ఞానమను తెప్పను నాశ్రయించిన నాచార్యుఁ డనుగ్రహించి ఆవలకు దాఁటవేయును.

శ్లో॥ అనేక శాస్త్రం బహువేదితవ్యం
అల్పశ్చ కాలో బహవశ్చ విఘ్నాః
తత్సార భూతం సముపాసి తవ్యం
హంసో యథాక్షీర మివాంబు మిశ్రమ్॥

తెలియఁ దగిన శాస్త్రము లనేకములు. కాల మల్పము. విఘ్నము లధికము. హంస కలిసియున్న పాలను నీటిని వేఱుగావించి పాలనే గ్రహించినట్లు గ్రంథములలో సారభూతమైన దానినే గ్రహింపవలయును.

'ఆచార్యాద్దేవ విద్యా విదితా సాధిష్ఠం ప్రాపత్'
ఆచార్యుని వలన నేర్చిన విద్యయే సాధువైనది.

శ్లో॥ చక్షుర్గమ్యం గురుం త్యక్త్వా శాస్త్రగమ్యంస్తు యత్స్మరేత్
హస్తస్థ ముదకం త్యక్త్వా ఘనస్థ మభినాంఛతి॥

కనుల కగపడు గురుని వదలి శాస్త్రముల నెవఁడు స్మరించునో వాఁడు చేతిలోని నీటిని వదలిపెట్టి మేఘములోని నీటిని గోరినవాఁడగుచున్నాఁడు.

శాస్త్రములలోని రహస్యమును గ్రహించి సారము నేటిపెట్టుకొనిన గురువు నాశ్రయించి యావిషయమును దెలిసికొనిన నన్ని గ్రంథములు చదివి శ్రమపడవలసిన పనిలేదు. కావున విద్యగాని, జ్ఞానముగాని, భక్తిగాని, యోగముగాని, మంత్రముగాని మ ఱేవిద్యయైనను గానిందు అభ్యసింపవలయు ననిన నాచార్యుఁడుండి తీరవలయును.

## గురు శబ్దార్థము

గురు శబ్దమున కర్థము తెలిసికొనినవాఁడు గురువ నెట్టివాఁడో తెలిసికొనఁగలఁడు.

'గృణాతి, ఉపదిశతి ధర్మమితి గురుః'
'గిరత్వ జ్ఞానమితి గురుః'
'యద్వాగీర్యతే స్తూయతే దేవగంధర్వాదిభిరితి గురుః'

పై యుత్పత్తులను బట్టి ధర్మమును నుపదేశించువాఁడును, అజ్ఞానమును, బోఁగొట్టువాఁడును, దేవగంధర్వాదులచే స్తోత్రము చేయఁబడువాఁడు గురువు.

శ్లో॥ గు శబ్దస్త్వంధకారస్స్యాత్ రు శబ్దస్త న్నిరోధకః
అంధకార నిరోధిత్వా ద్గురురిత్య భి ధీయతే॥

'గు' అనఁగా నంధకారము. 'రు' కారము దాని నిరోధించుటకు పేరు అజ్ఞానాంధకారమును బోఁగొట్టు వాఁడు కావున గురువని పిలువఁబడుచున్నాఁడు.

శ్లో॥ గుకారశ్చ గుణాతీతో రుకారో రూప వర్జితః
గుణాతీత మరూపంచ యత్తత్త్వం స గురుః స్మృతః॥

గుకార మనఁగా గుణాతీతము. రుకార మనఁగా రూపరహితము. నిరాకారమును గుణాతీతమైన తత్త్వమే గురుతత్త్వము. అనఁగా కేవలము పరబ్రహ్మతత్త్వమే గురుతత్త్వము. 'గు' అనఁగా సర్వసిద్ధుల నొసఁగువాఁ డనియు, 'రు' కారము పాపనాశకుఁడనియు నర్థమిచ్చును.

'గు' అనఁగా జ్ఞానము. 'ర' కారము తత్త్వప్రకాశకము. 'ఉ' కారము ఆత్మతాదాత్మ్యప్రదమని తంత్రశాస్త్రార్థము.

ప్రకృత విషయమున శ్రీరామ మంత్రమును, మంత్రార్థమును బాగు గాఁ దెలిసినవాఁడును, మంత్రమహిమ నెఱిఁగి దానిని బొందినవాఁడును, మంత్రానుష్ఠాన పరుఁడును, మంత్రోపదేశముచేఁ బరమార్థ తత్త్వజ్ఞానమును బ్రసాదింపఁ గలవాఁడు నిజమైన గురువు.

## గురు లక్షణములు

శ్లో॥ వేత్తా సకల ధర్మాణాం, శాస్త్రేషు పరినిష్ఠకః,
సత్యవాక్ మితభుక్ జ్ఞానీ కలావాన్ ద్విజవంశకః॥

సత్కర్మనిష్ఠో ధర్మాణా ముపదేష్టా సు బుద్ధిదః,
యోగాభ్యాస కలాభిజ్ఞో యోగవాన్ సమదర్శనః॥

కృతకర్మా తీర్థసేవీ ధర్మాధర్మ వివేచకః,
బ్రహ్మచారీ గృహస్థోవా వానప్రస్థాశ్రమీ యతిః॥

స్వాశ్రమాచార సన్నిష్ఠో బుద్ధిమాన్ విజితేంద్రియః,
క్షమీ కృపాళుర్మృదు వాక్ సుముఖ స్సౌమ్యదర్శనః॥

అనిద్రశ్చ సముద్యోగీ శాంతాత్మా పరతోషకృత్,
ఔదార్యవాన్ జ్ఞాననిష్ఠః శుచిస్త్యక్త పరిగ్రహః॥

ఇత్యాది గుణయుక్తో య స్సగురుః పరమోత్తమః॥

— ఆనంద రామాయణము.

సకల ధర్మముల నెఱిఁగినవాఁడును, శాస్త్రములందు విచక్షణుఁడును, సత్యసంధుఁడును, మితముగా భుజించు వాఁడును, జ్ఞానియు, కలావంతుఁడును, బ్రాహ్మణుఁడును, సత్కర్మానుష్ఠాన పరుఁడును, ధర్మోపదేశము చేయు వాఁడును, సద్బుద్ధి నొసంగు వాఁడును, యోగాభ్యాస కళను బాగుగా నెఱిఁగినవాఁడును, యోగియు, సమదర్శనుఁడును, కృతకృత్యుఁడును, తీర్థయాత్రలు సేవించినవాఁడును, ధర్మమేదియో అధర్మమేదియో బాగుగానెఱిఁగిన వాఁడును, ఆతఁడు బ్రహ్మచారి యగుఁగాక, గృహస్థు అగుఁగాక వానప్రస్థుఁడగుగాక, యతి యగుఁగాక యే యాశ్రమమందున్నాఁడో ఆ యాశ్రమ నిష్ఠను జక్కఁగా జరుపువాఁడును, బుద్ధిమంతుఁడును, ఇంద్రియములను జయించిన వాఁడును, ఓర్పుఁగలవాఁడును, కృప జూపువాఁడును, మృదువుగఁ బల్కువాఁడును, సుముఖునుగ నుండువాఁడును, చల్లని చూపులఁ జూచువాఁడును, నిద్రాలస్యములు లేనివాఁడును, ఎల్లప్పుడు భగవంతుని గనుగొనవలయునను బ్రయత్నములో నుండువాఁడును, శాంతమైన మనస్సు గలవాఁడును, పరులను సంతోష పెట్టువాఁడును, ఉదారవంతుఁడును, జ్ఞాననిష్ఠ కలవాఁడును, పరిశుద్ధుఁడును, అపరిగ్రహుఁడుగ నున్నవాఁడు గురువులలో నుత్తమోత్తముఁడని చెప్పఁబడును.

శ్లో॥ దేవతోపాసక శ్శాంతో విషయేష్వతి నిస్పృహః,
అధ్యాత్మ విద్బ్రహ్మ వాదీ వేదశాస్త్రార్థకోవిదః॥
ఉద్ధర్తుం చైవ సంహర్తుం సమర్థో బ్రాహ్మణోత్తమః,
అభిజ్ఞో యంత్రమంత్రాణాం మర్మ భేత్తా రహస్యవిత్॥
పురశ్చరణ కృచ్ఛుద్ధో మంత్రసిద్ధః ప్రయోగవిత్,
తపస్వీ సత్యవాదీచ గృహస్థో గురురుచ్యతే॥ —ఆగస్త్య సంహిత.

దేవతోపాసకుఁడును, శాంతుఁడును, విషయములం దత్యంత విముఖుఁడును, అధ్యాత్మజ్ఞానము కలవాఁడును, బ్రహ్మజ్ఞానము కలవాఁడును, వేద శాస్త్రముల నెఱిఁగిన వాఁడును, ఉద్ధరించుటకైనను సంహరించుటకైనను సమర్థత కలవాఁడును, బ్రాహ్మణ శ్రేష్ఠుఁడును, యంత్రమంత్ర రహస్యముల నెఱిఁగిన వాఁడును, మర్మముల నాశము చేయువాఁడును, గోప్యవిషయ జ్ఞానము కలవాఁడును, పురశ్చరణ మొనర్చినవాఁడును, శుద్ధుఁడును, మంత్ర సిద్ధిని బొందినవాఁడును, మంత్రప్రయోగము నెఱిఁగినవాఁడును, తపస్వియు సత్యము పలుకువాఁడును, గృహస్థుఁడైన వాఁడును గురు వనఁబడు చున్నాఁడు

శ్లో॥ భగవద్ధ్యాన యోగోక్తి వందనస్తుతి కీర్తనైః,
లబ్ధాత్మా తద్గత ప్రాణ మనోబుద్ధీంద్రియ క్రియాః॥
ఆచార్యో వేదసంపన్నో విష్ణుభక్తో విమత్సరః,
మంత్రజ్ఞో మంత్రభక్తశ్చ సదా మంత్రాశ్రయ శ్శుచిః॥
గురుభక్తి సమాయుక్తః పురాణజ్ఞో విశేషతః,
ఏవం లక్షణసంపన్నో గురురిత్యభిధీయతే॥

—. అద్వయతారకోపనిషత్తు.

భగవద్ధ్యానయోగముచే ఆలాప వందన స్తుతి కీర్తనాదులచే నాత్మవంతుఁడైనవాఁడును, తదధీన ప్రాణ మనో బుద్ధీంద్రియ కర్మలు కలవాడును, వేద సంపన్నుఁడును, విష్ణుభక్తుఁడును, మచ్చరము లేనివాఁడును, మంత్రము నెఱిఁగిన వాఁడును, మంత్రమునందు విశ్వాసము కలవాఁడును,సదా మంత్రాశ్రయుఁడును, పరిశుద్ధుఁడును, గురువునందు భక్తి కలవాఁడును, విశేషించి పురాణముల నెఱిఁగిన వాఁడును, గురువని చెప్పఁబడు చున్నాఁడు

శ్లో॥ శాంతో దాంతః కులీనశ్చ వినీతః శుద్ధవేషవాన్,
సదాచారః సుప్రసిద్ధః శుచిర్దక్షః సుబుద్ధిమాన్॥
ఆశ్రమీ ధ్యాన నిష్ఠశ్చ మంత్రతంత్ర విచక్షణః,
నిగ్రహానుగ్రహే శక్తో గురురిత్యభిధీయతే॥

బాహ్యేంద్రియ నిగ్రహమును, అంతరింద్రియ నిగ్రహమును గలవాఁడును కులీఁడును, అనఁగా నుత్తమ కులమునఁ బుట్టినవాఁడును, అణఁకువ గలవాఁడును, మంచి వేషమును ధరించిన వాఁడును, శాస్త్రీయమగు నాచారమున నడుచువాఁడును, మిక్కిలి ప్రసిద్ధి కలవాఁడును, పవిత్రుఁడును, సమర్థుఁడును, బుద్ధిమంతుఁడును, నాల్గు ఆశ్రమములలో నేదియో ఒక ఆశ్రమమున నుండు వాఁడును, ధ్యాననిష్ఠుఁడును, మంత్రతంత్రములను బాగుగాఁ దెలిసినవాఁడును, నిగ్రహానుగ్రహ సమర్థుఁడు నగువాఁడు గురువనఁబడు చున్నాఁడు.

శ్లో॥ ఆచార్యో వేద సంపన్నో విష్ణు భక్తో విమత్సరః,
మంత్రజ్ఞో మంత్ర భక్తశ్చ సదా మంత్రాశ్రయశ్శుచిః॥
సత్సంప్రదాయ సంయుక్తో బ్రహ్మవిద్యా విశారదః,
అనన్య సాధనశ్చైవ తథాఽనన్య ప్రయోజనః॥

బ్రాహ్మణో వీతరాగశ్చ క్రోధలోభ వివర్జితః,
సద్వృత్తో శాసితాచైవ ముముక్షుః పరమార్థవిత్ ॥

ఏవమాది గుణోపేత ఆచార్యస్స ఉదాహృతః॥

వేద సంపన్నుడును, విష్ణుభక్తుడును, మత్సరము లేనివాడును, మంత్రముల నెఱిగినవాడును, మంత్రమందు భక్తికలవాడును, సర్వదా మంత్రమునే ఆశ్రయించిన వాడును, పరిశుద్ధుడును, మంచి సంప్రదాయము కలవాడును, బ్రహ్మవిద్యా విశారదుడును, ఇతర సాధన ప్రయోజనములు లేని వాడును, బ్రాహ్మణుడును, వైరాగ్యము కగవాడును, కామ క్రోధ లోభాదులు లేనివాడును, మంచి నడవడియందు శిక్షణ పొందినవాడును మోక్షమందు కోరిక గలవాడును, పరమార్థ విదుడు నైనవా డాచార్య పదమున కర్హుడు,

ఈ క్రింది లక్షణములు కలవాడు గురువుగానుండ నర్హుడు కాడు.

శ్లో॥ క్రోధీ కుష్ఠీ మహారోగీ మలినో నిర్ఘృణో జడః,
అపండితో నిందకశ్చ లోలుపో విషయాతురః॥

దాంభికో గర్వసంయుక్తః పాపాత్మా దుష్టవంశజః,
ఘాతీ పరద్రోహకర్తా పరద్రవ్యాప హారకః॥

అజితాత్మా వేదబాహ్యః పరదార రతస్సదా,
పరదోషారోపకశ్చ కృపణశ్చా జితేంద్రియః॥

వేద దేవ ద్విజానాం చ యతి తీర్థగవా మపి,
తులసీ వహ్ని సూర్యాణాం ద్వేష్టా యోగ్యో గురుర్నహి॥

— ఆనంద రామాయణము

క్రోధము కలవాడును, కుష్ఠురోగియు, క్షయాది మహా రోగములు కలవాడును, మలినుడును, నిర్దయుడును, మూర్ఖుడును, పండితుడు కాని వాడును, దూషించువాడును, విషయలోలుడును, విషయాసక్తుడును, బడాయిలు కొట్టువాడును, గర్వయుక్తుడును, పాపబుద్ధి కలవాడును, చెడ్డవంశములో బుట్టినవాడును, హింస చేయువాడును, పరులను వంచించు వాడును, పరస్వత్వాపహారకుడును, జితేంద్రియుడు కానివాడును, వేద

బాహ్యుడును, జారుడును, పరులయందు దోషముల నారోపించువాడును, లోభియు, నింద్రియముల జయింపనివాడును, వేదములను, దేవతలను, బ్రాహ్మణులను, యతులను, తీర్థములను, గోవులను, తులసిని, అగ్నిని, సూర్యుని ద్వేషించువాడు గురువుగ నుండ దగడు.

## గురువుగానుండ నధికారులు

శ్లో॥ ఉత్తమో బ్రాహ్మణః ప్రోక్తో మధ్యమో క్షత్రియ స్తథా
అధమో వైశ్య ఇత్యుక్త స్సర్వ శాస్త్రార్థ వేదిభిః॥
అధమాచ్యుత వైశ్యస్య శూద్రస్యాపి గురుర్భవేత్
మధ్యమో మధ్యమస్యాపి తథా వైశ్యస్య కేశవ।
శూద్రస్యాపి గురుః ప్రోక్త శ్శుశ్రూషో రాత్మవేదిభిః
ఉత్తమో బ్రాహ్మణ స్యాపి క్షత్రియస్య తథైవచ॥
విశాం శూద్రస్య శుశ్రూషో ర్గురు రి త్యుచ్యతే మయా
శూద్రాణాంచ తథా స్త్రీణాం గురుత్వం న కదాచన॥

— సూత సంహిత.

గురువులలో నుత్తముడు బ్రాహ్మణుడు. మధ్యముడు క్షత్రియుడు. అధముడు వైశ్యుడు. వైశ్యుడు వైశ్యశూద్రులకును, క్షత్రియుడు క్షత్రియ వైశ్య శూద్రులకును, బ్రాహ్మణుడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులకును గురువుగా నుండ నర్హులుకారు.

బ్రాహ్మణులలో గురువు లైదురకములు. బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థుడు, యతి, అతివర్ణాశ్రమి.

శ్లో॥ బ్రహ్మచారీ గృహస్థస్య వనస్థస్య యతేరపి
విద్యోత్కర్ష బలేనైవ గురుర్భవతి నాన్యథా॥
గృహస్థోఽపి వనస్థస్య యతేరప్యంబుజేక్షణ !
విద్యోత్కర్ష బలేనైవ గురుర్భవతి నాన్యథా॥

వానప్రస్థాశ్రమస్థోఽపి తథా సన్న్యాసినాం హరే
విద్యోత్కర్ష బలేనైవ గురుర్భవతి నాన్యథా॥
అతి వర్ణాశ్రమీ ప్రోక్తో గురుస్సర్వాధి కారిణామ్॥

— సూత సంహిత.

జ్ఞానోత్కర్షముచే బ్రహ్మచారి గృహస్థ వానప్రస్థ సన్న్యాసులకును, గృహస్థుఁడు వానప్రస్థ సన్న్యాసులకును, వానప్రస్థుఁడు సన్న్యాసికిని గురువు కావచ్చును. అతి వర్ణాశ్రమి యగు వాఁడందఱకును గురువు కావచ్చును.

'అతి వర్ణాశ్రమీ సాక్షాద్గురూణాం గురురుచ్యతే' అని చెప్పుటచే అతి వర్ణాశ్రమి యగువాఁడు గురువులకు గురువు. అట్టి అతి వర్ణాశ్రమియొక్క లక్షణముల నిచ్చట తెలిసికొనుట అవసరమని తోఁచుచున్నది. గ్రంథవిస్తర భీతిచే సంస్కృతశ్లోకము లిచ్చట నుప్పృతము కావింపఁబడుట లేదు.

## అతి వర్ణాశ్రమి లక్షణములు

శరీరేంద్రియములకు భిన్నుఁడును, సర్వసాక్షియు, పరమార్థైక విజ్ఞానుఁడును, సుఖాత్ముఁడును, స్వయంప్రకాశుఁడును, పరతత్త్వము నెఱిఁగిన వాఁడును, వేదాంతవాక్య విచారణముచే నాత్మయగు నీశ్వరుని దెలిసికొనిన వాడును, జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలనుండి విడివడిన వాఁడును, ఈ యవస్థా త్రయమునకు సాక్షీభూతుఁడును, వర్ణాశ్రమములు దేహమునకు సంబంధించినవే గాని ఆత్మకు లేవని తెలిసికొనిన వాఁడును, నెల్లప్పు డాత్మబుద్ధితో నుండు వాఁడును భాస్కరుని సన్నిధిలో సర్వలోకము చలించుచున్నట్లు భగవత్సన్నిధిచే నంతయు జరుగుచున్నదని తెలిసికొనిన వాఁడును, సువర్ణ మనేకములగు నాభరణములై వివిధ నామరూపములను జెందినట్లు భగవంతుఁడే తనమాయచే నీ విశ్వముగ నైనాడని తెలిసికొనిన వాఁడును, ముత్యపు చిప్పయందు వెండి తోఁచినట్లు భగవంతుని యందు మహదాది జగన్మాయామయము ఆయన వలనఁ గల్పింపఁబడిన దని యెఱిఁగిన వాఁడును, బ్రాహ్మణ, గో, గజ, శ్వాన, శ్వప చాదులందు సమానమగు నాత్మబుద్ధి కలవాఁడును, ఈ అన్నింటిలో నాకాశము వలె దేనిని అంటక ఆత్మయున్నదని గ్రహించినవాఁడును, స్వప్నములో స్వమాయచే నిర్మితమైన ప్రపంచమట్లు జాగ్రతలోను స్వమాయచే నీప్రపంచమంతయు

నిర్మితమైనదని భావించువాఁడును, స్వాత్మ దర్శనము వలన స్వవర్ణాశ్రమాచార ములను మఱచినవాఁడును, నేను అనునది దేహము, యింద్రియములు, ప్రాణము, మనస్సు బుద్ధి, అహంకారము, చిత్తము, మాయ, పంచభూతాత్మికమైన జగత్తు, కర్త, భోక్త, భోజయిత యిత్యాదులు కావనియుఁ గేవలము సచ్చిదా నంద బ్రహ్మమని గుర్తెఱిఁగినవాఁడును, నీటిలోఁ బ్రతిబింబించిన సూర్యుఁడు నీరు కదలినప్పుడు అతఁడుకూడ కదలినట్లు తోఁచును. అట్లే అహంకారముచే నన్నియు నారోపితము గావించుకొని నేను ఫలాని వర్ణము వాఁడను, ఫలాని ఆశ్రమములో నున్నవాఁడనని యజ్ఞానముచే భావించుచుండెనని తెలిసికొన్న వాఁడును, ప్రపంచములోని జనులందఱును భగవద్విషయమున నిద్రించుచుఁ బ్రాపంచికముగ మేల్కొనియున్నారు; జ్ఞాని అట్లుగాక అందఱు భగవద్విష యమున నిద్రించుచుండఁ గాను మేల్కొనియు, నందఱు ప్రపంచ విషయముల మేల్కొనియుండఁ దాను నిద్రించుచున్నాఁడు,

శ్లో॥ యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః॥

— గీత.

(ఇది గాక సూతసంహితావ్యాఖ్యానమున శ్రీ విద్యారణ్యస్వాములవారు 'తత్త్వ స్వరూపే జనా నిత్యం సుప్తాస్తత్ర సంయమి నిత్యం ప్రబుద్ధః, యత్ర దృశ్య ప్రపంచే లోకాః ప్రబుద్ధాః తత్ర విద్వాన్ సుషుప్తః' అని వ్రాసినారు. దీని అర్థము పైనఁగలదు.) పైలక్షణములు కలవాఁడును, అద్వయమును, నిర్వి కల్ప, నిరంజన, నిత్య, శుద్ధ, నిరాభాస, చిన్మాత్ర, పరామృతము నెఱిఁగి యను భవముఁ జెందువాఁడును అతివర్ణాశ్రమి అనఁబడును. ఇట్టి లక్షణములు గల గురువు దొఱకుట దుర్లభము. దొఱకిన నదృష్టమును వర్ణింప నలవికాదు.

## గురుశుశ్రూష

గురుని సామాన్య మానవుఁడని భావింపరాదు. విగ్రహమును శిలయని తలఁపరాదు.

శ్లో॥ యోవిష్ణోః ప్రతిమాకారో - లోహబుద్ధిం కరోతిచ
యో గురౌ మానుషం భావ ముభౌ నరక పాతినౌ॥

ప్రతిమాకారుఁడైన విష్ణువునందు లోహబుద్ధియు, గురువునందు నరుఁడను భావమును నుంచువారు ఉభయులును నరకమున గూలుదురు.

'ఆచార్యో బ్రహ్మణో మూర్తిః' ఆచార్యుఁడు పరబ్రహ్మయొక్క స్వరూపము. అని మనువు పలికినాఁడు.

'యస్య దేవే పరా భక్తి ర్యథా దేవే తథా గురౌ' ఎట్టి పరమభక్తి తన దేవుని పైఁగలదో తన గురువు నందట్టి భక్తి యుంచవలయును.

శ్లో॥ యథా గురు స్తథైవేశో యథైవేశ స్తథా గురుః
పూజనీయో మహాభక్త్యా న భేదో విద్యతేఽనయోః॥

— శివపురాణము _ కైలాససంహిత.

గురువు నెట్లో అట్లే భగవంతుని, భగవంతు నెట్లో అట్లే గురువును మహాభక్తితోఁ బూజింప వలయును. వీరిద్దరకు భేదము లేదు.

అందుకనియే భగవంతుఁడు 'ఆచార్యం మాం విజానీయాత్ నావమన్యేత కర్హిచిత్' ఆచార్యుని నన్నుగాఁ దెలిసికొనవలెను. ఆతని నెప్పుడు నవమానింపరాదు.

'ఆచార్యం సంశ్రయేత్పూర్వం, మదాశ్రయణ సిద్ధయే' నా సాన్నిధ్య లాభ మాసించువాఁడు మునుముం దాచార్యు నాశ్రయింప వలయును: అని పలికెను.

కావున శిష్యుఁడగువాఁడు గురువును సాక్షాత్తుగఁ దన యిష్టదైవముగ భావింపవలయును. ఆయనకుఁ జతుర్విధ శుశ్రూషలు కావింపవలయును. 'గురుశుశ్రూషయా త్వేవ బ్రహ్మలోకం సమశ్నుతే' అని మనువు పలికినాఁడు.అనఁగా గురు శుశ్రూషవలననే బ్రహ్మలోకంబును బొందుచున్నాఁడు.

శ్లో॥ ఆ సమాప్తే శ్శరీరస్య యస్తు శుశ్రూషతే గురుం
స గచ్ఛత్యంజసా విప్రో బ్రహ్మణస్సద్మ శాశ్వతమ్॥

—. మనుస్మృతి. అ. ౨ శ్లో॥ ౨౪౪

శరీరము నశించు దనుక నెవఁడు గురుశుశ్రూష నొనరించునో, అతఁడు తప్పక శాశ్వతమగు బ్రహ్మలోకము నొందుచున్నాఁడు.

శుశ్రూషలు నాల్గు విధములు. ౧. స్థాన శుశ్రూష ౨. తనూ శుశ్రూష లేక అంగ శుశ్రూష ౩. భావ శుశ్రూష ౪. ఆత్మ శుశ్రూష.

## ౧. స్థాన శుశ్రూష.

స్థాన శుశ్రూష యనఁగా గురువునకుఁగల గృహములు, మందిరములు, ఆరామములు, క్షేత్రములు మొదలగువాటిని సంరక్షించుచు వానిని వృద్ధిలోనికిఁ గొనివచ్చుచు తాను గష్టపడి చేసియు, చేయించియు, నందు వచ్చు నాదాయమును గురునకు సక్రమముగ సమర్పించి భక్తి చూపుచుండుట.

## ౨. అంగశుశ్రూష.

అంగశుశ్రూష యనఁగా గురుని భౌతిక శరీరమునకు సమస్తోపచారములు చేయుటయును, అభ్యంగనాదుల నొనర్చుటయును, ఆతిథ్యము నొసంగి శారీరకముగ నన్ని సేవలు చేయుట.

## ౩. భావశుశ్రూష.

భావశుశ్రూష యనఁగా దన మనస్సులో గురువే తల్లియుఁ, దండ్రియు, దైవము, దాత, ప్రభువు వేయేల సర్వస్వ మతఁడేనని భావించుట.

## ౪. ఆత్మశుశ్రూష.

ఆత్మ శుశ్రూష యనఁగా గురువునకుఁ గావలసినవి యెల్ల నాతఁ డడుగక మునుపే గ్రహించి వాటిని సమకూర్చుటకు ఆత్మశుశ్రూష యని పేరు.

యథార్థముగ గురుభక్తున కేసాధనయు నవసరము లేదు. గురువునకుఁ బ్రపత్తి కావించిన నాతఁడే అనుగ్రహించి మోక్షమొసంగఁ గలఁడు. చీఁకటిని దాఁటి గమ్యస్థానము చేరుటకు మనము కరజ్యోతిని సంపాదింపలేకున్నను అది కలవాని నాశ్రయించిన నాతనితోఁగూడి గమ్యస్థానము చేరవచ్చును. అట్లే జ్ఞానజ్యోతిని కలుగురువు నాశ్రయించిన నజ్ఞానాంధకారమును దాఁటుటలో నేవిధమగు సందేహమును లేదు.

# గురుసాన్నిధ్యమునఁ బ్రవర్తనము

మనువు గురుసన్నిధానమున శిష్యుఁడు మెలఁగవలసిన విధమునుగూర్చి యిట్లు చెప్పినాఁడు.

శ్లో॥ హీనాన్న వస్త్ర వేషస్యా త్సర్వదా గురు సన్నిధౌ,
ఉత్తిష్ఠే ప్రథమం చాస్య చరమం చైవ సంవిశేత్॥

ప్రతి శ్రవణ సంభాషే శయానో న సమాచరేత్,
నాసీనో నచ భుంజానో నతిష్ఠన్న పరాఙ్ముఖః॥

ఆసీనస్య స్థితః కుర్యా దభిగచ్ఛంస్తు తిష్ఠతః,
ప్రత్యుద్గమ్య త్వా వ్రజతః పశ్చాద్ధావస్తు ధావతః॥

పరాఙ్ముఖ స్యాభిముఖో దూరస్థస్యై త్యచాంతికమ్,
ప్రణమ్యతు శయానస్య నిదేశేచైవ తిష్ఠతః॥

నీచశయ్యాసనం చాస్య సర్వదా గురు సన్నిధౌ,
గురోస్తు చక్షుర్విషయే న యథేష్టాసనో భవేత్॥

నోదాహరే దస్యనామ పరోక్షమపి కేవలమ్,
నచైవాస్యాను కుర్వీత గతి భాషిత చేష్టితమ్॥

గురోర్యత్ర పరీవాదో నిందావాపి ప్రవర్తతే,
కర్ణౌ తత్రాపి ధాతవ్యౌ గంతవ్యం వాతతోఽన్యతః॥

పరీవాదాత్ ఖరో భవతి శ్వావై భవతి నిందకః,
పరిభోక్తా క్రిమిర్భవతి కీటో భవతి మత్సరీ॥

దూరస్థో నార్చయే దేనం నక్రుద్ధో నాంతికే స్త్రియాః,
యానాసనస్థశ్చైవైనం మవరుహ్యాభి వాదయేత్॥

ప్రతివాతేఽను వాతేచ నాసీత గురుణాసహ,
అసంశ్రవే చైవ గురో ర్నకించి దపి కీర్తయేత్॥

గోఽశ్వోష్ట్ర యాన ప్రాసాద ప్రస్తరేషు కటేషు చ,
ఆసీత గురుణా సార్ధం శిలా ఫలక నౌషుచ॥

గురోర్గురౌ సన్నిహితే గురువద్వృత్తి మాచరేత్,
నచానిసృష్టో గురుణా స్వాన్ గురూ నభివాదయేత్॥

విద్యాగురు ష్వేతదేవ నిత్యావృత్తిః స్వయోనిషు,
ప్రతిషేధత్సు చాధర్మా న్హితం చోపదిశత్స్వపి॥

శ్రేయస్సు గురువ ద్వృత్తిం నిత్యమేవ సమాచరేత్
గురుపుత్రేషు చార్యేషు గురోశ్చైవ స్వబంధుషు॥

— మనుస్మృతి. ౨ అ. శ్లో. ౧౯౮_౨౦౭

గురు సన్నిధానమందు గురువుకంటె హీనమగు ఆహారమును, బట్టలను, వేషమును గలవాఁడై యుండవలయును. గురువునకంటె ముందు నిద్ర లేవవలయును. ఆతఁడు నిద్రించిన పిమ్మట నిద్రింప వలయును. శిష్యుఁడు పరుండిగాని, కూర్చుండిగాని, భుజించుచుగాని, పెడమోముతో నుండికాని గురువు మాటకు బదులు మాటలాడుచు గాని, ముచ్చట లాడుటకాని చేయరాదు. గురువు ఆసనమునఁ గూర్చుండి ఆజ్ఞ నిచ్చునెడల శిష్యుఁడు తాను నిలువఁబడియు, నిలువఁబడి యాజ్ఞాపించినఁ దా నెదురేగియు, వచ్చుచును నిచ్చునెడలఁ దా నెదుర్కొనియుఁ, బరుగిడుచు నిచ్చునెడలఁ దాను వెంబడి పరుగిడుచును, దేని నైన గ్రహించుటగాని సంభాషించుట గాని చేయవలయును. పెడమోముతో నున్నచోఁ దానెదురేగియు, దవ్వున నున్నచోఁ దాను దగ్గిఱియుఁ, బరుండి యున్నచో నమస్కరించియు, నిలఁబడి యున్నచోఁ దాను దాపున నిలఁబడియు గురువు నాజ్ఞను జేయుటగాని, మాటలాడుటగాని చేయవలయును. శిష్యుఁ డెల్లప్పుడు గురుసన్నిధియందు తగిన యాసనశయనము లందుండవలయును. గురువు కనఁబడు చున్నప్పుడు కాళ్లు చాచుకొని కూర్చుండరాదు. మాగురువుల వారు, మా ఉపాధ్యాయులవారని చెప్పవలయునే కాని గురువు మరుగుననైన గురువుపేరు చెప్పరాదు. గురువువలె నడిచి, మాటలాడి, పనులొనర్చి యాతని వెక్కిరింపరాదు. గురునిపై నపవాదము పెట్టుట, ఆతని దూషించుట యెచ్చట జరుగునో అచ్చటఁ దాఁ జెవులు మూసికొన వలయును. లేదా, వేఱొక తావునకు లేచి పోవలయును. శిష్యుఁడు గురువుపై నపవాదము మోపుటచే గాడిదెగను, గురునిందచేఁ గుక్కగను, గురు ధనానుభవముచేఁ గ్రిమిగను, గురుద్వేషముచేఁ గీటకముగను జన్మించును. శిష్యుఁడు రోగాదులచే నస్వస్థుఁడై యున్నపుడు తప్ప

తక్కిన సమయములందు గురువున కితరులచే శుశ్రూష చేయింపరాదు. తాను దూరముగనుండియు, కోపముతో నున్నప్పుడును, గురువు భార్యాసమేతుఁడై యున్నప్పుడును అతనిని బూజింపరాదు. బండియందు పోవునప్పుడును, పీఠముపైఁ నున్నప్పుడును, అప్పటినుండి దిగి గురువునకు అభివాదనము కావింప వలయును. ఎదురుగాలి వీచునప్పుడును, దిగువగాలి వీచునప్పుడును, గురువుతో సమానాసనములఁ గూర్చుండరాదు. గురువు వినునప్పుడు తనను గూర్చిగాని, ఒరులను గూర్చిగాని యేమియు మాటలాడరాదు. ఎడ్లబండి, గుఱ్ఱపుబండి, ఒంటెలబండి, మేడ, బండ, చాప, రాయి, పలక, నావ వీనిమీఁద మాత్రము గురువుతో సమానముగఁ గూర్చుండ వచ్చును. (అట్లే ఆధునిక యానములగు సైకిలు, మోటారు, రైలుబండి, విమానము మొదలగువాటి మీఁదఁగూడ గురువుతో సమానముగఁ గూర్చుండ వచ్చును.) గురువుయొక్క గురువు దయచేసి నపుడు తన గురువునందువలె నభివాదక్రియ చేయవలయును. అట్లే గురువునింట నుండునప్పుడు తన తల్లిదండ్రులు మొదలగు వారు వచ్చిరేని గురువువలన నాజ్ఞఁ గొనక వారి కభివాదనము చేయరాదు. ఆచార్యుఁడు కాక ఇతరులగు నుపాధ్యాయులందును, తన బంధువులగు పినతండ్రి పెదతండ్రి మున్నగువారి యందును, అధర్మములనుండి నివారించువారియందును, హితములు బోధించువారియందును, నిదే విధముగ నభివాదనము చేయవలయును. విద్యాతపములచే గొప్పవారియందును, తనకంటె పెద్దలగు గురుపుత్రులందును, గురుబంధువులంగును, పితృవ్యుఁడు మొదలగు తన బంధువులందును, గురువునందువలెనే నడుచుకొన వలయును.

గురువున కెన్నటికిని అతఁ డెట్టివాఁడైనను ద్రోహము గావింపరాదు. అది దేవద్రోహముతో సమానమగును.

శ్లో॥ దేవద్రోహం గురుద్రోహం నకుర్యాత్ సర్వయత్నతః
కృత్వా ప్రమాదతో విప్రాః ప్రణవస్యాయుతం జపేత్॥

దేవద్రోహము గురుద్రోహము చేయకుండుటకు సర్వవిధములఁ బ్రయత్నింపవలయును. పొరపాటున నట్లు చేసిన బ్రాహ్మణులు పదివేలు ప్రణవమును జపింపవలయును.

శ్లో॥ కర్మణా మనసా వాచా గురోః క్రోధం నకారయేత్
తస్య క్రోధేన "దహ్యంతే ఆయుః శ్రీజ్ఞాన సత్క్రియాః"॥

మనో వాక్కాయముల గురువునకుఁ గోపము తెప్పింపరాదు. ఆయన కోపముచే శిష్యునియొక్క ఆయువు, సంపత్తు, జ్ఞానము, సత్కర్మలు నశించును.

గురువును సంతోషపెట్టిన ఆయన ఈయలేని దొక్కటియును లేదు.

శ్లో॥ చింతామణి ర్లోకసుఖం సురద్రుః స్వర్గసంపదమ్
ప్రయచ్ఛతి గురుః ప్రీతో వైకుంఠం యోగి దుర్లభమ్॥

— భాగవతమాహాత్మ్యము.

గురువు ప్రీతిచెందిన ఇహలోక సుఖము లిచ్చుటకు చింతామణివలెను, స్వర్గసుఖము లిచ్చుటకు కల్పవృక్షమువలె నగును. ఇంతయేల యోగి దుర్లభమగు వైకుంఠము నీయఁగలఁడు.

భగవంతుఁడు కోపించినను గురువనుగ్రహించి శిష్యుని రక్షింపఁగలఁడు కాని గురువు కోపించిన భగవంతుఁడైనను వానిని రక్షింపఁజాలఁడు.

అందుకనియే శాస్త్రములు గురువు త్రిమూర్త్యాత్మక స్వరూపుఁడనియుఁ బరబ్రహ్మమేననియు శాస్త్రములు వచించుచున్నవి.

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః
న గురోరధికః కశ్చిత్ త్రిషులోకేషు విద్యతే॥

గురువే బ్రహ్మ, గురువే విష్ణువు, గురువే మహేశ్వరుఁడు. గురువును మించినవాఁడీ మూఁడు లోకములలో నింకొకఁడు లేఁడు.

శ్లో॥ ధ్యానమూలం గురోర్మూర్తిః పూజామూలం గురోః పదమ్
మంత్రమూలం గురోర్వాక్యం మోక్షమూలం గురోః కృపా॥

గురుమూలాః క్రియాః సర్వాలోకేఽస్మిన్ కులనాయికే
తస్మాత్సేవ్యో గురుర్నిత్యం సిద్ధ్యర్థం భక్తి సంయుతైః॥

తావదార్తిర్భయం దుఃఖం మోహశోక భ్రమాదయః
యావన్నాయాతి శరణం శ్రీగురుం భక్తివత్సలమ్॥

తావద్భ్రమతి సంసారే సర్వదుఃఖ మలీమసే
యావన్న భజతే భక్త్యా శ్రీగురుం శివరూపిణమ్॥

సర్వసిద్ధిఫలోపేతా మంత్రస్కంధోఽతి శోభనః
గురు ప్రసాద మూలోఽయం పరతత్త్వమహాద్రుమః॥

యథా దదాతి సంతుష్టః ప్రసన్నో వరదో మనుమ్
తథా భక్త్యా ధనైః ప్రాణైర్గురుం యత్నేన తోషయేత్॥

గుర్వర్థం ధారయేత్ప్రాణాన్ గుర్వర్థం చార్థమర్థయేత్
అపి ప్రాణాన్ పరిత్యజ్య గురువాక్యం న లోపయేత్॥

తావదారాధయేచ్ఛిష్యః సుప్రసన్నో యథా భవేత్
గురౌ ప్రసన్నే శిష్యస్య సద్యః పాశక్షయో భవేత్॥

బ్రహ్మవిష్ణు మహేశాద్యా దేవతా మునియోగినః
కుర్వంత్యనుగ్రహం తుష్టా గురౌ తుష్టే న సంశయః॥

భక్త్యా సంతుష్ట గురుణా హ్యుపదిష్టః కృపాలునా
కర్మ ముక్తో భవేచ్ఛిష్యో భుక్తిముక్త్యోః సభాజనమ్॥

శిష్యేణాపి తదా గ్రాహ్యం యదా సంతోషితో గురుః
తస్మాద్గురోః ప్రియం కుర్యా న్మనోవాక్కాయ కర్మభిః॥

యదివా పరితుష్టేన గురుణా యత్ర కుత్ర చిత్
ముక్తోఽసీతి సమాదిష్టః సోఽపి ముక్తో భవేత్ప్రియే॥

గురు భక్తి విహీనస్య తపో విద్యా వ్రతం కులమ్
నిష్ఫలం హి కులేశాని! కేవలం లోకరంజనమ్॥

గురుభక్త్యాఖ్య దహన దగ్ధం దుర్జాతి కల్మషమ్
శ్వపచోఽపి పరైః పూజ్యో న విద్వానపి నాస్తికః॥

ధర్మార్థ కామైః కిం తస్య మోక్షస్తస్య కరే స్థితః
సర్వార్థైః శ్రీగురోర్దేవి! యస్యభక్తిః స్థిరా సదా॥

లక్ష్మీనారాయణౌ వాణీధాతారౌ గిరిజా శివౌ
శ్రీగురుం గురుపత్నీంచ పితరావితి చింతయేత్॥

గురుభక్త్యా యథాదేవి! ప్రాప్యంతే సర్వసిద్ధయః
యజ్ఞదాన తపస్తీర్థ వ్రతాద్యైర్న తథాప్రియే॥

శ్రీగురౌ నిశ్చలా భక్తిర్వర్ధతే హి యథాయథా
తథాతథాస్య విజ్ఞానం వర్ధతే కులనాయికే॥
కిం తీర్థాద్యైర్మహాయాసైః కిం వ్రతైః కాయశోషణైః
నిర్వ్యాజసేవా దేవేశి భక్త్యేషాం హి సద్గురౌ॥
కాయక్లేశేన మహతా తపసా వాపి యత్ఫలమ్
తత్ఫలం లభతే దేవి సుఖేన గురుసేవయా॥

భోగమోక్షార్థినాం బ్రహ్మ విష్ణ్వీశపదకాంక్షిణామ్
భక్తిరేవ గురౌ దేవి! నాన్యః పంథా ఇతి శ్రుతిః॥

గురౌ మనుష్య బుద్ధించ మంత్రే చాక్షర బుద్ధికామ్
ప్రతిమాసు శిలాబుద్ధిం కుర్వాణో నరకం వ్రజేత్॥

గురుం న మర్త్య బుధ్యేత యది బుధ్యేత తస్య తు
కదాపి న భవేత్సిద్ధి ర్మంత్రైర్వా దేవతార్చనైః॥
శ్రీగురుం ప్రాకృతైః సార్ధం యే స్మరంతివదంతి వా
తేషాం హి సుకృతం సర్వం పాతకం భవతి ప్రియే॥
గురుః పితా గురుర్మాతా గురుర్దేవో గురుర్గతిః
శివే రుష్టే గురుస్త్రాతా గురౌ రుష్టే శివో నహి॥
గురోర్హితం హి కర్తవ్యం వాఙ్మనః కాయకర్మభిః
అహితాచరణాద్దేవి! విష్ఠాయాం జాయతే కృమిః
శరీర విత్త ప్రాణాంశ్చ శ్రీగురోర్వంచయంతి యే
కృమి కీట పతం గత్వం ప్రాప్నువంతి నరాధమాః॥
గురుత్యాగాద్భవేన్మృత్యుర్మంత్ర త్యాగా ద్దరిద్రతా,
గురుమంత్ర పరిత్యాగా ద్రౌరవం నరకం వ్రజేత్॥
గుర్వర్థం ధారయేద్దేహం తదర్థం ధనమార్జయేత్,
నిజప్రాణాన్ పరిత్యజ్య గురుకార్యం సమాచరేత్॥
గురూక్తే పౌరుషం వాక్యమాశిషం చింతయేత్ప్రియే!
తేన సంతాడితే వాపి ప్రసాదమితి సంస్మరేత్॥

భోగయోగ్యాని వస్తూని గురవే సర్వమర్పయేత్,
తచ్ఛేషమితి సంచింత్య చాను భూయాత్కు_లేశ్వరి!॥

గుర్వగ్రే న తపః కుర్యా న్నోపవాస వ్రతాదికమ్,
తీర్థయాత్రాంచ నో కుర్యా న్న స్నాయాదాత్మ శుద్ధయే॥

న నియోగం గురోర్దద్యా ద్యుష్మాకమితి భాషయేత్,
ఋణదానం తథాదానం వస్తూనాం క్రయ విక్రయమ్॥

నకుర్యా ద్గురుభిః సార్థం శిష్యో భూత్వా కదాచన,
న కుర్యా న్నాస్తికై ర్వాక్యైః సంభాషణ మపీశ్వరి॥

స యాతి నరకం ఘోరం సాపూజా నిష్ఫలా భవేత్,
శిరసా న వహేద్భారం గురు పాదాబ్జ ధారిణమ్॥

ఆత్మసత్సర్వభూతేషు హితం కుర్యాత్కు_లేశ్వరి!,
ఆత్మస్థానాంగ సద్భావైః శుశ్రూషా స్యాచ్చతుర్విధా॥

శుశ్రూషయానయా దేవి! శిష్యః సంతోషయేద్గురుమ్,
పదే పదేఽశ్వమేధస్య ఫలంప్రాప్నోత్యసంశయమ్॥

శుశ్రూషణ పరో యస్తు గురుదేవ మహాత్మనామ్,
కేవలం గురుశుశ్రూషా తత్కృపాకారిణీ ప్రియే!॥

సద్భక్తి సహితా సా చేత్సర్వ కామ ఫలప్రదా,
క్షీయంతే సర్వపాపాని వర్ధంతే పుణ్యరాశయః॥

సిద్ధ్యంతి సర్వకార్యాణి గురుశుశ్రూషయా ప్రియే!,
యద్యదాత్మహితం వస్తు తత్తద్ధితం న వంచయేత్॥

గురుదేవార్చకో యస్తు తస్యపుణ్యం న గణ్యతే,
భక్త్యా విత్తానుసారేణ గురుముద్దిశ్య యత్కృతమ్॥

స్వల్పం వా బహు వా పుణ్యం తుల్యమాఢ్యదరిద్రయోః,
సర్వస్వమపి యోదద్యాద్గురవే భక్తి వర్జితః॥

శిష్యో న ఫలమాప్నోతి భక్తి రేవహి కారణమ్,
తస్మిన్ ద్రవ్యే గురోరస్తి స్పృహా నానుభవేచ్చ తత్॥

ఆవశ్యం యది వాంఛా స్యాదనుభూయాత్త దాజ్ఞయా,
యస్తిలార్థం తదర్థం వా గురుస్వముపజీవతి॥

లోభాన్మోహాత్స పచ్యేత నరకే చ త్రిసప్తకే,
అల్పా డల్పం గురు ద్రవ్య మదత్తం స్వీకరోతి యః॥

తిరశ్చాం యోనిమాపన్నః క్రవ్యాదైర్భక్ష్యతే! ప్రియే,
గురు ద్రవ్యాభిలాషీచ గురు స్త్రీ గమనోత్సుకః॥

పతితస్య క్షుల్లకస్య ప్రాయశ్చిత్తం న విద్యతే,
ఆజ్ఞా భంగోఽర్థ గ్రహణం గురోరప్రియ వర్తనమ్॥

గురుద్రోహ మిదం ప్రాహుర్యః కరోతి స పాతకీ
స్వద్రవ్య వినియోగం చ నానివేద్య గురోశ్చరేత్॥

అనివేద్య తు యః కుర్యాత్స భవేద్బ్రహ్మ ఘాతకః
గురుస్థానం సంప్రదాయం తద్ధర్మం యో వినాశయేత్॥

గురుభిః స బహిః కార్యో దండ్యో వధ్యశ్చ పాతకీ
గురు కోపాన్న నాశోఽన్యో గురుద్రోహాన్న పాతకమ్॥

న మృతిర్గురు నిందాయా గుర్వనిష్టాన్న చాపదః
జీవేదగ్ని ప్రవిష్టో వా నరః పీత విషోఽపి వా॥

మృత్యు హస్తగతో వాపి నాపరాధకరో గురోః
యత్ర శ్రీగురు నిందా స్యా త్పిధాయ శ్రవణౌ స్వకౌ॥
సద్యస్తస్మాదపక్రామేద్దూరం న శృణు యాద్యథా
గురోర్నామ జపేత్పశ్చా చ్ఛ్రవణే సా ప్రతిక్రియా॥
గురుమిత్ర సుహృద్దాసీ దాసా ద్యాన్నావ మానయేత్
న నిందే దన్య సమయాన్ వేదశాస్త్రా గమాదికాన్॥

శ్రీగురోః పాదుకా భూషా గురునామ స్మృతిర్జపః
గుర్వాజ్ఞా కరణం కృత్యం శుశ్రూషా భజనం గురోః॥

వివిక్తు క్లేశ సం శాంత చిత్తోఽతి భక్తిమాన్
వ్యజనం పాదుకాం ఛత్రం చామరం వాహనాదికమ్॥

తాంబూల ముల్బణం వేషముత్సృజ్య ప్రవిశేచ్ఛనైః
హాసనం పాదుకాం ఛత్రమాసనం వసనాదికమ్॥

దృష్ట్వా గురోర్నమస్కుర్యా న్నాత్మభోగాయ కారయేత్
పాదప్రక్షాలనం స్నాన మభ్యంగం దంత ధావనమ్॥

మూత్రం నిష్ఠీవనం క్షౌరం శయనం స్త్రీ నిషేవణమ్
వీరాసనం చ దుర్వాక్య మాలస్యం హాస్యరోదనమ్॥

కేశమోచన ముష్ణీషం కంచుకం నగ్నతాం తథా
పాదప్రసారణం వాదం కలహం దూషణం ప్రియే॥

అంగభంగాంగ వాద్యాది కరాస్ఫాలన ధూననమ్
ద్యూత కుక్కుట మల్లాది యుద్ధమిత్యాది చాంబికే॥

గురు యోగి మహాసిద్ధ సిత క్షేత్రాశ్రమేషు చ
నాచరే దాచరే న్మోహా ద్దేవతాశాప మాప్నుయాత్॥

ఉపచారం వినా తిష్ఠేద్గుర్వగ్రే నేచ్ఛయా విశేత్
కృతాంజలి పుటో భూత్వా ప్రవిశేద్గుర్వాజ్ఞయా విశేత్॥

ముఖాపలోకీ సేవేత తదుక్తం చ సమాచరేత్
గురూక్తానుక్త కార్యేషు నోపేక్షాం కారయేత్ప్రియే॥

సదసద్వా గురు ర్బ్రూయా త్తత్కార్య మవిశంకయా
నిగ్రహానుగ్రహే వాపి గురుః సర్వస్య కారణమ్॥

నిగ్రహం యద్గురో ర్యుక్తా త్స్వర్గం శాస్త్రం తదుచ్యతే
గురుకార్యే స్వయం శక్తో నాపరం ప్రేషయేత్ప్రియే !॥

బహుత్వే తత్పరైర్భక్త్యైః సహితో ఽప్యతి భక్తిమాన్
గచ్ఛం స్తిష్ఠ న్స్వపన్ జాగ్రజ్జపన్ జుహ్వన్ ప్రపూజయేత్॥

గుర్వాజ్ఞామేవ కుర్వీత తద్గతే నాంతరాత్మనా,
అభిమానో నకర్తవ్యో జాతి విద్యాధనాదిభిః॥

యదాఽర్చ్యా నివసేన్నిత్యం శిష్యః శ్రీగురు సన్నిధౌ,
కాయాభూతో పరిత్యాగి వినీమస్త్వతి భక్తిమాన్॥

దేవి! గుర్వగ్రతస్తిష్ఠేద్గురుకార్య సముత్సుకః,
స్వకార్యమన్య కార్యంవా శిష్యః శ్రీగురు చిత్తవిత్॥

గురు పార్శ్వ గతో నమ్రః పృచ్ఛన్ స్వామివ సంవదేత్,
సామాన్యతో నిషేవేచ్చేత్సద్గురోర్యది సంనిధౌ॥

ఆచరేద్యది మూఢాత్మా దోషః కోటిగుణో భవేత్,
అనాహత్య గురోర్వాక్యం శృణుయాద్యః పరాఙ్ముఖః॥

అహితం వా హితం వాపి రౌరవం నరకం వ్రజేత్,
గోబ్రాహ్మణ వధం కృత్వా యత్పాపం సమవాప్నుయాత్॥

తత్పాపం సమవాప్నోతి గుర్వగ్రేఽనృత భాషణాత్,
స్థానాంతరాకృతే చార్థవ్యసనే విషమే స్థితమ్॥

శ్రీ గురుం న త్యజేత్త్వాపి తదాదిష్టో వ్రజేత్ప్రియే!,
అధఃస్థితే గురావూర్ధ్వం న తిష్ఠేత కదాచన॥

న గచ్ఛే దగ్రతస్తస్య న విశేదుత్థితే గురౌ,
శక్తిచ్ఛాయాం గురుచ్ఛాయాం దేవచ్ఛాయాం న లంఘయేత్॥

స్వచ్ఛాయాం తేషు నో కుర్యా న్నస్వపే ద్గురుసన్నిధౌ,
భాషణం పఠనం గానం భోజనం శయనాదికమ్॥

అనాదిష్టో న కుర్వీతి నత్వా వందనపూర్వమ్,
బ్రహ్మహత్యాశతం కుర్యాద్గుర్వాజ్ఞాం ప్రతి పాలయేత్॥

జాతివిద్యాధనాఢ్యో వా దూరే దృష్ట్వా గురుం సదా,
దండప్రణామం కృత్వైక స్త్రిః ప్రదక్షిణ మాచరేత్॥

తతస్త్రిషట్ ద్వాదశ వా జ్యేష్ఠాది ష్వేక మేవ చ,
గురు తద్గురు యోగే తు వందేత పరమం గురుమ్॥

తతో నమే ద్గురుం సోఽపి గుర్వగ్రే తం నివారయేత్,
ప్ర గురోః సన్నిధౌ శిష్యః స్వగురుం మనసా నమేత్॥

గురోః ప్రణామ త్రితయం జ్యేష్ఠానామేక మేవచ,
పూజ్యానా మంజలిస్తద్వద న్యేషాం వాక్యవందనమ్॥

దేవాన్ గురూన్ కులాచార్యాన్ జ్ఞానవృద్ధాన్ స్తపోధనాన్,
విద్యాధికాన్ స్వకర్మస్థాన్ ప్రణమేత్కులనాయికే॥

అనివేద్య గురోర్భుక్తే యస్త్వేక గ్రామ సంస్థితః.
అమేధ్యం తేన భుక్తంస్యాచ్ఛూకరో జాయతే మృతః॥

ఏక గ్రామ స్థితః శిష్య స్త్రి సంధ్యం ప్రణవేద్గురుమ్
క్రోశమాత్ర స్థితో భక్త్యా గురుం ప్రతిదినం నమేత్॥

అర్ధ యోజనగః శిష్యః ప్రణమే త్పంచ పర్వసు
ఏకయోజన మారభ్య యోజన ద్వాదశావధి॥

దూరదేశ స్థితః శిష్యో భక్త్యా తత్సన్నిధిం గతః
తత్తద్యోజన సంఖ్యాత మాసైర్గత్వా నమేద్గురుమ్॥

అతి దూరస్థితః శిష్యో యదేచ్ఛా స్యాత్తదా వ్రజేత్
రిక్తహస్తస్తు నోపేయాద్రాజానం దైవతం గురుమ్॥

ఫలపుష్పాంబరాదీని యథా శక్త్యా సమర్పయేత్
ఏవం యో నాచరేద్దేవి! బ్రహ్మరాక్షసతాం వ్రజేత్॥

గురుశక్తిశ్చ తత్పుత్రో జ్యేష్ఠభ్రాతా గురోః సమః
... ... ... ... ॥
యదా త్వాచార్య రూపేణ స్వాత్మానం సంప్రకాశయేత్
అభ్యుత్థాన ప్రణామాద్యై స్తోషదః స్యాత్తదా ప్రియే॥

— కులార్ణవము.

## అర్థము

ధ్యానమునకు మూలము గురుస్వరూపము. గురువు పాదములు పూజకు మూలము, గురువాక్యము మంత్రమునకు మూలము, గురుకృప మోక్షమునకు మూలము. ఈ లోకములో సమస్త కర్మలకు గురువే మూలము. కావున సిద్ధి కలుగవలెనని భక్తితో గూడుకొని నిత్యము గురువును సేవింపవలయును. భక్తి తత్పరుడగు గురువును శరణు చొచ్చినంతవరకే ఆర్తి, భయము, దుఃఖము, మోహము, శోకము, భ్రమ మొదలగునవి కల్గును. పరమేశ్వర స్వరూపుడగు

గురువును భజింపనంతవఱకే సర్వదుఃఖమయమగు సంసారమునఁ దిరుగుచుండును. పరతత్త్వమను మహావృక్షమునకు గురుప్రసాదము మూలము. అంకురము బోధే మంత్రము. సర్వసిద్ధులు ఫలములు. గురువు సంతోషించి, ప్రసన్నుఁడై మంత్రమిచ్చురీతిగ భక్తితో ధనప్రాణముల నొసంగి ఆతనిని ప్రయత్న పూర్వకముగ సంతోషపెట్టవలయును. గురువు కొఱకు ప్రాణములు ధరింపవలయును. గురువు కొఱకు ధనమడుగ వలయును. చివరకు ప్రాణములైన విడిచియైన గురువాక్యమునకు లోపము రానీయరాదు. గురువు ప్రసన్నుఁడగు వఱకు శిష్యుఁడు ఆరాధింపవలయును. గురువు ప్రసన్నుఁడయ్యెనా వెంటనే శిష్యుని సంసారపాశము నశించినట్లే. గురువు సంతోషించెనా బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, దేవతలు,మునులు, యోగులు నిస్సంశయముగ ననుగ్రహింతురు. భక్తిచేయుటచే గురువు సంతోషించి కృపచే నుపదేశించును. అంతనా శిష్యుఁడు కర్మవిముక్తిని జెందును. అట్టి శిష్యుఁడు భుక్తిముక్తులకు యోగ్యుఁడగును. గురువు సంతోషించు వఱకు శిష్యుఁడు చేయవలసియుండును. కావున మనోవాక్కాయకర్మలతో గురువునకుఁ బ్రియమొనర్పవలయును. ఎట్లో గురువు పరితుష్టిని జెంది 'ముక్తుఁడవైతి'వని యనెనా ఆతఁడు ముక్తుఁడైనట్లే. గురుభక్తి లేనివానియొక్క తపస్సు, విద్య, వ్రతములు, కులము ఇవన్నియు నిష్ఫలములే. ఇవి కేవలము లోకరంజనమునకే కాఁగలవు. గురుభక్తి యను అగ్నిచే దుర్జాతి కల్మషము దగ్ధమగును. అట్టి గురుభక్తిగల చండాలుఁడైనను పూజ్యుఁడే. విద్వాంసుఁడైనను నాస్తికుఁడు పూజ్యుఁడుకాఁడు. గురుభక్తి గలవానికి ధర్మార్థకామములేమి మోక్షమే వానికి అఱచేతిలో నుండును. గురుభక్తి స్థిరమైయుండెనా సర్వార్థములు వానికి లభించినట్లే. గురువును గురుభార్యను లక్ష్మీనారాయణులు గాను, వాణీ హిరణ్యగర్భులు గాను, పార్వతీ పరమేశ్వరులు గాను తల్లిదండ్రులగాను జూడవలయును. గురుభక్తి వలన సర్వ సిద్ధులు లభించునట్లు యజ్ఞ, దాన, తపముల వలనను, తీర్థయాత్రలవలనను, వ్రతాదులవలనను లభింపవు. గురువునందు భక్తి అభివృద్ధి చెందు కొలఁది విజ్ఞానము కూడ అభివృద్ధి చెందుచుండును. మహా ఆయాసముతోఁ గూడిన తీర్థయాత్రాదులేల? దేహమును శోషింపఁ జేసికొను వ్రతాదులేల? నిష్కారణముగ గురువునకుఁ జేసిన భక్తియే వాటికంటె నుత్తమమైనది. దేహమును శుష్కింపఁజేసి చేసిన గొప్ప తపస్సుచే నెట్టి ఫలము లభించునో అట్టి ఫలము సుఖముగ గురుసేవచేతనే లభించును. భోగమోక్షముల నాశించువారును,వైకుంఠ, కైలాసపదవులను గాంక్షించు

వారును కేవలము గురుభక్తియే యొనర్పవలయును. అంతకంటె నింకొకమార్గము లేదని శాస్త్రములు చెప్పుచున్నవి. గురువునందు మనుష్యుఁడను బుద్ధియు, మంత్రమునందు అక్షరబుద్ధియు, ప్రతిమయందు తాలుయను బుద్ధియుఁ గలవాఁడు నరకమును బొందును. గురువును మానవుఁడని యను కొనరాదు. అట్లనుకొనెనా వానికి మంత్రములచేఁగాని దేవపూజలచేఁగాని సిద్ధికలుగదు. గురువును ప్రాకృత మానవునివలె స్మరించినను, అట్లు పలికినను వాని సుకృతమంతయుఁ బాపముగ నగును. గురువే తండ్రి. గురువే తల్లి. గురువే దేవుఁడు. గురువే గతి. భగవంతుఁ డలిగెనా గురువు రక్షింపఁగలఁడు. గురుఁడలిగెనా భగవంతుఁడు రక్షింపఁ జాలఁడు. మనోవాక్కాయముల గురువునకు హితమే చేయవలయును. గురువు నకు అహితమొనర్చెనా మలములో పురుగై పుట్టును. తను ధన ప్రాణముల గురు వును వంచించిన నరాధములు క్రిములుగను, కీటకములుగను, పతంగములుగను బుట్టుదురు. గురువును ద్యజించుట వలన మృత్యువును, మంత్రమును ద్యజించుట వలన దారిద్ర్యమును, గురువును మంత్రమును వదలుట వలన రౌరవ నరకమును బొందును. ఈ శరీరమును గురువుకొఱకే ధరింపవలయును. గురువుకొఱకే ధనము నార్జింపవలయును. తన ప్రాణములను వదలియైన గురుకార్యమును నెర వేర్పవలయును. గురు వేదైన పరుషవాక్యమును బలికెనా అది ఆశీర్వచనముగ భావింపవలయును. ఆతఁడు కొట్టెనా అది గురుప్రసాదముగ భావింపవలయును. భోగ యోగ్యములగు వస్తువులను గురువునకు సమర్పింపవలయును మిగిలిన వస్తువు లను బ్రసాదశేషముగ భావించి యనుభవింపవలయును. గురుసన్నిధానమునఁ దపమొనర్పరాదు. ఉపవాసవ్రతములు చేయరాదు. తీర్థయాత్రలు చేయరాదు. ఆత్మశుద్ధికొఱకు స్నానాదులు చేయరాదు. గురువును 'నీవీపని చేయు'మని నియమింపరాదు. మీరు, తమరు, అని సంబోధింప వలయును. గురువునకు బుఋ మీయరాదు. దాస మొసంగరాదు. వస్తువులు క్రయవిక్రయ మొనర్చరాదు. గురువుతో నాస్తిక వాక్యములు పలుకరాదు. నాస్తిక సంభాషణ మొనర్ప రాదు. అట్లు చేయువాఁడు ఘోరనరకము పాలగును. వాని పూజ నిష్ఫల మగును. గురు పాదాబ్జములను ధరించినవాఁడు నెత్తిన వేఱు భారము నెత్తు కొనరాదు. ఆత్మహితము నెట్లు కోరుకొనునో సర్వభూతహితము నట్లే కోర వలయును. ఆత్మ శుశ్రూష, స్థాన శుశ్రూష, అంగశుశ్రూష, భావశుశ్రూష యని శుశ్రూషలు నాలుగు విధములు. ఈ చతుర్విధ శుశ్రూషలచే గురువును

సంతోషపెట్టవలయును. ఇట్లు శుశ్రూషలు కావించుచో నిస్సంశయముగ పద పదమునకు అశ్వమేధ ఫలము లభింపఁగలదు. మహాత్ముఁడగు గురుదేవుని శుశ్రూష యందు నిమగ్నుఁడైనవానికి కేవలము గురుశుశ్రూష వలననే భగవత్కృప కలుగఁగలదు. ఉత్తమ భక్తితో సేవించునెడల సమస్తకోరికలు నెఱవేఱఁగలవు. సమస్తపాపములు నశింపఁగలవు. పుణ్యరాశులు వృద్ధి పొందఁ గలవు. గురు శుశ్రూషచే సమస్తకార్యములు సిద్ధింపఁగలవు. శిష్యునకేది హితమో దానిని గురువునకు హితముగఁ దలఁచి సమర్పింపవలయును. వంచింపరాదు. గురుదేవుని బూజించువాని పుణ్యమును లెక్కింప సాధ్యముకాదు. తన శక్తికొలఁది భక్తితో గురునిగూర్చి యేమి యొసర్చిననుఅది స్వల్పమగుఁగాక, బహుళమగు గాక ధనవంతునకును, దరిద్రునకును ఫలము సమానమే.

భక్తిలేక గురువునకు సర్వస్వ మర్పించినను శిష్యునకు ఫలములేదు. భక్తియే ముఖ్యము. గురువున కర్పించిన ద్రవ్యము గురువుది. దాని విషయమున తనకు స్పృహయైన నుండరాదు. ఒకవేళ దాని ననుభవింప దలఁచుచో గుర్వాజ్ఞచే ననుభవింపవలయును. నువ్వుగింజంతయైన గాని, దానిలో సగముగాని గురుద్రవ్యమును లోభముచేఁగాని, మోహముచేఁగాని అనుభవించెనా ఆతఁ డిరువదొక్క నరకముల యాతన ననుభవించును ఏ అల్పద్రవ్యమునైన గురుస్వమును ఆయన యిచ్చకుండ గ్రహించెనా తిర్యగ్యోనియందు జనించి మాంసాశను లచే భక్షింపఁబడును. గురుద్రవ్య మపహరింపఁ దలఁచువాఁడును, గురుభార్యాగమనము చేయఁదలఁచువాఁడు నను నిట్టి పతితులకుఁ బ్రాయశ్చిత్తము లేదు. గురుని ఆజ్ఞను భంగపఱచుటయును, ఆతని ద్రవ్యమును గ్రహించుటయును, గురువున కిష్టముకాని రీతిగ వర్తించుటయును గురుద్రోహమగును. ఇట్లు చేయు వాఁడు పాతకి. తన ద్రవ్యమునైనను గురువునకుఁ జెప్పక వినియోగించెనా అట్టి వాఁడు బ్రహ్మఘాతకుఁ డగును. గురుస్థానము యొక్క సంప్రదాయమును, ధర్మము నెవఁడు వినాశము కావించునో ఆతనిని గురువులు బహిష్కరింపవల యును. అట్టివాఁడు దండ్యుఁడు. వధ్యుఁడు. పాతకి. గురువు కోపము కంటె నాశనము లేదు. గురుద్రోహము కంటెఁ బాతకమును లేదు. గురుని నిందించుట కంటె వేఱు మృతి లేదు. గురువున కనిష్టము చేయుటకంటె వేఱు ఆపదలేదు. గురువున కపరాధము కావింపకున్న నగ్నిలోఁబడి జీవింప వచ్చును. విషము దినవచ్చును. మృత్యువాతఁబడి నప్పటికిని గురువున కపకారమొనర్పరాదు. గురు

నింద జరుగుచుండిన చెవులు మూసికొనవలయును. కావున వెంటనే ఆనింద వినఁబడకుండునంత దూరముగ లేచి వెళ్లవలయును. అట్టి నిందావాక్యము వినిన దానికి ప్రతిక్రియగా గురునామమును జపింప వలయును. గురువుయొక్క స్నేహితులను గాని, ప్రాణప్రియులను గాని, దాసీలను గాని, దాసజనమును గాని అవమానింపరాదు. వేదశాస్త్రాగమములను ఇతర సమయములలో నిందింపరాదు. గురువుయొక్క పాదుకలు, ఆభూషణముల గౌరవింపవలెను. గురునామ స్మృతిని, గురునామ జపమును గావింపవలెను. గుర్వాజ్ఞను పాలింపవలయును. గురు శుశ్రూష, గురుభజనము కావింపవలెను.

గురువు సన్నిధానమున వసింప వలయును. శాంతచిత్తుఁడై గురుభక్తి కలిగి యుండవలెను. విసనకఱ్ఱను, పాదుకలను గొడుగును, చామరమును, వాహనాదులను, తాంబూలమును, రాజస వేషమును వీడి మెల్లగా గురువు దగ్గఱకు వెళ్లవలెను. గురువుయొక్క వాహనమును, పాదుకల (పాదరక్షల) ను, గొడుగును, ఆసనమును, వస్త్రములు మొదలగు వాటిని జూడఁగానే గురువును జ్ఞాపకము చేసికొని నమస్కరింపవలయు. పైవస్తువులను తాననుభవించుట కుపయోగించ రాదు. కాళ్లు కడుగుకొనుటయు, స్నానము చేయుటయు, తలంటు పోసికొను టయు, పలుదోముకొనుటయు, మూత్రము విడుచుటయు, ఉమ్మి వేయుటయు, క్షౌరము చేయించుకొనుటయు, పరుండుటయు, స్త్రీతో సంభోగించుటయు, వీరాసనము వేసికొనుటయు, దుర్వాక్యములు పలుకుటయును, సోమరిగ నుండు టయు, హాస్యములు పలుకుటయును, ఏడ్చుటయును, తలవిఱియఁబోసికొనుట యును, చొక్కా తొడుగుకొనుటయు, కంచుకమును ధరించుటయును, దిగంబరి యగుటయు, కాళ్లు చాపుటయును, వాదమొనర్చుటయును, పోట్లాడుటయు, దూషించుటయును, ఒడలు విఱుచుకొనుటయు, శరీరమును చలించుటయును, చేతులు జూపుటయు, నిక్కి నిలుచుండుటయు, జూదమాడుటయును, కోడిపందె ములు వేయుటయును ఇవి గురువు, యోగులు, మహాసిద్ధులయొక్క పీఠ క్షేత్రా దులలోను, ఆశ్రమములందును చేయరాదు. ఒకవేళ నజ్ఞానమునఁ జేసినా దేవతల వలన శాపమును బొందును. ఉచ్చారము చేయక గురుసన్నిధానమున నుండరాదు. ఏపనియు లేక గురువు దగ్గఱకు రారాదు. చేతులు జోడించుకొని గుర్వాజ్ఞచే నాయన దగ్గఱకు మెల్లగాఁ బ్రవేశింపవలయును. గురువు ముఖమును జూచి సేవింపవలయును. అతఁడు చెప్పినట్లు చేయవలయును. గురువు చెప్పిన

కార్యములందుగాని, చెప్పని కార్యములందుగాని ఉపేక్షచేయరాదు. గురువు మంచి చెప్పఁగాక చెడ్డ చెప్పఁగాక శంకలేక ఆకార్యములు చేయవలయును. గురువు నిగ్రహానుగ్రహము లొనర్చుటకు అర్హుఁడు. గురువు నోటివెంట వచ్చినదే శాస్త్రమంతయును, గురుకార్యములు స్వయముగఁ జేయుటకు సమర్థుఁడగునప్పుడు ఆపని ఇంకొకరికిఁ జెప్పరాదు. ఆయనకు సేవచేయు భృత్యులనేకులున్నను, వారు ఫస్తులైనను నడుచుచును, నిలుచుండుచును, నిద్రించుచును, మేల్కొనుచును, హోమము చేయుచును, పూజింపవలయును. మనసా గురువు మీఁదనే యుంచి గుర్వాజ్ఞనే నెఱవేర్ప వలయును. జాత్యభిమానము, విద్యాభిమానము, ధనాభిమానము చెందరాదు. శిష్యుఁడు గురు సన్నిధిలో అర్చకునివలె నుండ వలెను. శరీరాభిమానమును వీడి వినయముతోను, భక్తితోను గురుకార్య నిర్వహణమునందుత్సాహము కలవాఁడై యుండవలయును. స్వకార్యమందుగాని, ఇతరకార్యమందుగాని, శిష్యుఁడు గురుచిత్తమును గ్రహించి మెలఁగ వలయును. శిష్యుఁడు గురువుదగ్గఱకు ప్రక్కగాఁజేరి నమ్రభావముతో స్వాంత విషయము నడిగినట్లుడుగ వలయును. గురుసన్నిధిని సామాన్యముగ మెలఁగి సేవించుచో ఆ మాహాత్మ్యని గుణములు కోటిరెట్లధికమగును. గురువు చెప్పినమాట హితమగుఁ గాక అహితమగుఁగాక అనాదరముగఁ బరాఙ్ముఖముగ వినుచో అట్టి శిష్యుఁడు రౌరవ నరకమును బొందఁగలఁడు. గురువుకడ నసత్యములు పలికినా గోబ్రాహ్మణులను జంపిన నెంతటి పాపము సంభవించునో అంతటి పాపము సంభవింపఁగలదు. ఎక్కడనో గురువు అర్థవ్యసనములో విషముగా నున్నాఁడని గురువును త్యజింపరాదు. ఆతని ఆదేశము ప్రకారమే వెళ్ళవలయును. గురువు క్రింద కూర్చుండఁగాఁ దాను పైనఁ గూర్చుండరాదు. గురువునకు ముందుగా నడువ రాదు. గురువు నిలుచుండి యుండఁగా గూర్చుండరాదు, శక్తి ఛాయను, గురు ఛాయను, దేవఛాయను, దాఁటరాదు. శిష్యుని నీడను గురువు మీఁదకుఁబోనీయ రాదు. గురుసన్నిధిలోఁ బరుండరాదు. సంభాషించుట, పఠనము, గానము, భోజనము, శయనాదులు గురువుచే నాజ్ఞాపింపఁ బడకయు, ఆతనికి వందనాదికము లొనర్పకయుఁ జేయరాదు. నూఱు బ్రహ్మహత్యల నొనర్చియైన గుర్వాజ్ఞను పాలింపవలయును. జాతిలోను, విద్యలోను, ధనములోను గొప్పవారైనప్పటికిని గురువును దూరముగఁ జూచినచో సర్వదా దండప్రణామ మొనరించి మూఁడు ప్రదక్షిణములు చేయవలయును: లేక పదునెనిమిది, లేక పండ్రెండుగాని ప్రదక్షి

ణములు చేయవలెను. తనకంటెం బెద్దవారికి ఒక్క ప్రదక్షిణము చేయవలెను. గురువు యొక్క గురువు లభించెనా పరమ గురువునకు నమస్కరింప వలయును. తర్వాత స్వగురువునకు నమస్కరింపవలయును. గురువుయొక్క గురువుకు గురువును ప్రగురువందురు. వారు లభించెనా వారివద్ద తనగురువును శిష్యుఁడు మనస్సులో ననే నమస్కరింప వలయును. గురువునకు మూఁడు ప్రణామములను, జ్యేష్ఠులకు ఒక్క ప్రణామమును, పూజ్యుల కంజలి ఘటించుటయును, ఇతరులకు వాక్య వందనముచేయ వలయును. సేవకులకును, గురువులకును, కులాచార్యులకును, జ్ఞాన వృద్ధులకును, తపోధనులకును, విద్యాధికులగు స్వకర్మ నిష్ఠాపరులకును నమస్కరింప వలయును. గురుశిష్యులొక్క గ్రామములో నుండఁగా గురువుకు నివేదింప కయు, గురువు తినకయుఁ దాను దినరాదు. అట్లు తినిన మలము దినినట్లే కాఁగ లదు. చచ్చిన తర్వాత పందియై పుట్టఁగలఁడు. ఒకే గ్రామములో నున్న శిష్యుఁడు గురువుకు ముప్పూటల నమస్కరింపవలయును. ఒక క్రోసుదూరములో నుండిన భక్తితో రోజుకు గురువు నొక్కసారి దర్శించి నమస్కరింప వలయును. అఱ ఆమడ దూరములో నుండిన శిష్యుఁడు గురువునకుఁ * పంచ పర్వములలో నమస్కరింప వలయును. శిష్యుఁడు ఒక ఆమడ మొదలు పంద్రెం డామడ దూరములో నుండిన నాతఁడు దూరదేశమున నున్నాఁడు గనుక నాతఁడెన్ని యామడ దూరములో నున్నాఁడో అన్నిమాసముల కొకసారి వెళ్లి గురువును దర్శించి నమస్కరింపవలయును. ఇంకను జాలదూరములో నున్న వాఁడు తనకిష్టమైనప్పుడు వెళ్లనచ్చును. రాజు, దేవుఁడు, గురువు వీరి దగ్గఱకు వెళ్లునప్పుడు వట్టిచేతులతోఁ బోరాదు. ఫలములను గాని, పుష్పములనుగాని, వస్త్రములనుగాని యథాశక్తిగ సమర్పింప వలయును. ఇట్లు వఁడు చేయఁడో ఆతఁడు బ్రహ్మరాక్షసుఁడు కాఁగలఁడు. గురుభార్య, గురుపుత్రుఁడు, పెద్ద అన్న వీరు గురువుతో సమానులు. ఆచార్యరూపమగు గురువెట్లు ఆత్మప్రకాశ మును, ప్రణామాదులచే నున్నతిని బ్రసాదించునో అట్లుచేయకున్న దోషములు లభించుననుటలో సందేహములేదు.

పైన గురువును వీడరాదని యున్నప్పటికిని గుర్వనుజ్ఞచే నెక్కువ విషయములు తెలిసికొనుటకు అనేక గురువుల సేవింపచుచ్చును. కాని మొదట

* పంచపర్వములు:_ పూర్ణిమ, అమావాస్య, పాడ్యమి, అష్టమి

తనకు మంత్రప్రసాద మొనర్చిన గురువును వీడరాదు. ధ్యానసమయమున నుండ వలసిన గురువాతఁడే.

శ్లో॥ అనభిజ్ఞం గురుం ప్రాప్య సంశయచ్ఛేద కారకమ్
గుర్వంతరం తు గత్వా స నైతద్దోషేణ లిప్యతే॥
మధులుబ్ధో యథాభృంగః పుష్పాత్పుష్పాంతరం వ్రజేత్
జ్ఞానలుబ్ధస్తథా శిష్యో గురోర్గుర్వంతరం వ్రజేత్॥

బాగుగాఁ దెలియని గురువును బడసియు, సంశయచ్ఛేద కారకుఁడగు వేఱొక గురువును జేరుటవలన దోషము రాదు. మధులోభముచేఁ దుమ్మెద ఒక పుష్పమునుండి వేరొక పుష్పము కడకుఁబోవునటుల జ్ఞానలుబ్ధుఁడగు శిష్యుఁడు ఒక గురువునుండి మఱియొక గురువుకడకు వెళ్లవచ్చును.

## గురుపూజ

దైవపూజకంటె గురుపూజ చాల ముఖ్యమైనది. గురుని బూజింపక దైవపూజ కావించినను ఫలము లేదు. గురువు సన్నిధానమున లేకున్నను మానసికపూజ కావింప వచ్చును. లేదా గురుస్వరూపమున్న పటమునకుఁగాని, విగ్రహమునకుఁగాని పూజింపవచ్చును. చివరకు గురువును మనసా ధ్యానించి యైనను దైవపూజ గావింపవలెను.

శ్లో॥ గురు పూజా వినాదేవి స్వేష్టపూజాం కరోతియః,
మంత్రస్య తస్య తేజాంసి హరతే భైరవః స్వయమ్॥

— కాళీవిలాస తంత్రము.

గురుపూజను జేయక తన యిష్టదైవపూజను జేయువాని మంత్రతేజమును, వాని తేజమును భైరవుఁడు స్వయముగ హరించును.

దేవపూజా కాలమున గురువేతెంచిన నేమి చేయవలెనను విషయమున శాస్త్రమిట్లు చెప్పుచున్నది.

శ్లో॥ పూజా కాలేచ చార్వంగి ఆగచ్ఛేచ్ఛిష్యమందిరమ్,
గురుర్వా గురుపుత్రో వా పత్నీ వా వరవర్ణినీ॥

తదా పూజాం పరిత్యజ్య పూజయేత్స్వగురుంప్రియే,
దేవతా పూజనార్థయత్ గంధపుష్పాదికంచ యత్॥

తత్సర్వం గురవేదద్యా త్పూజయే న్నగనందిని,
తత్రైవ సహసాదేవి దేవతా ప్రీతిమాప్నుయాత్॥ —రుద్రయామిలము.

పూజాకాలమునందు శిష్యుని యింటికి గురువుగాని, గురు పుత్రుఁడు గాని, గురు పత్ని గాని వచ్చినయెడల, నప్పుడు తాను జేయుచున్న పూజను వదలి గురువును బూజింపవలయును దేవపూజకు సేకరించిన గంధపుష్పాదుల నన్నిటిని గురువున కర్పించి పూజింపవలయును. ఆ గురుపూజచే శీఘ్రముగ దేవుఁడు ప్రీతి చెందును.

భర్త సమక్షమున లేనిది స్త్రీ లొంటరిగ నిట్లు ప్రత్యక్షముగఁ బూజింప నవసరము లేదు. కేవల మాదరించి మానసిక పూజ గావింపవచ్చును. స్త్రీలకు భర్తయే గురువు. భర్తయే దైవము. భర్తయే శాస్త్రము. విధవలు మామ, అత్త, పుత్రుఁడు, సోదరుఁడు వీరిలో నెవరి యధీనమున నామె కలదో వారి యాజ్ఞను బొంది గురుపూజ చేయవలయును.

ఇప్పటికి శిష్యుని లక్షణములు, గురు లక్షణములు, శిష్యుఁడు గురువు వద్ద మెలఁగనలసిన విధానము ఇంతవఱకు తెలిసినవి. ఇఁక మంత్రమునకు సిద్ధాది శోధనము చేయవలెను. శ్రీ రామ మంత్రమున కట్టి శోధన మవసరము లేకున్నను రామమంత్రముతో మంత్రయోగానుష్ఠానము చెప్పఁబడుచున్నది. కావున దెలియుటమంచిది.

## మంత్రము — సిద్ధాది శోధనము

వివాహమునకు యోని పొంతనములు, తారాబల చంద్రబలములు చూచు కొనునట్లు మంత్రమునకును, మంత్రోపాసకునకును ఇట్టి పొంతనమున్నది లేనిది చూచియే గురువు మంత్ర మొసఁగ వలయును. తర్వాత శిష్యుఁడైనఁ జూచుకొన వచ్చును. పరమభక్తి యుక్తుఁడగు శిష్యునకు మంత్ర మీయవలసివచ్చిన నీనియమ మవసరము లేదు. వాని కేమంత్రమిచ్చినను అది సిద్ధమంత్రమే కాఁగలదు. పరా భక్తి స్థితిని జెందిన యాచార్యుఁ డనుగ్రహించి యిచ్చిన మంత్రమున కీ నియ మము లేదు. ఆదియునుగాక చంద్రగ్రహణము, సూర్యగ్రహణము, అర్ధోదయము,

మహోదయము మొదలగు మహాపర్వ దినములలో నీ శుద్ధులు చూడ నవసరములేదు.

శ్లో॥ స్వప్న దత్తం దైవదత్తం స్త్రీదత్తం గురుదత్తకమ్
పితృదత్తం మాతృదత్తం సిద్ధాదీని నశోధయేత్॥
పీఠత్రయాణి మంత్రాణి పంచ ప్రణవ బీజకాః
సపిండ్యాక్షర మంత్రాణి సిద్ధాదీని నశోధయేత్॥
నృసింహంచ వరాహంచ వాసుదేవం చ వైష్ణవమ్
ఏకాక్షరీం త్ర్యక్షరీం చ సిద్ధాదీని నశోధయేత్॥
గోపాలం వామనం రామం భాస్కరంచ సుదర్శనమ్
నామత్రయం కార్త్యవతీం సిద్ధాదీని నశోధయేత్॥
ఆంజనేయం హయగ్రీవం దక్షిణామూర్తి మంత్రకమ్
చింతామణిం గణేశంచ సిద్ధాదీని నశోధయేత్॥
బాలాం పంచదశీం చైవ షోడశీం శివతారకమ్
నారాయణంచ పంచైతాః సిద్ధాదీని నశోధయేత్॥
ప్రణవాద్యంచ స్వాహాంతం ప్రాసాదాద్యం క్రమాగతమ్
గాయత్రీం వేదమంత్రాణి సిద్ధాదీని నశోధయేత్॥
సార్పంచ గారుడంచైవ భాషామంత్రంచ శాంబరమ్
పంజరం కవచం మాలా సిద్ధాదీని నశోధయేత్॥

స్వప్నములో నొసంగఁబడిన మంత్రమునకును, దైవదత్తమును, స్త్రీచే నీయఁబడినదియు, గురువు తనకు దాను బిలిచి యిచ్చినదియు, తండ్రి యిచ్చినదియు, తల్లి యొసంగినదియు, ఈ మంత్రములకు సిద్ధాది శోధనము కావింపరాదు.

పీఠత్రయ మంత్రములకును, అయిదు బీజములు ప్రణవము కలదియు, సంపిండ్యాక్షర మంత్రమునకు సిద్ధాది శోధన అవసరములేదు.

నృసింహమునకు, వరాహమునకు, వాసుదేవమునకు, వైష్ణవమునకు, ఒక యక్షరము గలదానికి, మూడక్షరములు గలదానికి, గోపాలమునకు, వామన

మునకు, తామమునకు, భాస్కరమునకు, సుదర్శనమునకు, నామత్రయ (వాసుదేవ అనిరుద్ధ, సంకర్షణ)మునకు, కార్త్యవతికి, ఆంజనేయమునకు, హయగ్రీవమునకు, దక్షిణామూర్తికి, చింతామణికి గణపతికి, బాలకు, పంచదశికి, షోడశికి, శివ తారకమునకు, నారాయణమునకు, ప్రణవము మొదట స్వాహా చివర గలదానికి ఒకరి యనుగ్రహమువలన సంప్రాప్తించినదానికి, గాయత్రికి, వేదమంత్రములకు, సర్పమంత్రమునకు, గారుడమునకు, సరస్వతికి, శాంబరమునకు, పంజరమునకు, కవచమునకు, మాలామంత్రమునకు_ ఈమంత్రములకు సిద్ధాది శోధనఅవసరములేదు.

## ౧. కులాకుల చక్రము

శ్లో॥ సాధకస్యాక్షరం పూర్వం మంత్రస్యాపి తదక్షరం,
యద్యేక భూత దైవత్యం జానీయా త్స్వకులం హితత్॥

భౌమస్య వారుణం మిత్ర మాగ్నేయ స్యాపి మారుతమ్,
మారుతం పార్థివానాంచ ఆగ్నేయస్యాంభసం రిపుః,

నాభసం సర్వమిత్రంస్యా ద్విరుద్ధం నైవదృశ్యతే॥ _వారాహసంహిత.

సాధకుని నామముయొక్క మొదటి అక్షరము, మంత్రము యొక్క మొదటి అక్షరము ఒకేజాతికి చెందిన స్వకులమునకు చెందినదని గ్రహింపవలెను. (భేదించిన నది మిత్రమో, శత్రువో తెలిసికొన వలయును. ఒకే కులమునకుం

| వాయువు | అగ్ని | భూమి | జలము | ఆకాశము |
|---|---|---|---|---|
| అ, ఆ | ఇ, ఈ | ఉ, ఊ | ఋ, ౠ | ఌ, ౡ |
| ఎ, ఏ | ఐ | ఒ, ఓ | ఔ | అం |
| క | ఖ | గ | ఘ | ఙ |
| చ, ౘ | ఛ | జ, ౙ | ఝ | ఞ |
| ట | ఠ | డ | ఢ | ణ |
| త | థ | ద | ధ | న |
| ప | ఫ | బ | భ | మ |
| య | ర, ఱ | ల | వ | శ |
| ష | క్ష | ళ | స | హ |

చెందిన మంత్రము నవశ్యము గ్రహింపవచ్చును. అట్లే మిత్ర మంత్రమును

గ్రహింప వచ్చును.) జలము, భూమి ఇవి మిత్రములు. అగ్ని, వాయువు మిత్రములు. వాయువు, భూమి శత్రువులు. అగ్ని, జలము శత్రువులు. ఆకాశము అన్ని భూతములకును మిత్రము. దీనికి విరుద్ధము లేదు.

శత్రు మంత్రమును గ్రహించినఁ గీడు కలుగును. ఉదా :- శ్రీరామ రామరామ అను మంత్రము సీతారామయ్య అను సాధకున కెట్లుండునో చూతము. మంత్రాది వరమగు శకారము ఆకాశవర్ణము. సాధకుని వర్ణము సకారము జలము, ఆకాశవర్ణము శకారమన్ని వర్ణములకు మిత్రమే. శ్రీకారమాదిగాఁగల మంత్రములకు సిద్ధారి శోధనము చేయవలసిన పనిలేదు.

---

# ౨. సిద్ధారి చక్రము

దీనికి అ క థ హ చక్రమని పేరు.

౧ ౩ ౧౧ ౯ ౨ ౪ ౧౨ ౧౦
శ్లో॥ ఇంద్వగ్ని రుద్ర నవ నేత్ర యుగాఽర్క దిక్షు,
౬ ౮ ౧౬ ౧౪ ౫
ఋ గ్వ ష్ట షోడశ చతుర్దశ భౌతికేషు,
౭ ౧౫ ౭ ౧౩
పాతాల పంచ దశ వహ్ని హిమాంశు కోష్ఠే,
వర్ణాన్ లిఖేత్ లిపి భవాన్ క్రమశస్తు ధీమాన్॥

వరుసగా అక్షరములను పైన చెప్పిన గడులలో వరుసగా వ్రాయఁ వలయును.

| | | | |
|---|---|---|---|
| ౧ | ౨ | ౩ | ౪ |
| అ, క | ఉ, జ | ఆ, ఖ | ఊ, చ |
| థ, హ | ప | ద | ఫ |
| ౫ | ౬ | ౭ | ౮ |
| ఓ, డ | ఌ, ఝ | ఔ, ఢ | ౡ, |
| బ | మ | శ | ఞ, య |
| ౯ | ౧౦ | ౧౧ | ౧౨ |
| ఈ, | ౠ | ఇ, గ | ఋ |
| ఘ, న | ఙ, భ | ధ | ఛ, వ |
| ౧౩ | ౧౪ | ౧౫ | ౧౬ |
| అః, త | ఐ, ఠ | అం, ణ | ఏ, ట |
| స | ల | ష | ర |

ఈ చక్రములో సాధకుని నామము యొక్క మొదటి యక్షర మేగడిలో నున్నదో యచ్చటి నుండి మంత్రము యొక్క మొదటి అక్షర మున్న గడి వఱకు లెక్క పెట్టవలెను. దానిని నాలుగుచే భాగింపఁగా ఒకటి మిగిలిన సిద్ధము, రెండు మిగిలిన సాధ్యము. మూఁడు మిగిలిన సుసిద్ధము. నాలుగు మిగిలిన అరి అని తెలిసికొనవలయును.

శ్లో॥ సిద్ధః సిద్ధ్యతి కాలేన సాధ్యస్తు జపహోమతః,
సుసిద్ధో గ్రహమాత్రేణ అరిర్మూలా న్నికృంతతి॥ —విశ్వసారము.

సిద్ధమంత్రము కొంతకాలమునకును, సాధ్యము జపహోమముల వలనను, సుసిద్ధము ఉపదేశమాత్రము చేతను, సిద్ధించును. అరి మంత్రము మూలనాశనము కావించును.

శ్లో॥ సిద్ధార్ణా బాంధవాః ప్రోక్తాః సాధ్యాస్తే సేవకాః స్మృతాః,
సుసిద్ధాః పోషకాజ్ఞేయాః శత్రవో ఘాతకామతాః॥
జపేన బంధుః సిద్ధః స్యా త్సేవకోఽధిక సేవయా,
పుష్ణాతి పోషకోఽభీష్టం ఘాతకో నాశయేద్ధ్రువమ్॥

— విశ్వసారము.

సిద్ధవర్ణములు బాంధవులని చెప్పఁబడుచున్నవి. సాధ్యములు సేవకుల వంటివి. సుసిద్ధములు పోషకముల వంటివి. శత్రువులు ఘాతకులు. జపము వలన బంధువు (సిద్ధము) సిద్ధింపఁజేయును. సేవకుఁడు (సాధ్యము) అధిక సేవచే సిద్ధించును. పోషకుఁడు (సుసిద్ధము) అభీష్టములను బెంపొందించును. ఘాతకుఁడు (అరి) తప్పక నాశము చేయును.

| | మొదటినాల్గు | | రెండవనాల్గు | | |
|---|---|---|---|---|---|
| బంధువులు | సిద్ధసిద్ధము<br>అ క థ హ<br>౧ | సిద్ధసాధ్యము<br>ఉ జ ప<br>౨ | సాధ్యసిద్ధము<br>ఆ ఖ ద ళ క్ష<br>౩ | సాధ్యసాధ్యము<br>ఊ చ ఫ<br>౪ | సేవకులు |
| | సిద్ధ అరి<br>ఓ డ వ<br>౫ | సిద్ధసుసిద్ధము<br>ౠ ఝ మ<br>౬ | సాధ్యఅరి<br>ఔ ఢ శ<br>౭ | సాధ్యసుసిద్ధము<br>ౡ ఞ య<br>౮ | |
| ఘాతకులు | అరిసిద్ధము<br>ఈ ఘ న<br>౯ | అరిసాధ్యము<br>ఋ జ భ<br>౧౦ | సుసిద్ధసిద్ధము<br>ఇ గ ధః<br>౧౧ | సుసిద్ధసాధ్యము<br>ఋ ఛ బ<br>౧౨ | పోషకులు |
| | అరి_అరి<br>అః త స<br>౧౩ | అరి_సుసిద్ధము<br>ఐ ఠ ల<br>౧౪ | సుసిద్ధఅరి<br>అం ణ ష<br>౧౫ | సుసిద్ధ సుసిద్ధము<br>ఏ ట ర<br>౧౬ | |
| | నాల్గవ నాల్గు | | మూడవనాల్గు | | |

శ్లో॥ సిద్ధః సిద్ధో యథో క్తేన - ద్విగుణాత్సిద్ధ సాధ్యకః
సిద్ధః సుసిద్ధోఽర్ధ జపాత్ - సిద్ధారి ర్హంతి బాంధవాన్॥
సాధ్య సిద్ధో ద్విగుణతః - సాధ్య సాధ్యో నిరర్థకః
సుసిద్ధః స్త్రీగుణ జపాత్ - సాధ్యారి ర్హంతి గోత్రజాన్॥
సుసిద్ధః సిద్ధోఽర్ధజపాత్ - తత్సాధ్యో ద్విగుణాధికాత్
తత్సు సిద్ధో గ్రహాదేవ - సుసిద్ధారిః స్వగోత్ర హా॥
అరి సిద్ధః సుతాన్ హన్యా దరి సాధ్యస్తు కన్యకాః
తత్సు సిద్ధస్తు పత్నీఘ్నః - స్తదరి ర్హంతి సాధకమ్॥

— విశ్వసారము.

సిద్ధసిద్ధము యథోక్తమగు ఫలము నొసంగును. సిద్ధసాధ్య మంత్రమైన రెట్టింపుగ జపించిన సిద్ధించును. సిద్ధసుసిద్ధము సగము జపమునకే సిద్ధించును. సిద్ధ - అరి మంత్రము బంధువులను జంపును. (ఇవి ౧, ౨, ౬, ౫ గడులలోని వాని ఫలములు) సాధ్యసిద్ధము రెట్టింపు జపించుటచేత సిద్ధించును. సాధ్యసాధ్య మంత్రము నిరర్థకము. సాధ్యసుసిద్ధము మూడురెట్లు జపించిన సిద్ధించును. సాధ్య - అరి గోత్రజులను జంపును. (ఇవి వరుసగా ౩, ౪, ౭, ౭ గడులలోని వాని ఫలము) సుసిద్ధ సిద్ధము అర్ధజపముచే సిద్ధించును. సుసిద్ధసాధ్యము రెట్టింపు చేయుటచే సిద్ధించును. సుసిద్ధ సుసిద్ధము కేవలము మంత్రము గ్రహించుటచేతనే సిద్ధించును. సుసిద్ధ - అరి మంత్రము స్వగోత్రమును నశింపజేయును. (ఇవి వరుసగా ౧౧, ౧౨, ౧౬, ౧౫ గడులలోని వాని ఫలములు.) అరిసిద్ధము సుతులను జంపును. అరిసాధ్యము కూతుండ్రను జంపును. అరి సుసిద్ధము భార్యనుజంపును. అరిఅరి సాధకునే జంపును. (ఇవివరుసగా ౯,౧౦,౧౪,౧౩ గడులలోనివానిఫలము.)

పై పథకములో 4 × 4 = 16 గడులు కలవు. సాధకుని నామాక్షర మేగడిలో నున్నదో చూచుకొనవలయును. తర్వాత మంత్రముయొక్క మొదటి అక్షర మేగడిలో నున్నదో చూచుకొనవలెను. సాధకుని నామాక్షరమునుండి మంత్రాది అక్షరము వఱకెన్ని గడులైనవో లెక్కించుకొని దానిని నాలుగుచే భాగింపవలయును. అట్లు భాగింపఁగా ఒకటి మిగిలిన సిద్ధమనియు, రెండు

మిగిలిన సాధ్యమనియు, మూఁడు మిగిలిన సుసిద్ధ మనియు, నాలుగు మిగిలిన అరి యనియుఁ దెలిసికొనవలయును. మొదటి నాల్గు గడులలోని అక్షరములు బంధువులు. (సిద్ధములు.) రెండవ నాల్గు గడులలోని క్షరములు సేవకులు (సాధ్యములు.) మూఁడవ నాల్గు గడులలోని అక్షరములు. పోషకములు (సుసిద్ధములు) నాల్గవ నాల్గు గడులలోని అక్షరములు ఘాతుకములు. మఱల అంతరములు చెప్పఁబడి వేలువేలు ఫలములు పైన వ్రాయఁబడినవి.

శ్లో॥ ఏషు దోషేషు సర్వత్ర మాయాం కామమథాపివా,
క్షిప్త్వా చాద్యౌశ్రియం దద్యాత్తద్దూషణ విముక్తయే॥

వీనిలోఁ బైన చెప్పిన దోషములు సంభవించుచో మంత్రాదిని హ్రీం బీజమునుగాని, క్లీం బీజమునుగాని, శ్రీం బీజమును గాని జోడించి యిచ్చిన నా దోషము పోవును. ఉదా :_ శ్రీరామరామరామ అను మంత్రమునకు మొదటి అక్షరము శ కారము. సీతారామయ్య అను వాని మొదటి వర్ణము సకారము. సకారము ౧౩ వ గడిలో నున్నది. శ వర్ణము ౭ వ గడిలో నున్నది. ౧౩ వ గడినుండి ౭ వ గడికి ౧౧ అయినది. దానిని ౪ చే భాగింపఁగా 3 మిగిలినది. కాఁబట్టి యీ సాధకునకు పై మంత్రము సుసిద్ధమైనది. కావున వీనికీ మంత్ర ముపదేశము పొందుటచేతనే సిద్ధించినది.



## అ క డ మ చక్రము.

పైన చెప్పిన చక్రము గాక సిద్ధ సాధ్యాదులను దెలిసికొనుటకు వేఱొక చక్రమూ కలదు. దీనికి ప్రథమ గడిలో అకడమ అను అక్షరములు కలవు. కావున దీనికి అకడమ చక్రమని పేరు కలిగినది. ఈ చక్రమునుబట్టి పైనఁ జెప్పిన రీతినే

సిద్ధ, సాధ్య, సుసిద్ధ, అరి మంత్రములను జూచుకొన వలయును. ఈ ౧౨ పం
డ్రెండు రాసులు, వాటిని గూడ చూచుకొనవచ్చును.

| | | ౧ | ౨ | ౩ |
|---|---|---|---|---|
| ౧ | అః, త<br>భ<br>మీనము | అ, క<br>డ, మ<br>మేషము | ఆ, ఖ<br>డ, య<br>వృషభము | ఇ, గ<br>ణ, ర<br>మిథునము |
| ౧౧ | ౦, ట<br>బ<br>కుంభం | అ క డ మ | | ఉ, ఘ<br>త, ల<br>కర్కాటకము |
| ౧౦ | ఔ, ఞ<br>ఫ, క్ష<br>మకరం | చక్రము. | | ఊ, జ<br>ధ, వ<br>సింహము |
| | ఓ, ఝ<br>ప, హ<br>ధనస్సు | ఐ, జ<br>న, స<br>వృశ్చికము | ఎ, ఛ<br>ధ, ష<br>తుల | ౠ, చ<br>ద, శ<br>కన్య |
| | ౯ | ౮ | ౭ | |

ఉదా:- సీతారామయ్య అనువాని నామ ప్రథమాక్షరము సకారము ౮ వ గడి లోనున్నది. శ్రీరామ ర రామ రామ యను మంత్రము యొక్క ప్రథమాక్షరము శకారము ౬ వ గడిలో నున్నది. ౮వ గడినుండి ౬వ గడికి౧౧అయినది. ౬ దానిని నాలుగుచే భాగింపగా ౩ మిగులును. మూడవది సుసిద్ధము కాబట్టి వీనికా మంత్రము ఉపదేశమాత్రముననే సిద్ధించును.

## ఋణధన శోధనము

శ్లో॥ ఇంద్రదస్త్ర నేత్ర రవిపంచదశర్తు వేద,
వహ్న్యష్ట యుధాష్ట నవభిర్గుణితాంశ్చ సాధ్యాన్,
దిగ్బాహు గిరిశ్రుతి గజాగ్ని మునీషు వేద,
వహ్న్యహ్నిభిశ్చ గుణితానథ సాధకార్ణాన్॥
నామాక్షరాదకరబాద్గజ భక్త శేషం,
జ్ఞాత్వోభయోః రధిక మూల యుతం ఋణంస్యాత్॥

ఇంద్రాద్యంకైః స్వారాధ్యార్ణాన్ స్వరవ్యంజన రూపేణ పథకప్ర
థక్ కృత్వా గుణితాన్ కృత్వా తథా సాధక నామాక్షరాణ్యపి దిశాది

ధీరం కైర్ఋణ మేత్। నామాక్షరాదితి స్వరవ్యంజన సముదాయాత్। అకత బాదితి వర్గచతుష్టయ ప్రభిన్నాత్। అకారాదిః అః అంతః యస్య అ ఇ ఉ ఋ ఌ ఏ ఐ ఓ ఔ అం అః ఏతద్రూపః అవర్గః। కాదిష్టాంతః కవర్గః। తాది ఫాంతః తవర్గః। బాదిర్హాంతః బవర్గః। ఏతే ఏకాదశైకాదశాక్షరాశ్చత్వారో వర్గాః। అస్మాదకతబాదష్టభిర్భాగే హృతే సతి ఉభయోః సాధ్యసాధక వర్గయోః శేషస్యాధికరూపస్య ఋణత్వం, ధనత్వం, చ న్యూనరూపస్య జ్ఞాత్వా మంత్రం దద్యాత్.

సాధ్యాంకములు

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ౮ | ౨౭ | ౨ | ౧౨ | ౧౫ | ౬ | ౪ | ౩ | ౯ | ౯ | ౯ | ఋణం |
| అ | ఇ | ఉ | ఋ | ఌ | | ఐ | ఒ | ఔ | అం | అః | |
| ఆ | ఈ | ఊ | ౠ | ౡ | | | ఓ | | | | |
| క | ఖ | | ఘ | జ | చ | ఛ | | | ఞ | ట | |
| త | ఢ | ఢ | ణ | త | థ | ద | | న | ప | | |
| బ | భ | మ | య | ర | | వ | | ష | స | హ | |
| ⌒ | ౧ | ౭ | ౪ | ౯ | ౩ | ౭ | ౫ | ' | | | ధనం |

సాధకాంములు

పంక్తికి పదునొకండు గడులు చొప్పున నాలుగు వరుసలకు నాలుగు పంక్తు లేర్పఱచవలయును మొదటి పంక్తిలో అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ, అం, అః పై పథకములో రీతిగ వ్రాయవలెను. అట్లే క మొదలు ట వఱకు రెండవ వరుసలోను, త మొదలు ఫ వఱకు మూడవ వరుసలోను, బ మొదలు హ వఱకు నాలవ వరుసలోను వ్రాయవలెను. సాధ్యాంకములు పైనను, సాధకాంకములు క్రిందను వేసికొనవలయును. మంత్రము సాధ్యము. జపించవలసిన వాఁడు సాధకుఁడు. మంత్రములోని అచ్చులు, హల్లులను విడదీసికొని ఏ అక్షర మేగడిలోనున్నదో చూచుకొని పైనగల అంకెలను, ఆయా అక్షరములకు సంబంధించిన వాటిని వేసికొని కూడుకొనవలయును. అట్లే సాధకుని నామాక్షరములలోని అచ్చులను హల్లులను ఏఱుకొని వాటికి ఆయా అక్షరములకు గల సాధకాంకములను

గూడుకొని ఒక్కొక్క దానిని ౯ చే భాగింపఁగా మిగిలిన సంఖ్యలు చూచుకొనవలెను. శేషము సాధకునికి మిగిలిన సంఖ్యకంటె హెచ్చైన ఋణము. సాధకుని సంఖ్య మంత్రములో మిగిలిన సంఖ్యకంటె హెచ్చైన ధనము. ఋణమైననే సాధకునకుఁ ద్వరగా సిద్ధి గలిగించును. ధనమైన నాలస్యముగ సిద్ధి కలిగించును. రెండును సమానమైనను ఉత్తమమే. శేషము శూన్యమైన మృత్యుకారకమగును.

ఉదా :_ సాధకుఁడు సీతారామయ్య. దీనిలో స, ఈ, త, ఆ, ర, ఆ, మ, య, య ఉన్నది. అనఁగా ౬ + ౧ + ౭ + ౧౦ + ౭ + ౧౦ + ౩ + ౪ + ౪ (ఇవి క్రిందనున్న సాధకాంకములనుబట్టి వేయఁబడినవి.) = ౪౭.

సాధ్యము (మంత్రము) శ్రీరామరామరామ. దీనిలో శ, ఈ, ర, ర, ఆ, మ, ర, ఆ, మ, ర, ఆ, మ ఉన్నవి. అనఁగా ౩ + ౨౬ + ౧౫ + ౧౫ + ౧౪ + ౨ + ౧౫ + ౧౪ + ౨ + ౧౫ + ౧౪ + ౨ (ఇవి పైనున్న సాధ్యాంకములు) = ౧౩౭. దీనిలో ౪౭ ని ౯ చే భాగింపగా ౨ మిగులును. ౧౩౭ ని ౯ చే భాగింపఁగా ౨ మిగిలెను. సమానమగుట ఉత్తమమే అగుచున్నది.

## రాశి మేళనము

మంత్రమునకు రాశి మేళనము కూడ చూడవలయును. ఈ క్రింద నుదహరించిన పథకమును జూచుకొని ముందుగా మంత్రరాశిని గనుఁగొనవలెను. తర్వాత సాధకుని నామ ప్రథమాక్షరముతో సాధకుని రాశిని కనుఁగొనవలెను.

| | | | |
|---|---|---|---|
| మీనము<br>య, ర, ల, వ, శ | మేషము<br>అ, ఆ, ఇ, ఈ | వృషభము<br>ఉ, ఊ, ఋ | మిథునము<br>ౠ, ఌ, ౡ |
| కుంభము<br>ప, ఫ, బ, భ, మ | | | కర్కాటకము<br>ఏ, ఐ |
| మకరము<br>త, థ, ద, ధ, న | రాశి చక్రము | | సింహము<br>ఓ, ఔ |
| ధనుస్సు<br>ట, ఠ, డ, ఢ, ణ | వృశ్చికము<br>చ, ఛ, జ, ఝ, ఞ | తుల<br>క, ఖ, గ, ఘ, ఙ | కన్య<br>అం, అః, ష, హ, ళ, క్ష |

సాధకుని రాశినుండి మంత్రరాశి యెన్నవదో దానిని బట్టి ఫలము కనుఁగొన వలెను.

శ్లో॥ ఏక పంచ నవ బాంధవాః స్మృతాః,
ద్వే చ షట్చ దశమాస్తు సేవకాః।
వహ్ని రుద్ర మునయస్తు పోషకాః,
ద్వాదశాష్ట చతురస్తు ఘాతకాః॥

తన రాశికి మంత్రరాశికి ౧, ౫, ౯ స్థానములు బాంధవులనియు, ౨, ౬, ౧౦ స్థానములు సేవకు లనియు, ౩, ౭, ౧౧ స్థానములు పోషకములనియు, ౪, ౮, ౧౨ స్థానములు ఘాతుకము లనియుఁ దెలియవలయును. ఉదా:- సీతారామయ్య అనువాని రాశి సకారము కావున కన్యారాశి. శ్రీరామరామ రామ అను మంత్రమునకు రాశి (శ కారము) మీనరాశి. కన్యనుండి మీనము నకు ౭ అయినది. కావున పోషకము.

## నక్షత్ర మేళనము

నక్షత్ర మేళనము చూచుటయు అవసరమే.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| అ, ఆ | ఇ, ఈ | ఉ, ఊ | ఋ, ౠ, ఌ, ౡ | ఏ | ఐ | ఓ, ఔ | క | ఖ, గ |
| అశ్వని | భరణి | కృత్తిక | రోహిణి | మృగశిర | ఆరుద్ర | పునర్వసు | పుష్య | ఆశ్లేష |
| దేవ | నర | రాక్షస | నర | దేవ | నర | దే | దేవ | రాక్షస |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ఘ, ఙ | చ | ఛ, జ | ఝ, ఞ | ట, ఠ | డ | ఢ, ణ | త, థ, ద | |
| మఖ | పుబ్బ | ఉత్తర | హస్త | చిత్త | స్వాతి | విశాఖ | అనూ | జ్యేష్ఠ |
| రాక్షస | నర | నర | దేవ | రాక్షస | దేవ | రాక్షస | దేవ | రాక్షస |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| న, ప, ఫ | బ | భ | మ | య, ర | ల | వ, శ | ష, స, హ | ళ, క్ష, అః |
| మూల | పూ॥షా | ఉ॥షా | శ్రవణం | ధనిష్ఠ | శతభిష | పూ॥భా | ఉ॥భా | రేవతి |
| రాక్షస | నర | నర | దేవ | రాక్షస | రాక్షస | నర | నర | దేవ |

శ్లో॥ ప్రదక్షిణ్యేన గణయేత్ - సాధకాఖ్యాత్షరాత్సుధీః,
జన్మ సంపద్విపత్ క్షేమ - ప్రత్యరిః సాధకో వధః॥
మైత్రం పరమమైత్రంచ - జన్మాదీని పునః పునః,
విపద్వధః ప్రత్యరిశ్చ - పరిత్యాజ్యా మనీషిభిః॥

సాధకుని నామ ప్రథమాక్షర మేనక్షత్రమో తెలిసికొనవలెను. తర్వాత మంత్ర ప్రథమాక్షరముచే దాని నక్షత్రము తెలిసి సాధకుని నక్షత్రమునుండి మంత్ర నక్షత్రము వఱకు ప్రదక్షిణముగా లెక్కపెట్టి ౧. జన్మ ౨. సంపత్ ౩. విపత్ ౪. క్షేమ ౫. ప్రత్యరీ ౬. సాధక ౭. వధ ౮. మైత్రము ౯. పరమ మైత్రము లలో నేదియో చూచుకొనవలెను. విపత్తు, వధము, ప్రత్యరి తారలను వదలి పెట్టవలయును.

తా నేగుణమునకుఁ జెందినవాఁడో, మంత్ర మే గుణమునకుఁ జెందినదో తెలిసికొనవలయును. దేవగణములోఁ బుట్టినవానికి దైవగణ మంత్ర ముత్తమము. మనుష్య గణమంత్రము మధ్యమము. రాక్షసగణ మంత్రము విరోధము. విరోధ మంత్రము పనికిరాదు. మనుష్య గణమునఁ బుట్టినవానికి మనుష్యగణ మంత్ర ముత్తమము. దేవగణమంత్రము మధ్యమము. రాక్షసగణ మంత్రము పనికిరాదు. రాక్షసగణమునఁ బుట్టినవానికి రాక్షసగణ మంత్రములే సిద్ధించును గాని అన్యమంత్రములు సిద్ధింపవు. వీనికి దైవమంత్రములు కేవలము విరోధము లగును.

కొందఱు ఎంత జపించినను భగవంతుఁడు ప్రత్యక్షము కాఁడు. కారణము ఆతఁడు దైవగణమునఁ బుట్టక పోవుటయే. దేవగణస్థులకు దేవతా దర్శనమగును. మనుష్య గణములోనివారికి దేవతలు, రాక్షసులు ఇద్దరును గనపడరు. రాక్షస గణములోనివానికి దేవతాదర్శనము కాదు, రాక్షస, పిశాచములు కనఁబడును. దేవతాదర్శనము కాకున్నను ఫలము తప్పదు. ఉదా :- సీతారామయ్యకు ప్రథమాక్షరము స కారము. అతని నక్షత్రము ఉత్తరాభాద్ర. శ్రీరామ రామరామ అను మంత్రమునకు శ కారము ప్రథమాక్షరము. పూర్వాభాద్ర. రెండును మనుష్య గణములోనివే. కావున నాతనికి శ్రేష్ఠమైనదే. ఉత్తరాభాద్రకు పూర్వాభాద్ర ౨౭ వ నక్షత్రము. కావున దీనిని తొమ్మిదిచే భాగింపఁగా '౦' మిగులును. అనఁగా దొమ్మిదవది చూచుకొనవలయును. నవమ తార పరమ మైత్రతారయైనది. కావున నీ మంత్రము చాల తగినదై యున్నది.

# మాసాది శుద్ధులు

## మాస శుద్ధి

శ్లో॥ మధు మాసే భవేద్దుఃఖం మాధవే రత్న సంచయః,
మరణం భవతి జ్యేష్ఠే ఆషాఢే బంధునాశనమ్॥

సమృద్ధిః శ్రావణే నూనం భవేద్భాద్రపదే క్షయః,
ప్రజానామాశ్వినే మాసి సర్వతః శుభమేవ హి॥

జ్ఞానం స్యాత్కార్తికే సౌఖ్యం మార్గశీర్షే భవత్యపి,
పౌషే జ్ఞానక్షయో మాఘే భవేన్మేధా వివర్ధనమ్॥

ఫాల్గునేపి సమృద్ధిః స్యాన్మలమాసం పరిత్యజేత్॥

చైత్ర మాసమున నుపదేశమైన దుఃఖమును, వైశాఖ మాసముల రత్న సంచయమును, జ్యేష్ఠమున మరణమును, ఆషాఢమున బంధునాశమును, శ్రావణములో సమృద్ధియు, భాద్రపదములో క్షయమును, ఆశ్వయుజమున సంతాన వృద్ధియు, శుభమును, కార్తీక మాసమున జ్ఞానప్రాప్తియు, మార్గశిరమున సౌఖ్యమును, పుష్యమున జ్ఞాన నాశనమును, మాఘమాసమున మేధాభి వృద్ధియు, ఫాల్గుణమున సర్వసమృద్ధియుఁ గలుగును. మల మాసమును వదల వలయును. అధిక మాసములు పనికిరావు.

## తిథి శుద్ధి

శ్లో॥ పూర్ణిమా పంచమీ చైవ ద్వితీయా సప్తమీ తథా,
త్రయోదశీ చ దశమీ ప్రశస్తాః సర్వకామదాః॥

విదియ, పంచమి, సప్తమి, దశమి, త్రయోదశి, పూర్ణిమ ఇవి ప్రశస్తములు. సర్వకోరికల నొసంగును.

శ్లో॥ ద్వితీయా పంచమీ వాపి – షష్ఠీచాపి విశేషతః.
ద్వాదశ్యామపి కర్తవ్యం – త్రయోదశ్యామథాపివా॥

— మంత్రసార సంగ్రహము.

విదియ, పంచమి, షష్ఠి, ద్వాదశి, త్రయోదశి తిథులుకూడ ఉపదేశము నకు ముఖ్యములు.

## నక్షత్ర శుద్ధి

శ్లో॥ రోహిణీ శ్రవణార్ద్రాశ్చ ధనిష్ఠాచోత్తరాత్రయమ్,
పుష్యః శతభిషశ్చైవ దీక్షానక్షత్రముచ్యతే॥ — నారద తంత్రము.

రోహిణి, శ్రవణము, ఆర్ద్ర, ధనిష, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, పుష్యమి, శతభిషా నక్షత్రములు ఉపదేశమున కుత్తమములు.

ఇట్లు చెప్పఁబడియున్నను, అశ్వని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, మఖ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాఢ, శతభిషము, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర రేవతీ నక్షత్రము లుత్తమములు.

## లగ్న శుద్ధి

శ్లో॥ మంత్రాద్యారంభణం మేషే ధనధాన్య సుఖప్రదమ్,
వృషే మరణ మాప్నోతి మిథునే పుత్రనాశనమ్॥

కర్కటే సర్వసిద్ధిస్స్యాత్సింహే మేధా వినాశనం,
కన్యాయాం సిద్ధిదో జూకేర్ణిఫలో వృశ్చికేఽర్థదః॥

మకరే పుత్రదః కుంభే మహద్ధన వివృద్ధిదః,
మీనం దుఃఖప్రదం నిత్య మేవం రాశిఫలం శివే॥

మంత్రోపదేశము మేషములోఁ జేసిన ధనధాన్యములు లభించుటయే గాక సుఖప్రదమగును. వృషభములో మరణమును మిథునములో పుత్రనాశనమును, కర్కాటకములో సర్వసిద్ధియు, సింహములో మేధా వినాశనమును. కన్యలో సిద్ధియు, తులలో అనల్ప ఫలమును, వృశ్చికము ధనమును, ధనుస్సు శుభము, మకరమున పుత్రసంతతియు, కుంభమున మహద్ధన వృద్ధియు, మీనము దుఃఖమును ప్రసాదించును.

వృషభ, సింహ, కన్యా, ధనస్సు, మీన లగ్నములు ఉత్తమములు' విష్ణు మంత్రములకు స్థిరలగ్నములును, శివ మంత్రములకు చర లగ్నములును శక్తి

మంత్రములకు స్థిరచర లగ్నము లుత్తమములు. లగ్ననిర్ణయముతోఁ బాటుగా గ్రహముల శుభాశుభ విచారణకూడ చేయుట మంచిది. లగ్నమునకు ౩, ౬, ౧౧ స్థానములలోఁ బాపగ్రహములును, కేంద్ర (౧, ౪, ౭, ౧౦) త్రికోణము (౧, ౫, ౯) స్థానములందు శుభగ్రహములున్న నుత్తమములు.

## వా ర శు ద్ధి

శ్లో॥ రవౌ గురౌ తథా సోమే కర్తవ్యం బుధశుక్రయోః,

ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారములం దుపదేశమునకు ప్రశస్తము.

## ప క్ష శు ద్ధి

శ్లో॥ శుక్లపక్షే శుభాదీక్షా కృష్ణేఽప్యాపంచమీదినాత్॥

దీక్షకు శుక్లపక్షము శుభము. కృష్ణపక్షము పంచమి వఱకు శుభమే.

## యో గ శు ద్ధి

శ్లో॥ శుభః సిద్ధిశ్చ ఆయుష్మాన్ ధ్రువయోగ స్తతః పరమ్,

ప్రీతిః సౌభాగ్యయోగశ్చ వృద్ధియోగస్తతః పరమ్॥

హర్షణశ్చ తథా యోగాః సర్వతంత్రే శుభావహాః॥ - విశ్వసారము.

సిద్ధి, ఆయుష్మాన్, ధ్రువ, ప్రీతి, సౌభాగ్యము, వృద్ధి ఇవి యోగములలోఁ శ్రేష్ఠము లైనవి.

## క ర ణ శు ద్ధి

శ్లో॥ కౌలవస్తైతులబవే వణిజస్తదనంతరమ్,

కరణాని శుభాన్యేవ సర్వతంత్రేషు భామిని॥ — విశ్వసారము.

కౌలవ, తైతుల, బవ, వణిజ ఇవి కరణము లన్నిటిలోఁ శ్రేష్ఠములు.

ఈ క్రింద తిథులలోఁ నేవిధమగు శుద్ధులు చూడవలసిన పనిలేదు.

శ్లో॥ షష్ఠీ భాద్రపదే మాసి ఇషే కృష్ణా చతుర్దశీ,

కార్తికే నవమీ శుక్లా మార్గే శుక్ల తృతీయకా॥

పౌషే చ నవమీ శుక్లా మాఘే శుక్ల చతుర్థికా,
ఫాల్గుణే నవమీ శుక్లా చైత్రే కామచతుర్దశీ॥
వైశాఖే చాక్షయా చైవ జ్యేష్ఠే దశహరా తిథిః
ఆషాఢే పంచమీ శుక్లా శ్రావణే కృష్ణపంచమీ,
ఏతాని దేవపర్వాణి తీర్థకోటి ఫలం లభేత్॥

— ఆగమ కల్పద్రుమము.

భాద్రపద శుక్ల షష్ఠి, ఆశ్వయుజ బహుళ చతుర్దశి, కార్తీక శుద్ధ నవమి, మార్గశిర శుద్ధ తదియ, పుష్యశుద్ధ నవమి, మాఘశుద్ధ చవితి, ఫాల్గుణశుద్ధ నవమి, చైత్రములో కామ చతుర్దశి, వైశాఖములో అక్షతదియ, జ్యేష్ఠములో దశమి, ఆషాఢశుద్ధ పంచమీ, శ్రావణ బహుళ పంచమి. ఇవి అన్నియు దేవపర్వములు. ఈ దినములందు కోటి తీర్థములందలి ఫలము లభించును. ఇంకొకచోట యిట్లు కలదు— —

శ్లో॥ చైత్రే త్రయోదశీ శుక్లా వైశాఖైకాదశీ సితా
జ్యేష్ఠే చతుర్దశీ కృష్ణా ఆషాఢే నాగపంచమీ॥
శ్రావణైకాదశీ భాద్రే రోహిణీ సంయుతాష్టమీ
ఆశ్వినే తు మహాపుణ్యా మహాష్టమ్యప్యభీష్టదా॥
కార్తికే నవమీ శుక్లా మార్గశీర్షే తథా సితా
షష్టీ చతుర్దశీ పౌషే మాఘేష్వేకాదశీ సితా॥
ఫాల్గునేచ సితా షష్ఠీ త్యేవం కాలస్య నిర్ణయః,

చైత్రశుద్ధ త్రయోదశి, వైశాఖశుద్ధ ఏకాదశి, జేష్ట బహుళ చతుర్దశి, ఆషాఢములో నాగపంచమీ, శ్రావణమున ఏకాదశి, భాద్రపదములో రోహిణీతోఁగూడిన అష్టమీ, ఆశ్వీజములో శుద్ధ అష్టమి కార్తీక శుద్ధ నవమి, మార్గశిరశుద్ధ షష్ఠి, పుష్య శుద్ధ చతుర్దశి, మాఘశుద్ధ ఏకాదశి, ఫాల్గుణ శుద్ధ షష్ఠి ఇవి పర్వదినములు. ఈదినములందు మంచి చెడ్డ లేకయే ఉపదేశమును బొందవచ్చును.

శ్లో॥ నింద్యాదిష్వపి కాలేషు దీక్షోక్తా గ్రహణే శుభా
సూర్యగ్రహణ కాలేన సమానో నాస్తి భూతలే॥

తత్ర యద్యత్కృతం సర్వమనంత ఫలదం భవేత్
రవి సంక్రమణే చైవ సూర్యస్య గ్రహణే తథా
తత్ర లగ్నాదికం కించిన్న విచార్యం కథంచన॥
సత్తీర్థేఽర్కవిధుగ్రాసే పుణ్యారణ్యే వనేషుచ
మంత్రీ దీక్షాం ప్రకుర్వాణో మాసర్క్షాదీన్న శోధయేత్॥
అమావాస్యా సోమవారే భౌమవారే చతుర్దశీ
సప్తమీ రవివారే చ సూర్యపర్వ శతైః సమాః॥
న కుర్యాచ్ఛాక్తికీం దీక్షా ముపరాగే విభావసోః
న కుర్యాద్వైష్ణవీం దీక్షాం యది చంద్రమసో గ్రహః॥
పుణ్యతీర్థే కురుక్షేత్రే దేవీపీఠ చతుష్టయే
ప్రయాగే శ్రీగిరౌ కాశ్యాం కాలాకాలం నశోధయేత్॥

— యామళము.

పనికిరాని రోజులలో నైనను గ్రహణములందు దీక్ష గొనవచ్చును. సూర్యగ్రహణముతో సమానమగున దీభూమిలో లేదు. ఆ రోజున నే పని చేసినను అది అనంత ఫలము నీయఁగలదు. రవి సంక్రమణమందును, సూర్యగ్రహణమందును, లగ్నాదులను విచారింపరాదు. ఉత్తమ తీర్థములందును, సూర్యచంద్ర గ్రహణములందును, పుణ్యారణ్యము లందును, పుణ్యవనములలోను, దీక్షను బొందిన మాస, నక్షత్రాదులను విచారింప నక్కఱలేదు. అమావాస్యా సోమవారము వచ్చినను, చతుర్దశీ మంగళవారము వచ్చినను, సప్తమీ ఆదివారము వచ్చినను, సూర్యపర్వమును నూటింటితో సమానమైనవి. సూర్యగ్రహణ సమయమున శక్తి మంత్ర మీయరాదు. విష్ణుమంత్రమును జంద్రగహణమున నీయరాదు. పుణ్యతీర్థములందును, కురుక్షేత్రమందును, దేవీపీఠములు నాల్గింటియందును, ప్రయాగ, శ్రీశైలము, కాశీ మొదలగు వానియందు కాలాకాలమును శోధింపరాదు.

శ్లో॥ దేవీ బోధం సమారభ్య యావత్స్యా న్నవమీ తిథిః,
కృత్వా తాసు బుధైర్దీక్షా సర్వాభీష్ట ఫలప్రదా॥

బోధనే చైవ దీక్షయాః కాలాకాలం న శోధయేత్,
అశోకాఖ్యాష్టమీ చైవ రామాఖ్యా నవమీ తథా॥
లగ్నే వాప్యథవాఽలగ్నే యత్ర తత్ర తిథావపి,
గురోరాజ్ఞానురూపేణ దీక్షా కార్యా విశేషతః॥

— విష్ణుయామిళము.

ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి అనఁగా దేవీనవరాత్రులలో నవమివఱకు నే రోజున దీక్ష గైకొనినను సమస్తాభీష్టముల నొసంగును. బోధనైకాదశి (కార్తీక శుద్ధ ఏకాదశి) రోజున కాలాకాలములను జూడరాదు. అశోకాష్టమి, శ్రీరామ నవమి, ఈ దినములలో లగ్నాలగ్నముల జూడక గుర్వనుజ్ఞచే దీక్షను గొన వచ్చును.

శ్లో॥ శిష్యానాహూయ గురుణా కృపయా దీయతే యదా,
తదా లగ్నాదికం కించి న్నవిచార్యం కథంచన॥
సర్వే వారా గ్రహాః సర్వే నక్షత్రాణి చ రాశయః,
యస్మిన్నహని సంతుష్టో గురుః సర్వే శుభావహాః॥

— సమయాతంత్రము.

గురువు శిష్యులను బిలిచి కృపతో మంత్రమిచ్చుచో నప్పుడు లగ్నాదికములను విచారింపరాదు. గురువు సంతసించిన రోజున సమస్త వారములు, గ్రహములు, నక్షత్రములు, రాశులు శుభావహు లగుదురు.

శ్లో॥ సంతుష్టే చ గురౌ యస్య సంతుష్టాః సర్వదేవతాః,
గురుం సంతోషయేద్భక్త్యా ద్వయమేవ తథాభవేత్॥

గురువు సంతసించిన సమస్తదేవతులు సంతసింతురు. కావున గురువును సంతుష్టి చెందింప వలయును. అట్లు చెందించిన భుక్తి ముక్తులు రెండును లభించును.

'గ్రహణేచ మహాతీర్థే నాస్తికాలస్య నిర్ణయః'
గ్రహణ సమయమందును, మహాతీర్థములోను కాలనిర్ణయము లేదు.

శ్లో॥ విధవాయాః సుతాదేశాత్ కన్యాయాః పితురాజ్ఞయా
నాధికారః స్వతో నార్యా భార్యాయా భర్తురాజ్ఞయా॥

— కులార్ణవము.

విధవలు కొడుకుల అనుజ్ఞను బొందియు, కన్యకలు తల్లిదండ్రుల అనుజ్ఞయు, భార్యలు భర్తల యాజ్ఞలను బొంది దీక్షగైకొనవలెను గాని స్త్రీలకు స్వతంత్రింప నధికారము లేదు.

## శిష్య పరీక్ష

శ్లో॥ గురు శిష్యా వుభౌ మోహా దపరీక్ష్య పరస్పరమ్
ఉపదేశం దదన్ గృహ్ణన్ ప్రాప్నుయాతాం పిశాచతామ్॥

— కులార్ణవము.

గురుశిష్యు లిద్దరు ఒకరొకరు పరీక్షించుకొనక ఉపదేశమిచ్చినను, పుచ్చుకొన్నను పిశాచత్వమును బొందుదురు.

శ్లో॥ అశాస్త్రీయోపదేశం తు యో గృహ్ణాతి దదాతి యః
భుంజాతే తావుభౌ ఘోరాన్నరకానేక వింశతిః॥

అనర్హే మంత్ర విజ్ఞానం న తిష్ఠతి కదాచన
తస్మాత్పరీక్ష్య వక్తవ్య మన్యథా నిష్ఫలం భవేత్॥

జ్ఞానేన క్రియయా వాపి గురుః శిష్యం పరీక్షయేత్
సంవత్సరం తదర్ధం వా తదర్ధం వా ప్రయత్నతః॥

శిష్యోఽపి లక్షణైరేతైః కుర్యాద్గురు పరీక్షకమ్
ఏకాబ్దేన ద్విజో యోగ్యః క్షత్రియో వత్సరద్వయమ్॥

వైశ్యో యోగ్యస్త్రిభిర్వర్షైశ్చతుర్భిః శూద్ర ఏవ చ॥

— కులార్ణవము.

అశాస్త్రీయమగు నుపదేశము నెవఁడిచ్చుచున్నాఁడో, ఎవఁడు పుచ్చుకొనుచున్నాఁడో వారిద్దరు ఇరువదొక్క ఘోర నరకములలోఁ బడుదురు. అనర్హునికి మంత్రవిజ్ఞాన మెన్నటికిని నిలువఁజాలదు. కావునఁ బరీక్షించి మంత్రమీయవలెను. లేకున్న నిష్ఫలమగును. జ్ఞానము చేతను, క్రియతోను గూడ గురువు శిష్యుని బరీక్షింపవలెను. సంవత్సరముగాని, ఆఱునెలలుగాని, కనీసము మూఁడు నెలలుగాని శిష్యలక్షణముల ననుసరించి పరీక్షింప వలెను. సంవత్సరము మీఁదట బ్రాహ్మణుఁడు యోగ్యుఁడు. క్షత్రియుని రెండు సంవత్సరములు పరీ

క్షింప వలెను. వైశ్యుని మూఁడు సంవత్సరములు పరీక్షింప వలయును. శూద్రుని నాలుసంవత్సరములు పరీక్షింప వలయును. తండ్రి మొదలగువారి వలన దీక్షను గొనరాదు.

## మంత్రము గ్రహింపఁదగని చోటు

శ్లో॥ పితుర్మంత్రం న గృహ్ణీయాత్తథా మాతామహస్య చ
సోదరస్య కనిష్ఠస్య వైరిపక్షాశ్రితస్య చ॥ — యోగినీతంత్రము.

తండ్రివలనఁ గాని, మేనమామ వలనఁగాని, తమ్మునివలనఁ గాని, విరోధ పక్షము వహించిన వానివల్లను మంత్రము గైకొనరాదు.

శ్లో॥ యతేర్దీక్షా పితుర్దీక్షా యాదీక్షా వనవాసినః,
వివిక్తాశ్రమిణో దీక్షా న సా కల్యాణదాయికా॥ —గణేశవిమర్శినీ.

యతి వలన, తండ్రి వలన, వానప్రస్థుని వలనఁ ఏకాంతముగ నుండువాని వలన గొనినదీక్ష శుభప్రదముకాదు. ఇవి యంతయు సిద్ధులుకానివారి విషయము.

'సిద్ధ మంత్రే గురుః సర్వమయోగ్యం యోగ్యతాం నయేత్'
— శక్తియామిలము.

సిద్ధమంత్రమైనచో గురువు అయోగ్యము నంతను యోగ్యతగా నొనర్చును. కావున సిద్ధమంత్రమునకు గురుదోష ముండదు.

శ్లో॥ యది భాగ్యవశేనైవ సిద్ధవిద్యాం లభేత్ప్రియే,
తత్రైవ తాంతు దీక్షేత త్యక్త్వా గురు విచారణమ్॥
— సిద్ధయామళము.

అదృష్టవశమున సిద్ధవిద్య దొఱకుచో గురు విచారణ చేయక అచ్చటనే దీక్షను బొందవలయును.

శ్లో॥ న పత్నీం దీక్షయేద్భర్తా న పితా దీక్షయేత్సుతామ్,
న పుత్రం చ తథా భ్రాతా భ్రాతరం న చ దీక్షయే॥
— రుద్రయామళము.

భర్త భార్యకును, తండ్రి కూఁతురునకును, కొడుకునకును, తమ్మునికి అన్నయును దీక్ష యొసంగరాదు.

శ్లో॥ ప్రమాదాచ్చ తథాఽజ్ఞానాత్పితుర్దీక్షాం సమాచరేత్,
ప్రాయశ్చిత్తం తతః కృత్వా పునర్దీక్షాం సమాచరేత్॥

వ్యా॥ పితురిత్యుప లక్షణం మాతామహాదీనామపి । ప్రాయశ్చిత్తం తు అయుత సావిత్రీ జపః॥ —గణేశ విమర్శినీ తంత్రము.

ఒకవేళ ప్రమాదముచేతఁగాని అజ్ఞానముచేఁగాని తండ్రివలనఁగాని మేనమామ మొదలగు వారిచేఁగాని దీక్షను గైకొనిన ప్రాయశ్చిత్తము కావించుకొని మరల దీక్షను బొందవలయును. దానికి ప్రాయశ్చిత్తము పదివేలు గాయత్రీ మంత్రజపము.

విష్ణుమంత్రము జపింపక అన్యమంత్రములు జపింపరాదు.

శ్లో॥ విష్ణుమంత్రమధికృత్య యోఽన్య మంత్రముపాసతే,
నిష్ఫలా జపపూజార్చా జాపకో రౌరవం వ్రజేత్॥

విష్ణు మంత్రమును వదలి యితర మంత్రము నుపాసించెనా అట్టి జపముగాని, పూజగాని నిష్ఫలమగును. జపించువాఁడు రౌరవ నరకమును బొందును.

శ్లో॥ నిర్వీర్యం చ పితుర్మంత్రం తథా మాతామహస్య చ
స్వప్నలబ్ధం స్త్రియా దత్తం సంస్కారేణైవ శుధ్యతి॥

శక్తి రహితమగు మంత్రము, తండ్రియిచ్చిన మంత్రము, మేనమామ యొసంగిన మంత్రము, స్వప్న లబ్ధమంత్రము, స్త్రీ యొసంగిన మంత్రము ఇవి మఱల సంస్కార మొనర్చుటచే శుద్ధికాఁగలవు.

శ్లో॥ స్త్రియః శూద్రాదయశ్చాపి బోధనీయా హితాహితమ్,
తథార్హా మాననీయాశ్చ నార్హాం త్యాచార్యకం క్వచిత్॥

స్త్రీలు శూద్రులు మంచిచెడ్డలు చెప్పిన వినవచ్చును. వానిని మన్నింపవచ్చును కాని వారు ఆచార్యత్వమునకుఁ బనికిరారు.

వారత్యాశ్రములైనచోఁ బనికివత్తురు.

శ్లో॥ గృహీత మంత్ర స్త్యక్తవ్యో గురుశ్చేద్దోష సంయుతః
మహాపాతక యుక్తో వా పునశ్చేద్దేవ నిందకః॥

గురువు దోషయుక్తుఁడైనను, మహాపాతకియైనను, దేవనిందకుఁడైనను గైకొనిన మంత్రమును త్యజింప వలయును.

అట్లు కాకున్నఁ ద్యజించుచో రౌరవనరకమును బొందును.

శ్లో॥ గురుత్యాగాద్భవే న్మృత్యుర్మంత్ర త్యాగాద్దరిద్రతా
గురుమంత్ర పరిత్యాగా ద్రౌరవం నరకం వ్రజేత్॥

జ్ఞానహీనో గురుస్త్యాజ్యో మిథ్యా వాదీ విడంబకః
స్వ విశ్రాంతిం న జానాతి పరశాంతిం కరోతి కిమ్॥

గురువును త్యజించిన మృత్యువును, మంత్రత్యాగము వలన దారిద్ర్యమును, గురువును మంత్రమును ఈ రెంటిని త్యాగము చేయుటవలన రౌరవ నరకమును గలుగును.

మిథ్యావాదియు, బడాయి కొట్టువాఁడునగు గురువును వదలవలయును. తన విశ్రాంతినే తాను బొందలేనివాఁడు పరశాంతి నెట్లు పొందింపఁగలఁడు.

## దీక్షయొక్క ఆవశ్యకత

దీక్ష యనఁగా మంత్రోపదేశము. దీక్షను గూర్చి శాస్త్రము లిట్లు చెప్పినవి.

శ్లో॥ దివ్యజ్ఞానం యతోదద్యా త్కుర్యాత్పాపస్య సంక్షయమ్
తస్మాద్దీక్షేతి సాప్రోక్తా మునిభి స్తంత్ర వేదిభిః॥

దివ్యజ్ఞానము నొసఁగి పాపసంక్షయమును గావించును గావున దానికి దీక్షయను పేరు కలిగెను.

శ్లో॥ దీక్షామూలం జపం సర్వం దీక్షామూలం పరం తపః
దీక్షామాశ్రిత్య నివసే ద్యత్రకుత్రాశ్రమే వసన్॥

అదీక్షితా యే కుర్వంతి జపపూజాదికాః క్రియాః
న భవంతి ప్రియే! తేషాం శిలాయాం న్యస్త బీజవత్॥

దేవి! దీక్షావిహీనస్య న సిద్ధిర్న చ సద్గతిః
తస్మాత్సర్వ ప్రయత్నేన గురుణా దీక్షితో భవేత్॥

అదీక్షితోఽపి మరణే రౌరవం నరకం వ్రజేత్
తస్మాద్దీక్షాం ప్రయత్నేన సదా కుర్యాచ్చ తాంత్రికాత్ (వైదికాత్)॥

కల్పే దృష్ట్వాతు మంత్రం వై యో గృహ్ణాతి నరాధమః
మన్వంతర సహస్రేషు నిష్కృతిర్నైవ విద్యతే॥

నాదీక్షితస్య కార్యం స్యాత్తపోభిర్నియమ వ్రతైః
న తీర్థగమనేనాపి నచ శారీరయంత్రణైః॥

సద్గురోరాహితా దీక్షా సర్వకర్మాణి సాధయేత్॥

జపమంతకు మూలాధారము దీక్ష. ఉత్తమ తపస్సుకు దీక్షయేమూలము. ఏ యాశ్రమములో నున్నను దీక్ష నాశ్రయించియే యుండవలెను. దీక్షను గైకొనక చేయు జపపూజాదిక కర్మలన్నియు ఆళ్లమీఁద గింజలు చల్లిన ఫలింపనట్లు ఫలింపవు. దీక్షా విహీనునికి సిద్ధియులేదు. సద్గతియును లేదు. కావునఁ బ్రయత్నపూర్వకముగ గురువుచే దీక్షను బొందవలయును. దీక్షపొందని వాఁడు చచ్చిన తర్వాత రౌరవ నరకమును బొందును. కావునఁ బ్రయత్న పూర్వకముగ తాంత్రిక వైదికాదులలో దేనితోనైన దీక్షను బొందవలయును. పుస్తకములోఁజూచి మంత్రము నేనరాధముఁడు గ్రహించునో వేయి మన్వంతరముల వఱకు వానికి నిష్కృతి లేదు. దీక్షపొందని వానికి తపస్సు, నియమములు, వ్రతములు, తీర్థయాత్రలు, శారీర యంత్రణములద్వారా నేమియు లాభములేదు. సద్గురు సమ్మతమగు దీక్షవలన సమస్త కర్మలు సాధింపవచ్చును.

## మంత్ర మెట్లు సిద్ధించును?

శ్లో॥ ఉపదేశస్య సామర్థ్యాచ్ఛ్రీ గురోశ్చ ప్రసాదతః
మంత్రప్రభావా ద్భక్త్యా చ మంత్రసిద్ధిః ప్రజాయతే॥

నిశ్చయోత్సాహ ధైర్యైశ్చ తత్త్వజ్ఞానస్య దర్శనాత్
అల్పాశీ త్యక్త సంగశ్చ షడ్భి ర్మంత్రః ప్రసిద్ధ్యతి॥

ఉపదేశ సామర్థ్యము వలనను, గురుప్రసాదముచేతను, మంత్రప్రభావము వలనను, భక్త్యతిశయము వలనను మంత్రసిద్ధి కల్గును. నిశ్చయము, ఉత్సాహము,

ధైర్యము, తత్త్వజ్ఞానిని దర్శించుటచేతను, అల్పభోజనము వలనను, విడువబడిన సంగము కలవాఁడగుటచేతను, ఈ ఆఱింటివలన సిద్ధించును.

## మంత్ర మేల సిద్ధింపదు?

యదృచ్ఛయాపి తం మంత్రం ఛద్మనాపి ఛలేన వా
పరేరితం వాప్యాదాయ యజ్జపే త్తదనర్థకమ్॥
పుస్తకే లిఖితా న్మంత్రా నాలోక్య ప్రజపంతి యే
బ్రహ్మహత్యాసమం తేషాం పాతకం పరికీర్తితమ్॥
ప్రవాసీ బహుభక్షీ చ ప్రజపీ నియమాపహః
నీచ సంగాచ్చ లౌల్యాచ్చ షడ్భి ర్మంత్రో న సిద్ధ్యతి॥

— పురశ్చరణ పద్ధతి.

యదృచ్ఛగాఁగాని, మోసముచేఁగాని, కపటముచేఁగాని, ఇతరులకు చెప్పఁగా వినిగాని జపించిన నా మంత్ర మనర్థకమగును. పుస్తకములో వ్రాసిన మంత్రమును జూచి చదువుకొని జపించినచో బ్రహ్మహత్యతో సమమగు పాతకమును బొందును.

శ్లో॥ భవే ద్వీర్యవతీ విద్యా గురువక్త్ర సముద్భవా
అన్యథా ఫలహీనస్యా న్నిర్వీర్య త్యాతి దుఃఖదా॥

గురువు నోటినుండి వచ్చిన యేవిద్యయైనను బలము కలదగును. లేకున్న ఫలహీనమును, నిర్వీర్యతయునై దుఃఖము నిచ్చున దగును. "ఆచార్య ముఖాదేవ సాఫల్యాత్" ఆచార్యుని ముఖమునుండి వచ్చుట చేతనే సాఫల్యము చెందును.

శ్లో॥ శ్రీగురుం గురుపత్నీం చ తత్పుత్రాన్ శక్తికాలికాన్
దీక్షితస్తోషయే ద్దేవి ! యథా విభవ విస్తరైః॥

— కులార్ణవము.

గురువును, గురువులవారి భార్యను, గురుపుత్రుని దీక్షితుఁడగువాఁడు తన విభవము కొలఁది సంతోషింపఁ జేయవలెను.

# మంత్రోపదేశ పద్ధతి

మంత్రోపదేశమునకుఁ జాలపద్ధతులు కలవు. లౌకిక దీక్ష వైదిక దీక్ష, తాంత్రికదీక్ష, సిద్ధాంతదీక్ష అని దీక్షలు నాలుగు రకములు. ఇచ్చట వైదిక పద్ధతి సామాన్యరీతిని చెప్పఁబడుచున్నది. దీనికి చాల తతంగము గలదు. విపుల దీక్షాప్రకారమును వ్రాసిన నదియొక గ్రంథ మగును. ఇచ్చట సంక్షేప దీక్షా ప్రకారము వ్రాయఁబడుచున్నది.

శ్లో॥ ముహూర్తే సర్వతో భద్రే నవకుంభం నిధాయ చ,
సోదకం గంధపుష్పాభ్యా మర్చితం వస్త్రసంయుతమ్॥
సర్వౌషధి నవరత్న పంచపల్లవ సంయుతమ్,
తతో దేవార్చనం కృత్వా హునే దష్టోత్తరం శతమ్।
శిష్యం స్వలంకృతం వేద్యా ముపాస్య ముపసంవిశేత్,
మంత్రితైః ప్రోక్షణీ తోయైః శాతకుంభజలై స్తథా॥
మూలమంత్రే ణాష్టశతై ర్మంత్రితై రభిషేచయేత్,
అథ సంపాదయే న్మంత్రం హస్తం శిరసి ధారయన్,
సమోఽస్త్వి త్యక్షతాన్ దద్యా త్తతః శిష్యోఽర్చయే ద్గురుమ్॥

శుభముహూర్తమందు సర్వతోభద్ర పీఠమందు క్రొత్త ముంతలో నీరు పోసి, గంధపుష్పాదులచే నర్చింపవలయును. దానిపై వస్త్రమునుగూడ అర్పింప వలయును. దానిలో సర్వౌషధులు, నవరత్నములు, పంచపల్లవములు ఉంచవల యును. తర్వాత దేవతార్చనము కావించి ౧౦౮ సార్లు ఆ మంత్రముతో హోమము చేయవలెను. తర్వాత నలంకరించుకొనఁబడిన శిష్యుని దగ్గఱకుఁజేరి మంత్రించిన శాతకుంభములోని జలముతో, మూల మంత్రమును ౧౦౮ సార్లు జపించి అభిషేకింప వలయును. అంత తనచేతిని శిష్యుని శిరస్సుపై నుంచి ఉపదేశింపవలయును. 'సముఁడవైతి' వని అక్షతలు శిరస్సుపై వేయవలయును. అంత శిష్యుఁడు గురువును బూజింప వలయును.

### మరియొక విధము.

శ్లో॥ తత్రా ప్యశక్తః కశ్చి చ్ఛేదబ్జ మభ్యర్చ్య సాక్షతమ్,
తదంబు నాభిషిచ్యాష్టవారం మూలేన కే కరమ్,
నిధాయాష్టౌ జపేత్కర్ణే ఉపదేశేఽ ప్యయం విధిః॥

పైనఁ జెప్పినట్లు చేయలేకున్న నొక శంఖమును అక్షతులతోఁ బూజించి, దానిలో నీరుపోసి యెనిమిదిసార్లు చేతిలోఁ బెట్టుకొని అభిమంత్రించి ఆజలముచే శిష్యుని అభిషేకించి చెవిలో నెనిమిదిసార్లు జపింపవలయును.

### ఉపదేశము

శ్లో॥ చంద్రసూర్య గ్రహే తీర్థే సిద్ధక్షేత్రే శివాలయే,
మంత్ర మాత్రప్రకథన ముపదేశః స ఉచ్యతే॥
మహాదీక్షా తథా దీక్షా ఉపదేశ స్తతః పరమ్,
యుగే యుగే చ కర్తవ్యా ఉపదేశః కలౌ యుగే॥

చంద్రసూర్య గ్రహణములందును, తీర్థస్థలములందును, సిద్ధక్షేత్రములందును, శివాలయమందును, కేవలము ఒక్కసారి మంత్రము చెప్పినఁజాలును. అదియే యుపదేశము. మహాదీక్ష, దీక్ష, ఉపదేశము ఈ మూఁడు రకములును యుగయుగములలోఁ జేయువచ్చును గాని కలియుగములో ఉపదేశము ముఖ్యము.

శ్లో॥ తత స్తచ్ఛిరసి స్వస్య హస్తం దద్యా చ్ఛతం జపేత్,
అష్టోత్తరం తతో మంత్రం దద్యా దుదకపూర్వకమ్॥
ఆవయోస్తుల్యఫలదో భవత్వేవముదీరయేత్॥

శిష్యుని శిరస్సుమీఁద తన హస్తమును బెట్టి నూఱు జపముచేసి తర్వాత ౧౦౮ మంత్రమును జపించి ఆ ఫలమును ఉదకపూర్వకముగ శిష్యున కర్పించి మన యిద్దరకు సమానమగు ఫలము కలుగుగాక యని పలుకవలెను.

శ్లో॥ న్యాస జాలం తస్య దేహే గురుః సన్న్యస్య యత్నతః,
దక్షకర్ణే వదేన్మంత్రం త్రివారం పూర్ణమానసః॥ —గౌతమీతంత్రము.

గురువు యత్నముతో శిష్యుని దేహమునందు న్యాసమును జేసి కుడి చెవిలో మంత్రమును పూర్ణమగు మనస్సుతో మూఁడుసార్లు మంత్రింప వలయును.

శ్లో॥ దక్షకర్ణే శిశోర్విద్యా మేకోచ్చారేణ చోచ్చరేత్,
విధిరేష ద్విజాతీనాం స్త్రీశూద్రాణాం చ వామతః॥

శిష్యుని కుడిచెవిలో నొక్కసారి మంత్రము చెప్పవలయును. ఇది ద్విజులకు విధి. స్త్రీ శూద్రులకు ఎడమ చెవిలోఁ జెప్పఁవలెను.

శ్లో॥ దక్షకర్ణే వదేన్మంత్ర మృష్యాదిక సమన్వితమ్,
తథా తస్మిన్ క్షణే దేవి! జపేన్మంత్రం శతాష్టకమ్॥

— విశ్వసారము.

కుడిచెవిలో ఋషి, ఛందస్సు, బీజము, శక్తి, కీలకాదులతోఁ జెవిలోఁ జెప్పవలయును. అంత నాక్షణముననే ౧౦౮సార్లు మంత్రమును జపింపవలయును.

శ్లో॥ దేవతా గురు మంత్రాత్మ తత్త్వైక్యం భావయన్ముదా,
శతం జపేత్తదగ్రస్థో నికటే త్రిదినం వసేత్॥
నచేత్సంచారిణీ శక్తిర్గురుమేతి న సంశయః,
తస్మాత్తదంతికే తస్య పూజాదేశాది కృద్వసేత్॥

— తంత్రరాజము.

మంత్రదేవత, గురువు, మంత్రము ముగ్గురు నొక్కటేయని భావించి, ఆయన సన్నిధానములో నూఱు జపము చేయుచు మూఁడు దినము లుండవలెను. అట్లుండకపోయిన సంచారిణీశక్తి యనుశక్తి నిస్సంశయముగ గురువును బొందును. కావున నాయన సన్నిధానములో పూజాదులు కావించుచుండవలెను.

శ్లో॥ శరీర మర్థ ప్రాణాంశ్చ సర్వం తస్మై నివేదయేత్,
తతః ప్రభృతి కుర్వీత గురోః ప్రియమనన్యధీః॥
యద్యదిష్టతమం లోకే గురవే తన్నివేదయేత్॥

శరీరమును, ద్రవ్యమును, ప్రాణములను గురువునకు సమర్పింపవలయును. అప్పటినుండి అనన్య మనస్కుఁడై గురువునకుఁ బ్రీతి యొనర్పవలయును. లోకములోఁ దనకేది యిష్టమో దానిని గురువునకుఁ దెచ్చి సమర్పింప వలయును.

ఇట్లని గురువు కామినీ కాంచనాసక్తుఁడై శరీరమర్పింపుమని కలదుగదా యని స్త్రీలకుపదేశించి నింద్యాకార్యములను జేయరాదు. గురువునకు సర్వ సమర్పణము చేయుమని కలదుగదా యని సమర్పణము శిష్యుఁడు భక్తితోఁ జేయఁగా వానికి లేకుండ నంతయు గ్రహింపరాదు. అతఁడయాచితముగ భక్తి పూర్వకముగ సమర్పించినదే గైకొనవలయును. అతఁడా ద్రవ్యము గురువుదని ప్రసాదరూపముగ గ్రహించి తరింపవలయునను తాత్పర్యముతోఁ జెప్పఁబడిన విషయమిది. గురువు బోధ గురువుగా నుండవలయును గాని బాధ గురువుగా నుండరాదు.

శ్లో॥ ఆచార్యాదనభిప్రాప్తః ప్రాప్తశ్చాదత్త దక్షిణః
అభ్యస్తోఽపి సదామంత్రః శ్రేయసే నావకల్పతే॥

— నారదీయపురాణము.

దొరకుటకు దుర్లభమగు మంత్రము నాచార్యుని వలన దొరకిన నాతనికి దక్షిణనీయక మంత్రమును సదాజపించినను శ్రేయస్సుకలుగదు. సిద్ధింపదుకూడా.

శ్లో॥ గురవే దక్షిణాం దద్యాత్ప్రత్యక్షాయ శివాత్మనే
సర్వస్వం వా తదర్ధం వా తదర్ధం వా తదాజ్ఞయా॥
నచేత్సం చారిణీ శక్తిః కథమస్య భవిష్యతి
గజాశ్వ మహిషీ మేష పశుదాసీ మహీయుతమ్
అపూర్వం భూషణం వాసో భవనం చాన్యదీప్సితమ్॥
దద్యాత్స్వశక్తితో భక్త్యా హ్యాశక్తో యది సర్వదా
సర్వథాఽసౌ తదాయత్తస్తేన సిద్ధిర్భవిష్యతి॥

— స్వతంత్రతంత్రము.

ప్రత్యక్ష పరమేశ్వరుఁడగు గురువునకు దక్షిణ నొసంగవలయును. సర్వస్వ మును గాని, దానిలో సగమును గాని, పాతిక భాగమును గాని ఆయన యాజ్ఞచే సమర్పింప వలయును. అట్లు గాకున్న నాతనిలో సంచారిణీ శక్తి యెట్లు కలుగును? ఏనుఁగులు, గుఱ్ఱములు, గేదెలు, మేఁకలు, పశువులు, దాసీలు, భూమి అపూర్వములగు భూషణములు, వస్త్రములు, భవనములు, ఇంకా ఆతని కిష్టమైనవి సమర్పింప వలయును. ఇంత శక్తి లేకున్న సర్వదా ఆతనికి వశుఁడై ఆతనికి సేవచేయుచుండిన మంత్రము సిద్ధింపఁగలదు.

శ్లో॥ గో భూ హిరణ్య వస్త్రాద్యై స్తోషయేద్గురుమాత్మనః,
సర్వస్వం దక్షిణాం దద్యా త్తదర్థం వా దయాన్వితే॥
చతుర్థాంశం దశాంశం వా గాశ్చ దద్యాత్పయస్వినీః,
భూమిం విత్తకరీం దద్యా త్పుత్ర పౌత్రాను జీవినీమ్॥
గురు సంతోషమాత్రేణ సిద్ధిర్భవతి శాశ్వతీ,
అన్యథా నైవ సిద్ధిః స్యా ద్దుష్ట మంత్రోఽపి సిద్ధ్యతి॥
యథా దత్వాతి సంతుష్టః ప్రసన్నో వరదో మనుః,
విప్రేభ్యో భోజనం దద్యా ద్బహుమాన పురః సరమ్॥

ఆవులను, భూములను, బంగారమును, వస్త్రముల నొసంగి గురువును సంతోష పెట్టవలయును. సర్వస్వమునుగాని దానిలో సగమునుగాని, నాల్గవ వంతుగాని, పదవ వంతుగాని, పాడియావులనుగాని పుత్రపౌత్రులు జీవించుట కనువగు విలువచేయు భూమిని దక్షిణగా గురువున కీయవలెను. మంత్రము గురు సంతోషము వలననే శాశ్వతమగు సి కలుగును. లేకున్న సిద్ధి కలుగదు. ఆయన సంతోషించిన దుష్టమంత్రమైన సి కలుగును. అతని కెట్టిచ్చి సంతోష పెట్టిన మంత్రమంతగాఁ బ్రసన్నము కా గలదు. బ్రాహ్మణులకు బహుమాన పురస్సరముగ భోజన మిడవలయును.

శ్లో॥ గురుదేవం వంచయిత్వా యః కుర్యాద్ధన సంచయమ్,
తేన తద్భుజ్యతే నైవ హ్రియతే రాజ తస్కరైః॥

— కులామృతమ్.

గురుదేవుని వంచించి యెవఁడు ధనమును గూడఁబెట్టునో నది వాఁడు తినఁడు సరేకదా! రాజులు, దొంగలు అపహరింతురు.

శ్లో॥ దీక్షా హీనాన్పశూన్యస్తు భోజయేద్వా స్వమందిరే,
సయాతి పరమేశాని! నరకానేక వింశతిః॥ — కులసారము.

దీక్షా విహీనులగు పశువులకు భోజనము తన యింటిలోఁ బెట్టిన వాఁడు ఇరువదొక్క నరకములలోఁ బడఁగలఁడు.

శ్లో॥ మంత్రం దత్వా గురుశ్చైవ ఉపవాసం యదాచరేత్ ॥
మహాంధకారే నరకే కృమిర్భవతి నాన్యథా॥

దీక్షాం కృత్వా యదామంత్రీ చోపవాసం సమాచరేత్,
తస్య దేవః సదారుష్టః శాపం దత్వా ప్రజేత్పురమ్॥

— యోగినీ తంత్రము.

మంత్రమిచ్చి గురువు ఉపవాసము చేయునెడల మహాంధకార నరకములో క్రిమి యగుట తప్పదు. దీక్షను బొందినమంత్రి ఉపవాస ముండెనా, వాని మీఁద సదా దేవుఁడు కోపముతోనుండి శాపమిచ్చి పోవును.

## దీక్షా భేదములు

దీక్షయొక్క ఆవశ్యకతను గూర్చియు నెట్లీయ వలసినదియుఁ జెప్పఁబడినది. ఇప్పుడు గురువు దీక్ష నెన్నిరకములుగ నిచ్చునదియుఁ జెప్పఁబడు చున్నది.

మంత్ర దీక్ష యనఁగా గురు కృపాప్రవాహమును శిష్యుని శ్రద్ధా ప్రవంతియు మిళితమగుట. శిష్యుఁ డిదివఱకే తనకొక యిష్టదైవమును నిర్ణయించుకొని, ఆ యిష్టదైవ ప్రాప్తికి ఉపదేశమందవలసిన మంత్రమెఱిఁగిన సద్గురువు నాశ్రయించును. శిష్యుఁడు సద్గురువున కాత్మ సమర్పణము కావించును. 'శిష్యస్తే ఽహంశాధిమాం త్వాం ప్రపన్నమ్' అని గురుని పాదపద్మములపైఁ బడును. గురువునకు శిష్యుఁడాత్మ సమర్పణము గావించి నప్పుడు గుర్వనుగ్రహించి ఆత్మ ప్రదానము మఱలఁ గావించును. ప్రపన్నుని భగవంతుఁడెట్లు తానే బాధ్యత వహించి నిరంతరము రక్షించుచుండునో, అట్లే తనకాత్మ సమర్పణము గావించిన శిష్యునకు గురువాత్మ ప్రదానము కావించును. ఇంకను గురువు దీక్షతోఁబాటు జ్ఞానమును, శక్తిని, సిద్ధుల నొసంగును. జ్ఞానమువలన నజ్ఞానమును, శక్తివలనఁ బాపమును, సిద్ధివలన దారిద్ర్యము నశించును.

దీక్ష ప్రతివారికిని ఆవశ్యకమై యున్నది. దీక్ష లేక పరమాత్మ ప్రాప్తి కలుగదు. ఎన్ని సాధనలు గావించినను పరమాత్మ ప్రాప్తి కొఱవడియే యుండును. వీఁడెన్ని చేసినను సాధన రహస్యము తెలియనిది తత్ఫలసిద్ధి యెట్లు లభింపఁగలదు? ఒకానొక ఆవరణములో నిధి యున్నదని తెలియును. అది యే స్థలములో నెంత లోతున నున్నదియో సరిగా తెలియదు. దానిని దెలియవలెననిన బుద్ధిహీనుఁడేమి చేయును? ఆ యావరణములోఁగల గృహారామాదులను నాశము కావించి జలధి వఱకు ద్రవ్వినఁగాని అది లభింపదు. ఆ నిధి ఫలాని స్థలమున నున్నదని తెలిసినవాఁడు చప్పున నిచ్చట నిన్ని గజముల లోతుననున్న

దని నిర్దేశించి చెప్పిన నచ్చటనే త్రవ్వి సులభముగ దానిని బొందవచ్చును గురువు చెప్పినప్పుడు ముందతనిపై విశ్వాస ముంచవలయును. అతఁడు చెప్పిన చోప్పున స్థలమును తప్పక త్రవ్వవలెను. ఆ నిధినిబొంది చివరకు ఆనందము ననుభవించునది తానే యని శ్రద్ధాభక్తులు చూపవలెను. చెప్పినట్లు చేయక ఆ ఫలము లభింపలేదనిన నేమిలాభము? అట్లే గురునిపై విశ్వాసముంచి, అతఁడు చెప్పిన సాధన క్రమమునఁ బోయి శ్రమించి ఆ పరమార్థతత్త్వమును గ్రహింప వలయును. కావున గురుదీక్షవలనఁ బరమార్థ తత్త్వము శీఘ్రముగ లభించునని సిద్ధమగుచున్నది.

పరమాత్మ ప్రాప్తికి అహంకారము నశింపవలెను. గురువు లేకున్నను ఘోరతపస్సును గావించినఁ గొంతశక్తి లభించును. కాని అహంకార జవనిక తెగనిది పరమాత్మ ప్రాప్తి లభించదు. అందువలనఁ దనకుపైన నొకఁడు గొప్ప వాఁడు (గురువనఁగా గొప్పవాఁడని యర్థము) కలఁడనుట అహంకారము చచ్చుటే యగును. ఒక పరమ సాధువు (భగవదనుగ్రహము పొందినవాఁడు) 'వీడు నా వాఁడ'ని అనుకొన్ననే భగవంతుఁ డనుగ్రహించును గాని లేకున్న ననుగ్రహింపఁడు. గురువొక సాధువే కావున నాతఁడు శిష్యుని భక్తిని గాంచి 'నా వాఁడ'ని యనుకొనిన జాలుఁను. శిష్యుఁ డనుగ్రహింపఁ బడినఁవాఁడే యగును.

ప్రతివానిలోను జ్ఞానశక్తి సుప్తి చెందియుండును. దానికి కారణ మజ్ఞానము. విషయవాసన లొకటిపై నొకటి పడి సుప్తి చెందిన జ్ఞానము నావరించి యుండును. సాధకుఁడు గురువులేకయే విషయవాసనాచ్ఛాదనమును దొలఁగించు కొనఁగలఁడు. అజ్ఞానావరణమును గూడ కొంతవఱకు తొలఁగించు కొనఁ గలఁడు. కాని సుప్తి చెందిన జ్ఞానము జాగృతి చెందుటెట్లు? గురుదీక్షవలననో, హస్త మస్తక స్పర్శవలననో, కేవలానుగ్రహముచేనైన సరియే శిష్యుని లోని జ్ఞానము జాగృతి చెందును. దీక్షాకాలమున నైనను, దీక్షానంతరమైనను గుర్వను గ్రహము కలుగఁగానే శిష్యునిలో జ్ఞానప్రకాశము కలిగినట్లు శిష్యునకుఁదోఁచి తీరును. దానిని శిష్యుఁడు గమనింప వలయును. గురుని శక్తి పాతము (దీక్షా) మూలమున శిష్యునిలో జ్ఞానసంచారము కలుగుచుండును. ఈ జ్ఞాన సంచారము కలుగుటకుఁ బ్రారంభింపఁగనే శిష్యునిలోని పాపసమూహ మంతయు భస్మీపటలమై హృదయ నిర్మలత యేర్పడును. అప్పుడే నిజముగ సాధకుఁడు భగవ

త్సేవకు యోగ్యుఁడగు చున్నాఁడు. పైవిషయములను బట్టి దీక్ష ప్రతివానికిని అవసరమై యున్నదనియు, శక్తిపాత మహిమ కలదనియుఁ దెలియుచున్నది.

## శక్తిపాతమహిమ — భేదములు

పైనఁజెప్పిన శక్తిపాతము మాయాతీతమైనది. కావున మాయను బోఁ గొట్టును. ఇది కేవలము నిర్వ్యాజ భగవత్కారుణకు సంబంధించినది. ఈ కరణ కేవలము సత్పురుషులయందే కలుగవలెనను నియమము లేదు. మహామహేశ్వ రాచార్యులవారు చెప్పినట్లు—

శ్లో॥ శక్తిపాతసమయే విచారణం
ప్రాప్తమీశ న కరోషి కర్హిచిత్
అద్య మాం ప్రతి కిమాగతం యతః
స్వప్రకాశన విధౌ విలంబసే॥

ఓ ప్రభూ! నీవు శక్తిపాతము చేయు (జీవునిపైఁ గృపసారించు) సమయమున న్యాయముగఁ బ్రాప్తింపవలసిన దైనను పాత్రాపాత్ర విచారణ సేయవు. నేఁడు నావిషయమున నేమి వచ్చిపడినది. నాకు ఆత్మ ప్రకాశము కలిగించుటలో నాలస్యము చేయుచున్నావు.

శక్తిపాతము కలుగఁగానే జపధ్యానాది క్రియలం దనురక్తుఁడగును. జపధ్యానాదులు కర్మలు కావు. పరమేశ్వర స్వరూప వికాసమునకును గ్రియాశక్తికి (కర్మకు) చాల భేదము కలదు. కర్మలు పరిమితమగు ఫలము నొసంగి భోగింపఁజేయును. భగవత్కృప అనఁగా శక్తిపాతము మంచివారు చెడ్డవారను విచక్షణ లేకుండ పూర్వజన్మ వాసనను బట్టి కలుగవచ్చును. భగవత్కృప రెండు విధములు. మాయా సహిత శక్తిపాతము. మాయా రహిత శక్తిపాతము. మాయా సహిత శక్తిపాతము ధనాది భోగముల నొసఁగును. మాయా రహిత శక్తిపాతము జపధ్యానాదులం దాసక్తిని గలిగించి మోక్షము నొసంగును.

శక్తిపాతము ముఖ్యముగ నింక రెండు విధములుగలవు. పరశక్తి పాతము. అపరశక్తి పాతము. వీనినే వేఱొక భాషలో పూర్ణకృప, అపూర్ణకృప యన వచ్చును. పరశక్తి పాతము కేవల పరిపూర్ణ చిదాత్మ ప్రకాశముగ నవచ్ఛేదమై యుండును. ఇందులో భోగాంశ, అధికారాంశవలనఁ గొంచె మవచ్ఛేదముం

డును. పూర్ణకృపకు అనఁగా పరశక్తి పాతమునకుఁ బరమేశ్వరుఁడే యధికారి. అపూర్ణకృప లేక అపరశక్తి పాతమునకు బ్రహ్మాది దేవత లధికారులు. అనఁగా బ్రహ్మలోక ప్రాప్తివఱకు వారికి ఫలము కలుగును.

ఈ శక్తిపాతము మందము తీవ్రమని మఱి రెండు విధములు. వీనిని బొందువారిద్దరును మరల జనన మొందరు. కాని మందశక్తి పాతమును బొందు వాఁడు ప్రాయకముగ నప్రాకృత జగత్తున జన్మించును. తీవ్రశక్తిపాతమును బొందువాఁడు కళాపురుషజ్ఞానము కలిగి మాయాతీత పరిపూర్ణ పరమాత్మ తత్త్వ మును దెలిసికొనును. ఈతఁడు మాయాతీతుఁడగును. ఇట్లు తెలిసికొనిన వాఁడు మఱల నింక భూమిపై జన్మింపఁడు.

ఇట్టి తీవ్రశక్తిపాతమును బొందినవాఁడు సాధన కొలఁది మంత్ర, మంత్రే శ్వర, మంత్రమహేశ్వర, పరమేశ్వర భావమును బొందును. శక్తిపాతము (దీక్ష) లోఁగూడ అధికార భేదములు కలవు. అవి సమయీ, పుత్రక, సాధక, ఆచార్యులని నాల్గు రకములుగ నుండును. ఇట్లు వరుసగ నగుదురు, కొందఱకుఁ గ్రమములేదు. సమయీ అనఁగా మందశక్తి పాతమును బొంది మాయాధికార మున రుద్రాంశయందుండుట. పరమేశ్వరుని విశిష్టకృపచేఁ గ్రమముగాఁ బుత్రక దీక్షను బొందును. పుత్రక దీక్షయనఁగాఁ దీవ్రతర శక్తిపాతమును బొంది విశుద్ధ మార్గమున దేహపాతానంతరము పూర్ణలాభమును బొందుదురు. సాధక దీక్ష యనఁగా మొదట భోగైశ్వర్యములను బొంది, విరక్తులై పరమ పదమును బొందుదురు. యోగ్యతాను సారముగ మందతీవ్రము లుండును. ఆచార్య దీక్ష యనఁగాఁ గర్తవ్యకార్యము లన్నిటిని బూర్తి కావించి సృష్టి, స్థితి, సంహార, అనుగ్రహ, నిగ్రహ (తిరోధాన) ములను జేయు పరమాత్మ స్వరూపమునందుండి ఆచార్యులగుదురు. ఈ యాచార్యులు విభిన్న యోగ్యతల ననుసరించి భుక్తి ముక్తులనిచ్చు మంత్రముల నొసంగి అనుగ్రహించెదరు.

శక్తి పాతము తీవ్ర, మధ్య, మందములని ముఖ్యముగ మూఁడు రక ములు. ఇవి ఒక్కొక్కటి మరల మూఁడు విధములు. ౧. తీవ్ర తీవ్రము. ౨. మధ్య తీవ్రము. ౩. మంద తీవ్రము. ౪. తీవ్ర మధ్యము. ౫. మధ్యమధ్యము. ౬. మందమధ్యము. ౭. తీవ్రమందము. ౮. మధ్యమందము. ౯. మందమందము. అని తొమ్మిది విధములు.

## 1. తీ వ్ర తీ వ్ర ము

ఈశక్తి పాతము కాఁగానే కొందఱు వెంటనే మరణింతురు. కొంద ఱాలస్యముగ మరణింతురు. కొందఱింకను ఆలస్యముగ మరణింతురు. కారణ మేమనఁగా వీనికి ప్రారబ్ధముకూడ క్షయించును. ప్రారబ్ధము క్షయించిన వెంటనే చచ్చును.

## 2. మధ్య తీవ్రము

ఈశక్తి పాతమువలన దేహనాశము కాదు; కాని అజ్ఞానక్షయమగును. ప్రారబ్ధక్షయము కాదు. అనఁగాఁ బ్రారబ్ధక్షయము వినా మిగిలినదంతయు జరుగును. తీవ్రములో అజ్ఞానముయొక్క ఆవరణాంశము, విక్షేపాంశము రెండును నశించును. దీనిలో ఆవరణాంశము మాత్రము నశించును. దీనిలో నజ్ఞాన నివృత్తి కావించు జ్ఞానము స్వతః పుట్టును గాని శాస్త్రముల వలనను, గురువు వలనను గలుగదు. దీనికే ప్రాతిభ జ్ఞానమని పేరు. ఇది స్వతః కలుగుటచే వీని కాచార్యునితోను, శాస్త్రముతోను బనిలేదు. ఇది కేవలము పరమేశ్వరాను గ్రహమునుబట్టి కలుగును. శాస్త్రము పేయము గురువు ఉపాయము. వీనికి ఉపేయోపాయములతోఁ బనిలేదు. గురువు చెప్పిన జ్ఞానముకంటె శాస్త్ర జ్ఞానము శ్రేష్ఠము. కారణము గురువుకూడ జ్ఞానమును శాస్త్రము వలననే పొందినవాఁడు కనుక. శాస్త్రజ్ఞానముకంటెఁ బ్రాతిభజ్ఞానము శ్రేష్ఠమైనది. దీనిని అనుభవజ్ఞాన మనవచ్చును. ఇది హృదయమున భగవత్ప్రేరణ వలన జనించును. ఇట్టి ప్రాతిభ జ్ఞానము కలిగినవానికి మంత్ర సంస్కారాదు లనవసరములు. శక్తిపాతముయొక్క ముఖ్యలక్షణము భగవద్భక్త్యన్మేషము. వీనికి అభిషేకాది సంస్కారములు వాటి యంతట నవియే సిద్ధించును. వీనికి దీక్షా విషయములో జరుపవలసిన క్రియలవసరము లేదు. వీనికా ప్రాతిభజ్ఞానమువలన నింద్రియము లంతర్ముఖములై యాత్మతో నేకీభూతమగును. అప్పుడు వీనికి శక్తులను పేరుకలుగును.

శ్లో॥ బహిర్ముఖస్య మంత్రస్య వృత్తయో యాః ప్రకీర్తితాః
తా ఏవాంతర్ముఖ స్యాస్య శక్తయః పరికీర్తితాః॥

మంత్ర (చిత్త) ము బహిర్ముఖమయిన వేనిని వృత్తులందుమో, యవియే అంతర్ముఖములైన శక్తులని చెప్పఁబడును.

బహిర్ముఖములైన యింద్రియముల ద్వారా గురు శాస్త్రాదుల ద్వారా గ్రహించిన జ్ఞానముకంటె అంతర్ముఖములైన శక్తులద్వారా పరమాత్మనుండి పొందెన జ్ఞానము పరమోత్కృష్టమైనది. దీనిలో శాస్త్ర రహస్యము లన్నియు బయటుపడును. కేవలము బహిరింద్రియముల వలనఁగలిగిన సవికల్పక జ్ఞానము వలన శాస్త్రములలోని అంతరార్థము గ్రహింప వీలులేదు. ఇట్టి ప్రాతిభ జ్ఞానము శాస్త్రము వలననైనఁ గలుగవచ్చును. లేదా స్వయముగానైన నుత్పన్నము కావచ్చును. స్వయముగ నుత్పన్నమైన జ్ఞానము అనఁగా ప్రాతిభ నిర్వికల్పక జ్ఞానము శ్రేష్ఠమైనది.

## 3. మంద తీవ్రము

ఈ శక్తిపాతములో శిష్యుఁడు సద్గురువు నన్వేషించు చుండును. ఆర్తి, భక్తి కొలఁది సద్గురువు దొఱకితీరును. శక్తిపాత మహిమవలన సద్గురువు దొఱకి మంత్రోపదేశమును, తత్త్వోపదేశమును జేయును. ఇట్టి సమయమున శిష్యునకు తత్త్వజిజ్ఞాసాపేక్ష కలుగుచుండును. గురువిట్టి శిష్యునికి గొన్ని దినముల కుప దేశ మొసంగి యథార్థ జ్ఞానమును గలిగించును. శిష్యునిపైఁ బ్రసరింపఁ జేసిన శక్తి పాతమాత్రమును బట్టి శిష్యునకు సాంసిద్ధిక సంస్కృత గురువులలో నెవరో యొకరు దొఱకును. సాంసిద్ధిక గురువన స్వయముగఁ బ్రాతిభజ్ఞానము పొందిన గురువు. సంస్కృత గురువనఁగా వేఱొక గురువుచేఁ బరమార్థ జ్ఞానమును బొందినవాఁడు. ఇట్టి గురువువలన పరమార్థ తత్త్వమును దెలిసికొని జీవన్ముక్తుఁ డగును. వానికి దేహపాతము కాకపోయినప్పటికిని కొరిడీ కట్టిన టెంకాయవలె దేహాభిమానమునకు దూరముగనే యుండి, ప్రపంచములో సామాన్య మానవుని వలెఁ బ్రవర్తించు చుండును.

శ్లో॥ యస్మిన్ కాలే తు గురుణా నిర్వికల్పం ప్రకాశితమ్,
తదైవ కిల ముక్తోఽసౌ యంత్రం తిష్ఠతి కేవలమ్॥

— రత్నమాల ఆగమము.

ఎప్పుడు గురువుచే నిర్వికల్ప జ్ఞానము ప్రకాశింపఁజేయఁ బడినదో అపుడే ఆలేఁడు ముక్తుఁడైనాఁడు. దేహ యంత్రము మాత్రము మిగులును.

జీవన్ముక్తునకు సుఖదుఃఖానుభవము ప్రారబ్ధకర్మానుసారము జరుగును. వాఁడు కేవలము ప్రారబ్ధమునే అనుభవించును గాని, ప్రారబ్ధవశమున నే కర్మ లొనర్చినను వాని ఫలములు వాని నంటవు. గీతలలోఁ జెప్పఁబడిన స్థితప్రజ్ఞుని వలె నగును. వీనికి దేహపాతానంతరము భగవదైక్యము.

## 4. తీవ్ర మధ్యము

ఈశక్తిపాతము వలన బ్రహ్మ (రామ) త్వ సిద్ధి వెంటనే కలుగదు. దీక్షానంతరము క్రమముగా నది సిద్ధించు చుండును. కాని దీనిలో స్పష్టానుభవము కలుగదు. వీనికి జీవితకాలములో నిర్వికల్ప ఆత్మసాక్షాత్కారముండదు. కాని దేహపాతానంతరము పరమాత్మ ప్రాప్తి కలిగి తీరును. ఇదియే పుత్రకదీక్ష.

## 5. మధ్య మధ్యము.

ఈశక్తి పాతములో భోగకాంక్ష నివృత్తి కాదు. అయితే పరమేశ్వర ప్రాప్తి కొఱకై దృఢాపేక్ష కలుగుచునే యుండును. ఈశక్తి పాతములోని దీక్షవలన స్వాత్మ తత్త్వమును గురించిన జిజ్ఞాస కలుగు చుండును గాని భోగాపేక్ష వదలక పోవుటచే భోగానుభవమున కధికారియై యీ జీవితములోనే భోగముల ననుభవించి దేహపాతానంతరమునఁ బరమాత్మ ప్రాప్తి చెందును.

## 6. మంద మధ్యము

ఈశక్తిపాతములో పైవిధముగనే భోగకాంక్ష యుండును గాని భోగము ననుభవించుటకైనను వాఁడీ జన్మలో నధికారి కాఁజాలఁడు. తర్వాత జన్మలో వాంఛిత భోగము ననుభవించి కైవల్యము చెందును.

## 7. తీవ్ర మందము

ఈ క్రిందఁ జెప్పఁబోవు శక్తిపాతములు మూడును భోగమునకు సంబంధించినవి. వీనిలో నున్నవారు పరమేశ్వర ప్రాప్తికి ఉత్సాహము చెందరు. ఉపాసనయైనను కేవలము భోగకాంక్షులై చేయుదురు. పరమేశ్వర ప్రాప్త్యుద్దేశ్యము యే యణుమాత్రమో హృదయమునఁ దాఁగియుండును. ఈ దీక్షవలన దేహపాతానంతరమున నభీష్టలోకములలో నణిమాది సిద్ధులనుభవించుచుందురు.

వారికి పరమేశ్వరుని యనుభవము సకళా రూపములోఁ గొన్నాళ్లును, నిష్కళా రూపములోఁ గొన్నాళ్లు ననుభవింతురు.

## 8. మధ్య మందము

ఈ దీక్షలో పై విధముగ భోగకాంక్షయుండుట వలన సూర్య్వలోకము వందు భోగము ననుభవించి అచ్చటి ఆలోకాధిపతిచే దీక్షను బొంది పరమేశ్వర ప్రాప్తి చెందును.

## 9 మంద మందము

ఈ శక్తిపాత దీక్షవలన నాతఁడేలోకములో భోగములను బొంది వాంఛించునో ఆలోకములో దేహపాతానంతరమున సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యాది ముక్తులను బొంది చివరకా లోకాధిపతిచే దీక్షను బొంది పరమాత్మప్రాప్తి చెందును.

పై విషయమంతయు వ్రాయుటవలన గ్రంథవిస్తరమగుచున్నను, శక్తిపాత దీక్షా భేదములను దెలిసికొనుట వలనఁ దామెంతటి స్థితిలో నున్నదియు, భగవదనుగ్రహము (శక్తిపాతము) గురువు ద్వారా తనకింత లభించినదియు కొలత బద్దవలె కొలుచుకొన వచ్చును. కావున వ్రాయఁబడినది. దీనినిబట్టి శక్తిపాతము లేక దీక్షా వినా భగవత్కృప కలుగదనియు, భగవత్కృపయననదియే యనియు ఇది లేక యెంత సాధన చేసినను నది నెఱవేరనిదే యనియు అయితే నిష్కల్మషముగ సాధన మందుగఁ జేయుచుండిన నధికారమును విచారించి భగవంతుఁడే తగిన గురువును లభింపఁ జేయుననియు, ఆ దొరకిన గురువు మానవుఁడుగఁ గనఁబడుచున్నప్పటికిని మానవుఁడు కాఁడనియు, శక్తిపాత దీక్షానుగ్రహమునకు భగవంతునిచేఁ బంపఁబడినవాఁడు కావున, భగవంతుఁడైనను ఒక గురువు మూలముననే కరుణించును గావున గురువు సాక్షాత్తుగ భగవంతుఁడనియే యెంచవలయును. పై విషయమునుబట్టి శక్తిపాత తారతమ్యము సాధకుని తారతమ్యమునుబట్టి యుండునని తెలిసికొనవలయును. అతఁడెట్టి యధికారియైనఁ గాని యొక్కసారి వానికి శక్తిపాతము (దీక్షాప్రదానము) జరిగిన యెడల వాఁడెన్నటికైనను పరమపదప్రాప్తిఁ బొందితీరును. భోగకాంక్షవలన మోక్ష ప్రాప్తి విలంబమగును. భోగకాంక్ష లేక శీలాదులలో నితర యోగ్యతలు లేకున్నను ఒకమాత్ర వానిని తీవ్రాతితీవ్ర మాత్రగా గూడ ననుగ్రహింపవచ్చును

'శక్తిపాత సమయే విచారణం ప్రాప్తమీశ నకరోషి కర్హిచిత్' అను వాక్యమును నమ్మవలెను. కాని సాధారణముగ యోగ్యతానుసారమే కలుగుచుండును. ఎట్టి శక్తిపాతమైనను గానిండు, ఒక్కసారి పతితమైన నది యా జీవుని ఉద్ధరించి పరమాత్మ ప్రాప్తి కలిగించి తీరును. గురువు జాగృతి నొందించిన జ్ఞానమందములో నొకటియా, అనేకమా యను ప్రశ్న రావచ్చును, జ్ఞానమొక్కటియే కాని అనేకముగాదు. కాని సాధకుని యొక్క అర్హత కొలఁది అది వ్యక్తమగుచుండును. పాత్రయొక్క పరిమాణ మెంతయో అంత నీరే దానిలోనికిఁ జేరును గాని యెక్కువగఁ జేరదు. గురువను జ్ఞాన సముద్రమునుండి కరుణచేఁ బొంగి పారలి వచ్చిన జ్ఞానామృతము శిష్యుని హృదయ విశాలతను బట్టి అతఁడు గ్రహించుచుండును.

హృదయ పరిపక్వత, విశాలత అందఱ కొక్కరీతిగ నుండదు. కారణ మేమనఁ గొందఱు మనుష్య జన్మమునకుఁ గుక్కలై కొందఱును, నక్కనుండి కొందఱును, ఆవు, మేక మొదలైన జంతువులనుండియు, ఇంకననేక జన్మలెత్తి యేదోజన్మనుండి మనుష్యజన్మ యెత్తినవారును, కొందఱు పూర్వజన్మమున మనుష్యులైనను వారి స్వభావములను బట్టియు, సంస్కారములనుబట్టియు వేఱువేఱు తరగతులుగ నుందురు. గురువు వారివారి అర్హతలనుబట్టి వారికి దీక్ష నీయవలయును. రోగ నిర్ణయముచేసి రోగియొక్క బలాబలములను, స్వభావము ననుసరించి ఔషధమిచ్చిననే రోగ మెట్లు నయమగునో అట్లే శిష్యుని అర్హతను గనిపెట్టియే గురువు వానికి మేలొనగూర్చు మంత్రము నీయవలయును. దానికి తగిన సిద్ధారిచక్రము, కులాకుల చక్రవిచారణ మొదలగున వన్నియు గురువు చూచి చేయవలెను. ఇట్లు చేసిన ఉపదేశము శీఘ్రముగ ఫలించును.

దీక్ష ఒక్కసారియే యుండవలయునా? అనేక సార్లుండవలెనా? అను ప్రశ్నకు సమాధానము; దీక్షాపద్ధతి ఒక్కమారే యుండవలయును. ఒక్కసారి దీక్ష యీయఁగానే వాని యధికారమును బట్టి ఆలస్యమగును కాని అది పరమాత్మ ప్రాప్తి కలిగించి తీరును.

## వివిధ దీక్షలు

దీక్షా భేదములు తంత్రశాస్త్రములలో ననేకవిధములఁ జెప్పఁబడినవి. వాటిని దెలిసికొనుట మనకును ఉచితమేయగును. సామాన్యముగ దీక్ష మూఁడు విధములు. శక్తి దీక్ష, శాంభవీ దీక్ష, మంత్ర దీక్ష.

## శక్తి దీక్ష :

కుండలినియే చేతనాత్మకమగు శక్తి. దానిని దీక్షా చర్యవలన గురువు మేల్కొలిపి బ్రహ్మనాడి ద్వారా సహస్రారమునఁగల శివు (భగవంతు) నిలోఁ గలుపును. ఈదీక్షలో గురువు శిష్యునియొక్క అంతర్దేహమునందు సంకల్పరూపమునఁ బ్రవేశించి నిద్రించుచున్న కుండలినీ శక్తిని లేపి, స్వశక్తిచేతనే భగవంతునిలోఁ జేర్చును. ఈదీక్షలో శిష్యుఁడు చేయవలసిన సాధన యేమియునుండదు.

## శాంభవీ దీక్ష :

గురువు తన కరుణను శిష్యునిపైఁ బ్రసారింపఁజేసియైనను, లేదా చేతితోఁ దాఁకియైనను తత్క్షణముననే పరమాత్మ స్వరూపానుభవము కలుగఁ జేయును. రుద్రయామిళ తంత్రము ప్రకారము సహస్రారకమల కర్ణికాంతర్గత చంద్రమండల సుధాప్లావిత చరణద్వంద్వములు గల శివశక్తుల నుపాసింపఁ జేయుటకు శాంభవీ దీక్ష యందురు. అనఁగా గురుని కృపాదృష్టివలననే శిష్యుని సహస్రారకమలము వికసించి వెంటనే సమాధిని బొంది కృతకృత్యుఁ డగును. శ్రీ రామకృష్ణ పరమహంస వివేకానందుని కిచ్చిన శక్తిపాతము వంటిదిది.

## మంత్ర దీక్ష :

దీనినే రుద్రయామిళ తంత్రములో ఆణవీ దీక్ష యని చెప్పఁబడినది. ఈ దీక్షలో మంత్రయోగమునకుఁ గావలసిన భక్త్యాది పదునారు అంగములు కావలయును. దీనిలో గురువు శిష్యునకు మంత్రోపదేశము కావించును. వీరియొక్క శ్రద్ధాభక్తులను బట్టి అది సిద్ధి వహించును. గురువు మూలముగా శక్తిపాతమును బొందును. దానివలన సిద్ధి కలుగుచుండును. ముక్తికి సంబంధించిన ఫలసుండుటకు నొక్కటియే. కాని సాధన, శ్రమ, కాలవిలంబనములలో భేదము కలదు. గుర్వనుగ్రహము వారివారి భక్తిశ్రద్ధలను బట్టియు, పూర్వజన్మ పుణ్య పరిపాకమును బట్టియు కలుగుచుండును.

అచ్చటచ్చట మంత్రదీక్షలో పది భేదములు కలవని శాస్త్రము చెప్పుచున్నది.

౧. స్మార్తీ ౨. మానసీ ౩. యౌగీ ౪. చాక్షుషీ ౫. స్పార్శికీ (తథా) ౬. వాచకీ ౭. మాంత్రికీ ౮. హౌత్రీ ౯. శాస్త్రీ ౧౦. అభిషేచికా.

### ౧. స్మార్తీ దీక్ష :

గురువు, శిష్యుఁడు దూరముగనుండి, గురువు శిష్యుని స్మరించి, అతఁడు మనోవాక్కాయములఁ జేసిన పాపముల నీవలకు లాగి భస్మము కావించును. అంత దివ్య పురుష సృష్టికావించి లయయోగ పద్ధతిని పరమాత్మయందు లీనము కావించును.

### ౨. మానసీ దీక్ష :-

ఈ దీక్షయుఁ బై విధముగనే యుండును. కాని పైనఁ జెప్పిన స్మార్త దీక్షలో గురు శిష్యులు దూరముగ నుందురు. ఇచ్చట దగ్గఱగ నుందురు. ఇదియే భేదము.

### ౩. యోగీ దీక్ష :-

ఈ దీక్షలో గురువు యోగసిద్ధి చెందినవాఁడుగా నుండవలెను. యోగి యగు గురువు శిష్యుని శరీరములోఁ బ్రవేశించి, అతని ఆత్మను తన శరీరము లోనికిఁ గొనివచ్చి ఏకీభూత మొనర్చి భగవదైక్య మొనర్చును.

### ౪. చాక్షుషీ దీక్ష :-

చాక్షుషీదీక్ష దృష్టికి సంబంధించినది. గురువు తాను సాక్షాత్తు రామ (బ్రహ్మ) స్వరూపమనుకొని, అనుగ్రహదృష్టిచే శిష్యుని జూడఁగా నా చూపు వలన శిష్యుని సమస్త దోషములు నశించి దివ్యత్వ ప్రాప్తి కలుగును.

### ౫. స్పార్శికీ దీక్ష :-

ఈ దీక్షలో గురువు తన కుడి అఱచేతిలో గంధమును బెట్టి శ్రీరామ పూజ కావించి, తాను సాక్షాత్తు శ్రీరాముఁడ ననుకొని, పరమ ప్రసన్న చిత్తముతో ఆ రామహస్తమును శిష్యుని శిరస్సునందు స్పర్శ గావించును. దానిచే శిష్యుఁడు కృతకృత్యుఁ డగును,

### ౬. వాచకీ దీక్ష :-

గురువు తన గురువును ధ్యానించి గురు తాదాత్మ్యమును బొంది, తన వాక్కు గురువు వాక్కు అనుకొని, శిష్య శరీరమునందు న్యాసము కావించి విధివిధానమున మంత్ర మొసంగును.

## ౭. మాంత్రిక దీక్ష :-

గురువు అంతర్న్యాసము, బహిర్న్యాసము గావించుకొనును. అప్పు డతఁడు కేవలము మంత్రశరీరుఁడగును. అప్పుడతఁడు శిష్యునకు తన శరీరము నుండి అతని శరీరమునకు మంత్రము సంక్రమించు చున్నట్లు భావించి దీక్ష నొసంగును.

## ౮. హోత్రీ దీక్ష :-

ఈ దీక్షలో మొదట అగ్నికుండమునందు గాని, వేదియందుగాని అగ్ని స్థాపన మొనర్చి షడధ్వాసంశోధన పద్ధతిని హోమము గావించిన దీక్ష పూర్తి యగును.

## ౯. శాస్త్రీ దీక్ష :-

ఈ దీక్ష కేవలము సామగ్రితోఁ గూడినది కాదు. శిష్యుఁడు యోగ్యుఁ డుగ నుండవలెను. శిష్య లక్షణములను జూడుఁడు. అట్టి శిష్యునకు యోగ్య తాను సారముగ శాస్త్రీయ పదములతో దీక్ష నొసంగును.

## ౧౦. అభిషేచికా దీక్ష :-

ముందు గురువు భగవంతునకు (సీతారాములకు) అభిషేక మొనర్చి, ఆ తీర్థముచే శిష్యుని కుశలతో నభిషేకించి తర్వాత మంత్ర మొసంగును.

శారదా పటలమునందు నాల్గురకములైన దీక్షా విశేషములు చెప్పఁబడినవి. ౧. క్రియావతీ, ౨. వర్ణమయీ, ౩. కలావతీ, ౪. వేదమయీ.

## ౧. క్రియావతీ దీక్ష :

ఇది పది క్రియలకు సంబంధించినది. దీనిలో స్నాన, సంధ్యా, ప్రాణా యామ, భూతశుద్ధి, న్యాస, ధ్యాన, పూజాదుల నొనర్చి శాస్త్ర పద్ధతిచే హోమాదులు కావించి కర్మ చేయవలెను. షడధ్వాశోధన క్రమముచే వేఱు వేఱాహుతులచేఁ బరమాత్మయందు విలీనము కావించి సృష్టిక్రమముచే శిష్యు నకు చైతన్య యోగము కలుగఁజేయవలెను. గురువు శిష్యునిలో నైక్యమై ఆత్మ జ్ఞాన ప్రదానము గావించి మంత్రమిచ్చును.

## ౨. వర్ణమయీ దీక్ష :

ఇది న్యాసరూపమైనది అకారాది [illegible] ప్రకృతి పురుషాత్మకములు. మన శరీరముకూడ ప్రకృతి పురుషాత్మకము. అందువలన ప్రకృతి పురుషాత్మకమగు నీ శరీరమందు ప్రకృతి పురుషాత్మకమగు వర్ణముల న్యాసము గావింపవలెను. గురువు తనయొక్క యిచ్ఛాశక్తిచే నా వర్ణములను ప్రతిలోమ విధిచే విలీనముగావింపఁగా, శిష్యుని శరీరము దివ్యమైన దగును. ఇటు దివ్యుఁడు కాఁగానే వాని శరీరమును సృష్టిక్రమముగా సృష్టిచేసి శిష్యునకు పరమానంద రసానుభవము గలుగఁజేయును.

## 3. కలావతీ దీక్ష :

మానవుని శరీరములో నైదు విధములైన శక్తులు కలవు. పాదతలము నుండి మోఁకాళ్ళవఱకు నివృత్తి శక్తియు, కంఠమునుండి లలాటమునఱకు శాంతి శక్తియు, లలాటమునుండి శిరస్సువఱకు శాంత్యాతీత కలాశక్తి గలవు. గురువు నివృత్తి శక్తిని ప్రతిష్ఠాశక్తిలోనికిని, ప్రతిష్ఠాశక్తిని విద్యాశక్తిలోనికిని, విద్యాశక్తిని శాంతిశక్తిలోనికిని, శాంతి శక్తిని కలాశక్తిలోనికిని, కలాశక్తిని పరమాత్మయందు విలీనము గావించి శిష్యుని పరమాత్మరూపుని గావించును. మరల సృష్టిక్రమముగాఁ బరమాత్మనుండి బయలు దేఱిన యీ పంచశక్తులఁ బ్రసాదించును. అప్పుడు శిష్యునకు దివ్యజ్ఞానము, దివ్యభావము లేర్పడును.

## ౪. వేధమయీ దీక్ష :

ఇది షట్చక్రభేదనమునకు సంబంధించినది. శిష్యుని శరీరములోని ఆఱు చక్రములను గురువు స్మరించి, వాటి నన్నిటిని కుండలినీ శక్తిలో విలీనము గావించును. తర్వాత వీటి నన్నిటిని బిందువులో విలీనము గావించును. బిందువును కళయందును, కళను నాదము నందును, నాదమును నాదాంతమునందును, దానిని ఉన్మనీయందును, ఉన్మనీని విష్ణుముఖమునందును, తర్వాత గురుముఖమునందును, తర్వాత నాశక్తిని పరమాత్మయందు విలీనము తానే గావించును. గురుకృపచే శిష్యుని పాశములన్నియు ఛిన్నభిన్నము లగును. వెంటనే వానికి దివ్యజ్ఞానము కలుగును. ఆదివ్యజ్ఞానము వలన సతసికన్నియు సిద్ధించును.

ఇదిగాక పంచాయతన దీక్ష ఒకటి గలదు. ఆదిత్యుఁడు, అంబిక, శివుఁడు, విష్ణువు, గణపతి అను నీయైదు దేవతల నావాహనము చేసి యేదేవత

యిష్టదైవముగా నున్నాఁడో ఆదేవతను మధ్యనుంచి మిగిలిన నలుగురు దేవతలను పరివార దేవతలుగానుంచి శాస్త్రోక్త విధిని బూజింపవలయును. పూజించి యిష్టదేవతా మంత్రము నుపదేశము నొందవలెను.

ఇదిగాక వైదికదీక్ష, తాంత్రిక దీక్ష, మిశ్ర (వైదిక తాంత్రికముల) దీక్ష, స్త్రీ దీక్ష, భావ దీక్ష, స్వప్న దీక్ష, మహాదీక్ష అని దీక్ష లనేకములు కలవు. ఇందులో ప్రస్తుత రామమంత్రమునకు వైదిక దీక్ష చాల శ్రేష్ఠమైనది.

కులార్ణవ తంత్రశాస్త్రములో మూఁడు రకముల దీక్షలు గలవు. ౧. స్పర్శదీక్ష ౨. దృగ్దీక్ష. ౩. ధ్యానదీక్ష.

## ౧. స్పర్శ దీక్ష :-

శ్లో॥ యథా పక్షీ స్వపక్షాభ్యాం శిశూన్ సంవర్ధయేచ్ఛనైః,
స్పర్శదీక్షోపదేశస్తు తాదృశః కథితః ప్రియే॥

పక్షి గ్రుడ్లను రెక్కలతోఁగప్పి కూర్చుండును. గ్రుడ్లు చిట్టి పిల్లలైన తర్వాతఁ గూడ తన రెక్కలతోఁగప్పి పెంచును. అట్లు తల్లి రెక్కలు తాఁకకున్నచో గ్రుడ్లు పొదగఁబడవు. పిల్లలు పెరుగవు. అట్లే యీ దీక్షయును గురువు శిష్యునిపైఁ దనరెండు కరములనుకచి దీవించును.

## ౨. దృగ్దీక్ష :-

శ్లో॥ స్వాపత్యాని యథా కూర్మీ వీక్షణేనైవ పోషయేత్,
దృగ్దీక్షాఖ్యోపదేశస్తు తాదృశః కథితః ప్రియే॥

ఆడ తాఁబేలు తన పిల్లలను జూచుటచేతనే పోషించును. అట్లే గురువు అపార కృపాకటాక్షము చేతనే జ్ఞాన ముత్పన్న మగునట్లు చేయును

## ౩. ధ్యాన దీక్ష :-

శ్లో॥ యథా మత్స్నీ స్వతనయాన్ ధ్యానమాత్రేణ పోషయేత్,
వేధ దీక్షోపదేశస్తు మనసః స్యాత్తథా విధః॥

ఇది మానసికము. చేఁప తనబిడ్డలను ధ్యానమాత్రము చేతనే పోషించి నట్లే ధ్యానదీక్షలో శిష్యుని మనస్సునఁ జింతించి వానికి శక్తిపాత మొనర్చి జ్ఞాన

మును జాగృతి నొందించును. ఈ దీక్షలో గురుశిష్యులొకచోట నున్నను లేక పున్నను బాధలేదు.

దీక్షలలో నింకను రకములు కలవు.

విద్ధి స్థూలం సూక్ష్మం సూక్ష్మతరం సూక్ష్మతమమపి,
క్రమతః స్పర్శన భాషణ దర్శన సంకల్పతశ్చతుర్థాతమ్॥

స్థూలము, సూక్ష్మము, సూక్ష్మతరము, సూక్ష్మతమమని క్రమముగా ౧. స్పర్శన, ౨. భాషణ, ౩. దర్శన, ౪. సంకల్ప దీక్షలని నాల్గురకములు.

## ౧. స్పర్శన (స్థూల) దీక్ష :-

"స్థూలం జ్ఞానం ద్వివిధం గురుసామ్యా సామ్యాదత్వ భేదేన
దీప ప్రస్తరయోరివ సంస్పర్శాత్సిద్ధ వర్త్యయసోః॥

స్థూల జ్ఞానము రెండు విధములు. గురు సామ్యము, అసామ్యమని ఒక వత్తితో వేరొక వత్తిని వెలిగించిన నదియు నట్టే వెలుగును. ఎన్నివత్తులను వెలిగించినను నొకటిగనే వెలుగును. ఇది సామ్యదీక్ష. ఈ దీక్షలో గురువున కున్నంత జ్ఞానము శిష్యున కేర్పడును. శిష్యుడు మరల నింకొకనికి నిట్టిజ్ఞానమును గలిగింప వచ్చును. ఇట్లు పరంపరగ జ్ఞానమేర్పడును.

రెండవది అసామ్యము. పరశువేది ఇనుమును దాకిన నది బంగారమగును. ఆ బంగారు ఇంకొక ఇనుప ముక్కను దాకి బంగారు కావింప లేదు. మఱల నాస్పర్శవేది నలననే ఆపని కావలెను.

## ౨. శబ్ద (సూక్ష్మ) దీక్ష :

"తద్వత్ ద్వివిధం సూక్ష్మం శబ్దశ్రవణేన కోకిలాంబుదయోః తత్సుత మయూరయోరివ తద్విజ్ఞేయం యథా సంఖ్యమ్"

సూక్ష్మజ్ఞానమగు శబ్ద దీక్షకూడ రెండువిధములు. కోయిల తన గ్రుడ్లను దాను పొదగ జాలదు. కాకి వాటిని పొదుగును. చిన్నపిల్లగా నున్నప్పుడు వేరొక కోయిల కూతను వినగానే తానుగూడ కోయిలయే యని గుర్తించు కొనును. ఇది శబ్ద దీక్ష.

రెండవది శ్రవణ దీక్ష. మేఘముయొక్క ఉరుము వినగానే నెమిలి ఆడును. కాని దాని శబ్దమువలన నితరులను ఆడునట్లు చేయనలేనట్లే, శిష్యుడు

గురువు వలన 'అహం బ్రహ్మాస్మి' యను జ్ఞానవాక్యమును వినఁగానే తనలోగల 'నేను' అను పదార్థముకూడ అట్టిదేనని భావించును. అనఁగా స్వభావస్థితి కలిగి నది. నెమిలి మేఘశబ్దమును విని ఆనందముతోఁ దానాడును గాని, తన శబ్దము చేత అట్టి ఆనంద మింకొకరి కీయఁజాలనట్లు గురుని బోధను విని శిష్యుఁడానం దించును గాని అట్టి జ్ఞానము నితరుల కీయఁజాలఁడు.

## 3. దృష్టి (సూక్ష్మతర) దీక్ష :

'ఇత్థం సూక్ష్మతరమపి ద్వివిధం కూర్మ్యా నిరీక్షణా త్తస్యాః
పుత్ర్యా స్తత్రైవ సవితుర్నిరీక్షణాత్కోక మిథునస్య॥

సూక్ష్మతర దీక్ష కూడ రెండు విధములు. ఆడ తాఁబేలు తన పిల్లలను జూచుట చేతనే అవి పెరుగును. అట్టి శక్తి దాని పిల్లలకుకూడ కలుగును. అట్లే గురుదృష్టిచేతనే శిష్యునకు జ్ఞానోదయము కలుగును. అట్టి జ్ఞానోదయిమే శిష్యుని వలన నింకొకనికి కలుగఁగలదు.

రెండవది చక్రవాక మిథునమునకు సూర్యదర్శనముచే నానందము కలుగుచున్నది. అట్టి ఆనందమును జెంగిన ఆ చక్రవాక మిథునము తమ దర్శనము వలన మఱొక చక్రవాక మిథునమున కానందము కలిగింపఁజాలదు. అట్లే గురువు శక్తిపాతముచే శిష్యునకు జ్ఞానమును గలిగించును. కాని ఆ శిష్యుఁ డింకొకనికి జ్ఞానమును బ్రసాదింపఁజాలఁడు.

## ४. సంకల్ప (సూక్ష్మతమ) దీక్ష :-

"సూక్ష్మతమ మపి ద్వివిధం మత్స్యాః సంకల్పతస్తు తద్దుహితుః,
తృప్తిర్నగరాది జనిర్మాంత్రిక సంకల్పతశ్చభువి తద్వత్॥

సూక్ష్మతమము గూడ రెండు విధములు. చేప సంకల్పము వలననే తన పిల్లలను బోషించుకొనును అట్టిశక్తి పెద్దనైన తరువాత వాటికిని లభించును. అట్లే గురువు శక్తిపాతముచే శిష్యునకు సంకల్పముచే జ్ఞానమును బ్రసాదించును. మఱల నట్టి శక్తియే యా శిష్యునకును గలుగును.

రెండవది అసామ్యము. మాంత్రికుఁడొకఁడు తన సంకల్పముచేఁ గొని ౦తవస్తువులను సృష్టించును. కాని ఆ వస్తు సముదాయమున కట్టి సంకల్పశక్తి అట్లే గురువు శిష్యునకు దీక్షనిచ్చి తన సంకల్పముచే జ్ఞాన ప్రదానము ౦చును. అట్టి సంకల్ప జ్ఞానప్రదానశక్తి శిష్యునకుండదు.

పై విషయమునుబట్టి గురువు తెలియకొనిన శిష్యునకు జ్ఞానము సర్వస్వమును వెంటనే యొసంగగలడు. శిష్యునకు ఉపదేశమాత్రము చాలును. మిగిలిన యనుష్ఠాన క్రియలతోఁగాని, సిద్ధారి చక్రములతోఁగాని, మంత్రయోగాంగములతోఁగాని పనిలేదు. గురుశక్తిపాతమునఁ గుండలనీ శక్తి మేల్కొని బ్రహ్మరంధ్రమును జేరును. అట్లు చేరుటకు గావలసిన ప్రాణాయామాది క్రియలు, ముద్రలు, ఆసనమును వాటికవియే సిద్ధించును. అంతర్వాణి (Inner Voice) రూపమున శాస్త్రములలోఁ గలవి, లేనివి అనేక సాధనలు వాటికవియే స్ఫురించి, అనేక కష్టములుపడి యోగాభ్యాసాదులు కావించి సంపాదించిన చిత్తైకాగ్రత కంటె మిక్కిలిగ సంపాదించును. ఇట్లు శక్తిపాతమున ప్రబుద్ధమైన కుండలినీశక్తి ఎన్ని జన్మలకైనను ముక్తిచెందువఱకును నిద్రింపదు. ఈ కలికాలములో యోగాభ్యాసాది అపాయకరమైన సాధనలను గొనుటకంటె, దానికంటె మిక్కిలి ఫలమునిచ్చు శక్తిపాతమును బొందుటకు సద్గురువును అన్వేషింపవలెను. శక్తిపాతము తీవ్రముగఁ గలిగిన నిట్టి గురుతు లభించును.

శ్లో॥ దేహ పాతస్తథా కంపః పరమానంద హర్షణే,
స్వేదో రోమాంచ ఇత్యేత చ్ఛక్తిపాతస్య లక్షణమ్॥

దేహపాతము, (క్రిందపడిపోవుట లేక చచ్చుట) కంపము, పరమానందము, నవ్వు, చెమట పోయుట, వెండ్రుకలు నిక్కపొడుచుట ఇవి శక్తిపాతము యొక్క లక్షణములు.

# శ్రీ రామ మంత్రము

శ్రీరామమంత్రములలో ననేకరకములు కలవు. ఒక అక్షరము మొదలు మాలామంత్రములో ననేకాక్షరముల వఱకు కలవు ఇవి ఉపనిషత్తులలోను, అగస్త్యసంహితలోను లభింపఁ గలవు. ఇందులోఁ గొన్ని మంత్రములు గొప్ప, కొన్ని తక్కువ యను భేదములేదు. ఏమంత్రమైనను ఒక్కటే. చెఱకును నెక్కడ కొఱికినను మధురమే. కొందఱు ప్రణవములేని మంత్రములు ఫలము లేనివని పల్కుచుందురు. అట్లు పల్కరాదు. ప్రథమ ప్రకరణమున రామమంత్రము ప్రణవము కంటె శ్రేష్ఠమైనదనియు, అసలది ప్రణవమునకును గారణభూతమైనదనియు నిరూపింపఁ బడినది. 'రామ' యను రెండక్షరములలోనే

అనంతమగు శక్తి కలదు. కావున భగవదాదేశముచే నేమంత్రము ననుగ్రహించి నను సంశయింపక భక్తిపూర్వకముగ జపించుకొన వలయును.

కేవల ప్రణవమును బ్రాహ్మణుఁడైన జపింపరాదు. ద్విజులు యితర మంత్ర ములతోఁ బ్రణవమును జేర్చి జపింపవచ్చును. స్త్రీ, శూద్రులకుఁ బ్రణవము నుప దేశింపరాదు. బ్రాహ్మణ స్త్రీలకైనను అధికారములేదు. కొందఱు బ్రాహ్మణ స్త్రీలకు ప్రణవముతోఁ గూడిన మంత్రమిచ్చుటయును, దానివలనఁ గీడుకలిగి పోత్తుగా ఆమంత్రజపమును విడుచుటయును జరిగిన సంఘటనము లనేకములు. అట్లుగాక ప్రణవములేని మంత్రము నిచ్చిన సుఖముగ జపించుకొని యిహపర సౌఖ్యములను బొందెదువారే శ్రీం, హ్రీం, క్లీం ఇత్యాది బీజములు వాడ వచ్చును.

శ్లో॥ న దేయ మర్థలుబ్ధాయ పిశునాయా స్థిరాయచ
భక్తి శ్రద్ధా విహీనాయ శుశ్రూషా విముఖాయ చ॥
ప్రణవేన వినా మంత్రః స్త్రీ శూద్రాణాం ప్రసాదకః
ప్రణవేన సమా యుక్త స్తయోర్దేవి విషోపమః॥
స్వాహా ప్రణవ సంయుక్తం మంత్రం శూద్రే దదద్ద్విజః
శూద్ర శ్చండాలతా మేతి విప్రశ్శూద్రత్వ మేవహి॥

— మంత్రార్ణవము.

ధనమునందు లోభబుద్ధి కలవానికిని, పిసినికొట్టువానికిని, స్థిరబుద్ధిలేని వానికిని, భక్తిశ్రద్ధలు లేనివానికిని, శుశ్రూష చేయుటయందు విముఖుఁడగు వానికిని మంత్రము నీయరాదు ప్రణవము లేకుండ మంత్రమిచ్చిన స్త్రీలకును, శూద్రులకును మేలొసంగును. ప్రణవముతో కూడిన మంత్రమును వారికిచ్చిన వారికది విషమువలెనె హానికాపించును. స్వాహా, ప్రణవములు గల మంత్ర మును శూద్రునకు (స్త్రీకి) యిచ్చిన శూద్రుఁడు చండాలత్వమును బొందును. అట్లిచ్చిన బ్రాహ్మణుఁడు శూద్రత్వమును బొందును.

కావున శిష్యుల మేలు కోరిన గురువు స్త్రీ శూద్రులకుఁ బ్రణవముతోఁ గూడిన మంత్ర మీయరాదు. ఇతర బీజముల ఫలమిది.

శ్లో॥ కామ బీజం ముఖే తేషాం దద్యాత్సర్వార్థ సిద్ధయే,
శ్రీ బీజాద్యం యథా జప్యా త్తదా లక్ష్మీరచంచలా॥

కామాద్యం జపనాదేవ సర్వలోకం వశం నయేత్,
వాగాది జపనాదేతత్ వాక్సిద్ధి ర్జాయతే౽చిరాత్॥
శక్తి బీజాధికో మంత్రః నిర్వాణ మచిరాద్దిశేత్॥
పుటనాత్ప్రణవా భ్యాంతు మోక్షమాప్నోతి నిశ్చితమ్,
ఏవం మంత్రపరం జప్త్వా కిం న సాధ్యతి మంత్రవిత్॥

— మాలినీ విజయము.

కామబీజము (క్లీం) మంత్రము మొదట నుంచిన సర్వార్థసిద్ధి లొసంగును. శ్రీ బీజమును (శ్రీం) జపించిన నచంచలమగు లక్ష్మి ప్రాప్తించును. క్లీంకారమును మొదటనుండి జపించిన సర్వలోకమును వశ్యమగును. వాగ్బీజమును (ఐం) జపించుటచే వాక్సిద్ధి త్వరలోఁ గలుగును. హ్రీంకారము మొదటగల మంత్రమువలనఁ ద్వరలో నిర్వాణము నొసంగును. మొదటను జివరను బ్రణవమునుంచిన నిశ్చయముగ మోక్షమును బొందును. ఇట్లు మంత్రములను జపించిన మంత్రవిదుఁడు దేనిని సాధింపలేఁడు ?

## మంత్ర సంస్కారములు

కావున వెనుకఁ జెప్పఁబడిన సిద్ధారి చక్రములను, శాస్త్రవిషయములను, శిష్యుని శ్రేయస్సును గమనించి మంత్ర మీయవలెను. రామ మంత్రమున కివి యేమియు నక్కఱలేదని శాస్త్రము. అయినను జూడుటచే దోషములేదు. మంత్రమునకు సంస్కారములు చేయవలయును. మంత్ర సంస్కారము వలన శీఘ్ర ఫలసిద్ధి కలుగుట నిశ్చయము. దోషము లాపాదించిన ఫలసిద్ధి కలుగదని శాస్త్రము. ఛిన్న, రుద్ధ, శక్తిహీన పరాఙ్ముఖాదాది దోషము లేఁబది.

శ్లో॥ దోషా నిమాని విజ్ఞాయ - యో మంత్రాన్ భజతే జడః,
సిద్ధిర్న జాయతే తస్య - కల్పకోటి శతైరపి॥

ఈ దోషముల నెఱిఁగి యే జడుఁడు మంత్రముమ జపించునో వానికిఁ గోటి కల్పములకైనను సిద్ధికలుగదు. మంత్ర సంస్కారములు పది.

శ్లో॥ జననం జీవనం పశ్చా త్తాడనం బోధనం తథా,
అథాభిషేకో విమలీ కరణా ప్యాయనే పునః॥
తర్పణం దీపనం గుప్తి ర్దశైతా మంత్ర సంస్క్రియాః॥

౧. జననము. ౨. జీవనము. ౩. తాడనము. ౪. బోధనము. ౫. అభిషేకము. ౬. విమలీకరణము. ౭. ఆప్యాయనము. ౮. తర్పణము. ౯. దీపనము. ౧౦. గోపనము అని మంత్రసంస్కారములు పది.

ఈ సంస్కారములకు కర్మపరమైన విధి యొకటి కలదు. మంత్రపరమైన విధి మఱియొకటి కలదు. కర్మపరమైన విధికి యితరవస్తు సహాయము కావలెను. కాని మంత్రపరమైన విధికి అన్యవస్తు సహాయ మవసరము లేదు. ఇందు రెండు పద్ధతులును వ్రాయఁబడును. ఇందులోఁ గేవలము కర్మిష్ఠి యగువాఁడు కర్మపరమైన విధిని, మోక్షాపేక్ష గలిగి నిష్కామమగు భక్తిజ్ఞానములు ప్రధానముగఁ గలవాఁడు మంత్రపరమైన విధిని సంస్కారములు చేసికొనవలయును. ఇందులో రెండవది ఉత్తమమని పెద్దల అభిమతము.

## సంస్కారపద్ధతి

౧. జననము. (క) కర్మపద్ధతి. (భ) భక్తి పద్ధతి.

శ్లో॥ మంత్రాణాం మాతృకా మధ్యా, దుద్ధారో జననం స్మృతమ్.

— శారదాతిలకము.

మంత్రమును మాతృకామధ్యమునుండి యుద్ధరించుటకు జననమని పేరు.

(క) భోజపత్రముపైఁగాని, తమలపాకుపైఁగాని, గోరోచనముతోడనో, కుంకుమతోడనో, చందనముతోడనో నలుబదితొమ్మిది గడులుగల నొక త్రికోణము లిఖించి ౪౯ గడులలో ౪౯ అక్షరములను వ్రాయవలెను. ఈశాన్యమున అ ఆలను ప్రారంభించి, క్రిందవఱకు వ్రాసి, మఱలఁబైకి, మఱల గ్రిందకు ఇట్లు హకారము వాయవ్య కోణమునకు వచ్చునట్లు వ్రాయవలెను. దానికిఁ బ్రాణ ప్రతిష్ఠఁగావించి షోడశోపచారములతో నిష్టదేవతా పూజనము గావించి, ఆ మంత్రవర్ణముల నొక్కటొకటి తీసి వేఱొక పత్రముపై వ్రాయవలయును. దీనికే మంత్ర జనన మని పేరు.

శ్రీరామ రామ రామ = శ, ఈ, ర, ర, ఆ, మ. ర, ఆ, మ, ర, ఆ, మ పై యంత్రమునుండి మంత్రము నుద్ధరించి తర్వాత ఉద్వాసన చెప్పి నీటిలోఁ గడిగి శుద్ధ జలమునందు వదలవలెను.

(ఛ) రెండవ పద్ధతియు నింతియే.

౨. జీవనము.

(క) శ్లో॥ ప్రణవాంతరితాన్ కృత్వా మంత్రవర్ణాన్ జపేత్సుధీః,
ఏతజ్జీవన మిత్యాహు ర్మంత్ర తంత్ర విశారదాః॥ —శారదాతిలకము.

బుద్ధిమంతుఁ డగువాఁడు మంత్రవర్ణములను ప్రణవాంతరితము కావించి జపింప వలెను. మంత్ర తంత్ర విశారదులు దీనిని జీవన మందురు.

(ఛ) స్వధా వషట్ సంపుటిత మూలమంత్రము నొక ౧౦౦ంగా జపించిన జీవన సంస్కారమగును.

ఉదా :— స్వధా వషట్ శ్రీరామరామరామ వషట్ స్వధా.

౩. తాడనము.

(క) శ్లో॥ మంత్ర వర్ణాన్ సమాలిఖ్య తాడయే చ్చందనాంభసా,
ప్రత్యేకం వారిణా మంత్రీ తాడనం తదుదా హృతమ్॥
— శారదా తిలకము.

మంత్ర వర్ణములను వ్రాసి దానిని చందన జలముతోఁ బ్రత్యేకముగాఁ గొట్టుటకు తాడనమని పేరు.

(ఛ) ఫట్ సంపుటిత మంత్రముతో నొక ౧౦౦ంగా మంత్రమును జపించిన తాడన సంస్కార మగును.

ఉదా :— ఫట్ శ్రీరామ రామ రామ ఫట్.

౪. బోధనము.

(క) శ్లో॥ విలిఖ్య మంత్రం తన్మంత్రీ ప్రసూనైః కరవీరజైః,
తన్మంత్రాక్షర సంఖ్యాతై ర్హన్యా ద్ధాతేన బోధనమ్,
— శారదా తిలకము.

ఆ మంత్రమును (తమలపాకుపై) వ్రాసి, ఆ మంత్రాక్షరములను కరవీర పుష్పములతోఁ గొట్టుటకు బోధనమని పేరు.

(భ) హ్రూం బీజసంపుటితము గావించి ౫౦౦౦ మంత్రజపము కావించిన బోధన సంస్కార మగును.

ఉదా :— హ్రూం శ్రీరామ రామ రామ హ్రూం.

## ౫. అభిషేకము.

(క) శ్లో॥ స్వ తంత్రోక్త విధానేన మంత్రీ మంత్రార్ణ సంఖ్యయా,
అశ్వత్థ పల్లవైర్మంత్ర మభిషించే ద్విశుద్ధయే॥

— శారదా తిలకము.

స్వతంత్రోక్త విధానమున మంత్రాక్షరములను వ్రాసి రావి చిగుళ్లతో మంత్రము నభిషేకించుటకు అభిషేకమని పేరు.

(భ) భూర్జ పత్రముపై లేక తమలపాకుపై మంత్రమును వ్రాసి 'ఓం హంసః ఓం' అను మంత్రముచే నభిమంత్రితము గావించి ౧౦౦౦ మార్లు జపించి, జలముతోడను, రావి చిగుళ్లతోడను అభిషేకించిన అభిషేక సంస్కారము పూర్తి యగును.

## ౬. విమలీ కరణము.

(క) శ్లో॥ సం చింత్య మనసా మంత్రం జ్యోతిర్మంత్రేణ నిర్దహేత్,
మంత్రే మలత్రయం మంత్రీ విమలీకరణం త్విదమ్॥

— శారదా తిలకము.

మనస్సుతో మంత్రమును జపించి జ్యోతిర్మంత్రము (రం) తో మంత్రములోగల మలత్రయమును దహించుటకు విమలీ కరణమని పేరు.

(భ) ఓం త్రోం వషట్ అను బీజ సంపుటితము గావించి ౧౦౦౦ జపించిన విమలీకరణ సంస్కారము పూర్తికాగలదు.

ఉదా:— "ఓం త్రోంవషట్ శ్రీరామ రామ రామ వషట్ త్రోం ఓం

## ౭. ఆప్యాయనము.

(క) శ్లో॥ తార వ్యోమాగ్ని మనుయుగ్దండీ జ్యోతిర్మనుర్మతః
కుశోదకేన జప్తేన ప్రత్యర్ణం ప్రోక్షణం మనోః॥
తేన మంత్రేణ విధివదేతదాప్యాయనం స్మృతమ్. — శారదాతిలకము.

ఓం హం రం అను బీజములను జపించుచుఁ గుశోదకములచే మంత్రము లోని ప్రతి అక్షరముపైఁ బ్రోక్షించుచుండిన దాని నాప్యాయన మందురు.

(భ) ప్రౌం బీజ సంపుటిత మంత్రము నొక ౧౦౦౦ా జపించుట వలన నాప్యాయన మగుచున్నది.

ఉదా:- ప్రౌం శ్రీరామ రామ రామ ప్రౌం,

౮. తర్పణము.

(క) శ్లో॥ మంత్రేణ వారిణా తత్ర తర్పణం తర్పణమ్ స్మృతమ్.

— శారదాతిలకము.

మంత్రముతో నీరు విడుచుటకు తర్పణమని పేరు.

(భ) ఆవుపాలు, నీరు, ఆవునేయి కలిపి ౧౦౦ా సార్లు తర్పణము చేయుటకు తర్పణమని పేరు.

ఉదా:- శ్రీరామ రామ రామ శ్రీరామం తర్పయామి.

౯. దీపనము.

(క) తారమాయా రమా యోగో మనోర్దీపన ముచ్యతే. —శారదాతిలకము

ఓం హ్రీం శ్రీః అను బీజసంపుటిత మంత్రముతో జపించిన దీపనసంస్కార మగును.

ఉదా:- ఓం హ్రీం శ్రీః శ్రీరామ రామ రామ శ్రీః హ్రీం ఓం.

(భ) హంస మంత్ర సంపుటితము గావించి ౧౦౦౦ా జపము గావించిన దీపన సంస్కార మగును.

ఉదా:- హంసః శ్రీరామ రామ రామ సోఽహమ్.

౧౦. గోపనము.

(క) శ్లో॥ జప్య మానస్య మంత్రస్య గోపనం త్వప్రకాశనమ్.

— శారదాతిలకము.

జపించు మంత్రమును బ్రకాశపఱచ కుండుటకు గోపన మని పేరు.

(భ) హ్రీం బీజ సంపుటితము గావించి ౧౦౦౦ా జపము చేసిన గోపన సంస్కారము కాఁగలదు.

ఉదా:- హ్రీం శ్రీరామ రామ రామ హ్రీం,

# మంత్ర స్వరూపము

మంత్ర శబ్దమున కర్థము మననము చేయువారిని రక్షించునదియని. 'మననాత్ త్రాయతే యస్మాత్ మంత్రమిత్యభిధీయతే' అని శాస్త్రవచనము. మంత్రము బ్రహ్మ స్వరూపము. శబ్ద బ్రహ్మమని దీనినే యందురు. బీజమే వృక్షమైనట్లు బ్రహ్మస్వరూపమే మంత్రస్వరూపమున నభివ్యక్తమైనది. బ్రహ్మ స్వరూపము మాయాగ్రహణము వలన నీశ్వరస్వరూపమైనది. ఆకాశ కారణ తన్మాత్రయైన శబ్దము సూక్ష్మమైనది. ఇది ఆకాశమున కతీతమైనది. అప్రాకృతమైనది. ఇది సంకల్పరూపమున నుండును. ఈ శబ్దము మనము బాహ్యశబ్దార్థమును గ్రహించు నప్పుడు మనస్సులో సంకల్పరూపమున గోచరించును. ఇది అర్థ స్ఫుటితము గావించుటచే దీనికి స్ఫోటకమని వ్యాకరణ పండితులు పేరు పెట్టిరి. ఈ కారణ శబ్ద తన్మాత్ర తర్వాత సూక్ష్మ శబ్ద తన్మాత్ర గలదు. ఇది ఆకాశ స్వరూపమైనది. మూఁడవది ఆకాశగుణమైన శబ్దము. ఇది స్థూల శబ్దము. ఇది మనః ప్రేరితమైన వాయువుయొక్క ఆఘాతముచే కంఠ, తాలు, ఓష్ఠాది స్థానముల ద్వారా బయటకు వెలువడు చున్నది. స్ఫోటక శబ్దమువలన స్పందనము బయలుదేరును. ఆ స్పందనము వలన నర్థము గోచరించును. ఆ స్పందనము తీవ్రమైనదగు నెడల నింకను బాహ్యస్థూలశబ్దముగ వెలువడును. పాశ్చాత్య వైజ్ఞానికు లీశబ్దమునకు ఆధారము వాయువందురు. వారు దూర శ్రవణ యంత్రములను గనిపెట్టిన దీస్పందన పద్ధతి మీఁదనే ఒకచోట బయలు వెడలిన శబ్ద తరంగములు ప్రపంచ మంతటను వ్యాపింపఁగా నవి పోను పోను చిన్నవగు చున్నవి. వాటిని వేఱొక యంత్రము (Radio) వలన పెద్దతరంగ ములుగఁ జేయుచున్నారు. అనఁగా సూక్ష్మముగనున్న స్పందనమును స్థూల ముగఁ బెద్దదిగఁ జేయుచున్నారు. అందువలన శబ్దము స్పందన భేదముల వలన పెద్ద శబ్దముగఁ బరిణమించు చున్నది. మనకు కారణ, సూక్ష్మ, స్థూల శరీరము లెట్లు గలవో శబ్దమునకును అట్లే కలవని గ్రహింప వలయును. ఈ శబ్దము సగుణ బ్రహ్మము. దీనిలో మంత్రమునకును, దేవతకును, మంత్రప్రదాత యగు గురువునకును భేదము లేదు.

శ్లో॥ యథా దేవీ తథా మంత్రే యథా మంత్రే తథా గురౌ,
యథా గురౌ తథా స్వాత్మ న్యేవం భక్తి క్రమః స్మృతః॥

దేవతయందెట్టి బుద్ధియో మంత్రమునం దట్టి బుద్ధియు, మంత్రమునందెట్టి బుద్ధియో గురువునందట్టి బుద్ధియు, గురువునందెట్టి బుద్ధియో స్వాత్మయందట్టి బుద్ధియు కలిగి యుండుటయే భక్తిక్రమమని చెప్పఁబడును.

శ్లో॥ యథా ఘటశ్చ కలశః కుంభశ్చైకార్థ వాచకాః,
తథా మంత్రో దేవతాచ గురుశ్చైకార్థ వాచకాః॥

— సుందరీ తాపినీ.

ఘటము, కలశము, కుంభము అనునవెట్లు ఏకార్థ వాచకములో అట్లే మంత్రము, దేవత, గురువు అనునవి ఏకార్థ వాచకములు.

'భక్తి నామ భగవంత గురు చారు నాము వపు ఏక్'

— నారాయణస్వామి.

భక్తి, నామ (మంత్ర)ము, భగవంతుఁడు, గురువు అని పేరులు నాలుగు కాని శరీర మొక్కటే.

పై విషయమునుబట్టి మంత్ర, దేవతా, గురువుల కైకత్వము సిద్ధమగు చున్నది. మంత్రములోని శబ్దములను బాహ్యశబ్దములవలె నర్థాను సంధానము చేయ వలనుపడదు. మంత్రము పరబ్రహ్మ వాచకము కావున పరమాత్మార్థ మునే సాధింపవలెను. మంత్రము చైతన్య స్వరూపము. చైతన్యము పరమాత్మయే కదా! కావున మంత్రానుష్ఠానపరుఁడు తన మనస్సులో మంత్రము కేవలము చైతన్య పరబ్రహ్మమని భావింపవలయునే గాని, కేవలము స్థూలశబ్దముగఁ బరిగ ణింపరాదు. ఇట్లు మంత్రమును చైతన్యము గావించి, భావించి దానిలో లీనము కావలయును. శ్రీరామమంత్రము కేవల పరబ్రహ్మవాచకమని యిదివఱకే సాధిం పఁబడినది. ఇప్పు డీమంత్రమును సాధకుఁడు మంత్రచైతన్యముచేఁ జైతన్యము కావింపవలయును. మంత్రమును జైతన్య మొనర్చుటకు నిచ్చుట నాలుగు ప్రక్రి యలు చెప్పఁబడుచున్నవి. సాధకుల కేది సులభముగ నుండిన దానిని జేసి కొనవచ్చును.

## మంత్ర చైతన్యము

శ్రీరామ మంత్రము స్వయముగఁ జైతన్యము కలది. దానికీ సంస్కా రాదు లనవసరములు. కాని యితర మంత్రములకుఁ గూడ పనికివచ్చునను భావ

మతో నీ రామమంత్రానుష్ఠానము నెపమున మంత్రానుష్ఠాన పద్ధతి చెప్పఁబడు చున్నది. రామమంత్రమునకైనను దీనికి చేసిన శీఘ్రముగ సిద్ధికలుగును. సాధకుఁ డల్పజ్ఞుఁడైనను అల్పమాత్రలో శక్తిపాతమును బొందినచో మంత్రచైతన్యమును గలిగించి మంత్రమును జపింపవలయును. రంగును ముటికి వస్త్రమున కద్దవలసిన యెడల, రంగులో నే దోషములును లేనప్పటికిని రంగునకుఁ జైతన్యమును కలి గించిన ముటికి వస్త్రనకైనను బట్టును. అట్లె మంత్రము అశుద్ధాంతః కరణునికి బట్టవలెవనిన నా యశుద్ధతను బోఁగొట్టి మంత్రము పట్టుటకుఁ జైతన్యమును గలి గింపవలెను. మంత్రచైతన్యము కలిగించు పద్ధతు లనేక ప్రకారములుగఁ గలవు. అందులో ముఖ్యముగ నీ క్రింది పద్ధతులు సర్వులకు సులభమైనవి.

## మొదటి పద్ధతి

మంత్రమునకుఁ బూర్వము కామబీజము (క్లీం) శ్రీబీజము (శ్రీం) శక్తి బీజము (హ్రీం) నుంచి అక్షరములు అకారము మొదలు క్షకారము వఱకు పలికి, తర్వాత మంత్రము, మరల పై అక్షరములు తల్క్రిందుగాఁ బలికి పైన చెప్పిన బీజములను తల్క్రిందుగాఁ జెప్పవలయును. ఇట్లు ౧౦౮ జపించిన మంత్ర మునకుఁ జైతన్యము కలుగును. ఉదా:- ఓం క్లీం శ్రీం అం ఆం ఇం ఈం ఉం ఊం ఋం ౠం ఌం ౡం ఏం ఐం ఓం ఔం అం అః కం ఖం గం ఘం ఙం చం ఛం జం ఝం ఞం టం ఠం డం ఢం ణం తం థం దం ధం నం పం ఫం బం భం మం యం రం లం వం శం షం సం హం ళం క్షం శ్రీరామ రామ రామ క్షం ళం హం సం షం శం వం లం రం యం మం భం బం ఫం పం నం ధం దం థం తం ణం ఢం డం ఠం టం ఞం ఝం జం ఛం చం ఙం ఘం గం ఖం కం అః అం ఔం ఓం ఐం ఏం ౡం ఌం ౠం ఋం ఊం ఉం ఈం ఇం ఆం అం హ్రీం శ్రీం క్లీం ఓం.

## రెండవ పద్ధతి

మంత్రమును బ్రహ్మస్వరూపముగాను, అతనిశక్తి స్వరూపముగాను, గురుస్వరూపముగాను జింతించి సూర్యమండలమందు స్వమంత్రమును ధ్యానింప వలయును. లేకున్న అంతఃస్థిత ద్వాదశ కళాత్మక సూర్యమండలమందు చింతిం చుచు ౧౦౮ జపము చేసినను మంత్రచైతన్యము కల్గును.

## మూడవ పద్ధతి

వరదా తంత్రమురీత్యా మంత్రమునకు "ఈం" బీజమును సంపుటితము గావించి ౧౦౮ జపించిన మంత్ర చైతన్యము కల్గును. ఉదా:- ఓం ఈం శ్రీరామ రామరామ ఈం ఓం.

## నాల్గవ పద్ధతి

షట్చక్ర ప్రక్రియ తెలిసినవారు ఆయాచక్రములలోని వర్ణములను ధ్యానించుచు మంత్రమును జపించిన మంత్ర చైతన్యము కలుగును.

ఇట్లు మంత్ర చైతన్యమును గలిగించి మంత్ర జపము చేయుటవలన మంత్రము శీఘ్రముగ సిద్ధియగుచున్నది.

## మంత్రకుల్లుకా

జపము చేయుటకు ముందు మంత్రముయొక్క కుల్లుకను శిరస్సున ధరించిన త్వరగ సిద్ధించును. అనగా శిరస్సున న్యాసము కావింపవలయును. శ్రీరామమంత్రమునకు కుల్లుకా ఓం, శ్రీం, రాం.

## మంత్ర సేతువు

ప్రతిమంత్రమునకును ప్రణవమే మంత్రసేతువు. బ్రాహ్మణ క్షత్రియులకు ప్రణవము (ఓం)ను, వైశ్యులకు "ఫట్"ను, శూద్రులకు "హ్రీం" మంత్ర సేతువులని శాస్త్రము కలదు. జపమునకు ముందు ఈ బీజములను సంపుటిచేసి మానసికముగ ౧౦ మార్లు జపమును గావింపవలయును.

## మంత్రమహాసేతువు

మంత్రజపమునకు ముందు మంత్రమహాసేతువును జపింపవలయును. ఇట్లు జపించుటచే మంత్రమును సర్వకాలసర్వావస్థలయందును జపించు నధికారము ప్రాప్తించును. రామమంత్రమునకు మహాసేతువు 'రాం'. దీనిని కంఠస్థానమునగుండు విశుద్ధచక్రమున ౧౦ మార్లు జపింపవలయును.

## ముఖశోధనము

మంత్రమును పాచిముఖముతోగాని, అశుద్ధిగ నున్న నోటితోగాని, యేదైనను దిని శుద్ధి సరిగా చేసికొనకగాని, అశ్లీలవాక్యాలు, అసత్యవాక్యాలు,

పలికిన నోటితోఁగాని కలహించి యితరులను దిట్టిన నోటితోఁగాని జపించిన మంత్రము త్వరగా సిద్ధింపదు. బాహ్యామలములగు పాఁచిని పండ్లుతో ముకొని బాగుగా నాలుక గీచుకొనుటచేతను, నేదైన పండ్లసందుల నిఱుకుకొనిన కుట్టు పుల్లతో తొలఁగించి నోరు నీటితోఁ గడుగుకొనుటచేతను శుద్ధియగును. మిగిలిన వాఙ్మలము, అంతర్మలమును కేవలము ౧౦ మార్లు ప్రణవమును జపించుటవలనఁ దొలఁగును. అట్లు ముఖశోధనము గావించుకొనియే జపమును బ్రారంభింప వలయును.

## ప్రాణయోగము

శరీరమునకుఁ బ్రాణమును బోసినట్లు మంత్రమునకు "హ్రీం" బీజసంపుటి చేసి యేడుమార్లు జపించిన మంత్రమునకుఁ బ్రాణము వచ్చును.

ఉదా:_ హ్రీం శ్రీ రామరామరామ హ్రీం.

## మంత్రదీపనీ

దీప మెట్లు గృహములోని యంధకారమును నశింపఁజేయునో, అట్లంధ కారము నశించుటచే నా యింటిలోఁ గల వస్తువులన్నియు నెట్లు గోచరము లగునో అట్లే దీపనీక్రియవలన మంత్రమునకుఁ బ్రకాశము గలుగును. దానివలన జ్ఞానరహస్యమంతయు గోచరించును. మంత్రమునకుఁ బ్రణవసంపుటి గావించి యేడుమార్లు జపించిన దీపనీక్రియ పూర్తియగును.

ఉదా:_ ఓం శ్రీరామ రామ రామ ఓం.

## మంత్రదోషములు

మంత్రమునకు ఎనిమిది దోషము లాపాదింపఁ గలవు. ఈ యెనిమిది దోషము లాపాదింపకుండినచే మంత్రసిద్ధి కలుగును. (హారితత్త్వదీధితి.)

౧. అభక్తి ౨. అక్షరభ్రాంతి ౩. లుప్తము ౪. ఛిన్నము ౫. హ్రస్వము, ౬. దీర్ఘము ౭. కథనము ౮. స్వప్నకథనము.

### ౧. అభక్తి:-

కొందఱు మంత్ర మక్షర సంపుటియనియు, దీనిలో విశేష మేమియుఁ లేదనియు, కేవలము మాటలు పల్కుటచే నిష్టదేవతా ప్రసన్నమగునా? యని

పలుకుట అసక్తి. యథార్థమునకు మంత్రము కేవలము అక్షరసంపుటియే కాదు. దేవతాస్వరూపము. శ్రీరామమంత్రము శ్రీరామస్వరూపమే. మంత్రము లభించు నప్పుడు కేవలము శ్రీరామచంద్రుఁడే లభించినాఁడని బ్రహ్మానందము పడవలెను. అట్టి భక్తి మంత్రమందున్నచో మంత్రమూర్తి శీఘ్రముగ లభించుట అంత ఆశ్చర్యకరమగు విషయము కాదు. తన మంత్రముకంటె నింకొకమంత్రము గొప్పదనియు, తనది హీనమంత్రమనియు భావించుట అభక్తియే. ఇట్టి అభక్తునకు సిద్ధి కలుగకపోఁగా విపరీతఫలము లభించుటకూడ నిజము. ఇట్టి అభక్తి దురదృష్టవశమునఁ గలుగుచో అమితమగు భక్తితో మంత్రజపము కావింపవల యును. అధిక మంత్ర జపమువలన భగవదనుగ్రహము కలిగి భక్తి కలుగును. భక్తివలన శీఘ్రముగ మంత్రసిద్ధియగును.

## ౨ అక్షరభ్రాంతి:-

గురువుగాని, శిష్యుఁడుగాని భ్రమప్రమాదములచే మంత్రాక్షరములను మార్చుటగాని, ఒకటి రెండక్షరములు పెంచుటగాని జరిగిన దాని నక్షర భ్రాంతి యందురు. అట్టి స్థితిలో మరల గురువువలనఁగాని, గురుపుత్రునివలనఁ గాని, గురుపీఠములోని గురుని శిష్య ప్రశిష్యులవలనఁగాని లేక యోగ్యుఁడగు నితర మంత్రజ్ఞునివలనఁగాని దానిని సవరింపఁజేసికొనవలయును.

## 3. లుప్తము:-

మంత్రములోని కొన్ని అక్షరములను లోపింపఁజేయుటకు లుప్తమని పేరు. ఇట్లు లుప్తమైన మఱల గురువువలన మంత్రమును గ్రహింపవలయును.

## ర. ఛిన్నము:-

ఛిన్నమనఁగా మంత్రములోని సంయుక్తాక్షరములను గొన్నిటిని విడుచు టకుఁ బేరు. ఉదా:_ హ్రీం అనుటకు బదులు హీం అనియు, స్త్రీం యనుటకు బదులు సీం అనిగాని స్రీం అనిగాని పలుకుట. ఈ దోషమునుగూడ మఱల మంత్రమును గ్రహించుటద్వారా పోఁగొట్టుకొనవలయును.

## ౫. హ్రాస్వము :-

దీర్ఘ వర్ణమునకు బదులు హ్రస్వవర్ణమును బలుకుట. ఉదా :_ క్లీం కు బదులుగా క్లిం అనుట మొదలగునవి. దీనిని గూడ సవరించు కొనవలయును.

**౭. దీర్ఘము :-**

హ్రస్వవర్ణ స్థానమున దీర్ఘవర్ణము నుంచుట దీనిని గూడ సవరింపఁ జేసి కొనవలయును. ఉదా :_ లం కు బదులుగా లాం అనునట్లు.

**౮. కథనము :-**

జాగ్రదవస్థలో నితరులతోఁ దన మంత్రమును జెప్పుటకు కథన దోషమని పేరు. ' గురుం ప్రకాశయే ద్ధీమాన్ మంత్రం నైవ ప్రకాశయేత్ ' గురువును బ్రకాశింపఁ జేయవచ్చును గాని మంత్రమును బ్రకాశపఱుపరాదు.

**౯. స్వప్న కథనము :-**

స్వప్నమునఁ దన మంత్రమును నితరులకుఁ జెప్పుటకు స్వప్న కథనమని పేరు.

పై వానిలో కథన, స్వప్నకథన దోషములు గురువు నిర్ణయించిన ప్రాయశ్చిత్తము వలనఁ దొలఁగును. ఈ యెనిమిది దోషములు లేకున్నఁగాని మంత్రసిద్ధి కానేరదు.

## శీఘ్ర మంత్రసిద్ధ్యుపాయము

పైన జెప్పిన దోషముల నుండి విడివడి మంత్రమును సక్రమముగ ననుష్ఠించి నప్పటికిని సిద్ధి కాకున్న మఱల మఱల ననుష్ఠానము కావింపవలయును. ఇట్లు ముమ్మారు అనుష్ఠానము కావించినను సిద్ధింపకున్న నీ క్రింది ప్రక్రియలను నొకటి తర్వాత నొకటిగాఁ జేయవలయును. అన్నిటిని జేయవలసిన పనిలేదు. మొదటి దానివలన సిద్ధింపకున్న రెండవది. రెండవదాని వలనఁ గాకున్న మూఁడవది చేయవలెను. ఇట్లు క్రమముగా సిద్ధింపకున్ననే తర్వాత ప్రక్రియను జేయవలసి యుండును. ఈ ప్రక్రియలేడు ౧. భ్రామణ ౨. రోధనము. ౩. వశ్యము. ౪. పీడనము. ౫. పోషణము. ౬. శోషణము. ౭. దాహనము.

**౧. భ్రామణము:-**

మంత్రమునకు వాయుబీజ సంపుటి గావింపవలెను. అనఁగా మొదట వాయు బీజము తర్వాత మంత్రాక్షరము, మఱల వాయుబీజము తర్వాత నింకొక మంత్రాక్షరము, ఇట్లు (యం శ్రీ యం రా యం మ యం రా యం మ

యం రా యం మ) సంపుటిచేసి యంత్రమును శిలారసము (దీనినేకొందఱు అలాజిత్తందురు) కర్పూరము, కుంకుమ, ఉశీరగంధము. కలిపిన పదార్థముతో వ్రాయవలెను. లిఖితమంత్రమును క్షీర, ఘృత, మధు, జలములలోనైచి పూజా జపహోమాదులు గావింపవలెను. ఇట్లు చేసిన తర్వాత నస్నానము గావించిన మంత్రము శీఘ్రముగ సిద్ధించును.

౨. రోధనము:-

వాగ్బీజమగు 'ఐం' బీజసంపుటిచేసి మంత్రజపము చేసిన రోధన ప్రక్రియ యగును. ఉదా:- ఐం శ్రీరామరామరామ ఐం.

3 వశ్యము:-

లాక్షారసము, (అలక్తకము) రక్తచందనము, కుటము, ఉమ్మెత్తగింజలు, మణిశిలతో నూరి దానితో భోజపత్రము లేక తమలపాకుపై తన మంత్రమును వ్రాసి కంఠములోఁ గట్టుకొనిన మంత్రము సిద్ధించును.

౪. పీడనము:-

అధరోత్తర యోగము (పెద్దగాను, మఱల మెల్లగాను, మఱల పెద్దగాను, మఱల మెల్లగాను పలుకుట) చే జపము చేయుచు అధరోత్తర దేవతా (సరస్వతీ) పూజ చేయవలెను. జిల్లేడుపాలచే మంత్రము లిఖించి కాలితో మట్టి (పీడించి) హోమము కావింపవలయును. దీనిని పీడనమందురు.

౫. పోషణము:-

మంత్రమున కాదిని, అంతమునను స్త్రీం బీజమును సంపుటచేసి జపించి పాలతో మంత్రమును వ్రాసి చేతియందు ధరింపవలయును.

ఉదా:- స్త్రీం శ్రీరామ రామ రామ స్త్రీం.

౬. శోషణము:-

వాయుబీజమగు 'యం' కారమును సంపుటితము కావించి జపించి, యజ్ఞభస్మముచే భోజపత్రముపై లిఖించి కంఠమున ధరింపవలయును.

ఉదా:- యం శ్రీరామ రామ రామ యం.

౭. దాహనము:-

మంత్రముయొక్క ప్రతివర్ణమునకును అగ్నిబీజమగు 'రం' కారమును శోధించి జపముచేసి, పాలాశ (మోదుగ) బీజతైలముచే మంత్రమును వ్రాసి కంఠమున ధరించిన దాహన క్రియ యగును. ఉదా:_ రం శ్రీరంరా రంమ రం రా రంమ రం రా రం మ. పై యేడు ప్రక్రియ లొక్కమారే చేయ నవసరము లేదు. ఒకదానితో సిద్ధి కాకున్నఁ దర్వాతదానికి పోవలయును. వీటి నిట్లను ష్ఠించిన మంత్రసిద్ధియై తీరును. సందేహము లేదు.

## మంత్రాంగములు

మంత్రాంగములు ఋషి, ఛందస్సు, దేవత, బీజము, శక్తి, కీలకము. ఇవి తెలియక ముఖ్యముగ ద్విజులు జపము చేయరాదు. ఊరక మంత్రమును జపించుటవలన ఫలము తగ్గును.

### ఋషి

శ్లో॥ ఆర్షం ఛందశ్చ దైవత్యం వినియోగస్తథైవచ,
వేదితవ్యం ప్రయత్నేన బ్రాహ్మణేన విశేషతః॥
అవిదిత్వాతు యఃకుర్యా ద్యాజనాధ్యాప నాదికమ్,
హోమంతర్జలాదీని తస్య చాల్ప ఫలం భవేత్॥ _యాజ్ఞవల్క్యుఁడు.

ఋషి, ఛందస్సు, దేవత, వినియోగము వీటి ముఖ్యముగ బ్రాహ్మణుడు ప్రయత్నపూర్వకముగఁ దెలియవలయును. ఇవి తెలియక యెవఁడు యాజనాధ్యాపకములను, అఘమర్షణాదులను జేయునో వాని కల్పఫలమే కలుగును.

శ్రు॥ ఋషిదైవతచ్ఛందో బ్రాహ్మణాన్యుపక్రమ్య అథ
యో మంత్రే మంత్రే వేద సర్వమా యురేతి శ్రేయాన్
భవత్యయాతయామాన్యస్య ఛందాంసి భవంతి తస్మా
దేతాని మంత్రే మంత్రే విద్యా దృషీణాం సస్థానో
భవతి బ్రహ్మణః స్వర్గేలోకే మహీయతే॥ ___సామబ్రాహ్మణము.

ఋషి, దైవత, ఛందస్సులనే బ్రాహ్మణులు ప్రతిమంత్రమునకుఁ దెలిసి కొనుచున్నారో వారు దీర్ఘాయుష్మంతు లగుదురు. శ్రేయస్సులు కలుగును. సంపదస్సు లన్నియు లభించును. కావున ప్రతి మంత్రమునకును వీటిని దెలిసికొన వలయును. అట్లు తెలిసికొనిన ఋషులతో సమానస్థానము లభించును. బ్రహ్మ సాయుజ్యము లభించును.

శ్లో॥ పూర్వోక్తేన ప్రకారేణ ఋష్యాదీన్వేత్తి యో ద్విజః,
అధికారో భవేత్తస్య రహస్యాదిషు కర్మ సు॥

పూర్వము చెప్పిన రీతిని ఋషి ఛందస్సు, దేవత మొదలగు వాటినే బ్రాహ్మణుఁడు తెలిసికొనుచున్నాఁడో కర్మలలో రహస్యమును దెలిసికొనుట కధికారి యగుచున్నాఁడు.

శ్లో॥ యేన యదృషిణాదృష్టం సిద్ధిః ప్రాప్తా చ యేన వై,
మంత్రేణ తస్య తత్ప్రోక్త మృషే ర్భావ స్తదార్షకమ్॥

ఏ ఋషిచే నీ మంత్ర మావిష్కరింపఁబడినదో, యెవనిచే సిద్ధిపొందఁ బడినదో ఆ మంత్రమా ఋషిదిగాఁ జెప్పఁబడుచున్నది.

## ఛందస్సు

ఇఁక ఛందస్సన నేమియో చెప్పఁబడుచున్నది.

శ్లో॥ ఛాదనాచ్ఛంద ఉద్దిష్టం వాససీ ఇవ చాకృతే,
ఆత్మా సంఛాదితో దేవైర్మృత్యో ర్భీతైస్తు వై పురా॥
ఆదిత్యైః వసుభిః రుద్రై స్తేన ఛందాం సితానివై॥ అట్లు

శరీరమునకు కప్పుకొనుటకు గుడ్డ లెట్లో కప్పుటవలన ఛందమను పేరు వచ్చినది. పూర్వము మృత్యు భీతిని జెందిన దేవతలచే నాత్మ ఆచ్ఛాదింపఁ బడినది. అట్లు ఆదిత్యులచేతను, వసువులచేతను, రుద్రులచేతను కప్పఁబడినవి కావున ఛందస్సులని పేరువచ్చెను.

## దేవత

శ్లో॥ యస్య యస్య తు మంత్రస్య ఉద్దిష్టా దేవతా తుయా,
తదాకారం భవేత్తస్య దేవత్వం దేవతోచ్యతే॥

ఏయే మంత్రమున కేయే దేవత ఉద్దేశింపఁబడినదో ఆ దేవతాకారము ఆమంత్రము జపించుటచే నేర్పడును గనుక ఆ మంత్రమునకు దేవత అది యని చెప్పఁబడినది.

## వి ని యో గః

శ్లో॥ పురా కల్పే సముత్పన్నా మంత్రాః కర్మార్థ మేవచ,
అనేనేదం తు కర్తవ్యం వినియోగః స ఉచ్యతే॥

— యాజ్ఞవల్క్యుఁడు.

పూర్వకల్పములో కర్మలకొఱకు మంత్రము లేర్పడినవి. వాటిచే నీ పని చేయవలెనను దానికే వినియోగమను పేరు వచ్చినది.

పై విషయమునుబట్టి మంత్ర ద్రష్టలగు మహర్షులు మంత్రమును గనిపెట్టిన వారును, దాని ననుష్ఠించి సిద్ధిపొందిన వారిలో నుత్కృష్టులును ఆయామంత్రములకు ఋషులైరి. మన రామమంత్రమునకు శివుఁడు, అగస్త్యుఁడు, వశిష్ఠుఁడు, వాల్మీకి మొదలగువారు ఋషులైరి.

మంత్రము నేయే రీతిగాఁ బలికిన, లేదా కూర్చిన నది యనుష్ఠాన యోగ్యమై ఆ ధోరణికి దేవతా ప్రసన్నమగునో అదియే ఛందస్సు. ఇట్టి ఛందస్సు, లనేకములు కలవు. శ్రీరామ మంత్రమునకు అనుష్టుప్ ఛందస్సు.

మంత్రమును జపించిన నేదేవత ఆవిర్భవించి దర్శన మొసంగునో ఆయ నయే ఆ మంత్రమున కధిదేవత. శ్రీరామ మంత్రమునకు శ్రీరామచంద్రుఁడే అధిదేవత.

## బీ జ ము

ఒక బీజము (విత్తనము) నకు దోహదములఁ గావించిన నదియే మొలకెత్తి పెద్ద వృక్షమైనట్లు, మంత్రబీజమువలన మంత్రము వర్ధిల్లి మంత్రఫలమగు దేవత లభించును. ఈ బీజమే మంత్రమునకు సారస్వరూపము. ఈబీజమువలననే మంత్రఫలమగు శ్రీరామచంద్రుఁడు ప్రత్యక్షమగును. శ్రీరామ మంత్రమునకు బీజము 'రాం' ఈ 'రాం' బీజము నుండియే సమస్త రామమంత్రములు ఉద్భవించినవి. రామమంత్రములే యననేల శతకోటి ప్రవిస్తరమగు రామాయణ మంతయు నీ బీజములోనే కలదు. ఈ బీజము లేక రామమంత్రమును

లేదు రాముఁడును లేఁడు. శ్రీరామ మంత్రార్థమంతయు నీ 'రాం' బీజము నందిమియే చెప్పనచ్చును. వేఱొకచోట వ్రాయఁబడిన శ్రీరామ మంత్రార్థమును జదువుఁడు.

## శక్తి

ప్రతి మంత్రమునకును శక్తి యుండును. ఈ శక్తియే మంత్రద్యోతకము కావించును. ఈ శక్తి వలననే ఒక విధమైన స్పందనము కలుగును. ఇది యుపాస్య దేవతవఱకు వాహనమువలె మనస్సును గొనిపోవును. సూర్యునికి తేజస్సు వలెను, బ్రహ్మకు వాణి వలెను, నారాయణునకు లక్ష్మి వలెను, పరమేశ్వరునకుఁ బార్వతి వలెను, పరంబ్రహ్మకు మాయవలెను నీశక్తి యున్నది. శ్రీరామ మంత్రమునకు శక్తి 'శ్రీం' ఇది లక్ష్మీస్వరూపిణి యగు సీతయొక్క బీజము. కొన్ని రామ మంత్రములకు 'రీం' శక్తి.

## కీలకము

కీలకము సకలమంత్రలకు సధికశక్తి నిచ్చునదై యున్నది. మంత్రములోని చిక్కును విడదీయునదీ కీలకమే ఈ కీలకము(Key) తెలిసినఁగాని మంత్రములోని చిక్కును విడదీయ వీలులేదు. చిక్కు విడిచిననే మంత్రమూర్తి వశపడును. శ్రీరామ మంత్రమునకుఁ గీలకము 'మం'. మం కారము జీవ వాచకము. కొన్ని రామ మంత్రములకు కీలకము 'రూం'. జీవుఁడును సచ్చిదానంద స్వరూపుఁడే. శ్రీరాముఁడును సచ్చిదానంద స్వరూపుఁడే. ఆయన పరమాత్మ. అనఁగా ఇంద్రియ విషయములకుఁ బరముగ నున్నాఁడు. జీవుఁడు ప్రత్యగాత్మ. ప్రత్యక్ అనఁగా సాక్షి. అనఁగా జీవుఁడు విషయాదులను సాక్షిగాఁ జూచుచున్నాఁడు. ఇట్లు విషయ దర్శనము చేయువాఁడు విషయరతుఁడై కర్మజాలమునఁ బడి సంసార పంకమునఁ జిక్కుకొన్నాఁడు. ఇట్టి జీవుఁడు ముందుగా విషయనిరతిని జెంది, ప్రత్యక్త్వమును వదలుకొని యంతర్ముఖుఁడై పరుఁడు కావలయును. అట్టి స్థితికి మంత్రము కొనిపోవును. మంత్రోపాసన రహస్య మిదియే. ఇదియే కీలకము.

మంత్ర వినియోగమునుగూడ చెప్పవలయును. మంత్రమును దేనికుపయోగింపఁదలఁతుమో అదియే వినియోగము. శ్రీరామ మంత్రమును పురుషార్థములకు

వినియోగింపరాదు. కేవలము శ్రీరామచంద్ర ప్రసాద సిద్ధికొఱకే మంత్రమును వినియోగింపవలయును. ఇట్టి వినియోగమును జెప్పి నీటిని విడువవలయును.

## న్యాస ప్రయోగ మహిమ

న్యాసమనఁగా స్థాపన. మనుష్యుని దేహమునకు బయట కొన్ని యవయవములును, లోపలఁ గొన్ని యవయవములును గలవు. ఒక్కొక్క స్థానమున మంత్రవర్ణములతోఁగాని, మాతృకావర్ణములతోఁగాని, తత్త్వములతోఁగాని, ఇంద్రియాధి దేవతలతోఁగాని న్యాసము గావింపవలయును. శరీరము అపవిత్రమైనది. రక్తమాంస శ్లేష్మాది దుర్గంధయుక్తమైనది. మనో బుద్ధులుకూడ విషయ చింతనముచేఁ గల్మష యుక్తములై యుండును. చిత్తము అపవిత్రముగ నున్నంత వఱకు చిత్త ప్రసాదము కలుగదు. భావోద్దీపన ముండదు. ఇట్లుండకపోవుటవలన చిత్తము చిరంతరము మంత్రమును జింతింపన సమర్థము కాకుండును.

శ్లో॥ న్యాసేన నితరాం దేహే అనమంత్రోక్షరాణిచ,
మన్యాకృతిర్జపన్నిత్యం సాధకః సిద్ధిమాప్నుయాత్ ॥

ఈ దేహమందు మంత్రాక్షరములను న్యాసముచేసి మంత్రాకృతిని నిత్యమును జపించిన సాధకుఁడు సిద్ధిని బొందును.

శ్లో॥ న్యాసం వినా కృతామంత్ర క్రియాః సర్వా వినిష్ఫలాః,
తస్మాన్న్యాసః ప్రకర్తవ్యోం మంత్రాగత ఫలేప్సుభిః॥

న్యాసము లేక చేసిన మంత్రక్రియలన్నియు నిష్ఫలములే. కావున మంత్రముతో గల ఫలము కావలెనను వారు న్యాస మొనర్పవలయును.

న్యాసము గావించుట వలననే మంత్రము సిద్ధించును. దేవత్వప్రాప్తి కలుగును. శరీరములోని ప్రతి యంగమునకు ఒక్కొక్క అధిదేవత కలఁదు. అయితే మనము గమనింపక పోవుటవలన నా యధిదేవతలు ప్రసన్నులు కాక యుందురు. శరీరమునఁగల క్రియాశక్తి సుప్తమైన క్రియాశక్తి జాగృతిచెందును.

న్యాసము కావించునపుడు ఆయా యంగములను బుష్పముతో స్పర్శించు నాచారము కలదు. కొందఱు అంగుష్ఠ అనామికలు కలిపి సర్వాంగములను దాఁకుదురు. కొందఱు భిన్న భిన్న యంగములను భిన్న భిన్న యంగుళములతోఁ

దాఁకవదురు. హృదయమును మధ్యమ అనామిక తర్జనీలతోఁ దాఁక వలయును. మధ్యమ తర్జనీలచే శిరస్సును, అంగుష్ఠముచే శిఖను, రెండుచేతుల పదివ్రేళ్ళను సంపుటిఁ గావించి కుడిచేతి సంపుటిచే నెడమ భుజమును, నెడమచేతి సంపుటిచేఁ గుడిభుజమును తాఁకవలెను. ఇది కవచము వంటిది. తర్జనీ మధ్యమ అనామికలచే నేత్రములను, తర్జనీ మధ్యములచేఁ గరతల కరపృష్ఠములను దాఁకవలెను.

# మాతృకా న్యాసము

పరబ్రహ్మలో మొదట స్పందనము కలిగినది. ఆస్పందనము వలన శబ్దము పుట్టినది. అదియే ప్రణవము (ఓం). ఆ ప్రణవము నుండి అకారము మొదలు క్షకారము వఱకు గల యేఁబది యక్షరములు కలిగినవి. అకారము మొదలు క్షకారము వఱకు గల వర్ణములకు అక్షరములను పేరువచ్చినది. ఈ యక్షరముల మూలముననే వేదము బయలు వెడలినది. వేదమువలనఁ బంచభూతాత్మిక మగు సృష్టి జరిగినది. వస్తుతః ఈదేహముకూడ శబ్ద బ్రహ్మ మయమే. ఈ శరీరమును గూడ శబ్దబ్రహ్మముగా భావింప వలయును. మంత్రయుక్తముగఁ జేసిన వర్ణ న్యాసము (దీనినే మాతృకా న్యాసమందురు) వలన దేహమంతయు దివ్యమై పరమానందానుభూతి కలుగును. న్యాసము కావించుటవలన నాధిదైవిక, ఆధిభౌతిక, ఆధ్యాత్మిక తాపములు శాంతించును.

ప్రథమమున సంకల్ప ప్రాణాయామములు కావించి యిట్లు న్యాసము చేయవలయును.

ఓం అస్య శ్రీమాతృకా న్యాసస్య బ్రహ్మఋషిః గాయత్రీ ఛందః మాతృకా సరస్వతీ దేవతా హలో బీజాని, స్వరాః శక్తయః, బిందవః కీలకమ్ అనుష్ఠీయమాన శ్రీరామ ...... అక్షరీమంత్ర రాజాంగత్వేన న్యాసే వినియోగః — (నీళ్లు వదలవలయును.)

ఓం బ్రహ్మణే ఋషయే నమః (శిరస్సు) ఓం గాయత్రీ ఛందసేనమః (ముఖము) ఓం మాతృకా సరస్వతీ దేవతాయై నమః ( హృదయము ) ఓం హల్భ్యో బీజేభ్యో నమః (గుహ్యము) ఓం స్వరేభ్యో నమః (పాదములు) ఓం బిందుభ్యః కీలకేభ్యో నమః (సర్వాంగములు.)

## కరన్యాసము

మామూలు కరన్యాసమునకు ముందు చేతి పర్వములందు స్వరములను న్యసింపవలయును.

ఓం అం ఆం (కుడి) తర్జన్యై నమః
,, ఇం ఈం ,, మధ్యమాయై నమః
,, ఉం ఊం ,, అనామికాయై నమః
,, ఋం ౠం ,, కనిష్ఠికాయై నమః
ఓం ౡం ౡం (ఎడమ) తర్జన్యై నమః
,, ఏం ఐం ,, మధ్యమాయై నమః
,, ఓం ఔం ,, అనామికాయై నమః
,, అం అః ,, కనిష్ఠికాయై నమః

## కరన్యాసము

ఓం అం కం ఖం గం ఘం ఙం ఆం అంగుష్ఠాభ్యాం నమః
,, ఇం చం ఛం జం ఝం ఞం ఈం తర్జనీభ్యాం నమః
,, ఉం టం ఠం డం ఢం ణం ఊం మధ్యమాభ్యాం నమః
,, ఏం తం థం దం ధం నం ఐం అనామికాభ్యాం నమః
,, ఓం పం ఫం బం భం మం ఔం కనిష్ఠికాభ్యాం నమః
,, అం యం రం లం వం శం షం సం హం ళం అః కరతల కరపృష్ఠాభ్యాం నమః

## అంగన్యాసము

ఓం అం కం ఖం గం ఘం ఙం ఆం హృదయాయ నమః
,, ఇం చం ఛం జం ఝం ఞం ఈం శిరసే స్వాహా
,, ఉం టం ఠం డం ఢం ణం ఊం శిఖాయై వౌషట్
,, ఏం తం థం దం ధం నం ఐం కవచాయ హుమ్

ఓం ఓం పం ఫం బం భం మం ఔం నేత్రత్రయాయవౌషట్

,, అం యం రం లం వం శం షం సం హం ళం అః అస్త్రాయఫట్

ఇట్లు చేసిన తర్వాత భావనాపూర్వకముగ నంతర్మాతృకాన్యాసము గావింపవలెను. ముందుగా ధ్యానము కావింపవలయును.

## ధ్యానమ్

శ్లో॥ పంచాశద్వర్ణ భేదైర్విహిత వదనదోః పాదహృత్కుక్షివక్షో
దేశాం భాస్వత్కపర్దా కలిత కలిత శశికళా మిందుకుందావదాతామ్,
అక్షస్రక్కుంభ చింతాలిఖిత వరకరాం త్రీక్షణాం పద్మసంస్థా,
మచ్ఛాకల్పా మతుచ్ఛ స్తన భర నమితాం భారతీం తాం నమామి॥

ముందు కంఠ ప్రదేశమున షోడశ (౧౬) దళపద్మమున అకారము మొదలు అః వఱకుగల పదునాఱక్షరములను నొక్కొక్క దళమున నొక్కొక యక్షరమున చొప్పున భావించుచు న్యసింపవలెను. ఓం అంనమః, ఆం నమః ఇం నమః, ఈం నమః, ఉం నమః, ఊం నమః, ఋం నమః, ౠం నమః, ఌం నమః, ౡం నమః, ఏం నమః, ఐం నమః, ఓం నమః, ఔం నమః అం నమః, అః నమః హృదయమున ద్వాదశ (౧౨) దళ పద్మమును భావించి దానిలో నీక్రిందివాటిని న్యసింపవలయును.

ఓం కం నమః, ఖం నమః, గం నమః, ఘం నమః, ఙం నమః, చం నమః, ఛం నమః, జం నమః, ఝం నమః, ఞం నమః, టం నమః, ఠం నమః.

నాభిస్థానమున దశ (౧౦) దళ పద్మమును భావించి దానిలో నీక్రింది వాటిని న్యసింపవలెను. ఓం డం నమః, ఢం నమః, ణం నమః, తం నమః, థం నమః, దం నమః, ధం నమః, నం నమః, పం నమః, ఫం నమః.

లింగస్థానమున షడ్దళ (౬) పద్మమును భావించి దానిలో నీ క్రింది వాటిని న్యసింపవలెను.

ఓం బం నమః, భం నమః, మం నమః, యం నమః, రం నమః, లం నమః.

పాయువు (గుదము లింగమునకు మధ్య) నందు చతుర్దళ (4) పద్మమును భావించి దానిలో నీ క్రింది వాటిని న్యసింపవలయును.

ఓం వం నమః, శం నమః, షం నమః, సం నమః, భ్రూమధ్యమున ద్వి (2) దళ పద్మమును భావింపవలయును.

ఓం హం నమః, క్షం నమః ఇది అంతర్మాతృకా న్యాసము.

## బహిర్మాతృకాన్యాసము

పైనఁ జెప్పిన ధ్యానమును గావింపవలెను. ఆయా స్థానములను దాఁకునప్పుడా యా వ్రేళ్ళను కలిపి తాఁకవలెను ఇది విధి కావునఁ దప్పదు. తాఁకవలసిన వ్రేళ్ళ గుర్తును సంఖ్యారూపమున నీయఁబడినది.

1 = అంగుష్ఠము. 2. = తర్జనీ. 3. = మధ్యమ. 4. = అనామికమి. 5 = కనిష్ఠికా

## న్యాసము

ఓం అం నమః (మౌళి 3, 4) ఓం ఆం నమః (ముఖము 2, 3, 4) ఓం ఇం నమః (కుడికన్ను 1, 4) ఓం ఈం నమః (ఎడమ కన్ను 1, 4) ఓం ఉం నమః (కుడి చెవి 1) ఓం ఊం నమః (ఎడమ చెవి 1) ఓం ఋం నమః (కుడి ముక్కు 1, 5) ఓం ౠం నమః (ఎడమ ముక్కు 1, 5) ఓం ఌం (కుడి కపోలము 2, 3, 4) ఓం ౡం నమః (ఎడమ కపోలము 2, 3, 5) ఓం ఏం నమః (పై పెదవి 3) ఓం ఐం నమః (క్రింది పెదవి 3) ఓం ఓం నమః (పై పండ్లు 4) ఓం ఔం నమః (క్రింది పండ్లు 4) ఓం అం నమః (బ్రహ్మ రంధ్రము 3) ఓం అః నమః (ముఖ మధ్యమున జిహ్వా 4) ఓం కం నమః (కుడి చంక 3, 4, 5) ఓం ఖం నమః (కూర్పరము 3, 4, 5) ఓం గం నమః (మణిబంధము 3, 4, 5) ఓం ఘం నమః (అంగుళి మూలము 3, 4, 5) ఓం ఙం నమః (అంగుళ్యగ్రములందు 3, 4, 5) ఓం చం ఛం జం ఝం ఞం టం నమః (దక్షిణపాదమూలము 3, 4, 5) ఓం ఠం నమః (జానువులు 3,4,5) ఓం డం నమః(గుల్భము 3, 4, 5) ఓం ఢం నమః (అంగుళిమూలము 3, 4, 5) ఓం ణం నమః (అంగుళ్యగ్రములు 3, 4, 5)

ఈ విధముగనే యెడమ కాలికికూడ న్యాసము చేయవలయును.

ఓం తం థం దం ధం నం నమః (ఎడమ భాగము) ఓం పం నమః (కుడి పార్శ్వము ౩, ౪, ౫) ఓం ఫం నమః (ఎడమ పార్శ్వము ౩, ౪, ౪) ఓం బం నమః (పృష్ఠము ౩, ౪, ౫) ఓం భం నమః (నాభి ౧, ౩, ౪, ౫) ఓం మం నమః (ఉదరము ౧, ౨, ౩, ౪, ౫) ఓం యం నమః త్వగాత్మనే నమః (హృదయము) ఓం రం నమః అసృగాత్మనే నమః (కుడిగజ్జ) ఓం లం నమః మాంసాత్మనే నమః (కకుది అనఁగా మూపురము) ఓం వం నమః మేదాత్మనే నమః (ఎడమ చంక) ఓం శం నమః అస్థ్యాత్మనే నమః (హృదయము మొదలు కుడిచేయి వఱకు) ఓం షం నమః మజ్జాత్మనే నమః (హృదయము మొదలు యెడమ చేయి వఱకు) ఓం సం నమః శుక్రాత్మనే నమః (హృదయము మొదలు కుడి పాదము వఱకు) ఓం హం నమః ప్రాణాత్మనే నమః (హృదయము మొదలు యెడమ పాదము వఱకు) ఓం ళం నమః శక్త్యాత్మనే నమః (జఠరము నందు) ఓం క్షం నమః క్రోధాత్మనే నమః (ముఖమునందు) హృదయము (యం) మొదలు చివర వఱకు అఱచేతితోఁ దాఁకవలెను.

## సంహార మాతృకా న్యాసము

సంహార మాతృకా న్యాసము పై న్యాసమునకు సరిగా తలక్రిందుగ చేయవలయును.

'బిందు యుక్తాం మాతృకాంతు విన్యసేచ్ఛ విలోమతః' అని శాస్త్రము. ఉదా :- క్షం క్రోధాత్మనే నమః (ముఖమునందు) ళం శక్త్యాత్మనే నమః జఠరమునందు ............ ఓం అం నమః (శిరస్సునందు) ఇట్లు ముగింపవలయును.

## కేశవాది మాతృకా న్యాసము

ఆచమ్య - ప్రాణానాయమ్య - [సంకల్పముచేసి] అస్యశ్రీ కేశవాది మాతృకా న్యాసస్య సాధ్యనారాయణ ఋషిః, దైవీగాయత్రీ ఛందః, శ్రీమహాలక్ష్మీనారాయణో దేవతా, హ్రాం బీజం, సర్వాః శక్తిః. ఇష్టార్థన్యాసే వినియోగః॥ (నీరు విడువవలెను.) ఓం శ్రీం ఓం నమోనారాయణాయ హంసః సోఽహం అం కం ఖం గం ఘం ఙం ఆం హ్రీం సోఽహం హంసః. ఓం నమోనారాయణాయ ప్రణవస్య - మస్వాహా శ్రీ దేవ్యై హృదయాయనమః(హృదయే) ఓం శ్రీం హ్రీం నమో నారాయణాయ హంసః సోఽహం ఇం చం ఛం జం

ఋం ఌం ఌౄం హ్రీం సోఽహం హంసః, ఓం నమో నారాయణాయ మహోల్కాయ స్వాహా శ్రీం పద్మిన్యైనమః శిరసే స్వాహా (శిరసి) ఓం శ్రీం ఓం నమో నారాయణాయ హంసః సోఽహం ఉం టం ఠం డం ఢం ణం ఊం హ్రీం సోఽహం హంసః ఓం నమో నారాయణాయ వీరోల్కాయ స్వాహా శ్రూం విష్ణు పత్న్యై శిఖాయై వషట్ (శిఖాయాం) ఓం శ్రీం ఓం నమో నారాయణాయ హంసః సోఽహం ఏం తం థం దం ధం నం ఐం హ్రీం సోఽహం హంసః ఓం నమో విద్యుదుల్కాయ స్వాహా ఓం శ్రైం వరదాయై కవచాయహుం । ఓం శ్రీం ఓం నమో నారాయణాయ హంసః సోఽహం ఓం ఓం పం ఫం బం భం మం ఔం హాం సోఽహం హంసః ఓం నమో నారాయణాయ సహస్రోల్కాయ స్వాహా శ్రౌం కమల రూపాయై నేత్రత్రయాయ వౌషట్।

ఓం శ్రీం ఓం నమో నారాయణాయ హంసంసోఽహం అం యం రం లం వం శం షం సం హం ళం క్షం అః హ్రీం సోఽహం హంసః ఓం నమో నారాయణాయ అనంతోల్కాయ స్వాహా శ్రః శూలిన్యైః నమః అస్త్రాయ ఫట్॥

## ధ్యానమ్

శ్లో॥ విద్యారవింద ముకురామృత కుంభపద్మ,
కౌమోదకీ దర సుదర్శన శోభిహస్తమ్,
సౌదామినీ ముకురకాంతి వికాస లక్ష్మీ,
నారాయణాత్మక మఖండిత మాది మూర్తిమ్॥

ఓం హ్రీం శ్రీం క్లీం అం క్లీం శ్రీం హ్రీం కేశవాది కీర్త్యైనమః (శిరస్సు)

ఓం హ్రీం శ్రీం క్లీం ఆం క్లీం శ్రీం హ్రీం నారాయణాయ కాంత్యై నమః (ముఖము)

ఓం హ్రీం శ్రీం క్లీం ఇం క్లీం శ్రీం హ్రీం మాధవాయ తుష్ట్యైనమః (కుడికన్ను)

ఓం హ్రీం శ్రీం క్లీం ఈం క్లీం శ్రీం హ్రీం గోవిందాయ పుష్ట్యైనమః (ఎడమ కన్ను)

" " ఉం " విష్ణవే ధృత్యైనమః

| | | | | |
|---|---|---|---|---|
| ఓం హ్రీం | శ్రీం క్లీం | ఊం | క్లీం శ్రీం హ్రీం | మధుసూదనాయ క్షాంత్యై నమః |
| ,, | ,, | ఋం | ,, | త్రివిక్రమాయ క్రియాయై నమః |
| ,, | ,, | ౠం | ,, | వామనాయ దయాయై నమః |
| ,, | ,, | ఌం | ,, | శ్రీధరాయ మేధాయై నమః |
| ,, | ,, | ౡం | ,, | హృషీకేశాయ హర్షాయై నమః |
| ,, | ,, | ఏం | ,, | పద్మనాభాయ శ్రద్ధాయై నమః |
| ,, | ,, | ఐం | ,, | దామోదరాయ లజ్జాయై నమః |
| ,, | ,, | ఓం | ,, | సంకర్షణాయ సరస్వత్యై నమః |
| ,, | ,, | ఔం | ,, | వాసుదేవాయ లక్ష్మ్యై నమః |
| ,, | ,, | అం. | ,, | ప్రద్యుమ్నాయ ప్రీత్యై నమః |
| ,, | ,, | ఆం | ,, | అనిరుద్ధాయ రత్యై నమః |
| ,, | ,, | కం | ,, | చక్రిణే జయాయై నమః |
| ,, | ,, | ఖం | ,, | గదినే దుర్గాయై నమః |
| ,, | ,, | గం | ,, | శార్ఙ్గిణే ప్రభాయై నమః |
| ,, | ,, | ఘం | ,, | ఖడ్గినే సత్యాయై నమః |
| ,, | ,, | జం | ,, | శంఖినే చండాయై నమః |
| ,, | ,, | చం | ,, | హలినే వాణ్యై నమః |
| ,, | ,, | ఛం | ,, | ముసలినే విలాపిన్యై నమః |
| ,, | ,, | జం | ,, | శూలినే విజయాయై నమః |
| ,, | ,, | ఝం | ,, | పాశినే విరజాయయై నమః |
| ,, | ,, | ఞం | ,, | అంకుశినే విశ్వాయై నమః |
| ,, | ,, | టం | ,, | ముకుందాయ విమదాయై నమః |
| ,, | ,, | ఠం | ,, | నందజాయ సునందాయై నమః |
| ,, | ,, | డం | ,, | నందాయ స్మృత్యై నమః |
| ,, | ,, | ఢం | ,, | నాదాయ బుద్ధ్యై నమః |

ఓం హ్రీం శ్రీం క్లీం ణం క్లీం శ్రీం హ్రీం నరకజితే సమృద్ధ్యై వమః

,, ,, తం ,, హరయే శుద్ధ్యై నమః

,, ,, ధం ,, కృష్ణాయ భుక్త్యై నమః

,, ,, దం ,, సత్యాయ ముక్త్యై నమః

,, ,, ధం ,, సాత్వతాయ మత్యై నమః

,, ,, నం ,, శౌరిణే క్షమాయై నమః

,, ,, పం ,, శూరాయ పరమాయై నమః

,, ,, ఫం ,, జనార్దనాయ ఉమాయై నమః

,, ,, బం ,, భూధరాయ క్లేదిన్యై నమః

,, ,, భం ,, విశ్వమూర్తయే క్లిన్నాయై నమః

,, ,, మం ,, వైకుంఠాయ వాసుదేవాయ నమః

,, ,, యం ,, త్వగాత్మనే పురుషోత్తమాయ వసుధాయ నమః

,, ,, రం ,, అసృగాత్మనే బలినే పరాయై నమః

,, ,, లం ,, మాంసాత్మనే బలానుజాయ పరాయణాయ నమః

,, ,, వం ,, మేదాత్మనే బలాయ సూక్ష్మాయై నమః

,, ,, శం ,, అస్థ్యాత్మనే వృషఘ్నాయ సంధ్యాయై నమః

,, ,, షం ,, మజ్జాత్మనే వృషాయ ప్రజ్ఞాయై సమః

,, ,, సం ,, శుక్రాత్మనే హంసాయ ప్రభాయై సమః

,, ,, హం ,, ప్రాణాత్మనే వరాహాయ నిశాయైనమః

,, ,, ళం ,, క్రియాశక్త్యాత్మనే విమలాయ అమోఘాయైనమః

,, ,, క్షం ,, పరమాత్మనే నృసింహాయ విమత్యాయై నమః

ఆయా యవయవములు తాఁకుట పై మాతృకా న్యాసములోవలెఁ జేయ వలయును. ఈ న్యాసము గావించిన

శ్లో॥ కేశవాదిరయం న్యాసో న్యాసమాత్రేణ దేహినామ్,
అచ్యుతత్వం దదాత్యేవ సత్యం సత్యం నసంశయః॥

ఈ కేశవాది మాతృకాన్యాసమును జేసినంత మాత్రముననే దేహులకు అచ్యుతత్వము నీయఁగలఁడు. ఇది ముమ్మాటికి సత్యము. సంశయము లేదు. ఈ న్యాసము విష్ణుభక్తులకు ముఖ్యమైనది.

## పీఠ న్యాసము

పీఠ మనఁగా దేవతా నివాస యోగ్యస్థానము. దీనికి బాహ్యక్రియలతో బనిలేదు. కేవలము భావనా సంబంధమైనది. ఇదె వఱకు చెప్పిన న్యాసములకంటె నిది యుత్తమమైనది. దీని ననుష్ఠించుట వలన మంత్రశక్తియు, భావనాశక్తియు ప్రాణశక్తియు, దైవీశక్తియు నుత్పన్నమగును. ఈ పీఠన్యాసములోఁ జెప్పఁబడు తత్త్వములన్నియు నిదివఱకే శరీరములో సూక్ష్మరూపమున నున్నవి. కాని మంత్రయుక్తముగాను, భావనాశక్తితోడను, వాటిని స్థూలరూపముగా నొనర్ప వచ్చును. ఈ న్యాసమున గావించుట వలన శరీరము దేవతా నివాస యోగ్యమగుచున్నది. ఇది దేవత నాకర్షించును.

## న్యాసము

(హృదయమునందు) ఓం ఆధారశక్త్యై నమః, ఓం ప్రకృత్యై నమః, ఓం కూర్మాయనమః, ఓం అనంతాయనమః, ఓం పృథివ్యైనమః, ఓం క్షీర సముద్రాయనమః, ఓం శ్వేతద్వీపాయనమః, ఓం మణిమండపాయనమః, ఓం కల్ప వృక్షాయనమః, ఓం మణివేదికాయైనమః, ఓం రత్నసింహాసనాయనమః.

(కుడి భుజమునందు) ఓం ధర్మాయనమః
(ఎడమ భుజమునందు) ఓం జ్ఞానాయనమః
(ఎడమ తొడమీద) ఓం వైరాగ్యాయనమః
(కుడి తొడమీద) ఓం ఐశ్వర్యాయ నమః
(ముఖమునందు) ఓం అధర్మాయ నమః

(ఎడమ పార్శ్వమునందు) ఓం అజ్ఞానాయనమః
(నాభియందు) ఓం అవైరాగ్యాయ నమః
(కుడి పార్శ్వమునందు) అనైశ్వర్యాయ నమః

(మరల హృదయమందు) ఓం అనంతాయనమః, ఓం పద్మాయనమః, ఓం అం సూర్యమండలాయ ద్వాదశ కళాత్మనే నమః, ఓం ఉం సోమ మండలాయ షోడశకళాత్మనే నమః, ఓం మం వహ్నిమండలాయ దశకళాత్మనే నమః, ఓం సం సత్వాయ నమః, ఓం రం రజసేనమః, ఓం తం తమసే నమః, ఓం ఆం ఆత్మనే నమః, ఓం అం అంతరాత్మనే నమః, ఓం పం పరమాత్మనే నమః, ఓం హ్రీం జ్ఞానాత్మనే నమః.

ఇట్లు న్యాసము కావించి హృదయ కమలమందు మధ్యను ఇష్టదేవతా స్వరూపమైన మంత్రమును స్థాపింపవలెను. ఇదియే పీఠన్యాసము.

## మూర్తి పంజర న్యాసము.

ఓం అం ఓం రాం కేశవాయ ధాత్రేనమః (లలాటము)
ఓం ఆం నం రాం నారాయణాయార్యమ్ణే నమః (నాభి)
ఓం ఇం మోం మాం మాధవాయ మిత్రాయనమః (హృదయము)
ఓం ఈం భం యం గోవిందాయ వరుణాయనమః (కంఠము)
ఓం ఉం గం నం విష్ణవే అంశవే నమః (కుడిపార్శ్వము)
,, ఊం వం మం మధుసూదనాయ భగాయనమః (దక్షిణాంసము)
,, ఏం తం రాం త్రివిక్రమాయ వివస్వతే నమః (దక్షిణ కంధరము)
,, ఓం ఓం సుం మాం శ్రీధరాయ పూష్ణేనమః (వామాంసము)
,, ఔం దేం యం హృషీకేశాయపర్జన్యాయనమః(వామకంధరము)
,, అం వాం నం పద్మనాభాయ త్వష్ట్రేనమః (పృష్ఠము)
,, అః యం మం దామోదరాయ విష్ణవేనమః (మూపురము)
,, నమో భగవతే వాసుదేయ (మూర్ధ్ని)

ఈ న్యాసమును గావించుట వలన మంత్రి శ్రీరామునితో సమానుఁడగును.

# అంగుళిన్యాస, హృదయాదిన్యాస, అక్షరన్యాస, పదన్యాసములు.

ఈ న్యాస మన్నిటికంటె ముఖ్యమైనది. ఇది మంత్రానుష్ఠానములో అంగన్యాసము కరన్యాసము రూపమున నుండును. ఏ న్యాసము చేసినను జేయకున్నను ఈ న్యాసము చేయనిది మంత్రజపము చేయనేరాదు. చేసినను అది సిద్ధింపదు. స్త్రీ శూద్రులకు న్యాసములతోఁ బనిలేదు. వారికి గుర్వనుగ్రహమునఁ గేవల జపము వలననే మంత్రసిద్ధి కలుగఁగలదు. ఏ యనుష్ఠానమునకైనను భక్తి ప్రధానము.

**అంగుళిన్యాసము**

ఓం రాం నమః అంగుష్ఠాభ్యాంనమః
,, రీం నమః తర్జనీభ్యాం నమః
,, రూం నమః మధ్యమాభ్యాంనమః
,, రైం నమః అనామికాభ్యాంనమః
,, రౌం నమః కనిష్ఠికాభ్యాం నమః
,, రం నమః కరతల కరపృష్ఠాభ్యాంనమః

**హృదయాదిన్యాసము**

ఓం రాం నమః హృదయాయనమః
,, రీం నమః శిరసేస్వాహా
,, రూం నమః శిఖాయై వషట్
,, రైం నమః కవచాయ హుం
,, రౌం నమః నేత్రత్రయాయ వౌషట్
,, రః నమః అస్త్రాయఫట్

## అక్షరన్యాసము

ఓం రాం నమః ( శిరస్సు )
,, రాం నమః ( భ్రూమధ్యము )
,, మాం నమః ( హృదయము )
,, యం నమః ( నాభి )
,, నం నమః ( గుహ్యము )
,, మః నమః ( పదస్థలము )

## పదన్యాసము

ఓం రాం నమః (శిరస్సు)
,, రామాయనమః (నాభి)
,, నమో నమః (పాదములు)

న్యాసములలో శ్రీరామ షడక్షరీ మహామంత్రము ఉపయోగింపఁబడినది.

## ధ్యానము

న్యాసము చేసిన తర్వాత ధ్యానము చేయవలెను. మంత్రములోని ధ్యాన శ్లోకమును జదువుకొనుచు నర్థాను సంధానము కావింపవలయును. సాధారణ ముగ రామమంత్రము లన్నిటికి ధ్యానశ్లోక మేదియో అది యీ క్రింద నుదాహరింపఁబడు చున్నది. కొన్ని మంత్రములకు ధ్యానశ్లోకములో భేదము కూడ కలదు. కాని ప్రసిద్ధమైనదిది.

శ్లో॥ కాలాంబోధరకాంతి కాంతమనిశం వీరాసనాధ్యాసితం
ముద్రాం జ్ఞానమయీం దధానమ పరం హస్తాంబుజం జానుని
సీతాం పార్శ్వగతాం సరోరుహ కరాం విద్యున్నిభాం రాఘవం
పశ్యంతం ముకుటాంగదాది వివిధా కల్పోజ్జ్వలాంగం భజే ॥

### అర్థము

నీలమేఘమునుబోలు శరీరఛాయ కలవాఁడును, నెల్లప్పుడు వీరాసనమందు కూర్చుండువాఁడును, జ్ఞానముద్రను ధరించినవాఁడును, నెడమచేతిని నెడమ మోఁకాలిపైఁ బెట్టుకొనినవాఁడును, ప్రక్కన పద్మమును ధరించినదియు, మేఘము చెంగటనున్న మెఱుపువలె శోభిల్లుచున్నదియు, రాఘవుని గ్రీగంటఁ జూచు సీతను కలవాఁడును, కిరీటాంగదములు మొదలైన యాభరణ రత్నకాంతులచే నుజ్జ్వలమైన యవయవములు కలవాఁడగు శ్రీరామచంద్ర మూర్తిని భజించుచున్నాను. ఈ విధమగు రూపమును మనస్సులో ధ్యానింపవలెను.

# ప ం చో ప చా ర పూ జ

ధ్యాన శ్లోకముతో ధ్యానము చేసినతర్వాత ముఖ్యముగ పంచోపచార పూజ లొనర్పవలయును. విపులముగాఁ బూజసేయుట జపసమయమున వలను పడదు. ఇచ్చట నీ పంచోపచారపూజయు మంత్రాక్షరముల తోడనే జరుప వలసియుండును. పంచోపచారములు గంధ, పుష్ప, ధూప, దీప, నైవేద్యములు.

* లం పృథివీ తత్త్వాత్మనే గంధం పరికల్పయామి (వ్యాన) [౫, ౧ ↑]
హం ఆకాశ తత్త్వాత్మనే పుష్పం పరికల్పయామి (సమాన) [౧, ౨ ↓]
యం వాయుతత్త్వాత్మనే ధూపం పరికల్పయామి (ప్రాణ) [౨, ౧ ↑]
రం తేజస్తత్త్వాత్మనే దీపం దర్శయామి (అపాన) [౩, ౧ ↑]
వం అమృత తత్త్వాత్మనే అమృతోపహారం సమర్పయామి (ఉదాన) [౪,౧ ↑]
సం సర్వతత్త్వాత్మనే సర్వోపచారపూజాం సమర్పయామి (రెండుచేతుల అయిదు వ్రేళ్ళతో)

పై మంత్రమును జెప్పుచుఁ జేతితో క్రియ చేయవలయును. చేతిలోని అయిదు వ్రేళ్లు అయిదు తత్త్వములకుఁ బ్రతినిధులు. ౧. బొటనవ్రేలు ఆకాశము. ౨. తర్జనీ వ్రేలు (చూపుడువ్రేలు) వాయువు. ౩. మధ్యమవ్రేలు అగ్నిహోత్రము. ౪. అనామిక జలము. ౫. చిటికెన వ్రేలు పృథివి.

కావున లం పృథివీ తత్త్వమైనపుడు బొటనవ్రేలు చిటికెనవ్రేలు కలిపి పైకి చూపింపవలెను. అందువలననే గుర్తుప వ్రేళ్ల సంఖ్య బాణపు గుర్తులు పెట్టఁబడినవి. ఆకాశ ప్రతినిధి యగు బొటనవ్రేలు అన్ని ఉపచారములలోను కలియుచుండును. తర్వాత హం ఆకాశ తత్త్వమైనపుడు పుష్పము నైచినట్లు క్రిందకు చూపించవలయును. దీనికి తర్జనీకూడ కలుపవలయును. యం వాయు తత్త్వమునకు అదియే పైకి చూపంప వలయును. రం తేజస్తత్త్వాత్మక మగును

* యకారం ప్రాణబీజంచ నీలజీమూత సన్నిభమ్। రకారమగ్నిబీజంచ అపానాదిత్య సన్నిభమ్॥ లకారం పృథివీరూపం వ్యానంబంధూక సన్నిభమ్। వకారం జీవబీజంచ ఉదానంశంఖవర్ణకమ్॥ హకారం వియత్స్వరూపంచ సమానం స్ఫటికప్రభమ్॥ —ధ్యానబిందూపనిషత్.

కావున బొటనవ్రేలు, మధ్యవ్రేలుకలిపి పైకి చూపవలెను. వం అమృత తత్త్వము అనామిక కావున బొటనవ్రేలు అనామికను గలిపి పైకి చూపవలయును. సం సర్వాత్మకము కావున రెండుచేతుల వ్రేళ్ళను సంపుటిగా వేఱువేఱుగాఁ జేసి రెంటిని నెదురెదురుగాఁ బెట్టవలయును. ఈ యుపచారములు చేయునపుడు ఆయా యుపచారములను దాను చేయుచున్నట్లు భావింపవలయును.

## గురు నమస్కారము

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణు గురుర్దేవో మహేశ్వరః,
గురుస్సాక్షాత్పరంబ్రహ్మ తస్మైశ్రీగురవే నమః॥

గురువే బ్రహ్మ. గురువే విష్ణువు. గురువే మహేశ్వరుఁడు. గురువు సాక్షాత్తుగ పరంబ్రహ్మ. అట్టి గురువునకు నమస్కారము చేయుచున్నాను.

మంత్రజపమునకుఁ బూర్వము పంచోపచార పూజలు చేయఁగానే గురు నమస్కారము చెయవలెను. మంత్రప్రదాత గురువు కావున గురునమస్కారము, గురుభక్తి చేయక మంత్రము సిద్ధింపదు. గురుమహిమను గూర్చియు, గురుభక్తిని గూర్చియు నీ యధ్యాయ ప్రారంభమున నిదివఱకే చెప్పఁబడినది. కావున నిచ్చట మఱలఁ జెప్పఁబూనుటలేదు. పై శ్లోకము కాక యితర గురునమస్కార శ్లోకములున్నఁ జదువుకొనవచ్చును. మనస్సులో గురురూపమును దలఁచుకొనవలయును.

## జపమాల - సంస్కారము

మంత్రానుష్ఠానపరునకు జపమాల చాల ముఖ్యమైనది. అది మనస్సును భగవంతునిపై నిలుపునట్లు చేయుటకు కొఱడా వంటిది. భగవత్ స్మరణను నిలుపును. చేతిలో జపమాల యున్నచో మంత్రము దానికదియే జ్ఞాపకమునకు వచ్చును. జపమాల జాపకునకు గుప్తధనము వంటిది. లెక్కలేక జపము చేయ సంఖ్యను లెక్కచూచుకొనుటకు జపమాల యుండి తీరవలయును. ఒక్కొక్కప్పుడు మనస్సు ప్రాపంచిక విషయముల మీఁదకుఁ బోవుచుండును. అట్లు పోకుండ నీ జపమాల కాపాడఁ గలదు. మనస్సు చంచలమైనది. దానిని నిలుపుట కొక్కటే మార్గము. జపమాలను ద్రిప్పుచు నోట మంత్రము నుచ్చరించుచుండిన విషయముల మీఁదకుఁ బోయినమనస్సు గతిలేక మఱల నిష్టదైవము కడకు వచ్చి

తీరును. మనస్సున కీ మాల ఆకర్షణ యంత్రము వంటిది. ఈ మాల చేతిలో లేకున్న సంఖ్యయుండదు. సంఖ్య లేకున్న జపము నాపుటకు సమయము తెలియదు. జపము నాపు అవసరము లేనివానికి మాల అవసరము లేదు. సాధకుఁడగు వాఁడు ఇంత జపము చేయవలెనను నియమమును బెట్టుకొని చేసిననే చేయఁగలఁడు గాని నియమము, లెక్క లేకున్న బ్రాలుమాలి నిద్రాలస్యము లెక్కువై, చాల స్వల్ప జపమునే స్వాభావికముగఁ జేయఁ బ్రయత్నించును. జపమాల లేకుండ, లెక్క లేకుండ సాధకుఁడు జపము చేయుట తామసకార్యము. కావున పమాల విషయమై శ్రద్ధ వహింప వలయును. అదియును విధిప్రకారము చేసిననే ఫలమిచ్చును గాని లేకున్న నిష్ఫలము.

జపమాల మూడు రకములు. ౧. కరమాల, ౨. వర్ణమాల, ౩. మణిమాల

## ౧. కరమాల :-

అనఁగా చేతి వ్రేళ్ల గణుపులమీఁద విధి ప్రకారము లెక్కించుట కొందఱు వ్రేళ్ళతో లెక్కింతురు. అది ఫలమీయదు. కణుపులమీఁద నైనను వరుసగా జపించినను ఫలమీయదు.

శ్లో॥ అనామికాది ద్వయం పర్వ కనిష్ఠాది క్రమేణచ,
తర్జనీ మూల పర్యంతం కరమాలా ప్రకీర్తితా॥ — స్కాందము.

అనామిక వ్రేలి మధ్య కణుపువద్ద ప్రారంభించి క్రిందికివచ్చి చిటికెన వ్రేలి అడుగు కణుపునఁ పైకిపోయి, చూపుడు వ్రేలి యడుగుభాగము వఱకు లెక్కించుటకుఁ గరమాల యందురు. అంగుళ్యగ్రములతో జపింపరాదు.

శ్లో॥ అంగుళ్యగ్రేషు యజ్జప్తం యజ్జప్తం మేరులంఘనే,
అసంఖ్యాతంతు యజ్జప్తం తత్సర్వం నిష్ఫలంభవేత్॥

వ్రేళ్ళ చివరలందు జపించినదియు, మేరువునదాఁటి జపించినదియు, లెక్క లేకుండ జపించినదియు నిష్ఫలమగును.

కరమాలకు మేరువూన మధ్యమవ్రేలియొక్క క్రింది రెండు కణుపులు.

శ్లో॥ మధ్యమాది ద్వయం పర్వం జపకాలేతు వర్జయేత్,
తం వై మేరు విజానీయా త్కథితం బ్రహ్మణాపురా॥

మధ్యమ వ్రేలి మొదటి రెండు కణుపులను జపకాలమున వదలవలయును' అవి మేరువని బ్రహ్మచేఁ బూర్వము చెప్పఁబడినది.

ఈ సంఖ్య మొత్తము పదియగును. కరమాలతో జపము చేయునపుడు వ్రేళ్ళ సందులు విడువరాదు. కలిపి యుంచవలయును. మేరూల్లంఘనము చేయరాదు. చేతిని హృదయమున కెదురుగఁ బెట్టుకొని, పైన గుడ్డకప్పుకొని జపింపవలయును. దీని నెవరును జూడరాదు. పదికంటె నెక్కువ సంఖ్య జపింపవలసి వచ్చినప్పుడొక యుపాయము చేయవచ్చును. శ్రీరామచంద్రమూర్తిని హృదయమున నిలిపి ఆయన పాదములు, పిక్కలు, మోఁకాళ్లు, తొడలు, నడుము, ఉదరము, రొమ్ము, చేతులు, కంఠము, ముఖము అను నీ పది స్థానములందును క్రమముగఁ బాదములు మొదలు స్థానమునకుఁ బది చొప్పున జపించిన ౧౦౦ అగును. ఇట్లుఁ మఱల పై నుండి క్రిందకు జపించుచు వచ్చిన ౨౦౦ అగును. అప్పటికొక యెడమ వ్రేలు ముడుచుకొనవలెను. ఇట్లు అయిదు వ్రేళ్లు ముడుచు నప్పటికి ౧౦౦౦ అగును. పైన ౮ జపము కావించిన ౧౦౦౮ అగును. ౧౦౮ వఱకే సరిపుచ్చుకొనిన ముఖము వఱకు జపించి, పైన ౮ జపించి ఆపవచ్చును. ఇట్లు చేయుట వలన శ్రీరామచంద్రుని రూపము మనస్సున దృఢముగ నిలుచును. మనస్సు ప్రపంచ విషయముల మీఁద పోకుండును.

## ౨. వర్ణమాల :-

దీనినే మాతృకా మాలయనియు నందురు. ఈమాలతో జపించిన వెంటనే సిద్ధి కలుగును. ఇందు సందేహము లేదు.

శ్లో॥ వర్ణైర్విన్యస్తయా యస్తు క్రియతే మాలయా జపః,

ఏకవారేణ తస్యైవ పురశ్చర్యా కృతా భవేత్॥

వర్ణమాలతో జపము కావించిన ఒక్కసారి జపించుట చేతనే పురశ్చర్య గావించిన ఫలము కలుగుచున్నది.

శ్లో॥ మాతృకాదియుతం మంత్రం ద్వాదశాబ్దంతు యోజపేత్,

క్రమేణ లభతే జ్ఞాన మణిమాది గుణాన్వితమ్॥

మాతృకా మాలతో పంద్రెండు సంవత్సరములు మంత్రజపము గావించిన అణిమాది అష్టసిద్ధులతోఁ గూడిన జ్ఞానము క్రమముగా లభించును.

ఇఁక నామాలాపద్ధతి యెట్లనిన :-

శ్లో॥ పంచాశదక్షరాణ్యత్రా నులోమ ప్రతిలోమతః,
ఇత్యేవం స్థాపయేత్ స్పష్టం నకస్మై చిత్ప్రదర్శయేత్॥

అక్షరములు ౫౦ కలవు. వానిని అనులోమ విలోమముగా లెక్కించిన నూఱు అగును. దీని నెవరికిని తెలియనీయరాదు. ఈ మాలతో జపము చేసిన మనోనిగ్రహ మవశ్యము గలుగును, ఇది ముఖ్యముగ మానసిక జపమునకు సంబంధించినది. ౧౦౮ జపించుపద్ధతి ఈ క్రింద వ్రాయఁబడు చున్నది. ముందు ప్రణవము తర్వాత పూర్ణానుస్వారముతో మాతృకయు, తర్వాత నమః పదము, తర్వాత మంత్రము.

ఓం అం నమః శ్రీరామరామరామ
,, ఆం నమః శ్రీరామరామరామ ఇట్లే అన్నిటికిని జపింపవలెను.
,, ఇం నమః శ్రీరామరామరామ

ఇట్లు అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఏ, ఐ, ఓ, ఔ,
అం, అః — ౧౬.

క వర్గము (క, ఖ, గ, ఘ, ఙ) — ౫
చ వర్గము (చ, ఛ, జ, ఝ, ఞ) — ౫
ట వర్గము (ట, ఠ, డ, ఢ, ణ) — ౫
త వర్గము (త, థ, ద, ధ, న) — ౫
ప వర్గము (ప, ఫ, బ, భ, మ) — ౫
య వర్గము (య, ర, ల, వ, శ, ష, స, హ, ళ) ౯
౫౦

క్ష కారము కొలికిపూస వర్గాక్షరములు ౮ (అం, కం, చం, టం, తం, పం, యం, శం) మఱల విలోమముగ ళం, హం, సం, షం, శం, వం, లం, రం, యం ..., అం వఱకు జపించిన ౧౦౮ అగును. కొందఱు ౫౦ అక్షరములు. అనులోమ విలోమ రీతిని ౧౦౦ జపించి తర్వాత అం, కం, చం, టం, తం, పం, యం, శం అని యెనిమిది జపింతురు.

మన శరీరములో నేడు చక్రము లున్నవి. ౧. మూలాధారము. ౨. స్వాధిష్ఠానము. ౩. మణిపూరము. ౪. అనాహతము. ౫. విశుద్ధము. ౬. ఆజ్ఞా. ౭. సహస్రారము. వీనిలో సహస్రారమును వదలి మిగిలిన ఆఱు చక్రముల దళములను జూచిన ౫౦ యగును. ఆ ౫౦ పైన చెప్పిన వర్ణములే. ఆయా వర్ణములతో జపము చేయునపుడు ఆయా చక్రములందు భగవంతుని ధ్యానించు చుండిన మంత్రము త్వరగా సిద్ధియగును. ఇది యోగులకు ముఖ్యమనియు శాస్త్రము.

శ్లో॥ అనులోమ విలోమాభ్యాం ర్మాతృకాయాః స బిందుకైః,
సమేరుకైః సాష్టవర్గై ర్మాలాస్యాద్యోగినాం శుభా॥

అనులోమ విలోమ గతిని బిందువుతో గూడిన అక్షరములను మేరువుతోను అష్టవర్గాక్షరములతోను నిర్మించిన వర్ణమాల యోగులకు శుభము.

| చక్రము పేరు | స్థానము | దళములు | వర్ణములు | తత్త్వము |
|---|---|---|---|---|
| మూలాధారము | గుదము | ౪ | వ, శ, ష, స | పృథ్వి |
| స్వాధిష్ఠానము | లింగము | ౬ | బ, భ, మ, య, ర, ల | జల |
| మణిపూరము | నాభి | ౧౦ | డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ | అగ్ని |
| అనాహతము | హృదయము | ౧౨ | క, ఖ, గ, ఘ, ఙ, చ,ఛ,జ,ఝ,ఞ,ట,ఠ | వాయు |
| విశుద్ధము | కంఠము | ౧౬ | అ,ఆ,ఇ,ఈ,ఉ,ఊ,ఋ, ౠ,ఌ,ౡ,ఏ,ఐ,ఓ, ఔ,అం,అః | ఆకాశ |
| ఆజ్ఞా | భ్రూమధ్యం | ౨ | హ, క్ష, (ళ) | మనస్సు |
| సహస్రారము | మూర్ధము | ౧౦౦౦ | ఓమ్ | ఆత్మ |

ముందు విశుద్ధ చక్రముపై ౧౬, అనామికముపై ౧౨, మణిపూరకము ౧౦, స్వాధిష్ఠానము ౬, మూలాధారము ౪, ఆజ్ఞా చక్రము ౨, — మఱల తల క్రిందుగా ఆజ్ఞా చక్రము ౨, మూలాధారము ౪, స్వాధిష్ఠానము ౬, మణిపూరము ౧౦, అనాహతము ౧౨, విశుద్ధము ౧౬, తర్వాత అం, కం, చం, టం తం, పం, యం శం, అను ౮ వర్గాక్షరములతో జపము చేయవలెను.

ఈ వర్ణమాలకు పూసలీ వర్ణములే. మూలాధారము మొదలు ఆజ్ఞా చక్రము వఱకు వ్యాపించిన కుండలినీ శక్తియే దీనికి దారము. క్షకారము కొలికిపూస. ఇది దాటరాదు. ఆజ్ఞా చక్రములో క్షకారమునకు బదులు ళకారమును జపింప వచ్చును. ఇట్లు వర్ణమాలతో జపము గావించిన మంత్ర మొకసారి జపించుటచేతనే సిద్ధి కలుగుచున్నది. దీని వలన మానసిక జపము అభ్యాసమగును. ఇచ్చట మనస్సు రూపముపై నున్నను లేకున్నను బాధలేదు. భగవద్రూపమునకును మంత్రమునకును భేదములేదు. (నామి నామములకు భేదము లేదు కదా!) ఆ మంత్రమే రూపమును బట్టి తెచ్చి యిచ్చును. ఈ జపము వలన మంత్రము శక్తివంత మగు ననుట నిస్సంశయము.

ఇచ్చట నీ ౫౦ వర్ణములయొక్క శక్తినిగూర్చి వేదములో నేమి చెప్పఁబడియున్నదో తెలిసికొనుట అప్రస్తుతము కాదనుకొనెదను. దీనినిగూర్చి అక్షమాలి కోపనిషత్తులో వివరముగఁ జెప్పఁబడినది

౧. ఓ మంకార మృత్యుంజయ సర్వవ్యాపక ప్రథమేఽక్షే ప్రతితిష్ఠ

**అం** అనునది మృత్యువును జయించునది. సర్వవ్యాపకమైనది. ఇది మొదటి పూసలో నిలుచుఁగాక.

౨. ఓ మాంకారా కర్షణాత్మక సర్వగత ద్వితీయేక్షే ప్రతితిష్ఠ

**ఆం** అనునది ఆకర్షణాత్మకము, సర్వత్ర ఉండునది. ఇది రెండవ పూసలో నిలుచుగాక.

3. ఓ మింకార పుష్టిదాక్షోభకర తృతీయేఽక్షే ప్రతితిష్ఠ

**ఇం** అనునది పుష్టి నిచ్చునది. క్షోభకలిగించునది. ఇది మూడవ పూసలో నుండుఁగాక

౪. ఓ మీంకార వాక్ప్రసాదకర నిర్మల చతుర్థేక్షేఽప్రతితిష్ఠ.

**ఊం** అనునది వాక్ప్రసాద మిచ్చును. నిర్మలమైనది. ఇది నాల్గవ పూసలో నుండుఁగాక.

౫. ఓం ముంకార సర్వబల ప్రద సారతర పంచమేఽక్షే ప్రతితిష్ఠ.

**ఉం** అనునది సమస్త బలముల నిచ్చునది. సారతర మైనది. ఇది అయిదవ పూసలో నుండుఁగాక.

౬. ఓ మూంకారోచ్చాటన కర దుస్సహ షష్ఠేఽక్షే ప్రతితిష్ఠ.

**ఊం** అనునది ఉచ్చాటనము కావించునదియు, సహింపరానిదై యున్నది. ఇది ఆఱవపూసలో నుండుఁగాక.

౭. ఓ మృంకార సంక్షోభకర చంచల సప్తమేఽక్షే ప్రతితిష్ఠ

**ఋం** అనునది సంక్షోభము కలిగించునదియు, చంచల మైనదియును. ఇది యేడవపూసలో నిలుచుఁగాక.

౮. ఓ మౄంకార సమ్మోహనకరోజ్జ్వలాష్టమేఽక్షే ప్రతితిష్ఠ.

**ౠం** అనునది సమ్మోహనకరమైనదియు, ఉజ్జ్వల కరమైనది యును. ఇది యెనిమిదవ పూసలో నిల్చుఁగాక.

౯. ఓమ్ఌంకార విద్వేషణకర మోహక నవమేఽక్షే ప్రతితిష్ఠ

**ఌం** కారము విద్వేషణకరమును, మోహకమునైనది. ఇది తొమ్మిదవ పూసలో నిల్చుఁగాక.

౧౦ ఓమ్ౡంకార మోహకర దశమేఽక్షే ప్రతితిష్ఠ

**ౡం** కారము మోహకరము. ఇది పదవ పూసలో నిలుచుఁ గాక.

౧౧. ఓమేంకార సర్వ వశ్యకర శుద్ధ సత్త్వైకాదశేఽక్షే ప్రతితిష్ఠ

**ఏం** కారము సర్వులను వశ్యపఱచును. సత్త్వమైనది. శుద్ధమైనది. ఇది పదునొకండవ పూసలో నిల్చుఁగాక.

౧౨. ఓమైంకార శుద్ధ సాత్త్విక పురుష వశ్యకర ద్వాదశేఽక్షే ప్రతితిష్ఠ

ఐం కారము శుద్ధ సాత్త్వికము. పురుషులను వశ్యము కావించునది. ఇది పండ్రెండవ పూసలో నిల్చుఁగాక.

౧౩. ఓమోంకారాఖిల వాఙ్మయ నిత్య శుద్ధ త్రయోదశేఽక్షే ప్రతితిష్ఠ

ఓం కారము నిఖిల వాఙ్మయ స్వరూపమైనది. శాశ్వతమైనది. శుద్ధమైనది. ఇది పదుమూఁడవ పూసలోఁ నిల్చుఁగాక.

౧౪. ఓమౌంకార సర్వవాఙ్మయ వశ్యకర చతుర్దశేఽక్షే ప్రతితిష్ఠ

ఔం కారము సర్వవాఙ్మయ స్వరూపమును, వశ్యకరమైనదైయున్నది. ఇది పదునాల్గవ పూసలో నిల్చుఁగాక.

౧౫. ఓమంకార గజాది వశ్యకర మోహన పంచదశేఽక్షే ప్రతితిష్ఠ

అం కారము ఏనుఁగులను మొదలగు వాటిని వశపఱుచునదియు, మోహనకరము నైనది. ఇది పదునైదవ పూసలో నిల్చుఁగాక.

౧౬. ఓమఃకార మృత్యునాశనకర రౌద్ర షోడశేఽక్షే ప్రతితిష్ఠ

అః కారము మృత్యువును నశింపఁజేయునది. రౌద్రము. ఇది పదునాఱవ పూసలో నిలుచుఁగాక.

౧౭. ఓం కంకార సర్వవిషహర కల్యాణద సప్తదశేఽక్షే ప్రతితిష్ఠ

కం కారము సర్వవిషహరమైనదియు, శుభము నిచ్చునదై యున్నది. ఇది పదునేడవ పూసలో నిల్చుఁగాక.

౧౮. ఓం ఖంకార సర్వక్షోభకర వ్యాపకాష్టాదశేఽక్షే ప్రతితిష్ఠ

ఖం కారము సర్వమును క్షోభపఱచునదియు, వ్యాపకమైనదియునై యున్నది. ఇది పదునెనిమిదవ పూసలో నిల్చుఁగాక.

౧౯. ఓం గంకార సర్వవిఘ్నశమన మహత్తరైకోనవింశేఽక్షే ప్రతితిష్ఠ

గం కారము సర్వవిఘ్నములను బోఁగొట్టునదియు, మహత్తరమైనదై యున్నది. ఇది పందొమ్మిదవ పూసలో నిల్చుఁగాక.

౨౦. ఓం ఘంకార సౌభాగ్యదస్తంభనకర వింశేఽక్షే ప్రతితిష్ఠ,

**ఘం** కారము సౌభాగ్యము నొసంగు నదియు, స్తంభనము చేయు నదైయున్నది. ఇది యిరువదవ పూసలో నిల్చుఁగాక.

౨౧. ఓం ఙంకార సర్వవిషనాశకరోగ్రైక వింశేఽక్షే ప్రతితిష్ఠ.

**ఙం** కారము సర్వవిషనాశన మొనర్చునదియు, ఉగ్రమైనదియునై యున్నది. ఇది ఇరువదొకటవ పూసలో నిల్చుఁగాక.

౨౨. ఓం చంకారాభిచారఘ్న క్రూర ద్వావింశేఽక్షే ప్రతితిష్ఠ.

**చం** కారము అభిచార నాశము గావించునదియు, క్రూర మైనదినై యున్నది. ఇది యిరువదవ రెండవ పూసలో నిల్చుఁగాక.

౨౩. ఓం ఛంకార భూతనాశకర భీషణ త్రయోవింశేఽక్షే ప్రతితిష్ఠ.

**ఛం** కారము భూతనాశము కావించు నదియు, భయంకరమైనదై యున్నది. ఇది యిరువది మూఁడవ పూసలో నిల్చుఁగాక.

౨౪. ఓం జంకార కృత్యాది నాశక దుర్ధర్ష చతుర్వింశేఽక్షే ప్రతితిష్ఠ.

**జం** కారము ప్రయోగాది కృత్యముల నాశము కావించునదియు, ప్రచండమైనదై యున్నది. ఇది యిరువది నాల్గవ పూసలో నిల్చుఁగాక.

౨౫. ఓం ఝంకార భూతనాశకర పంచ వింశాక్షే ప్రతితిష్ఠ.

**ఝం** కారము భూత నాశకరమైనది. ఇది యిరువదైదవ పూసలో నిల్చుఁగాక.

౨౬. ఓం ఞంకార మృత్యుప్రమథన షడ్వింశేఽక్షే ప్రతితిష్ఠ.

**ఞం** కారము మృత్యువును నశింపఁజేయును. ఇది యిరువది ఆఱవ పూసలో నిల్చుఁగాక.

౨౭. ఓం టంకార సర్వవ్యాధిహర సుభగ సప్తవింశేఽక్షే ప్రతితిష్ఠ.

**టం** కారము సమస్త వ్యాధులను హరించునదియు, మేలు చేయునదై యున్నది. ఇది యిరువది యేడవ పూసలో నిల్చుఁగాక.

౨౮. ఓం ఠంకారత చంద్రరూపాష్టా వింశేఽక్షే ప్రతితిష్ఠ.

**ఢం** కారము చంద్రరూపమైనది. ఇది యిరువదెనిమిదవ వ్రాసలో నిల్చుగాక.

౨౯. ఓం ఢంకార గరుడాత్మక విషఘ్న శోభనైకోన త్రింశేఽక్షే ప్రతితిష్ఠ

**ణం** కారము గరుడాత్మకము. విషమును హరించును. శుభకరమై నది. ఇది యిరువది తొమ్మిదవ వ్రాసలో నిల్చుగాక.

౩౦. ఓం ణంకార సర్వ సంపత్ప్రద సుభగ త్రింశేఽక్షే ప్రతితిష్ఠ.

**ణం** కారము సమస్త సంపద లొసంగునదియు, శుభస్కారమైనదియునై యున్నది. ఇది ముప్పదవ వ్రాసలో నిల్చుగాక.

౩౧. ఓం ణంకార సర్వసిద్ధిప్రద మోహకరైక త్రింశేఽక్షే ప్రతితిష్ఠ.

**ణం** కారము సర్వసిద్ధుల నొసంగునదియు, మోహనకరమైనదియునై యున్నది. ఇది ముప్పది యొకటవ వ్రాసలో నుండుగాక.

౩౨. ఓం తంకార ధన ధాన్యాది సంపత్ప్రద ప్రసన్న ద్వాత్రింశేఽక్షే ప్రతితిష్ఠ

**తం** కారము ధన ధాన్యాది సంపత్ప్రదమైనది. ప్రసన్నకరమైనదై యున్నది. ఇది ముప్పదిరెండవ వ్రాసలోఁ నిల్చుగాక.

౩౩. ఓం థం కార ధర్మప్రాప్తికర నిర్మల త్రయస్త్రింశేఽక్షే ప్రతితిష్ఠ

**థం** కారము ధర్మప్రాప్తి నొసంగును. నిర్మలమైనది. ఇది ముప్పది మూఁడవ వ్రాసలో నుండుగాక.

౩౪. ఓం దంకార పుష్టి వృద్ధికర ప్రియదర్శన చతుస్త్రింశేఽక్షే ప్రతితిష్ఠ

**దం** కారము పుష్టిని, వృద్ధిని కలిగించునదియు, ప్రియ దర్శనము కలిగించునదై యున్నది. ఇది ముప్పది నాల్గవ వ్రాసలో నిల్చుగాక.

౩౫. ఓం ధంకార విషజ్వర నిఘ్న విపుల పంచత్రింశేఽక్షే ప్రతితిష్ఠ.

**ధం** కారము విషజ్వరమును బోఁగొట్టునది. విస్తారమగునదై యున్నది. ఇది ముప్పది యైదవ వ్రాసలో నుండుగాక.

౩౬. ఓం నంకార భక్తి ముక్తి ప్రద సాంత షట్త్రింశేఽక్షే ప్రతితిష్ఠ.

**నం** కారము భక్తిముక్తుల నొసంగునదియు, శాంత మైనదై యున్నది. ఇది ముప్పది ఆఱవ పూసలో నుండుఁగాక.

౩౭. ఓం పంకార విషవిఘ్ననాశన భవ్య సప్తత్రింశే౽క్షే ప్రతితిష్ఠ.

౩౮. ఓం ఫంకారాణిమాది సిద్ధిప్రద జ్యోతీరూపాష్టత్రింశే౽క్షే ప్రతితిష్ఠ.

**ఫం** కారము అణిమాది సిద్ధుల నొసఁగునదియు, జ్యోతీరూపమైనది యునై యున్నది. ఇది ముప్పది యెనిమిదవ పూసలో నుండుఁగాక.

౩౯. ఓం బంకార సర్వదోషహర శోభనైకోన చత్వారింశే౽క్షే ప్రతితిష్ఠ.

**బం** కారము సర్వదోష హరమైనదియు, శుభకర మైనదియునై యున్నది. ఇది ముప్పది తొమ్మిదవ పూసలో నుండుఁగాక.

౪౦. ఓం భంకార భూతప్రశాంతికర భయానక చత్వారింశే౽క్షే ప్రతితిష్ఠ

**భం** కారము భూతములను శాంతింపఁ జేయునదియు, భయానకమై నదియునై యున్నది. ఇది నలుబదవ పూసలో నుండుఁగాక.

౪౧. ఓం మంకార విద్వేషి మోహన కరైక చత్వారింశే౽క్షే ప్రతితిష్ఠ.

**మం** కారము ద్వేషించువారిని మోహింపఁజేయును. ఇది నలువదొక టవ పూసలో నుండుఁగాక.

౪౨. ఓం యంకార సర్వవ్యాపక పావన ద్విచత్వారింశే౽క్షే ప్రతితిష్ఠ.

**యం** కారము సర్వవ్యాపక మైనదియుఁ, పావన మైనదియునై యున్నది. ఇది నలువది రెండవ పూసలో నుండుఁగాక.

౪౩. ఓం రంకార దాహకర వికృత త్రిచత్వారింశే౽క్షే ప్రతితిష్ఠ

**రం** కారము దాహకరమును, వికృతమైనదై యున్నది. ఇది నలువది మూఁడవ పూసలో నుండుఁగాక.

౪౪. ఓం లంకార విశ్వంభర భాసుర చతుశ్చత్వారింశే౽క్షే ప్రతితిష్ఠ.

**లం** కారము విశ్వమును భరించునదియు, ప్రకాశించు నదియునై యున్నది. ఇది నలువది నాలుగవ పూసలో నిలుచుఁగాక.

౪౫. ఓం వంకార సర్వాప్యాయనకర నిర్మల పంచచత్వారింశే౽క్షే ప్రతితిష్ఠ.

**వం** కారము సర్వసంతృప్తిని కలిగించునదియు, నిర్మలమైనదియునై యున్నది. ఇది నలువదైదవ పూసలో నుండుఁగాక.

౪౬. ఓం శంకార సర్వఫలప్రద పవిత్ర షట్చత్వారింశేఽక్షే ప్రతితిష్ఠ.

**శం** కారము సర్వఫలముల నొసంగునదియు, పవిత్రమైనదియునై యున్నది. ఇది నలుపదాఱవ పూసలో నుండుఁగాక.

౪౭. ఓం షంకార ధర్మార్థ కామద ధవళ సప్తచత్వారింశేఽక్షే ప్రతితిష్ఠ.

**షం** కారము ధర్మార్థకామముల నొసంగునదియు, తెల్లనైనదియునై యున్నది. ఇది నలువదేడవ పూసలో నుండుఁగాక.

౪౮. ఓం సర్వకారణ సార్వవర్ణి కాష్ట చత్వారింశేఽక్షే ప్రతితిష్ఠ.

**సం** కారము సర్వకారణమైనదియు, సర్వవర్ణములకు సంబంధించునదియునై యున్నది. ఇది నలువదెనిమిదవ పూసలో నుండుఁగాక.

౪౯. ఓం హంకార సర్వవాఙ్మయ నిర్మలేకోన పంచదశాఽక్షే ప్రతితిష్ఠ.

**హం** కారము సర్వవాఙ్మయ స్వరూపమైనదియు, నిర్మలమైనదియునై యున్నది. ఇది నలువది దొమ్మిదవ పూసలో నుండుఁగాక.

౫౦. ఓం ళంకార సర్వశక్తిప్రద ప్రధాన పంచాశదక్షే ప్రతితిష్ఠ.

**ళం** కారము సర్వశక్తుల నిచ్చునదియును, ప్రధానమైనదియునై యున్నది. ఇది యేఁబదవ పూసలో నుండుఁగాక.

కొలికి పూసయగు **క్షం** కారము పర, అపరతత్త్వములను జ్ఞాపకము చేయు పరంజ్యోతిరూపమైనది. ఇది శిఖామణియందు నుండుఁగాక.

ఈ మంత్రమే మణిమాలా సంస్కారములోనికిఁ గూడ పనికి వచ్చును. కొందఱు ౧౦౮ ఖండమాల యందురు, ౧౦౮ ని ౨ చే భాగింపఁగా ౫౪ అగును. దానిని మఱల ౨ చే భాగింపఁగా ౨౭ అగును. దానిని ౨ చే భాగింపగా ౧౩౪ ఇచ్చట అక్షము ఖండింపఁబడు చున్నది. కావున దీనికి ఖండమాల యను పేరు వచ్చినది. ౧౨౮ అఖండమాల. ౧౨౮ ని ౨ చే భాగింపఁగా ౬౪ అగుచున్నది. ౬౪ ను ౨ చే భాగింపఁగా ౩౨ అగుచున్నది. ౩౨ ను ౨ చే భాగింపఁగా ౧౬ అగుచున్నది. ౧౬ ను ౨ చే భాగింపఁగా ౮ అగుచున్నది. ౮ ని ౨ చే భాగిం

పంగా ౪ అగుచున్నవి. ౨ను ౨ చే భాగింపంగా ౧ వచ్చుచున్నది. అందువలన దీనికి అఖండమాల యను ఖ్యాతి వచ్చినది. ఇచ్చట అక్షరము తెగుట లేదు. కావున నిది శ్రేష్ఠమని కొందఱందురు. కాని ౧౦౮ అనునది జగత్ప్రసిద్ధమై యున్నది. శాస్త్రసమ్మతమైనదియు నిదియే. ౧౦౮ అనునది భగవతత్త్వమునకు సంబంధించిన సంఖ్య. ౧౦౮ లోగల ౧ = బ్రహ్మ పదార్థమును సూచించును. (ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ) భగవంతుని మాయను సూచించునది '౦' (సున్న). ౮ అనునది అష్టప్రకృతులను సూచించును.

శ్లో॥ భూమిరాపోఽనలో వాయుః ఖంమనోబుద్ధిరేవచ,
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా॥

భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము ఈ యెనిమిది భిన్నములగు ప్రకృతులు నావి.

బ్రహ్మ, రమా అచ్యుత, సీతారామ, రాధికాకృష్ణ, సంసార ఈ శబ్దము లన్నియు నీ తత్త్వమునే తెలుపును. ఈ విషయమునుగూర్చి సంపూర్ణముగఁ దెలిసికొన వలయుననిన మాచే వ్రాయఁబడిన పరమార్థ తత్త్వమను గ్రంథమును, కలిసంతరణోప నిషత్తను గ్రంథమును జూడుఁడు. హల్లులు, అచ్చులు విడివిడిగా లెక్కింపవలెను.

బ్రహ్మ = బ + ర + హ + మ

బ = ౨౩ వ అక్షరము
ర = ౨౭ ,,
హ = ౩౩ ,,
మ = ౨౫ ,,

౧౦౮

సీతారామ = స + ఈ + త + ఆ + ర + ఆ + మ.

స = ౩౨ వ అక్షరము
ఈ = ౪ ,,
త = ౧౬ ,,
ఆ = ౨ ,,
ర = ౨౭ ,,
ఆ = ౨ ,,
మ = ౨౫ ,,

౧౦౮

రమ + అచ్యుత

ర + మ + ఆ + అ + చ + ఉ + య + త

ర = ౨౭ వ అక్షరము
మ = ౨౫ ,,
ఆ = ౨ ,,
అ = ౧ ,,
చ = ౬ ,,
ఉ = ౫ ,,
య = ౨౬ ,,
త = ౧౬ ,,

౧౦౮

రాధికాకృష్ణ = ర + ఆ + ధ + ఇ + క + ఆ + క + ఋ + ష + ణ

ర = ౨౭ వ అక్షరము
ఆ = ౨ ,,
ధ = ౧౯ ,,
ఇ = ౩ ,,
క = ౧ ,,
ఆ = ౨ ,,
క = ౧ ,,
ఋ = ౭ ,,
ష = ౩౦ ,,
ణ = ౧౫ ,,

౧౦౮

సంసార (ప్రపంచము) స + అం + స + ఆ + ర

స = ౩౨ వ అక్షరము
అం = ౧౫ ,,
స = ౩౨ ,,
ఆ = ౨ ,,
ర = ౨౭ ,,

౧౦౮

పైవిషయమును బట్టి తత్త్వ సంఖ్య ౧౦౮ కావున జపము, జపమాల ౧౦౮ గానే యుండవలయును.

## ౩. మణిమాల

మణిమాలను గొందఱు ౧౦౮ పూసలతోడను, కొందఱు ౫౪ తోడను, కొందఱు ౨౭ తోడను, కొందఱు ౧౦ తోడను చేయుదురు.

శ్లో॥ అష్టోత్తర శతా మాలా తత్రస్యా దుత్తమోత్తమా
శత సంఖ్యోత్తమా మాలా పంచాశన్మధ్యమా మతా॥
చతుః పంచాశతో యద్వా అధమా సప్త వింశతిః
అధమా పంచవింశత్యా (యదిస్యాచ్ఛత నిర్మితా)॥

౧౦౮ పూసల మాల ఉత్తమోత్తమము. ౧౦౦ పూసలు కలది ఉత్తమము. ౫౦ పూసలు కలది గాని, ౫౪ పూసలు కలదికాని మధ్యమము. ౨౭, ౨౫ పూసలు కల మాలలు అధమములు.

ఇక పూసల రకములను గూర్చి శాస్త్రమిట్లు చెప్పుచున్నది.

శ్లో॥ రుద్రాక్ష శంఖ పద్మాక్ష పుత్రజీవక మౌక్తికైః
స్ఫాటికైర్మణి భీరత్నైః సౌవర్ణైర్విద్రుమైస్తథా॥
కుశైః పర్వై ర్ద్వాదశస్యు గృహస్థస్యాక్షమాలికాః
అంగుళీ గణనాదేకం లేఖయాష్ట గుణం భవేత్॥
పుత్రజీవైర్దశ గుణం శతం శంఖైః సహస్రకమ్
ప్రవాళైర్మణి రత్నైశ్చ దశ సాహస్రకం స్మృతమ్॥
తదేవ స్ఫాటికైః ప్రోక్తం మౌక్తికైర్లక్ష ముచ్యతే
పద్మాక్షైర్దశలక్షం స్యా త్సౌవర్ణైః కోటిరుచ్యతే॥
కుశగ్రంథ్యా కోటిశతం రుద్రాక్షైః స్యాదనంతకమ్
తులసీ కాష్ఠ ఘటితైః మణిభి ర్జపమాలికా
సర్వకర్మాణి సర్వేషా మీప్సితార్థ ఫలప్రదా॥

గృహస్థులకు రుద్రాక్ష, శంఖములు, తామరపూసలు, పుత్రజీవక, మౌక్తిక, స్ఫటిక, మణి, రత్న, సువర్ణ, ప్రవాళ (పవడము) కుశపర్వములు అను నీ పదిరెండును అక్షమాలికకుఁ బనికివచ్చును. వ్రేళ్లమీఁద లెక్కించిన సామాన్య ఫలము లభించును. వ్రేళ్ల రేఖలమీఁద లెక్కించిన దానికెనిమిది రెట్లు ఫలమును, పుత్రజీవితోఁ జేసిన పూసలమీఁద పది రెట్లును, శంఖములు నూఱు రెట్లును, పవడములును, మణులును, రత్నములును వేయిరెట్లును, స్ఫటికములు

పదివేలు రెట్లును, ముత్యములు లక్ష రెట్లును, పద్మాక్షములు (తామరపూసలు) పదిలక్షల రెట్లును, బంగారు పూసలు కోటిరెట్లును, కుశగ్రంథి నూరుకోట్లును, రుద్రాక్షలనంత ఫలమును, తులసీకాష్ఠముతోఁజేసినది సర్వకర్మలందున సమస్త కోరికల నిచ్చునదై యున్నది.

రామమంత్రము సర్వమత సమ్మతమైనది. కావున నే మాలయైనను బనికి వచ్చునుగాని, అన్నిటికంటె తులసీమాల చాల శ్రేష్ఠమైనది. మాలలోని మణులు పగిలినవి పనికిరావు. ఒకటి పెద్దది, మఱియొకటి చిన్నది పనికిరాదు. అన్నియు నొకే యురువుగా నుండవలయును. కొందఱు మాలలో మధ్య మధ్య ప్రవాళము, స్ఫటికము రుద్రాక్ష మొదలైనవి ఒక్కొక్కటి వేయుదురు. అట్లుండ రాదు. జపమాల కొకే రకముగ నుండవలయును. మెడలో ధరించు మాలలో నానారకములు వేసికొనిన దోషములేదు. మెడలో ధరించినది జపమునకుఁ బనికిరాదు. జపము చేసికొను మాలను మెడలో వేసికొనరాదు. బ్రాహ్మణకన్య నిర్మించిన దారముతో నాకన్యక చేతనే పేనించి మాల గ్రుచ్చవలయును. లేదా స్వయముగ నాపని చేసికొనవచ్చును. మొదట మూఁడు దారములుగఁ బేని మరల దానిని మూఁడు వరుసలుగ యజ్ఞోపవీతమువలె పేనవలెను. లేదా యజ్ఞోపవీతములకై మరనూలు కాక స్వయముగ వడికిన నూలుతో పేనిన దారమును దీనికి నిరభ్యంతరముగ వాడవచ్చును. దారము తెల్లనిదైన శ్రేష్ఠము. ఎఱుపుది మధ్యమము. నలుపుదార మధమము. బ్రాహ్మణులు తెలుపు దారమును, క్షత్రియు లెఱుపు దారమును, వైశ్యులు పసుపుదారమును, శూద్రులు నీలి లేక నలుపు దారమును వాడవచ్చును. శాంతి కర్మలందు తెల్లని దారమును, వశీకరణమందు రక్తవర్ణమును, అభిచారమున నలుపు దారమును వాడవచ్చును. మోక్షము కొఱకును, ఐశ్వర్యము కొఱకును పట్టుదారము మంచిది. తెలుపు దారమును సర్వులు సర్వకార్యములకును వాడవచ్చును.

దారము గ్రుచ్చునపుడు వెనుక చెప్పిన అక్షమాలికోపనిషత్తులోని 'ఓం అంకార మృత్యుంజయ సర్వవ్యాపక ప్రథమేఽక్షే ప్రతితిష్ఠ' అని చెప్పు చుండవలయును. ఇట్లు ౫౦ అక్షరములను ౫౦ పూసలకును, మఱల విలోమముగా ౫౦ పూసలును, తర్వాత ల వర్గాక్షరములును, ఇట్లు ౧౦౮ పూసలకు మంత్రము చెప్పుచు గ్రుచ్చవలెను. కొలికిపూస 'క్షం'. దీనికి 'ఓం క్షం కార పరాపర తత్త్వజ్ఞాపక పరంజ్యోతి రూప శిఖామణౌ ప్రతితిష్ఠ' అని మంత్రింపవలెను.

కొలికిపూస గ్రుచ్చునపుడు బ్రహ్మముడి వేసిన తర్వాత మేరుపూస గ్రుచ్చవలెను. లేదా 'ఓం అం నమః శ్రీరామరామరామ' అనిగాని లేక ఓ అం నమః (స్వమంత్రము) ను జెప్పవలయును. 'సౌవర్ణం రాజతం తామ్రం చేతి సూత్ర త్రయమ్' బంగారు, వెండి, రాగి ఈ మూడు లోహముల తీగెలతో చుట్టింప వచ్చును. బంగారు తీగె శ్రేష్ఠము. ఈ విధముగ మాల నిర్మించిన తర్వాత సం సంస్కరింపవలయును.

## మాలా సంస్కార పద్ధతి

ఒక పీఠము నేర్పఱచి దానిపై తొమ్మిది రావియాకులు, మధ్య యొకటియు, మిగిలిన యెనిమిదింటిని అష్టదళ పద్మాకారముగ బఱచి మధ్య నున్న ఆకునందు మాలనుంచి సంకల్పించి పంచ గవ్యముతో వర్ణములతో జప ములో వలెబలుకుచు అభిషేకింప వలయును. తర్వాత:-

శ్లో॥ క్షాళయే త్పంచ గవ్యైస్తాం సద్యోజాతేన తజ్జలైః
చందనాగరు గంధాద్యై ర్వామ దేవేన ఘర్షయేత్॥
ధూపయేత్తా మ ఘోరేణ లింపే త్తత్పురుషేణ తు
మంత్రయేత్పంచ మే నైవ ప్రత్యేకంతు శతం శతమ్॥
మేరుంచ పంచ మే నైవ తథా మంత్రేణ మంత్రయేత్
యేన ప్రతిష్ఠితా మాలా త మేవ తు మనుం జపేత్॥
అన్యమంత్ర జపాద్వీర్ధా నకార్యా కర్హిచిద్బుధైః
నస్పృశే ద్వామ హస్తేన కరభ్రష్టాం నకారయేత్॥

పంచగవ్యముతో క్షాళనము కావించిన తర్వాత జలముతో 'ఓం సద్యో జాతం ప్రపద్యామి సద్యోజాతాయవై నమోనమః। భవే భవేనాతి భవే భవస్వ మాం। భవోద్భవాయ నమః।' అని కడుగ వలయును. 'ఓం వామదేవాయ నమో జ్యేష్ఠాయ నమః శ్రేష్ఠాయ నమో రుద్రాయనమః కాలాయ నమః కలవికర ణాయ నమో బలవికరణాయనమః। బలాయ నమో బలప్రమథనాయ నమః సర్వభూత దమనాయ నమో మనోన్మనాయ నమః। అను మంత్రముతో, చంద నాగురు గంధములతో ఘర్షణము గావింపవలెను. 'ఓం అఘోరేభ్యోఽథఘో

రేభ్యో ఘోరఘోర తరేభ్యః సర్వేభ్యః సర్వ శర్వేభ్యో నమస్తే అస్తు రుద్ర రూపేభ్యః' అను మంత్రముతో ధూపము వేయవలెను. 'ఓం తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహీ తన్నో రుద్రః ప్రచోదయాత్' అను మంత్ర ముతో లేపనము చేయవలెను.

తర్వాత 'ఓం ఈశానః సర్వవిద్యానా మీశ్వరః సర్వభూతానాం బ్రహ్మాధి పతి ర్బ్రహ్మణోఽధిపతి ర్బ్రహ్మా శివో మే అస్తు సదా శివోమ్' అను మంత్రముతో నొక్కొక్క పూసను నూఱుమార్లు చొప్పున జపింపవలయును. ఇట్లు సంస్కరింపఁబడిన మాలతోడనే జపము చేయవలయును. ఈ మాలను తన యిష్టదేవతా మంత్రమునకే యుపయోగింపవలెను గాని అన్యమంత్రమున కుప యోగింపరాదు. ఇంకను మాలాసంస్కారము పూర్తికాలేదు. ఇట్లు జపించిన మాలను పీఠముపైనుంచి దానిలోనికి శ్రీరామచంద్రు నాహ్వానించి 'అసునీతే పునరస్మాసు' అను మంత్రముతోఁ బ్రాణప్రతిష్ఠా కర్మ నొనర్పవలెను. తర్వాత మాలను ధ్యానింపవలయును.

శ్లో॥ మాలేమాలే మహామాలే సర్వతత్త్వ స్వరూపిణి,
చతుర్వర్గ స్త్వయి న్యస్త స్తస్మాన్మే సిద్ధిదా భవ॥

ఓ మాలా! ఓ మహామాలా! సర్వతత్త్వ స్వరూపిణీ! ధర్మార్థ కామ మోక్షములు నీయందున్నవి. కావున నాకు సిద్ధికలిగించు దానవుకమ్ము అని నమస్కరింపవలెను.

విఘ్న భక్తులిట్లు పూజ గావింపవలెను. వర్ణమాలతో నీక్రింది మంత్ర ముతోఁ బూలతో బూజింపవలయును.

ఓం అం నమః ఓం ఐం శ్రీం అక్షమాలాయై నమః
ఓం ఆం నమః ఓం ఐం శ్రీం అక్షమాలాయై నమః

ఇట్లే ౧౦౮ మంత్రములతో అక్షమాలలు బూజించిన తర్వాత నీ మంత్ర ముతో ౧౦౮ తర్పణము, ౧౦౮ హోమము చేయవలెను. లేదా ౨౧౬ మారక జపము గావింపవలయును. తర్వాత నివేదన చేసి, ఉద్వాసన చెప్పి మాలను తీసి కొని ఒక మడి సంచిలోనో, గోముఖములోనో పెట్టుకొని వాడవలయును. జప సమయమున మాల ఊఁగరాదు, ఊఁపరాదు. క్రిందకు జార విడువరాదు

దీని దారమును జేతిలోఁ దెగనీయరాదు. అది మృత్యుప్రదము. దారము బల హీనమై తెగు స్థితిలో నున్న వేఱొక దారముతో గ్రుచ్చిన తర్వాతనే వాడ వలయును. పై మంత్రములతోఁ గాక కేవలము శ్రీరామ మూల మంత్రము తోనే మాలా సంస్కారము చేసికొనవచ్చును. ఇట్లు సంస్కరింపఁబడిన మాలతో జపము చేసిన శీఘ్రముగ మంత్రము సిద్ధించును.

ఇట్లుగాక గురువుచేఁ బ్రసాదింపఁబడిన మాల సర్వవిషయముల శ్రేష్ఠ మైనది. గురు వొసంగినది సంస్కరింపఁ బడినను, సంస్కరింపఁ బడకున్నను దానితో జపము చేసిన స్వయముగ సంస్కరింపఁబడిన దానికంటె శ్రేష్ఠమైనదే. అన్నిటికిని గుర్వనుగ్రహము చాలును. ఒకవేళ ఆయన ఈయకున్న సంస్కార మును మనమే చేసికొని. ఆయన చేతిమీఁదుగ తీసికొనిన మిక్కిలి శ్రేష్ఠము. ఒకవేళ గురువు పరమపదించిన, తద్గురు పుత్రుని చేతఁగాని, పరంపరా పీఠాధి పతి చేతఁగాని, లేక సద్గురు లక్షణములు కల సాధువుచేత మాలను గ్రహింప వచ్చును. అన్నిటికిని భక్తిప్రధానము. మంత్రయోగానుష్ఠాన పరునకు మంత్రము నకు మించిన దైవముగాని, దీనికి మించిన వేదమంత్రముగాని లేదు. ఇట్టి పరమ విశ్వాస మున్ననే మంత్రము సిద్ధించును. విశ్వాసములేక యెన్ని బాహ్యక్రియ లొనర్చినను వ్యర్థమే. శ్రద్ధా, భక్తి, విశ్వాసములే సర్వేశ్వరుని చేర్చునని నమ్మి శాస్త్రము తప్పక, గురువుపై పరమ విశ్వాసముంచి, పైనఁజెప్పిన సంస్కార ములను గావించుకొని, సత్వర మంత్రసిద్ధిని సాధకుఁడు పొందవలయును. ఇఁక జపమునుగూర్చి చెప్పఁబడును.

## జ ప ము

స్నానము చేసి, స్నానాంగ దేవర్షి పితృతర్పణములను గావించి, ఆచ మించి, మడుగు వస్త్రమును గాని, ధావళిగాని, పట్టుగుడ్డనుగాని కట్టుకొని శాస్త్రవిధిని సంప్రదాయానుసారముగఁ బుండ్రమును ధరింపవలయును. జపము చేయునపుడు ధోవతి ఒక్కటియే ధరించి జపింపరాదు. రెండవ వస్త్రముండ వలయును. స్త్రీలకీ నియమము లేదు. కట్టుకొన్న వస్త్రమును ముసుగు వేసి కొనరాదు. కట్టువస్త్రమును పైగుడ్డగఁగాని, పైగుడ్డను గట్టువస్త్రముగ ధరించి జపింపరాదు. గూడకట్టుతోఁగాని, లుంగీతోగాని జపింపరాదు. గూడకట్టైన గోఁచి యుండవలయును. మడుగు గుడ్డైనను బాగుగ నుదికినదిగ నుండ

వలయును. తెల్లగుడ్డ, కాషాయ వస్త్రము పనికివచ్చును గాని యితర రంగు గుడ్డ పనికిరాదు. గృహస్థు స్వాములవారి నిర్మాల్య కాషాయమును ధరింప వలయునే గాని తానుగాఁ గాషాయ వస్త్రమును ధరింపరాదు.

తర్వాత ఆసనమును పఱచవలెను. ఏయే యాసనములు పఱచుకొన వలసినదియు, ఏయే యోగాసనములు చేయవలసినదియు 'ఆసనము' అను ప్రకరణమునఁ జర్చింపఁబడినది. ఆసన స్థలమున స్థలశుద్ధి కావింపవలయును. బాగుగా నలికి ఱాళ్లు, ముళ్లు, దోమలు, నల్లులు, చీమలు, ఈఁగలు, సర్పములు, చెదలు, మిణ్ణలులు, మొదలగునవి లేని స్థలముననే జపింపవలయును. ఆ జపస్థలమును గోమయముతో నలికి, ముగ్గులు పెట్టి అగురు, సాంబ్రాణి ధూపములు వేయుట మంచిది. అచ్చట నీ క్రింది మంత్రముతో నీరు చల్లవలయును.

'ఓం పృథ్వీ త్వయా ధృతాలోకా – దేవి త్వం విష్ణునా ధృతా
త్వంచ ధారయ మాం దేవి – పవిత్రం కురు చాసనమ్॥
అపసర్పంతు యే భూతాః – యేభూతా భూమి సంస్థితాః
యే భూతా విఘ్నకర్తారః – తే నశ్యంతు శివాజ్ఞయా॥

ఇట్లు భూతోచ్చాటనము గావించి ఇట్లు ప్రార్థింప వలయును.

'ఓం విశ్వశక్త్యై నమః। ఓం మహాశక్త్యై నమః। ఓం కూర్మాసనాయ నమః। ఓం యోగాసనాయ నమః। ఓం అనంతాసనాయ నమః। ఓం విమలాసనాయ నమః। మధ్యే। ఓం పరమ సుఖాసనాయ నమః। ఓం భూర్భువః స్వః ఆత్మాసనాయ నమః (అనేన మంత్రేణ పుష్పాదినా ఆత్మనః ఆసనదానమ్) ఇట్టి మంత్రములచే పుష్పాదులను జల్లి ఆసన దానము కావింపవలయును.

ఆసనమున కీ క్రిందివి చాల ముఖ్యములు.

శ్లో॥ కౌశేయం కంబలంచైవ – ఆసనం పట్టమేవచ
దారుజం తాలపత్రం వా – ఆసనం పరికల్పయేత్॥

— వ్యాసుఁడు.

దర్భాసనమును గాని, కంబలమును గాని, చిత్రాసనమును గాని, పట్టమును గాని, కొయ్యతోఁజేసినదిగాని, తాటియాఁకు చాపనుగాని ఆసనముగాఁ గల్పించుకొన వలయును.

శ్లో॥ కృష్ణాజినే భవేన్ముక్తిః - జ్ఞానవృద్ధిః కుశాసనే
సర్వాన్కామా నవాప్నోతి - మనుష్యః కంబలాసనే॥

కృష్ణాజినము వలన ముక్తియు, దర్భాసనము వలన జ్ఞానవృద్ధియు, కంబలాసనము వలన సమస్త కోరికలను మానవుఁడు పొందఁగలఁడు.

ఆసనము మీఁదఁ గూర్చుండిన తర్వాత ఆచమనము కావింప వలయును. తర్వాత పద్మాసనము, స్వస్తికాసనము, సిద్ధాసనములలో నేదియో యొక ఆసనమును వేసికొని, చేతికి పవిత్రమును ధరింపవలెను. అది కుశతోఁ జేయబడినదైన శ్రేష్ఠము.

శ్లో॥ స్నానే హోమే జపే దానే - స్వాధ్యాయే పితృతర్పణే,
కరౌ సదర్భౌ కుర్వీత - తథా సంధ్యాభి వందనే॥

యథా వజ్రం సురేంద్రస్య - యథా చక్రహరేస్తథా,
త్రిశూలంచ త్రినేత్రస్య - బ్రాహ్మణస్య పవిత్రకమ్॥

స్నానము, హోమము, జపము, దానము, స్వాధ్యాయము, పితృతర్పణము, సంధ్యావందనము మొదలగు సమయములందు దర్భ చేతిని ధరించి చేయవలెను. ఇంద్రునకు వజ్రము, విష్ణువునకుఁ జక్రమును, శివునకుఁ ద్రిశూలమెట్లో బ్రాహ్మణునకుఁ బవిత్రమట్లే.

దర్భలు పదిరకములు. వీనిలో దేనినైన నుపయోగింప వచ్చును.

శ్లో॥ కుశాః కాశాః శరా దూర్వా - యవ గోధూమ బిల్వజాః
సువర్ణం రజతం తామ్రం దశదర్భాః ప్రకీర్తితాః॥

— హారీతకుఁడు.

కుశ, కాశ అను దర్భ, రెల్లు, గరిక, యవలగడ్డి, గోధుమగడ్డి, మారేడు సంబంధమైనది, బంగారు, వెండి, రాగి యీపదియు దర్భలని చెప్పఁబడుచున్నవి. వీనిలో దేనితోఁజేసిన పవిత్రమునైనను ధరింపవచ్చును.

జపమునకు ముందు భుజించి యుండరాదు. కడుపు నిండఁదిని జపము చేయుట శ్రేయస్కరము కాదు. అది జీర్ణము కావలయును. ఉదయమున జపమునకు ముందేమియు భుజింపరాదు. ఈ క్రిందఁ జెప్పఁబడినవి భుజించినను దోషముండదు.

శ్లో॥ ఇక్షు రాపః పయో మూలం - తాంబూలం ఫలమౌషధం
భక్షయిత్వాపి కర్తవ్యాః - స్నానదానాదికాః క్రియాః॥

చెఱకు, నీరు, పాలు, దుంపలు, తాంబూలము, ఫలము, ఔషధము, వీటిని దినినప్పటికిని స్నానదానాదిక క్రియలు చేయవచ్చును.

జపమునకు ముందు యాలకులు, జాజికాయ, జాపత్రి, పచ్చకర్పూరము, సోపు మొదలగు సువాసన ద్రవ్యములను నమలి సువాసనగల నోటితో జపించుట వలన శీఘ్రముగ జపసిద్ధికలుగునని సాధు, భక్త సంప్రదాయము. దుర్వాసనగల నోటితో జపించిన జపఫలముండదు.

మొదట సంధ్యాదిక క్రియలు గావించి, ధ్యానించి పూజను మానసికముగ నైనను, బాహ్యముగనైనను జేసి గురువును ధ్యానింప వలయును. కాళ్లను జాపి గాని, మఱగాళ్లు వేసికొనిగాని జపించిన మంత్రసిద్ధి కలుగదు. కావున ఆసన శుద్ధి ముఖ్యము. తర్వాత ఆచమించి సంకల్పము చేయవలయును. భగవత్ప్రీత్యర్థముగ జపమును వినియోగింప వలయును. తర్వాత ఛందస్సు, ఋషి, దైవతాదులను జెప్పవలెను.

శ్లో॥ అవిదిత్వా ఋషిం ఛందో - దైవతం యోగమేవచ
యోఽధ్యాపయేద్యాజయేద్వా - పాపీయాఞ్జాయతేతు సః॥

ఋషి. ఛంద, దైవత, వినియోగములను దెలియక నెవఁడు మంత్రమును బఠించునో, పఠింపఁజేయునో వాఁడు పాపియని గ్రహింపవలయును.

తర్వాత న్యాసము కావింప వలయును. అంగన్యాస, కరన్యాసములు ముఖ్యములు. తర్వాత ఇష్టదేవతా ధ్యానమును అర్థయుక్తముగఁ జేయవలెను. తర్వాత లం ఇత్యాది బీజమంత్రములతో పంచోపచారపూజ చేయవలయును. తర్వాత ముద్రను బ్రదర్శింపవలయును.

శ్లో॥ ముద్రాశ్చ దర్శయేద్ధీమా - న్దేవసాన్నిధ్యకారణమ్,
దర్శితాస్తాస్తు దేవానాం మోదకా ద్రావకాన్మనే॥
— అగస్త్య సంహిత.

దేవ సాన్నిధ్యకారణమగు ముద్రలను యత్నముతో దర్శింపఁ జేయవల యును. అట్లు దర్శింపఁజేయుట వలన దేవతలు మోదించి కఱఁగి పోవుదురు.

శ్రీరామమంత్రమునకు ధనుర్బాణ ముద్రను బ్రదర్శింప వలయును. తర్వాత జపమును బ్రారంభింప వలయును. ధనుర్బాణ ముద్రా లక్షణమిది.

శ్లో॥ వామస్య మధ్యమాగ్రంతు తర్జన్యగ్రే నియోజయేత్,
అనామికాం కనిష్ఠాంచ తస్యాంగుష్ఠేన పీడయేత్॥
దర్శయే ద్వామకే స్కంధే ధనుర్ముద్రేయమీరితా॥

ఎడమచేతి మధ్యవ్రేలికొనను, తర్జనీవ్రేలి చివరతోఁ జేర్పవలయును. అనా మిక కనిష్ఠకలను బొటన వ్రేలితోఁ బీడింపవలెను. ఈ ముద్రను ఎడమ భుజ ముపైఁ బ్రదర్శించిన నది ధనుర్ముద్ర యగుచున్నది.

తర్వాత వ్యాఖ్యాన ముద్రను కుడిచేతితోఁ బ్రదర్శింపవలెను.

శ్లో॥ దక్షిణాంగుష్ఠ పర్జన్యా వగ్రలగ్నే పరాంగులీః,
ప్రసార్య సంహతోత్తానా ఏషా వ్యాఖ్యాన ముద్రికా॥
రామస్య చ సరస్వత్యా అత్యంతం ప్రేయసీ మతా,
జ్ఞానవ్యాఖ్యా పుస్తకానాం యుగపత్సంభవః స్మృతః॥

కుడిచేతి బొటనవ్రేలును. తర్జనీ (చూపుడువ్రేలు) కొనలను గలిపి, మిగి లిన వ్రేళ్ళను జాపవలయును. ఆ జాపినవ్రేళ్లు పరస్పరము కలిసికొని పైకి యుండవలయును. ఇదియే వ్యాఖ్యాన ముద్ర. దీనినే జ్ఞాన ముద్ర యనియు నందురు. ఇది రామునకును, సరస్వతికిని చాల ప్రియమైనది. ఈ ముద్రద్వారా జ్ఞాన, వ్యాఖ్యాన, పుస్తక ముద్రలు ఒక్కసారిగాఁ బ్రకటింపఁబడినది.

ఇట్లీ రెండు ముద్రలను బ్రదర్శించిన తర్వాత జపమును బ్రారంభింప వలయును. జపమునకు ముందు కనీసము పది ప్రాణాయామము లొనర్చిన మనస్సైకాగ్రము కాఁగలదు. జప సమయమున నెదురుగ ఇష్టదేవతా పటమును గాని, విగ్రహమును గాని ఉంచుకొనుట శ్రేయస్కరము. ఆమూర్తిని జూచుచు నొక్కొక్క యవయవమును ధ్యానించుచు జపింపవలయును. హృదయమునఁ గాని, భ్రూ మధ్యమునఁ గాని శ్రీరామచంద్రుని ధ్యానింపవలయును. ధ్యాన ముతోఁగూడిన జపమే యుత్తమమైనది.

శ్లో॥ రామారాధన కోటిభ్యః సధ్యాన జప ఉత్తమః॥ —అగస్త్య సంహిత.

కోటిసార్లు రామారాధన చేయుటకంటె ధ్యానముతోఁ గూడిన జప మత్యుత్తమమైనది.

మౌనముతో మంత్రార్థ చింతనము కావించు చుండవలయును. మంత్రార్థమును గురువు వలనఁ దెలిసికొనవలయును. ఈ గ్రంథ ప్రారంభమునఁగల శ్రీరామ తత్త్వమును బాగుగా మనస్సునకుఁ బట్టించుకొనుటయే గాక ఆ ప్రకరణాంతమునఁగల రెండుమూఁడు మంత్రముల యొక్క అర్థమును గుర్తింప వలయును. జపము చేయుచు మంత్రమూర్తి యొక్క పాదములు, పిక్కలు, మోఁకాళ్లు, తొడలు, నడుము, పొట్ట, బొమ్మ, చేతులు, కంఠము, ముఖము ఈ పది భాగములను గ్రమక్రమముగ ధ్యానింపవలయును. ఒక్కొక్క యవయవమున కింతింతజపమని నియమించుకొని జపించుట శ్రేయస్కరము. జపించునప్పుడు మనస్సేకాగ్రముగ నుంచవలయును. ఏకాగ్రముగ నుండునట్లు చేయుమని శ్రీరామచంద్రుని బ్రార్థింప వలయును.

నాసికాగ్రమున దృష్టి నిలిపిన మనస్సేకాగ్రము కాఁగలదు. హృదయమున ధ్యానించునప్పుడు అష్టదళపద్మమున్నట్లు భావించి, అందులో నద్భుతమైన తేజస్సును, ఆ తేజో మధ్యమున మంత్రమూర్తి యున్నట్లు భావింపవలయును. కేవలము హృత్పద్మ మధ్యమందు మాత్రమే మనస్సును నిలుపవలయును. పద్మదళములందు మనస్సు తిరుగుచుండిన, వేఱువేఱు దళములందు తిరిగినపుడు వేఱువేఱు భావము లుత్పన్నమగును. కావున నా దళముల మీఁదకుఁ బోనీయరాదు.

శ్లో॥ పూర్వదళే పీత వర్ణే – యదా విశ్రామతే మనః,
తదా ధైర్యే తథౌదార్యే – ధర్మకీర్తౌ మతిర్భవేత్॥
అగ్నికోణ దళే రక్తే – యదావిశ్రమతే మనః,
తదా నిద్రాలసతాలస్యే – మందా బుద్ధిశ్చజాయతే।
కృష్ణే వర్ణే దక్షుదళే – యదా విశ్రమతే మనః,
తదా స్త్రీ పుత్ర విత్తాది – మోహజాలే భవేన్మతిః॥
పశ్చిమే కపిలే వర్ణే – యదా విశ్రమతే మనః,
తదా హాస్యే వినోదేచ – హ్యానందేచ భవేన్మతిః॥

వాయవ్యే శ్యామవర్ణేచ - యదా విశ్రమతే మనః,
తదా తీర్థాటనం కృత్వా - వైరాగ్యం ప్రాప్నుయాన్నరః॥
ఉత్తరే పీతవర్ణేచ - యదా విశ్రమతే మనః,
తదా శృంగార భోగాది - కరణేచ భవేన్మతిః॥
ఐశానే గౌర వర్ణేచ యదా విశ్రమతే మనః
తదా దయా క్షమా శాంతి - జ్ఞానాదౌచ భవేన్మతిః॥
సంధా సంధా మిశ్రవర్ణే - యదా విశ్రమతే మనః
తదా రోగాది భిర్గ్రస్తో - జాయతేచ సదాధ్రువమ్॥
మధ్యభాగే సదా వర్ణే - యదా విశ్రమతే మనః
తదా శాంతౌ సమాధౌచ - చైతన్యేచ భవేన్మతిః॥

మనస్సు హృదయ పద్మమునకు తూర్పుననున్న పీతవర్ణదళమందు సంచరించుచో ధైర్యము, ఔదార్యము, ధర్మము, కీర్తి వీనియందు బుద్ధి కలుగును. ఎఱ్ఱని ఆగ్నేయదళమునఁ జరించిన నిద్రాలస్యములు, మందబుద్ధియుఁ గలుగును. నల్లని దక్షిణ దళమున మనస్సు చరించుచోఁ గ్రోధ, ద్వేష, దుష్టత్వములు కలుగును. నీలవర్ణమగు నైరృతి దళమునఁ జరించుచో స్త్రీ, పుత్ర, విత్తాది మోహజాలమందు పడును. కపిల వర్ణముకల పశ్చిమ దళమందు మనస్సు చరించుచో హాస్యవినోదానందములందు మనస్సు లగ్నమగును. శ్యామ వర్ణముగల వాయవ్య దళమందు మనస్సు చరించిన తీర్థాటనము గావించి వైరాగ్యవంతుఁడగును పీత వర్ణముగల ఉత్తర దళమునందు మనస్సు చరించిన శృంగార భోగాది కరణము నందు బుద్ధి కలుగును. గౌరవర్ణము గల ఈశాన్యదళమందు మనస్సు చరించిన దయా, క్షమా, శాంతి, జ్ఞానాదులందు మతి గలుగును. మిశ్రవర్ణము గల సంధులందు మనస్సు చరించిన రోగాదులచే బాధపడును. తెల్లనగు మధ్యభాగమందు మనస్సు చరించిన శాంతి, సమాధులందును, చైతన్య వస్తువునందును బుద్ధి గలుగును. కావున మనస్సును హృత్పద్మ మధ్యమున మంత్రమూర్తి నుంచుట ముఖ్యము.

జపమును కరమాల, వర్ణమాల, మణిమాలలో దేనితోనైనఁ జేయవచ్చును. ఈ మాలా విషయమును గూర్చి యింతకు ముందు చెప్పఁబడినది. తులసీమాల జపమునకు మిక్కిలి శ్రేష్ఠమైనది.

శ్లో॥ యః కుర్యాత్తులసీ కాష్ఠే - రక్షమాలాం సురూపిణీం
కంఠమాలాంచ యత్నేన - కృతం తస్యాక్షయం భవేత్॥

తులసీ కఱ్ఱతో నక్షమాలనుగాని, కంఠమాలనుగాని ప్రయత్నపూర్వకముగఁ జక్కగ నిర్మించుకొని జపించినను, ధరించినను అక్షయఫలము నొసంగును

వర్ణమాలతో జపించినఁ బురశ్చరణ చేసిన ఫలము లభించును. మణిమాలతో జపించిన గోముఖములోఁ జేతినుంచి జపింపవలయును.

శ్లో॥ అక్షమాలాంచ ముద్రాంచ గురుం నైవ ప్రదర్శయేత్'

అనియుండుటచే జపించునపుడు అక్షమాలను, ముద్రను, గురువును బ్రదర్శింపరాదు.

'యతః మంత్రస్య పుంస్త్వం మాలాయాః స్త్రీత్వంచ తయోః సంయోగో రహస్యేవ భవతి' మంత్రము పురుషుఁడు, మాల స్త్రీ, జప మీ రెంటి యొక్క సంయోగము కావున రహస్యముగా నుంచవలయును.

జపమాలను మాపుడు వ్రేలితోఁ దాఁకరాదు. బొటనవ్రేలు, మధ్యవ్రేలు ఈ రెంటితో మాత్రమే త్రిప్పవలయును. వ్రేళ్లు పైకి చూచుచుండవలయును. మాల పూర్తియై కొలికిపూస వద్దకు రాఁగానే మఱల వెనుకకు త్రిప్పవలెను గాని మేరుపూస దాఁటనీయరాదు. మాల జారి పడరాదు. జపము చేయునపుడు మాల తెగిపడరాదు. అట్లు తెగిన మరణ యోగమని తెలియవలెను. కావున మాలను గట్టి దారముతో గ్రుచ్చుకొనవలయును. అది తెగునని తోఁచఁగానే వెంటనే మరల క్రొత్తదారముతో బాగుగా పేని గ్రుచ్చుకొన వలయును. ఒకవేళ అట్లు జారిపడినను, తెగినను మూఁడు ప్రాణాయామము లొనర్చి ఘృతప్రాశన మొనర్చిన నాదోషము పోవును.

శ్లో॥ అంగుళ్యగ్రేషు యజ్జప్తం - యజ్జప్తం మేరులంఘనే,
అసంఖ్యాతంతు యజ్జప్తం - తత్సర్వం నిష్ఫలం భవేత్॥

శ్లో॥ కృష్ణాజినే భవేన్ముక్తిః - జ్ఞానవృద్ధిః కుశాసనే
సర్వాన్కామా నవాప్నోతి - మనుష్యః కంబలాసనే॥

కృష్ణాజినము వలన ముక్తియు, దర్భాసనము వలన జ్ఞానవృద్ధియు, కంబలాసనము వలన సమస్త కోరికలను మానవుఁడు పొందఁగలఁడు.

ఆసనము మీఁదఁ గూర్చుండిన తర్వాత ఆచమనము కావింప వలయును. తర్వాత పద్మాసనము, స్వస్తికాసనము, సిద్ధాసనములలో నేదియో యొక ఆసనమును వేసికొని, చేతికి పవిత్రమును ధరింపవలెను. అది కుశతోఁ జేయబడినదైన శ్రేష్ఠము.

శ్లో॥ స్నానే హోమే జపే దానే - స్వాధ్యాయే పితృతర్పణే,
కరౌ సదర్భౌ కుర్వీత - తథా సంధ్యాభి వందనే॥

యథా వజ్రం సురేంద్రస్య - యథా చక్రహరేస్తథా,
త్రిశూలంచ త్రినేత్రస్య - బ్రాహ్మణస్య పవిత్రకమ్॥

స్నానము, హోమము, జపము, దానము, స్వాధ్యాయము, పితృతర్పణము, సంధ్యావందనము మొదలగు సమయములందు దర్భ చేతిని ధరించి చేయవలెను. ఇంద్రునకు వజ్రము, విష్ణువునకుఁ జక్రమును, శివునకుఁద్రిశూలమెట్లో బ్రాహ్మణునకుఁ బవిత్రమట్లే.

దర్భలు పదిరకములు. వీనిలో దేనినైన నుపయోగింప వచ్చును.

శ్లో॥ కుశాః కాశాః శరా దూర్వా - యవ గోధూమ బిల్వజాః
సువర్ణం రజతం తామ్రం దశదర్భాః ప్రకీర్తితాః॥

— హారీతకుఁడు.

కుశ, కాశ అను దర్భ, రెల్లు, గరిక, యవలగడ్డి, గోధుమగడ్డి, మారేడు సంబంధమైనది, బంగారు, వెండి, రాగి యీపదియు దర్భలని చెప్పఁబడుచున్నవి. వీనిలో దేనితోఁజేసిన పవిత్రమునైనను ధరింపవచ్చును.

జపమునకు ముందు భుజించి యుండరాదు. కడుపు నిండఁదిని జపము చేయుట శ్రేయస్కరము కాదు. అది జీర్ణము కావలయును. ఉదయమున జపమునకు ముందేమియు భుజింపరాదు. ఈ క్రిందఁ జెప్పఁబడినవి భుజించినను దోషముండదు.

శ్లో॥ మంత్రముచ్చారయే ద్వాచా - జపయజ్ఞః స వాచికః
శనైరుచ్చారయే న్మంత్ర - మీషదోష్ఠం ప్రచాలయేత్॥
కించిచ్ఛ్రవణ యోగ్యః స్యా - దుపాంశుః స జపః స్మృతః
ధియా యదక్షర శ్రేణీం - వర్ణస్వర పదాత్మికామ్
ఉచ్చరే దర్థ సంస్మృత్యా - స ఉక్తో మానసో జపః॥

నోటితో నందఱకు వినఁబడునట్లు పెద్దగాఁ బలుకు జపము వాచికము. మెల్లగా నుచ్చరించుచు పెదవులు మాత్రము కొంచెము కదలించుచు వినీవినఁబడ నట్లు చేయు జపము ఉపాంశువు. మనస్సుతో నక్షరములను పదాదులను అర్థయుక్తముగాఁ జింతించుచు జపించుట మానసికము.

పైవానిలో మానసిక జపమునకు నియమ మనవసరము.

శ్లో॥ అశుచిర్వా శుచిర్వాపి - గచ్ఛం స్తిష్ఠన్ స్వపన్నపి
మంత్రైక శరణో విద్వాన్ - మనసైవ సదాఽభ్యసేత్॥
న దోషో మానసే జాప్యే - సర్వదేశేఽపి సర్వదా॥

మంత్ర రహస్యమును దెలిసిన విద్వాంసుఁడు మంత్రమునే శరణుపొందును. అతఁడు అశుచిగా నున్నప్పటికిని, శుచిగా నున్నప్పటికిని, నడుచుచు, నిలుచుండుచు, నిద్రించుచు మనస్సుతో నిరంతరము జపింప వచ్చును. మానసిక జపమును సర్వస్థలముల యందును, సర్వకాల సర్వావస్థల యందును జపింప వచ్చును. దానివలన దోషములేదు.

వాచిక జపము కంటె నుపాంశు జపము నూఱురెట్లధిక ఫలమొసంగును. ఉపాంశు జపముకంటె మానసిక జపము నూఱురెట్లధిక ఫలమునిచ్చును. వాచిక జపము వలన వాక్సిద్ధి కలుగును. ఉపాంశు జపము వలన నేకాగ్రత కలిగి, యింద్రియవృత్తు లంతర్ముఖము లగుచుండును. ఈ జపము చేయునపుడు భ్రూమధ్యమునను, గొందఱకు ఫాలదేశమునను నొకవిధమగు స్పర్శ, విద్యుత్ప్రవాహమును దాఁకిన నెట్లుండునో అట్లు తోఁచును. మానసిక జపమువలన నానందానుభవము కలుగును. నిమీలిత నేత్రములు వానికవియే జపకాలమున నేర్పడును. మనస్సు మంత్రమూర్తియందు పూర్తిగా సంలగ్నమై యుండును. మంత్రార్థ చింతనము దీనిలోఁ జాల ముఖ్యము. జపమును జపసంఖ్యయంఁ

కేవలము మానసికముగనే యుండును. ఈ జపమునకు అక్షరమాల బాగుగా నుపకరించును. ఈ మానసిక జపములో ననుభవము, అభ్యాసము దృఢపడిన కొలఁది జపసంఖ్య అవసరము లేకయేపోవును. మానసిక జపము త్వరగా జేయవచ్చును. అర్థానుసంధానము చేయుకొలఁది జపముసాగదు. ఒకొ్కకచోట జపమంతయు పూర్తిగ ఆగిపోవుచుండును. ఎంతసేపాపితిమో తెలియని స్థితి కూడ కలుగుచుండును. అట్టి స్థితికి వచ్చిననాఁడే జపమునకు సార్థకతకలుగును. అట్టి జపమునకును భగవంతునకును భేదముండఁ జాలదు. అట్టి జపమునుగూర్చియే గీతాబోధ సమయమున "యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి" యని శ్రీకృష్ణుఁడు నుడివినది.

## గ మ ని క

జప సమయమునఁ గొందఱకు నిద్రవచ్చుచుండును. ఈ నిద్రలో మంత్రమును, మంత్రార్థమును, మంత్రమూర్తిని గూడ మఱచిపోవుదురు. మాల క్రింద పడిపోవును. కూరుకుపాట్లు పడుచుందురు. ఈ నిద్రను కూరుకుపాట్లను గాంచి సమాధ్యనుభవము కలిగినదని సంతోషించి తృప్తిపడు వారును లేకపోలేదు. వారికి సమాధియననేమియో, ఆ యనుభవ మెట్లుండునో తెలియనే తెలియదు. జ్ఞాపకుఁడు ఆ భ్రమను వదలవలయును. మంత్రమును తీవ్రముగ జపించుకొలఁది కొన్ని శక్తు లేర్పడును. మహిమలు జరుగును. వానితో మంత్రజ్ఞుఁడగువాఁడు తృప్తిపడరాదు. ఆమహిమ లన్నియు తల్లికొఱకై యేడ్చు శిశువుముందు పడవైచిన ఆటబొమ్మల వంటివి. ఆటబొమ్మలను మఱగిన శిశువును తల్లిని మఱచినట్లు మహిమలను నమ్ముకొనిన లేక లోభపడిన సాధకుఁడు, మహిమలను లోకసంగ్రహార్థమునకును, కీర్తికొఱకును ఉపయోగించి, అసలు భగవత్స్వరూపమును మఱచు చుందురు. కావున మహిమలకు లొంగిపోరాదు. మహిమలు వచ్చుట శుభసూచకమే. కాని వానికి వశపడుట పొరపాటు. అట్లు మహిమలు లభించుచో భగవంతుని లీలలిట్టివని భావించి 'స్వామీ! నాకివి యక్కఱలేదు. అఖండమహాసముద్రములను, అసంఖ్యాకములగు నక్షత్రములను, ఆకాశమునంటు కొండలు మొదలైనవాటిని సృజించిన నీమహిమను నేనేమని యెన్నఁగలను? వాటిముందీ మహిమ లేమిలెక్క?'' అని ఉపసంహరింపఁ బ్రార్థింపవలెను.

జపసంఖ్య త్వరత్వరగా వేలు లక్షలు కావలెనని అతితీవ్రముగ జపింపరాదు. జపము చేయుటచే శరీరములోని రక్తము అధికముగ పారును. వేగముగ

పారును. ఎంత వేగముగ జపించిన నంత వడిగ రక్తము పారుచుండును. అది శరీరారోగ్యమునకు చాల భంగకరము. మన శరీరములోని రక్తనాడులు ఆ వేగమును భరింపఁజాలవు. రక్తపుపోటు వచ్చును. దానిమీద పక్షవాతాది రోగములు రావచ్చును. కొందఱు కొద్ది దినములలో చావనే చావవచ్చును. కావున నట్లు చేయరాదు.

కొందఱు అందఱికంటె మనము చాల స్పష్టముగ, శుద్ధముగ జపము చేయవలెనను భ్రమచేఁ జాల నెమ్మదిగా, బొత్తుగా వడి లేకుండ చేయుచుందురు, దాని వలనను ప్రయోజనము లేదు. రావలసిన ఫలము రానేరాదు. అతి మందముగ డైనమో తిరుగుచుండిన నెట్లు విద్యుచ్ఛక్తి త్వరగా నుత్పన్నము కాదో, అట్లే అతి మందమగు వడిలో మెల్లగా జపము చేయుచుండిన రావలసిన ఫలితము రాదు. కావున జాపకుఁడు సమానమైన వడిలో జపము జేయుచుండవలయును,

కొందఱు కొంచెముసేపు ఎక్కువ వడితోడను, కొంచెముసేపు అతి మందముగను జపించుచుందురు. దీని వలనను ఫలము లేకపోఁగా వ్యత్యాసము వలన శరీరారోగ్యములో దుష్ఫలితములు కలుగవచ్చును. కావున ప్రారంభము మొదలు చివరవఱకు ఒకే వడిలో జపము సాగవలయును. అస్తు.

జప విధానములలో ననేక రకములు కలవు. వానిలోఁగొన్నిటి నీ క్రింద వివరించుచున్నాము. జపసాధకుఁడు తనకు దేనిలో నభిరుచి, సౌకర్యముకలదో దాని నాయా కాలములందు అనుష్ఠానములోఁ బెట్టుకొనవలయును.

## ౧. నిత్య జపము

ఉపదేశమైనది మొదలు ఉసురులు విడుచు వఱకు ఈ నిత్యజపము గావింపవలెను. ప్రతి దినము రెండు పూటలును దీనిని చేయవలసి యుండును. పూటకింత చేయవలయునని నియమించుకొని, ఆ నియమము తగ్గకుండ జపింపవలయును. ౧౦౮ కి తక్కువ జపము చేయరాదు. మనకు స్నానము, సంధ్యావందనము, భోజనము లెట్లు నిత్యకర్మలో అట్లే యిదియును కావున దీనిని వదలరాదు. ఈ నిత్యజపము వలన నేరోజు చేసిన పాపము లారోజుననే నశించును. పాపము లేమాత్రము చేయని వానికి భగవదనుగ్రహము శీఘ్రముగ లభిం

చును. జపాభ్యాస మభివృద్ధి కాఁగలదు. ఆనందము కలుగును. రోగబాధలు కలిగి నప్పుడును, ప్రయాణ సమయములందును, దుర్భిక్ష, దేశోపద్రవ సమయము లందును స్నానము చేసినను జేయకున్నను మానసికముగ జపమొనర్ప వచ్చును. స్నానము చేయవీలులేకున్న విభూతిస్నానమో, మంత్రస్నానమో లేక మానసిక స్నానమో చేసి జపింపవచ్చును. ఈ వివిధ స్నానముల విధానము వేఱొకచోట వివరింపఁబడినది. నియమిత జపమున కెక్కువగ నెంతయైనఁ జేయవచ్చును. ఎంత యెక్కువగఁజేసిన నంతగ భగవత్కృప, ఈశ్వరభక్తి, ధర్మావలంబనము అధికముగఁ బ్రాప్తించును.

## ౧. నై మి త్తి క జ ప ము

దేవతా జయంతులగు శ్రీరామనవమి, నృసింహజయంతి, వామనజయంతి, శ్రీకృష్ణజయంతి, హనుమజ్జయంతి, ఏకాదశి, ద్వాదశి, అమావాస్య, దేవీ నవరాత్రులు, రథసప్తమి, సంక్రమణాలు మొదలగు పర్వదినములందు ప్రత్యేకముగ నధికముగ జపింప వచ్చును. దీనివలనఁ బాపనాశనము కాఁగలదు. ప్రత్యేకముగ పర్వకాలములందు జపించుటచేఁ గాలమును బట్టి పుణ్య వృద్ధియగుచుండును. భగవత్కృప విశేషముగఁ గలుగఁగలదు. జ్ఞానోత్పత్తియు నగును. ఏదైనఁగోరికచే జపమొనర్చిన నాయా కోరికలు సిద్ధించును.

## ౨. కా మ్య జ ప ము.

ఏదైనఁ గోరికను మనస్సులోఁ బెట్టుకొనియు జపము చేయవచ్చును. శ్రీరామ మంత్రము సమస్త ఫలముల నొసంగఁగలదు. అయితే సాయుజ్యముక్తి నొసంగు నిట్టి యుత్కృష్టమంత్రమును కామ్యముల కుపయోగింపరాదు. రామరహస్యోపనిషత్తులో హనుమంతుని వాక్యమును గమనింపుఁడు.

శ్రు॥ నైవ యోజ్యో రామమంత్రః కేవలం మోక్షసాధకః,
ఐహికే సమనుప్రాప్తే మాంస్మరేద్రామ సేవకమ్॥

యో రామం సంస్మరేన్నిత్యం భక్త్యామను పరాయణః,
తస్యాహమిష్ట సంసిద్ధ్యై దీక్షితోఽస్మి మునీశ్వరాః॥

వాంఛి తార్థం ప్రదాస్యామి భక్తానాం రాఘవస్యతు,
సర్వదా జాగరూకోఽస్మి రామకార్య ధురంధరః॥

— రామరహస్యోపనిషత్.

అర్థము.

కేవలము మోక్షము కొఱకుగు రామ మంత్రమును కామ్యముల కుపయోగింపరాదు. ఒకవేళ ఐహిక కార్యములు నెరవేఱ వలయుననిన రామసేవకుఁడనగు నన్ను స్మరింపవలయును. నిర్త్యమును శ్రీరామచంద్రుని మంత్రము నాశ్రయించి భక్తితో జపించు వానియొక్క కోరికలన్నియు నెఱవేర్చుటకై నేను దీక్షను గొనియున్నాను. శ్రీరామ భక్తులకు నేను వాంఛితార్థముల నన్నింటిని నొసంగుచున్నాను. నేను రామ కార్య ధురంధరుఁడనై వారి కార్యములు నెఱవేర్చుటకు జాగరూకుఁడనై యున్నాను.

నిష్కామ భావముతో రాఘవుని గొలిచిన వానికార్యముల నన్నింటిని హనుమంతుఁడే నెఱవేర్చును. అయినను గొందఱు వారి కోరికలను నెఱవేర్చుకొనుటకును శ్రీరామ మంత్రమునే ఆశ్రయింతురు. కోరికలు కోరువారు నియమపాలనములో నణుమాత్రమైనఁ బొరపడరాదు. ఇది చాలముఖ్యముగ గమనింపఁదగిన విషయము. నియమోల్లంఘనమునఁ గామ్యజపము నెఱవేఱనే నెఱవేఱదు.

శ్లో॥ నిష్కామానాంచ భక్తానాం జపహోమాది కాత్మనః
ముక్తిరేవ ఫలం తేషామిహకించి న్నవిద్యతే॥
ఏకస్యైవ విధానస్య నకుత్రాపి ఫలద్వయమ్ ॥

— అగస్త్యసంహిత.

నిష్కాములగు భక్తులకు జపహోమాదికముల వలన ముక్తి కలుగును గాని యింకొకటి కలుగదు. ఒకేవిధానమున రెండుఫలములు లభింపవు.

ఇచ్చట నిఁక నేయే ఫలములు కోరువారు నేయే రీతిగ జపము చేయవలసినదియుఁ జెప్పఁబడుచున్నది.

శ్లో॥ అథ ప్రయోగా న్వక్ష్యామి తూర్ణమిష్టార్థ దాన్మునే,
మందభాగ్యోపి యేనష్ట్వా నాయా న్నైవ వాంఛితం॥

విధాయ విధివత్సమ్య గాజ్య భాగాంత ముక్తవత్,
తతో౽గ్నౌ దేవమావాహ్య పూజయే దుపచారకైః॥

పంచభిర్వా షోడశభిః పూజోపకరణైః పృథక్,
పలాశాశ్వత్థ ఖదిరో౽దుంబరామ్ర వటేంధనైః॥

అగ్నిప్రజ్వాలయేత్సమ్య గాగ్నికైర్వాథ వేంధనైః,
తత్రైవ పూజయేత్సమ్యక్ జుహుయాదపి రాఘవమ్॥

లక్షం తదర్ధమర్ధంవా జపిత్వాథ దశాంశకమ్,
తిలైర్వా కమలైర్హుత్వా యద్యదిష్టం తదశ్నుతే॥

బిల్వప్రసూనైరైశ్వర్య మర్చితే౽గ్నౌ హుతే భవేత్,
పలాశ పుష్పైర్హుత్వాథ మేధావీ వేదవిర్భవత్॥

దూర్వాభిశ్చ గుడూచీభిః ప్రత్యేకమపి చాక్షతైః
నిరామయోపి దీర్ఘాయు ర్భవత్యేవ తపోధన॥

సమ్యక్ చందన తోయేన ప్రత్యగ్రైశ్చ సముద్ధితైః,
జాతిప్రసూనైర్హుత్వాతు రాజానం వశమానయేత్॥

ధ్యాత్వాపి మన్మథం రామం సీతామపి రతింస్మరేత్,
సర్వవశ్య ప్రయోగేషు జపహోమాది కర్మసు॥

రామం నవోపయంతారం - స్మరన్నారాధ్య భక్తితః,
ఊర్వశీ సదృశాం కన్యాం - లాజహోమేన సాధకమ్॥

వాంఛితం ధనమాప్నోతి హుత్వారక్తోత్పలైర్నవైః,
హుత్వానీలోత్పలైస్సమ్యక్ వశయే దఖిలం జగత్॥

రామం విధివ దారాధ్య జ్వలితో౽గ్నే ప్రయోగవిత్,
మధురత్రయ యుక్తేన పాయసేన హుతేన తు॥

సర్వాధి పత్యం వైదుష్యం భవత్యేవ నసంశయః,
తిలైశ్చ తండులైరాజ్యై ర్హుత్వాలోకస్యపూజ్యతామ్॥
ఆదరావత్సరం యావత్ షట్సహస్రం దినే దినే,
జపేచ్చ జుహు యాదగ్నౌ దశాంశం సంభృతాంధసా॥

ప్రియమేవా న్న మోలోకే సర్వేషా మపిజాయతే,
బిల్వప్రసూనైః కుముదై స్తథా బిల్వదళైరపి॥
హుత్వా సలభతే లక్ష్మీ మచిరాన్మంత్ర సాధకః
ఆరాధ్యరామం చండాంశు మండలే వత్సరం మునే॥

ఉదమాస్తమయో యావజ్జపేన్నిత్య మనన్యధీః,
ఫలంభవతి తస్యాశు దేవానామపి దుర్లభమ్॥
నైదుష్ప్యే నాధి పత్యేన సమానా ముత్తమో భవేత్,
పూర్ణిమా సు నిశీధిన్యాం ఉదయా స్తమయం వ్రతమ్॥
సంవత్సరం ప్రకుర్వీత జపహోమార్చనం విధేః,
రాత్రౌ జపేద్దివాహోమం కుర్యాదేవాపరేహని॥
బ్రాహ్మణాన్ భోజయిత్వాతు వ్రతమేత త్సమాపయేత్,
సోమ సూర్యాత్మకం యస్తు వ్రతం కుర్వీత మానవః॥
ఇహ భుక్తించ ముక్తించ లభతే నాత్ర సంశయః,
రక్త పద్మైశ్చ బంధూకై స్తథా రక్తోత్పలైరపి॥
అభీష్టలోక వశ్యార్ధి జుహుయా దర్చితోఽనలే,
రాజ్యైశ్వర్యోపి భోగార్థీ జపం లక్షమనన్యధీః॥
పద్మైర్బిల్వప్రసూనైర్వా దశాంశం జుహుయాన్మనే,
సముద్రతీరే గోష్ఠేవా లక్షజాపీ పయోవ్రతః॥

పాయసేనాజ్యయుక్తేన హుత్వా విద్యానిధిర్భవేత్,
ఐరీక్షీణాధిపత్యోయః శాకాహారో జలాంతరే॥

జపేల్లక్షంచ జుహుయాత్ బిల్వపత్రై ర్దశాంశతః,
తదేవ పునరాయాతి హ్యాధి పత్యం న సంశయః॥

మాఘమాసే జలేస్థిత్వా కందమూల ఫలాశనః,
జపేల్లక్షంచ జుహుయా త్పాయసే నార్చితేన తే॥
దశాంశం పుత్రపౌత్రాప్త్యై తచ్ఛేషం ప్రాశయేత్ప్రియమ్,
శ్రీరామ సదృశః పుత్రః పౌత్రోప్యస్య ప్రజాయతే॥

— అగస్త్యసంహిత

ఓ సుతీక్ష్ణా! త్వరగా కోరిన కోరికలు నెఱవేఱుమార్గమును జెప్పెదను వినుము. మందభాగ్యుఁడు కూడ అనాయాసముగ కోరిన కోరికలను బొందఁ గలఁడు. అతఁడు విధివిధానము ననుసరించి చెప్పినట్లు బాగుగ హోమము చేయ వలయును. అగ్నిహోత్రుని లోనికి శ్రీరామచంద్రు నావాహ్వానించి, పంచోపచార ములచేఁ గాని, షోడశోపచారములచేఁ గాని ప్రత్యేకముగఁ బూజింపవలెను. మోదుగ, రావి, కడిమి, అత్తి, మామిడి, మఱ్ఱి ఈ సమిధలతో అగ్నిని బ్రజ్వ లింపఁజేసి హోమవిధానమున రాఘవుని బూజింపవలెను. లక్షగాని, ఏఁబది వేలుగాని, దానిలో సగముగాని మంత్రజపమును గావించి, దానిలో పదవవంతు నువ్వులతోఁగాని, కమలములతోఁగాని, హోమము గావించిన కోరిన కోరికలు నెఱవేరును. అగ్నిలో మారేడు పూలతో హోమముచేసి పూజించిన ఐశ్వర్యము లభించును. మోదుగు పుష్పములతో హోమముచేసిన మేధావియు, వేదవిదుఁడు కాఁగలఁడు. గరికతోఁగాని, తిప్పతీగెతోఁగాని, అక్షతలతోఁగాని ప్రత్యేక ముగనైన హోమము చేయునెడల రోగరహితుఁడును, దీర్ఘాయువును గలవాఁ డగును. బాగుగా చందనతోయములో జాజిపూలను ముంచి హోమముచేసిన రాజవశ్యము కలుగును. మన్మథుఁడగు శ్రీరాముని, రతి స్వరూపిణియగు సీతను ధ్యానించి జపహోమాదులు కావించినచో సర్వవశ్యమగును. నూతనముగ నుప నయనము చేసికొనిన రాముని భక్తితో స్మరించి, పేలాలు హోమము చేసినచో ఊర్వశితో సమానమగు కన్యక లభించును. నూతన ఎఱ్ఱకలువలతో హోమము చేసిన కోరిన ధనము ప్రాప్తించును. నల్లకలువలతో బాగుగ హోమము కావించిన సమస్త విశ్వము వశము కాఁగలదు. జపముచేసి మధురత్రయముతోఁ గూడి పాయసముతో హోమముచేసిన సర్వాధిపత్యమును, పాండిత్యమును నిస్సంశ యముగఁ గలుగును. నువ్వులచేతను, బియ్యముచేతను, నేయితోడను హోమము చేసిన లోకపూజ్యత కలుగును. ప్రతిదినము ఆఱువేలు జపముచొప్పున ఒక సంవత్సరము కాలము ఆదరపూర్వకముగ జపించి, అగ్నిలో తద్దశాంశను హోమముకావించినచో వానిని లోకమంతయు ప్రేమించి నమోవాకములు చేయుదురు. మంత్రసాధకుఁడు జపించి మారేడు పూలతోడను, కలువలతోడను, మారేడు దళములతోడను హోమముచేసిన త్వరలోనే సంపత్తును బొందును. సూర్యమండలమందు సూర్యోదయము మొదలు అస్తమయమువఱకు శ్రీరాముని సంవత్సర మారాధించినచో దేవదుర్లభమగు ఫలము లభించును. పాండిత్యము

చేతను, ఆధిపత్యము చేతను తనతోడివారిలో నుత్తమోత్తముఁడు కాఁగలఁడు. ఎవఁడు పూర్ణిమ దినమున చంద్రోదయము మొదలు చంద్రాస్తమయము వఱకు రాత్రిపూట ఒక సంవత్సరము వఱకు జపము చేసియు, నర్చనచేసియు, మఱునాఁడు పగలు హోమముచేసి బ్రాహ్మణులకు భోజనము పెట్టి వ్రతసమాప్తి చేయుచో సోమసూర్యాత్మకమగు నీవ్రతమును నెఱవేర్చుటవలన ఇహలోకమున భుక్తియు, పరలోకమున ముక్తియు నిస్సంశయముగ లభింపఁగలడు. ఎఱ్ఱ తామరలచేతను, బంధూక పుష్పములచేతను, ఎఱ్ఱకలువలచేతను హోమముచే నర్చించుచో కోరిన జనము వశులగుదురు. రాజ్యైశ్వర్యములు కాని, భోగములు కాని కావలసియుండిన లక్షజపము అనన్యమనస్కుఁడై చేసి పద్మముల చేతనుగాని, బిల్వపుష్పముల చేతనుగాని జపములో పదవవంతు హోమము చేయవలయును. సముద్రతీరములోఁగాని, ఆవులకొట్టములోఁగాని, కేవలము ఆవుపాలను పుచ్చుకొనుచు లక్షజపము కావించి, నేయి కలిపిన పాయసముతో తద్దశాంశము హోమముచేసిన విద్యానిధి కాఁగలఁడు. ఆధిపత్యమును బోఁగొట్టుకొన్నవాఁడు శాకాహారుఁడై నీటిలో నిలుచుండి లక్షజపముచేసి, మారేడు దళములతో పదవవంతు హోమముచేసిన మరల నిస్సంశయముగ నాధిపత్యము లభించును. మాఘమాసములో నీటిలోనిలుచుండి కందమూలాదులను భుజించుచు లక్షజపము కావించి పాయసముతో తద్దశాంశము హోమముచేసి, మిగిలిన పాయసమును దినిన ప్రియమగు పుత్రులు, పౌత్రులు కలుగుదురు.

ఇంకను శత్రు విజయము, శత్రు మారణాది ప్రయోగ విషయములు కలవు. అవి భక్తునకు పనిలేదు కావున వ్రాయుటలేదు.

## ౩. అచల జపము

ఈ జపము చేయువాఁడొక చోటనే కూర్చుండి, కదలక నిర్ణీత జప సంఖ్యను బూర్తి చేయనిది లేవనని హఠము వేసికొని కూర్చుండి జపింపవలయును. ఇట్టి జపము చేయువానికి ఆసన శుద్ధి మిక్కిలి అవసరము. స్వస్తికాసనమునఁ గనీసము మూఁడు నాలుగు గంటలు కదలక కూర్చుండఁ గలిగి యుండవలెను. వీనికి మంచి ఆరోగ్యము, మానసిక శాంతి, విశ్రాంతు లుండవలయును. వీనికి గోముఖము, జపమాల, జింకచర్మము లేక పులిచర్మము ఉండవలయును. జప సమయమున నిశ్చిత కాలము వఱకు ఆసనమును మార్చుటగాని, మాటలా

డుటగాని పనికిరాదు. ఎట్టి విఘ్నములు కలిగినను జపమునుండి లేవరాదు· కదలరాదు. మెదలరాదు. దీనికి ధైర్యము, వైరాగ్యము మిక్కిలి అవసరము. దీనివలన యమనియమ పాలనము సులభముగ కుదురును. ఆధ్యాత్మిక శక్తి అభివృద్ధియగును.

## ౪. చ ల జ ప ము

తినుచుఁ, త్రాగుచు, నిలుచుచుఁ, గూర్చుండుచు, మేల్కొనుచు, నిద్రించుచు, భోగములందును, విరాగము లందును, విరామములందు, అవిరామము లందును, జపమాలను గొనికొని, కైకొనక గాని జపింపవచ్చును. ఇది మానసికముగ నుండవలయును. రూపధ్యానమున్నను లేకున్నను బాధలేదు. ఈ జప సాధనకు మెడకు తగిలించుకొను జపసంచి యుండిన మిక్కిలి యుపయోగము. మాల పరుల కంటఁబడరాదు. దీనివలన వాక్సిద్ధి, వాక్శుద్ధి కలుగును. జపాభ్యాసము బాగుగా దృఢపడఁగలదు.

## ౫. భ్ర మ ర జ ప ము

తుమ్మెద ఝుంకారము చేయునట్లు జపము చేసిన దానిని భ్రమర జపమందురు. గాలిని లోనికి త్వరగాఁ బీల్చి మెల్లగా మంత్రమును జింతించుచు ఝుంకార శబ్దము చేయవలయును. ఇది విననఁగాని కుదురదు. పెదవులును, నాలుకయుం కదలవలసిన పనిలేదు. ఇట్లు మానసికముగ నీ భ్రమరనాదములోఁ గలిపి జపించుచు, భ్రూ మధ్యమున దృష్టినిలిపి, అచ్చట రూపమును జూచుచుండవలయును. ఈ శబ్దము వలన భ్రూ మధ్యమున నొక విధమగు స్పర్శజ్ఞానము Sensation) కలుగును. దానివలన మనస్సునకాహ్లాదము కలుగును. ఆనందము వృద్ధిచెందును. ఈ శబ్దము పరా వాక్ స్థానమున అనఁగా నాభియందు ఉద్భవించుచున్నది. పశ్యంతి స్థానమును (హృదయము) స్పర్శించుచు మధ్యమా వాక్ స్థానమగు కంఠప్రదేశమునఁ గొంతవఱకు సంకల్పరూపమున వ్యక్తమై వైఖరీ స్థానమగు నోటికుండా బయటకు వెడలును. దీనిని బూర్తిగా వైఖరి యని చెప్పుటకును వలను బడదు. ఈ జపము వలన మనస్సేకాగ్రమై ఆనందానుభూతిని జెందుటచే నిది తప్పక మంత్ర సాధకులచే నభ్యసింపఁ దగినది.

## ౧. అజపాజపము

వాత పిత్త శ్లేష్మములు సమాన స్థితిలో నుండు ఆరోగ్యవంతునకు దినము నకు ౨౧౬౦౦ ఉచ్ఛ్వాస నిశ్వాసములు జరుగుచుండును. అనఁగా, నిమిషము నకు ౧౫ శ్వాసలు జరుగుచుండును. జీవిత మీ యుచ్ఛ్వాసనిశ్వాసములను బట్టియే నిర్ణయింపఁ బడినది. ఇవన్నియు మనకు వ్యర్థమై పోవుచున్నవి. ఈ శ్వాసలమీఁద నిరంతరము జపము చేసిన శ్వాసలు 'శ్వాస శ్వాస పర కృష్ణకహో, వృథా న హోయ్ శ్వాస్' అన్నాఁడొక సాధువు. ప్రతిశ్వాసకు మంత్రమును జేర్చుటవలన, చివరశ్వాసకూడ మంత్రముతోడనే కావునఁ దాను మంత్రైక్యమునే చెందవచ్చును. దీనికి అజప అని పేరు. మంత్ర సాధనయు, నామ సాధనయుఁ జేయవలసినది ప్రాణము మీఁదనే. దీనికి మౌనమవసరము. నిద్ర నాలుగు గంటలకంటెఁ నెక్కువగఁ బోరాదు. ఇది అభ్యాసపడినకొలఁది నిద్రలోఁగూడ దానికదియే జపముసాగును. శ్వాసించుట, గుండెకొట్టుకొనుట మొదలగునవి మనకెఱుక యున్నను లేకున్నను ఎట్లు జరుగుచున్నవో, ఇదియు నట్లే జరగఁగలదు. ఒక్కొక్క శ్వాసకు ౪, ౫ సార్లు జపింపవచ్చును. దోషములేదు. దీనివలన నిరంతరము భగవత్స్మరణము ఉండి తీరును. పోనుపోను నిమిషమునకు ౧౫ శ్వాసలు క్రమక్రమముగా తగ్గి పోవును. నిమిషమునకు ౫ శ్వాసలలోనికి రాఁగానే శరీరస్మృతి పోవును. ఈజపము వలన విషయ విముఖతయు, నింద్రియ జయమును దానికదియే కలుగును. దీనికి దృఢసంకల్ప మవసరము.

## ౨. అఖండ జపము

ఈ జపమునకు ఉపక్రమణోప సంహారములు లేవు. ఈ జప సాధన చేయువాఁడు సాంసారిక కార్యములందు లగ్నమైన వాఁడుగా నుండరాదు. నిరంతరము జపము తప్పితే వీనికి వేఱొక సాధన లేనేలేదు. నిద్రలోఁగూడ వీనికి జపమే. అసలు వీనికి నిద్రయుండదు ఇట్టివాఁడు ప్రపంచము నంతయు మంత్రమయముగఁ జూడవలయును. తన శరీరము ఆత్మ వేయేల నున్నదంతయు మంత్రస్వరూపముతప్ప అన్యముగాదని భావించుచుండ వలెను. ఏ శబ్దము వినఁబడినను అది మంత్రశబ్దముగనే భావింపవలయును. సర్వకాల సర్వావస్థల

యందును వీనికి మంత్రము తప్ప వేఱొకటి గోచరింపరాదు. ఇట్లు శరీరము పడిపోవువఱకు మంత్రము తప్ప వేఱొకటి తాను కాదని భావింపవలెను.

## ౮. పంచాగ్ని జపము

గ్రీష్మకాలమున పంచాగ్ని మధ్యమునఁ గూర్చుండి యెండలోఁజేయు జపమునకు పంచాగ్ని జపమని పేరు. దీనివలన నుష్ణ సహిష్ణుత కలుగును.

## ౯. ప్రదక్షిణ జపము

యథా శాస్త్రీయముగ జపమును ప్రారంభించి దైవ విగ్రహము, సాల గ్రామము, దేవాలయము, రావిచెట్టు, సద్గురువు, సాధుమఠము చుట్టును ప్రద క్షిణము చేయుచుండవలయును. ఒక్కొక్క ప్రదక్షిణమున కింత జపమని నిర్ణ యించుకొని చేయుటవలన మిక్కిలి మేలుకలదు. దీనివలన సమస్తగ్రహములు, యక్షరాక్షస పిశాచాదులు తొలఁగిపోవుటయే గాక మంత్రసిద్ధియు త్వరగ లభింపఁగలదు. ఇది నిస్సంశయము. ప్రదక్షిణములు ౧౦౮ యో ౧౦౦౮ యో ఒకనిర్ణయము ననుసరించి చేయవలయును. పైనఁజెప్పిన వన్నియు శ్రీరామ స్వరూపములే యనియు, తాను ఆరూపములతో నున్న శ్రీరామచంద్రునకే ప్రదక్షిణము చేయుచున్నాననియు భావింప వలయును.

## ౧౦. శ్రవణ జపము

దీనికి మాల అవసరము లేదు. లెక్క అవసరము లేదు. సంకల్ప మవస రము లేదు. కేవలము మానసికము, అయితే ఏకాంత స్థలము కావలయును. విషయ విరాగమును జెంది కేవలము మంత్రమును గుడిచెవితో వినఁబ్రయత్నింప వలయును. ఇట్లు వినఁబ్రయత్నించు కొలఁదియు బాహ్యస్మృతి పోయి, నీలో నుండి కేవలము సంకల్ప భావనారూపమున వెలువడుచున్న పరాశబ్ద స్వరూప మగు రామమంత్రమే చెవులకు స్పష్టముగ వినఁబడఁ గలదు. ఇది చాల గొప్ప సాధన. నీవు నోటితో జపింపవలసిన పనియే లేదు, ఎవరో యింకొకరు పలికినట్లు చెవులకు వినఁబడు చుండును.

ఈ సాధన లన్నియుం గాని, లేక అనుకూలములగు కొన్నిటినిగాని అనుష్ఠానములోఁ బెట్టుకొనవలెను. జపమైన తర్వాత మరల అంగన్యాస కర

న్యాసాదులను జెప్పిదిగ్విమోకము కావించి శ్రీరామార్పణమని నీరు వదల వలెను. పురశ్చరణ ఒక్కసారైనను జేయనిదే మంత్రసిద్ధికాదు.

# పురశ్చరణము

## పురశ్చరణ మనఁగా నేమి?

శ్లో॥ పూజా త్రైకాలికీ నిత్యం జపస్తర్పణ మేవచ
హోమో బ్రాహ్మణ భుక్తిశ్చ పురశ్చరణ ముచ్యతే॥

ప్రతిదినము మూఁడు పూఁటలందు దేవపూజయు, జపము, తర్పణము, హోమము, బ్రాహ్మణ భోజనమును నీయైదింటికి పురశ్చరణ మని పేరు.

దీనికే పంచాంగోపాసన మనియుఁ బేరు కలదు. వేఱొక శాస్త్రరీత్యా పూజాపూర్వక (౧) జప (౨) హోమ (౩) తర్పణ (౪) మార్జన (౫) బ్రాహ్మణ భోజనమను నీయైదును బురశ్చరణమని పిలువఁబడుచున్నవి. వీనికిఁ బంచాంగోపాసన మని పేరు.

శ్లో॥ పంచాంగోపాసనేనైవ రామం సంపూజ్య భక్తితః
పంచాంగోపాసనం భక్త్యా పురశ్చరణ ముచ్యతే॥
ఏతద్ధి విదుషాం శ్రేష్ఠం సంసారోచ్ఛేదకారణమ్
నానేన సదృశో ధర్మో నానేన సదృశం తపః॥
నేదృశం సాధనం కించి ద్విష్టార్థస్య తపోధనమ్॥

పంచాంగోపాసన (జప, తర్పణ,హోమ, మార్జన, బ్రాహ్మణభోజన) ము చేతనే రాముని బూజింపవలెను. భక్తితోఁజేసిన పంచాంగోపాసనమునకే పురశ్చరణమని పేరు. 'పంచాంగోపాసనేన స్వేష్టదేవతా ప్రీతమానసా భక్తజనాగ్రే సంచరతీతి పురశ్చరణమ్' అనఁగాఁ బంచాంగోపాసనముచే స్వేష్టదేవతా ప్రీతమానసుఁడై భక్తుల ముందు సంచరించుటకు పురశ్చరణమని పేరు.

పురశ్చరణము చేయనిది మంత్రసిద్ధి కానేరదు. ఇష్టదేవతా ప్రసన్నత పురశ్చరణము వలననే కలుగుచున్నది. తనంతటఁ దాను అడుగక లభించిన

మంత్రమునకును, మోసము మంత్రమునకును, కపటముగఁ జెప్పిన మంత్రము నకును పరీక్షార్థము తెలిసికొనినదియు, స్నేహము చేతను, లోభము చేతను, భయము మొదలగు వానిచేతను లభించినదియుఁ బుస్తకములలోఁజూచి నేర్చిన మంత్రములను, అరిమంత్రములను బురశ్చరణము చేయరాదు. చేసినను ఉప యోగము లేదు.

సద్గురువు నాశ్రయించి మనోవాక్కాయకర్మలందు గురువును చతుర్విధ శుశ్రూషలచే సేవించుటచే లభించిన మంత్రమునే పురశ్చరణ చేయవలెను. పురశ్చరణకు చాతుర్మాస్యలు, అధికమాసము, క్షయమాసము, పుష్యమాసము (కృష్ణమంత్రమునకు చైత్రమాసము, శక్తిమంత్రము విషయమున మకరసంక్రాం తిని) వదలి (శక్తి విషయములో చాతుర్మాస్యలు పనికివచ్చును.) సర్వమంత్ర ములకు చైత్ర, వైశాఖ, శ్రావణ, ఆశ్వీజ, కార్తీక, మార్గశిర, మాఘ, ఫాల్గుణ మాసాది శుభమాసములందు, సుభిక్ష దేశమందును, సద్భక్తులు, సాధుసంత పురుషులు నివసించెడి ప్రదేశమందును, ధార్మిక రాష్ట్రమందును, నాస్తికులు, మ్లేచ్ఛులు, చోరులు, సింహవ్యాఘ్రాది దుష్టమృగములు, పాములు, తేళ్లు, చీమలు, చెదలు, దోమలు, అతిశయముగ నీఁగలు, గోమారులు, మిణ్ణులులు మొదలగు జంతువులు బాధించని స్థలమందును, నతిశయముగ జనసమ్మర్దమున్న చోటను, మలమూత్రాది యసహ్య పదార్థములచే దూషితముకాని స్థలమందును, సర్వనిందారహితమైన స్థలమందును బురశ్చరణ చేయవలయును.

రాజస్థానము దగ్గఱను, రాజ పురుషులుండు చోటను, రాజమార్గముల సమీపమునను, జీర్ణ దేవాలయమందునను, జీర్ణోద్యాన జీర్ణగృహములందును జపము చేయరాదు. చెట్టుక్రిందగాని, చెట్టు తొఱ్ఱలోఁగాని, నదులందుఁగాని, భావి లోఁగాని, నేలబొరియలలోఁగాని జప పురశ్చరణము చేయరాదు. పర్వతాగ్ర మందును, నదీతీరమందును, బిల్వమూలమందును, జలాశయము దగ్గఱను, ఆవుల కొట్టమందును, దేవాలయమందును, రావిచెట్టు, ఉసరిక చెట్టు దగ్గఱను, నుద్యాన వనమందును, పుణ్యక్షేత్రమందును, తీర్థప్రదేశమందును, సముద్ర నదీ సంగమమందును, నదీ సముద్ర సంగమందును, సముద్ర సముద్ర సంగమమందును, పర్వత తటమందును, స్వగృహమందును, గురుగృహమందును, గొప్పసాధు భక్త మహాపురుషుని గృహమందును, సూర్యచంద్రాగ్ని సన్నిధియందును, గురు, గో బ్రాహ్మణ సన్నిధియందును, చిత్తము ప్రసన్నముగ నుండు స్థానము

నను, పురశ్చరణ మవశ్యము చేయవలెను. ఒకవేళ పర గృహము, పరస్థలమైన నాయా యజమానులకు నేదో కొంత ద్రవ్యమిచ్చి యచ్చట స్వత్వము సంపాదించుకొని జపము చేయవలయును. లేకున్న జపమునకు విఘ్నము రావచ్చును. అదియునుగాక కొంతఫలము స్థలాధికారికి పోవుట తథ్యము.

## పురశ్చరణ కాలము

పైనఁజెప్పిన స్థానములలో శుభమాసమున శుక్ల పక్షమున చంద్రబలము తారాబలము చూచుకొని శుభదినమున శుభలగ్నమునఁ బురశ్చరణము ప్రారంభించవలెను. తిథులలో విదియ, తదియ, పంచమి, షష్ఠి, సప్తమి, దశమి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, పూర్ణిమలు మంచివి. వారములలో సోమ, బుధ, గురు, శుక్రవారములు మంచివి. నక్షత్రములలో అశ్విని, రోహిణి, మృగశిర. పునర్వసు, పుష్యమి, ఉత్తర, మఖ, పుబ్బ, హస్త. చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శతభిషము, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి యివి మంచివి.

యోగములలో సిద్ధి, ఆయుష్మాన్, ధ్రువము, ప్రీతి, సౌభాగ్యము, వృద్ధి, హర్షము మంచివి.

కరణములలో కౌలవము, తైతిలము, బవ, వణిజ ఇవి మంచివి. లగ్నములలో వృషభము, సింహము, కన్య, ధనుస్సు, మీనము వీటిలో చంద్రబలము తారాబలము చూచుకొనవలెను. పక్షములలో శుక్లపక్షము ముఖ్యము, కృష్ణపక్షమున పంచమి వఱకును బనికి వచ్చును.

## మంత్రసిద్ధి కలుగుటకు కారణములు

శ్లో॥ ఉపదేశస్య సామర్థ్యా చ్ఛ్రీగురోశ్చ ప్రసాదతః
మంత్ర ప్రభావాద్భక్త్యాచ మంత్ర సిద్ధిః ప్రజాయతే॥

గురువు చేయు శక్తిపాతాది యుపదేశ సామర్థ్యమువలనను, సద్గురువు యొక్క ప్రసాదము వలనను, అసలు మంత్రములోగల శక్తిప్రభావము వలనను, మంత్రసిద్ధి కలుగును.

శ్లో॥ నిశ్చయోత్సాహ ధైర్యైశ్చ తత్త్వజ్ఞానస్య దర్శనాత్
అల్పాశీ త్యక్తసంగశ్చ షడ్భిర్మంత్రః ప్రసిద్ధ్యతి॥

నిశ్చయము, ఉత్సాహము, సిద్ధించుననను ధైర్యము, తత్త్వజ్ఞానదర్శనము, అల్పాహారమును గొనుట, విషయసాంగత్యమును వీడుట యను నీయాఱింటి వలనను మంత్రము త్వరగా సిద్ధించును.

ఈ క్రింద నుదాహరించిన కారణముల వలన మంత్రము సిద్ధింపదు.

శ్లో॥ ప్రవాసీ బహుభక్షీచ ప్రజపీ నియమాపహః
నీచ సంగాచ్చ లౌల్యాచ్చ షడ్భిర్మంత్రో న సిద్ధ్యతి॥

ప్రవాసము చేయుట, అధికముగఁదినుట, గబగబ లెక్కలేకుండ జపించుట పాలనము చేయకపోవుట, నీచులతో సాంగత్యము చేయుట, విషయ లోలత్వము ఈ యాఱింటి వలనను మంత్రము సిద్ధింపదు.

అరి (వైరి) మంత్రమును జపింపరాదు కావున సిద్ధ, సాధ్య, సుసిద్ధ, అరి మంత్రమేదియో ముందు చూచుకొనవలయును. దీనికై యీ గ్రంథములోనే సిద్ధారి చక్ర శోధన ప్రకరణమును గాంచుఁడు. రామ మంత్రమునకు సిద్ధారి చక్రశోధన అవసరము లేదు. సాధకుల ఉపయోగము కొఱకు ఏయే మంత్రములకు శోధన అవసరములేదో యీ క్రింది శ్లోకముల వలనఁ దెలియఁగలదు.

శ్లో॥ స్వప్నదత్తం దైవతత్తం స్త్రీదత్తం గురుదత్తకమ్
పితృదత్తం మాతృదత్తం సిద్ధాదీని నశోధయేత్॥
పీఠత్రయాణి మంత్రాణి మంత్రాణి ప్రణవ బీజకాః
స పిండ్యాక్షర మంత్రాణి సిద్ధాదీని న శోధయేత్॥
నృసింహంచ వరాహంచ వాసుదేవంచ వైష్ణవమ్
ఏకాక్షరీం త్ర్యక్షరీంచ సిద్ధాదీని నశోధయేత్॥
గోపాలం వామనం రామం భాస్కరంచ సుదర్శనమ్
నామత్రయం కార్యవతీం సిద్ధాదీని నశోధయేత్॥
అంజనేయం హయగ్రీవం దక్షిణామూర్తి మంత్రకమ్,
చింతామణిం గణేశంచ సిద్ధాదీని నశోధయేత్॥

బాలాం పంచదశీం చైవ షోడశీం శివతారకమ్,
నారాయణంచ పంచైతాన్ సిద్ధాదీని నశోధయేత్॥
లక్ష్మీం వాగీశ్వరీం దుర్గాం పార్వతీం భువనేశ్వరీం,
శ్రీవిద్యాం సిద్ధవిద్యాంచ సిద్ధాదీని నశోధయేత్॥
ప్రణవాద్యంచ స్వాహాంతం ప్రాసాదాద్యం క్రమాగతమ్,
గాయత్రీం వేదమంత్రాణి సిద్ధాదీని నశోధయేత్॥
సార్పంచ గారుడం చైవ భాషామంత్రంచ శాంబరమ్,
పంజరం కవచం మాలా సిద్ధాదీని నశోధయేత్॥
అర్వాణార్థంతు మంత్రాణాం ప్రణవస్తు ప్రయుజ్యతే,
తస్మాత్ప్రణవ యుక్తాని సిద్ధాదీని నశోధయేత్॥

స్వప్నములో వచ్చినదియు, దైవమిచ్చినదియు, స్త్రీ యిచ్చినదియు, గురు అనుగ్రహించి యిచ్చినదియు, తండ్రి యిచ్చినదియు, తల్లి యిచ్చినదియు నగు మంత్రములకు సిద్ధాదులను శోధించరాదు. పీఠత్రయముగల మంత్రములకును, ఓంకారము మొదలగు బీజములుగల మంత్రములకును, సపిండ్యాక్షరములు గల మంత్రములకు సిద్ధాది శోధనము అక్కరలేదు నృసింహ,వరాహ,వాసుదేవ, విష్ణు మంత్రములకును ఒకే అక్షరము, మూడే అక్షరములు గల మంత్రములకును సిద్ధాది శోధనము చేయవలసిన పనిలేదు. గోపాల, వామన. రామ, భాస్కర, సుదర్శన ,నామత్రయ మంత్రములకు (హరే రామ కృష్ణ) కార్యవతీ మంత్రము నకును, వీనికి సిద్ధాది శోధనము చేయవలసిన పనిలేదు, ఆంజనేయము, హయ గ్రీవము, దక్షిణామూర్తి, చింతామణి, గణేశ మంత్రములకు సిద్ధాది శోధనపనికి రాదు. బాలపంచదశాక్షరీ, షోడశాక్షరీ, శివతారకము, నారాయణ అష్టాక్షరీ యను నీ యైదు మంత్రములకును, సిద్ధాదిశోధన మవసరము లేదు. లక్ష్మి, సర స్వతీ, దుర్గా, పార్వతీ, భువనేశ్వరీ, శ్రీవిద్యా, సిద్ధవిద్యాది మంత్రములకు సిద్ధాది శోధన మక్కరలేదు. ఓంకారము మొదట కలవి స్వాహాకారము చివర కలవి, శ్రీకారము మొదటగల మంత్రములకును, గాయత్రీ మొదలగు వేదమంత్రములకును, సిద్ధాది చక్ర శోధన మక్కరలేదు. సర్ప, గరుడ, భాషా మంత్రములకును, శాంబరము, పంజర కవచములకును, అనేక బీజాక్షరములుగల

మాలామంత్రములకును సిద్ధాది శోధనము చేయవలసిన పనిలేదు. అర్వాణదోష ములు వచ్చునేమోనని మంత్రములకు మొదట ప్రణవమును బెట్టుచుందురు. కాఁబట్టి ప్రణవమున్న మంత్రములకు సిద్ధాదిశోధనము చేయనక్కఱలేదు.

జ ప మా ల

శ్లో॥ స్ఫాటిక మౌక్తికీ వాపి ప్రోతవ్యా సితసూత్రకైః
సర్వకర్మ సమృద్ధ్యర్థం జపేద్రుద్రాక్ష మాలయా॥
శ్లో॥ ధర్మార్థ కామ మోక్షార్థ జపేత్పద్మాక్ష మాలయా,
అరిష్ట పుత్ర జీవైశ్చ శంఖః పద్మమణి స్తథా॥
శ్లో॥ కుశగ్రంథిశ్చ రుద్రాక్ష ఉత్తమం చోత్తరోత్తరమ్॥ (మంత్ర ఖండము)

స్ఫటికములు, ముత్యములు, రుద్రాక్షలు వీటిని తెల్లదారములతోఁ కూర్చి సర్వకర్మ సమృద్ధి కొఱకు జపింపవలయును.

ధర్మార్థ కామమోక్షములను చతుర్విధ పురుషార్థముల నపేక్షించు వాఁడు పద్మాక్షమాలతోను, అరిష్ట, పుత్రజీవి, శంఖములు, పద్మమణులు, కుశగ్రంధి, రుద్రాక్ష వీనితో జేసిన మాలచే జపింపవలయును. వీనిలో నొకదాని కంటె నొకటి వరుసగ శ్రేష్ఠమైనవి.

శ్లో॥ రుద్రాక్ష శ్వేత పద్మాక్ష మాలాభ్యా మఖిలం జపేత్॥

రుద్రాక్ష మాలతోను, తెల్లతామర పూసల మాలలతోను అన్నిమంత్ర ములను జపించవచ్చును.

ఒకవేళ పైనఁజెప్పిన పూసలు లభింపకున్న కరమాలతోఁ జేయవచ్చును.

శ్లో॥ అలాభే జపమాలాయాః కరశాఖాసు పర్వభిః,
అనామికాయా మో మధ్య స్తస్మాదధః క్రమేణతు॥

మధ్యాంగుళ్యగ్ర పర్వాది ప్రాదక్షిణ్యా క్రమేణతు,
తర్జన్యాదౌ జపాంతశ్చ అక్షమాలా కరేస్థితా॥

అంగుళ్యగ్రేతు యజ్జప్తం యజ్జప్తం మేరులంఘనే,
అసంఖ్యాకంతు యజ్జప్తం తత్సర్వం నిష్ఫలం భవేత్॥

మధ్యమాది ద్వయం పర్వ జపకాలేతు వర్జయేత్,
పర్వమేరుం విజానీయా త్తస్మాత్తత్పరి వర్జయేత్॥

జపమాల దొరకకున్నచో వ్రేళ్ళకణుపులపై జపించ వలయును, అనామిక యొక్క మధ్యకణుపు మొదలుకొని క్రిందుగా చిటికెనవ్రేలి మీఁద లెక్కపెట్టుచుఁ బ్రదక్షిణముగా ననామిక పైగణుపు, మధ్యమయొక్క పైగణుపు, చూపుడువ్రేలి మీఁద పైనుండి క్రిందవఱకు జపించిన పదియగును కరమాల వ్రేళ్ళకొనల మీఁద చేసిన జపమున్ను, మేరువుదాఁటి చేసిన జపమున్ను, లెక్కలేకుండ చేసిన జపమున్ను నిష్ఫల మగును. మధ్యవ్రేలియొక్క మొదటి రెండు గణుపులు వదల వలయును. అవి కరమాలకు మేరువు.

ఇఁక నేమాలతో జపించిన నెంత ఫలమో చెప్పఁబడు చున్నది.

శ్లో॥ అంగుళ్యా జపసంఖ్యాన మేకమేక ముదాహృతం,
రేఖయాఽష్ట గుణం విద్యా త్పుత్ర జీవైర్దశస్మృతం॥
శతం చందన శంఖైశ్చ ప్రవాళైస్తు సహస్రకం
స్ఫటికై రష్ట సాహస్రం మౌక్తికై ర్లక్ష మేవచ॥
దశలక్షం రాజతాక్షై స్స్వర్ణైః కోటిరుచ్యతే
కుశగ్రంథ్యాచ రుద్రాక్షై రనంత గుణితో భవేత్॥

వ్రేళ్లమీఁద చేసిన జపమెంతయో అంతేఫలము లభించును. వ్రేళ్ల కణుపుల మీఁద జపించిన దానికంటె నెనిమిది రెట్లు ఫలము వచ్చును. పుత్రజీవి కట్టెతోఁ జేసిన పూసలతో జపించినఁ బదిరెట్లెక్కువ ఫలము. చందనపు పూసలతోఁగాని శంఖములతోఁగాని జపించిన నూఱురెట్లు ఫలము. పగడములతో వేయిరెట్లు. స్ఫటికములచే జపించిన నెనిమిదివేల రెట్లును, ముత్యములతో జపించిన లక్షరెట్లును, వెండిపూసలతో జపించినఁ బదిలక్షలరెట్లున్ను, బంగారుపూసలతో జపించిన కోటిరెట్ల ఫలమును దర్భముడులతోగాని రుద్రాక్షలతోఁగాని జపించిన ననంత గుణితమును ఫలము లభించును.

పైవాటి అన్నిటికంటె విష్ణుప్రీతికరమైనది తులసి. తులసి పూసలను ధరించుచుఁ దులసీమాలతో జపించిన దాని ఫలమును వర్ణింప నేరికిని శక్యము

కాదు. ఈ తులసిని గూర్చి వేలుగ్రంథము వ్రాయఁబడుచున్నది. దాని మహిమను గూర్చి దానిలో సమగ్రముగఁ దెలియవచ్చును.

శ్లో॥ తులసీ కాష్ఠ ఘటితైర్మణి భిర్జపమాలికా
సర్వకర్మణి సర్వేషా మీప్సితార్థ ఫలప్రదా॥

తులసీ కట్టెతోఁ జేయఁబడిన పూసలచే కట్టిన జపమాలిక సమస్త కోరికలను బ్రసాదించును.

జపమాలకు ౧౦౮ పూసలుండుట చాల అవసరము. ఏఁబదినాలుగు కాని, ఏఁబదికాని, ముప్పదియాఱు కాని, ఇరువదేడు కాని, ఇరువదైదు కాని పూసలుండవచ్చును.

శ్లో॥ అష్టోత్తర శతైర్మాలా పంచాశచ్చతురుత్తరైః
సప్తవింశతిభిః కార్యా ఏకగ్రీవా సమేరుకా॥

నూటయెనిమిది పూసలుగల మాలగాని, ఏఁబదినాల్గు పూసలమాలగాని, ఇరువదేడు పూసల మాలగాని చేర్చి మాల కూర్చవలెను. దానికొక మేరుపూస యుండవలయును.

శ్లో॥ త్రింశద్భి స్స్యాద్ధనం పుష్టి స్సప్త వింశతి భిర్భవేత్
పంచవింశతి భిర్మోక్షే పంచదశ్యాభి చారికే॥
పంచా శద్భిః కులేశాని సర్వసిద్ధి రుదాహృతా॥

ముప్పది పూసల మాలవలన ధనమున్నూ, ఇరువదేడు పూసలమాలవలనఁ బుష్టియున్నూ, ఇరువదైదు పూసల మాలవలన మోక్షమున్నూ కలుగును. అభిచారములో పదునైదు పూసలుండవలెను. ఏఁబది పూసల వలన సర్వసిద్ధియున్నూ కలుగును.

## మాలాసంస్కారము

మాలను సంస్కరించనిది జపమునకుఁబనికి రాదు. ఒకవేళ చేసినను నిష్ఫలమగును. 'ప్రోతత్వా పితసూత్రేణ సత్కర్మ ఫలసిద్ధయే' యని చెప్పుటచే జపమాలను తెల్లని దారముతో గ్రుచ్చవలయు ననియును, దాని వలన సత్కర్మ ఫలసిద్ధి కలుగుననియుఁ దెలియవలెను. జందెముల దారము గ్రుచ్చుట శిష్టాచా

రము. బజారు దారమంత శ్రేష్ఠముకాదు. ఇట్లు గ్రుచ్చిన తర్వాత మాలా సంస్కారము కావింప వలయును. సంస్కార పద్ధతి వేఱొకచోటఁ జెప్పఁ బడినది. మఱల నిచ్చట సూక్ష్మముగ జెప్పఁబడు చున్నది.

శ్లో॥ ప్రక్షాళ్యం పంచ గవ్యేన తథా పంచామృతేన చ
సంస్నాప్య పంచ గవ్యేన శివకుంభ స్థితేన చ॥
సర్వం వై మూల మంత్రేణ గంధపుష్పాక్షతాదిభిః,
ధూపం దీపంచ నైవేద్యం దత్వా చాష్టశతం స్పృశేత్॥
మూల మంత్రం జపేత్పశ్చా ద్దండవత్ప్రణమే ద్బుధః,
ఏవం యా సంస్కృతా మాలా జపకర్మణి సర్వదా॥
అభీష్ట ఫల దాత్యర్థం సా సర్వాఘ వినాశినీ॥

ఆవు పాలు, ఆవు పెరుగు, ఆవు నేయి, ఆవు పేడ, ఆవు పంచతము (గో మూత్రము) ఇవి పంచగవ్యములు, వీనిచే మాలను కడుగవలయును. తర్వాత ఆవు పాలు, ఆవు పెరుగు, ఆవునేయి, తేనే, చక్కెర అనునీ పంచామృతములచేఁ గడుగ వలయును. తర్వాత దానినొక క్రొత్త కుండలో మఱల పంచగవ్యములో మాలను స్నానము చేయించి మూలమంత్రముతో నన్ని యుపచారములు చేయు చుండవలయును. గంధము, పుష్పము, అక్షతలు, ధూపము, దీపము, నైవేద్యము ఇవన్నియు మూల మంత్రముతోడనే చేయవలయును. తర్వాత నూటయెనిమిది పూసలను మూలమంత్రముతో (అక్షమాలికోపనిషత్తు ప్రకారము ఒక్కొక్క అక్షరమును ఒక్కొక్క పూసపై ప్రతిష్ఠంచవలెను.) జపించుచు తాఁకవలెను. తర్వాత శుద్ధోదకముచేఁ గడిగి మూలమంత్రమును ౧౦౮ జపించవలెను. తర్వాత నా మాలకు సాష్టాంగ నమస్కారము చేయవలసి యుండును. ఇట్లు సంస్కరింపఁబడిన మాల జపము నందుపయోగించినఁ గోరిన కోరిక లొసంగును. సమస్త పాపములను బోఁగొట్టును.

పురశ్చరణ జపమును బ్రారంభించుటకు ముందు గుర్వనుజ్ఞను గైకొని ఆయన సమ్మతి మీఁద జపమును బ్రారంభింప వలయును. జప ప్రారంభమున గురువునకు పాదపూజాదులు కావించి వస్త్రాద్యలంకారముల చేతను దక్షిణల చేతను గురువును సంతోష పరుపవలయును. గురువు సంతోషించిననే భగవం

తుఁడు సంతసించును. భగవంతుఁడు ప్రసన్నుఁడు కాకున్నను గురువు ప్రసన్నుఁడైన జప ఫలము నీయఁగలఁడు. భగవంతుఁడు ప్రసన్నుఁడైనను గురువు ప్రసన్నుఁడు కాకున్న జపఫలము రాదు.

## భూ, పీఠ, భూత శుద్ధులు

ముందుగా జపము చేయు స్థలము శుద్ధి కావలయును. తర్వాత మనము కూర్చుండు స్థలము (పీఠము) శుద్ధి కావలెను. తర్వాత మన శరీరములోఁగల పంచభూతములు శుద్ధి కావలయును.

## భూ శుద్ధి

శ్లో॥ పృథ్వీత్వయా ధృతాలోకా దేవీ త్వం విష్ణునాధృతా
త్వం చ ధారయ మాం దేవి పవిత్రం కురు చాసనమ్॥
(అని నీటిని భూమిమీఁద చల్లవలయును.)

## పీఠ శుద్ధి

"ఆసన మంత్రస్య మేరుపృష్ఠ ఋషిః, సుతలం, ఛందః, శ్రీకూర్మో దేవతా, ఇష్టదేవతా మహామంత్రస్య ఆసనాయ ఆసనోపవేశనే వినియోగః—

(తర్వాత కూర్మయంత్రమును లిఖించి నమస్కరించవలెను.)

## కూర్మ యంత్రము.




శ్లో॥ కురుక్షేత్రే ప్రయాగేచ – గంగాసాగర సంగమే,
మహాకాశేచ కాశ్యాంచ – కూర్మస్థానం న చింతయేత్॥

ఈ కూర్మచక్రము విషయము కురుక్షేత్రము, ప్రయాగ, గంగాసాగర సంగమము, అవంతి (ఉజ్జయిని) కాశీ ఈ మొదలగు పుణ్యస్థలములలోఁ జింతించ వలసిన పనిలేదు.

ఓం హ్రీం ఆధారశక్త్యై నమః, కమలాసనాయ నమః, అనంతాసనాయనమః, పద్మాసనాయనమః, కూర్మాసనాయనమః, ఓం గుం గురవేనమః, ఓం పం పరమ గురవేనమః, ఓం పరాపరగురవేనమః (అని గురువును ధ్యానించి)

(అనంతరము సపరివారముగా ఇష్టదేవతకు నమస్కరించి)

ఓం దుం దుర్గాయైనమః, ఓం గం గణపతయే నమః.

ఓం క్షుం క్షేత్రపాలకాయనమః, ఓం సం సరస్వత్యైనమః.

(అని పై దేవతలకు నమస్కరించి)

ఈ క్రింది మంత్రములతో నెనిమిది దిక్కులకు నమస్కరించవలెను.

ఓం బ్రహ్మతేజసే-ఈం ఇంద్రాయనమః (తూర్పు) ఓం బ్రహ్మతేజసే రాం ఆగ్నేయాయనమః (ఆగ్నేయము) ఓం బ్రహ్మతేజసే సాం యమాయనమః (దక్షిణము) ఓం బ్రహ్మతేజసే హాం నిరృతయే నమః (నైరృతి దిక్కు) ఓం బ్రహ్మతేజసే ళాం వరుణాయనమః (పడమర) ఓం బ్రహ్మతేజసే క్షాం వాయవే నమః (వాయవ్యము) ఓం బ్రహ్మతేజసే రాం కుబేరాయనమః (ఉత్తరము) ఓం బ్రహ్మతేజసే హాం ఈశానాయనమః (ఈశాన్యము) శం, హం, షం, సం, శం, వం, లం, రం, అని సంసర్గాగ్ని బీజములచే అగ్ని ప్రాకారమును కల్పించవలెను.

## భూతశుద్ధి

యం అను వాయుబీజమును ౧౬ సార్లు మనస్సుతో జపించుచుఁ బూరించి, రం అను అగ్ని బీజాక్షరముతో ౬౪ సార్లు జపించుచుఁ గుంభించి, ఠం అను అమృతబీజముచే ౩౨ సార్లు జపించుచు రేచించవలెను. ఇట్లు ప్రాణాయామము చేయుటకుముందు ధర్మము దుంపగాను, జ్ఞానమే నాళముగాను, అష్టైశ్వర్యములే అష్టదళములుగాను, వైరాగ్యమే కర్ణికగా నుండి ముడిచుకొనియున్న హృత్పద్మమును ప్రణవముచే వికసించినట్లు భావించి, సుషుమ్నా నాడిద్వారా జీవుని తీసుకొనిపోయి సహస్రారమందున్న పరమాత్మతో 'హంస'

యను మంత్రముతో సేకముచేసి స్వశరీరముతో నున్న పాపపురుషుని బ్రహ్మహత్యయే శిరస్సుగాను, బంగారు దొంగిలించుటయే రెండు భుజములుగాను, సురాపానమే హృదయముగాను, గురుతల్పమే కటిద్వయముగాను, తత్సహవాసమే రెండు పాదములుగాను, ఇతర పాతకములు అవయవములుగాను, ఉపపాతకములు రోమములుగాను, ఎఱ్ఱని మీసములు, ఎఱ్ఱని కండ్లు కలిగి, ఖడ్గ, చర్మముల ధరించి నల్లగా నున్నవానిగా నెడమ భాగమున నున్నట్లు స్మరించి ఆ పాపపురుషుని పైనఁ జెప్పిన 'యం' అను వాయుబీజముచే ఎండించి, 'రం' యను అగ్నిబీజముచే కాల్చి, 'వం' అను అమృత బీజముచే మరల నిష్కల్మషునిగా భావించి మరల నా జీవుని సుషుమ్నా మార్గముగుండా హృదయకమలములోనికి 'ఓం సోహమ్' అను మంత్రముతో స్థాపించవలయును. (ఇది క్లుప్త పద్ధతి.)

## ఆసనములు

ఆసనము పరచుటకు ముందు పుణ్యాహవాచనము చేయుట మంచిది. తర్వాత వెనుక చెప్పిన భూశుద్ధ్యాదులు జరుపవలయును. ఆసనము క్రింద కూర్మచక్రము వేసికొనవలెను, కొందఱు దీపస్థానమునందు కూర్మచక్ర ముండవలెనని చెప్పుదురు. జాపకుని నావాక్షర మేగడిలో నుండునో అచ్చట పీఠము నుంచవలయును. పర్వత నదీసింధు తీర్థములందును, పుణ్యాశ్రమము, దేవాలయాదులందును కూర్మచక్రలేఖనము చేయరాదు. దివ్యాంబర గంధపుష్పాదులను అలంకరించుకొనవలయును. ఆసనములలో ఈక్రింది యాసనములు శ్రేష్ఠములు.

శ్లో॥ వంశాశ్మ ధరణీదారు తృణ పల్లవ నిర్మితః
వర్జయే దాసనం ధీమాన్ దారిద్ర్య వ్యాధిదుఃఖదమ్॥
మూలకంబర వస్త్రాణి పట్టవ్యాఘ్ర మృగాజినమ్
కల్పయే దాసనం ధీమాన్ సౌభాగ్య జ్ఞాన సిద్ధిదమ్॥

వెదురు చాప, ఱాయి, నేల, కొయ్య, తృణములు, చిగురుటాకులు వీనితో నిర్మింపఁబడిన యాసనములను విడువవలెను. ఇవి దారిద్ర్యమును, వ్యాధిని, దుఃఖమును గలిగించును. సౌభాగ్యమును, జ్ఞానమును సిద్ధింపఁజేయు

నటువంటి ప్రేళ్లు, కంబళము, వస్త్రము, పట్టము, పులిచర్మము, జింకచర్మవు పీటిని ఆసనములుగ నేర్పఱచుకొన వలయును.

ఏ యాసనమును వేసికొనిన నేమి ఫలమో చెప్పఁబడు చున్నది.

శ్లో॥ వంశాసనే దరిద్రత్వం పాషాణే వ్యాధి సంభవః
ధరణ్యాం దుఃఖ సంభూతి ర్దౌర్భాగ్యం దారుకాసనే॥
తృణాసనే యశోహానిః పల్లవే చిత్త విభ్రమః
కృష్ణాజినే జ్ఞానసిద్ధిః మోక్షశ్రీర్వ్యాఘ్ర చర్మణి॥
స్యాత్పుష్టిః కేచ కౌశేయం కంబళేదుఃఖ మోచనమ్
స్యాదాభిచారికం నీలే రక్తే వశ్యాదికం భవేత్॥
ధవళే శాంతికం మోక్షః సర్వార్థశ్చిత్ర కంబళే
సర్వాభావే త్వాసనార్థం కుశవిష్టరి మిష్యతే॥

వెదురు చాపపై దరిద్రమును, ఱాతి యందు వ్యాధియు, భూమిమీఁద దుఃఖమును, కొయ్యమీఁద దౌర్భాగ్యమును, తృణాసనము వలన యశో హానియు, చిగురుటాకులపై చిత్తవిభ్రమమును కలుగును. కృష్ణాజినమున జ్ఞాన సిద్ధియును,పులిచర్మమున మోక్షలక్ష్మియు, దర్భాసనమునఁ బుష్టియు, కంబళము ందు దుఃఖము పోవుటయుఁ గలుగును. నీల వస్త్రము అభిచారములందును, ఎఱ్ఱని వస్త్రమును వశ్యాదికములందును, తెల్లని వస్త్రములను శాంతియందును, మోక్షము కొఱకును, చిత్రాసనమును సర్వార్థ సిద్ధికొఱకును ఉపయోగించ వలయును. ఏయాసనము దొఱకకున్న నొక దర్భపోఁచ పఱుచుకొని కూర్చుండ వలయును.

వెనుక జపము చేయఁదగిన స్థలములను గూర్చి చెప్పియున్నను, ఏస్థలము నందు జపించిన నెంతఫలమో చెప్పఁబడుచున్నది.

శ్లో॥ శివస్య సన్నిధానేచ సూర్యాగ్న్యోర్వా గురోరపి
దీపస్య జ్వలిత స్యాపి జపకర్మ ప్రశస్యతే॥
గృహేజపం సమం విద్యా ద్గోష్ఠే శతగుణం భవేత్
నద్యాం శతసహస్రం స్యాం దనంతం శివసన్నిధౌ॥

సముద్ర తీరేచ హ్రదే గిరౌ దేవాలయేషు చ,
పుణ్యాశ్రమేషు సర్వేషు జపం కోటిగుణం భవేత్॥
స్యాత్పూర్వాభిముఖో వశ్యే దక్షిణే చాభిచారికమ్,
పశ్చిమే ధనదం విద్యా దుత్తరే శాంతిదం భవేత్॥

శివ సన్నిధానమునందును, సూర్యుఁడు, అగ్ని, గురువు, వెలిగింపఁబడిన దీపము వీని దగ్గఱ జపము చేయుట శ్రేష్ఠము. ఇంటి దగ్గఱ చేసిన జపమున కంపయే ఫలము. ఆవుల కొట్టములో చేసిన జపము నూఱురెట్లు ఫలమిచ్చును. కృష్ణా గోదావర్యాది నదులందు లక్షరెట్లు ఫలమును, శివ సన్నిధిలో ననంత ఫలమును కలుగును. సముద్రతీరము లందును, దేవహ్రదము లందును, కొండలందును దేవాలయము లందును, పుణ్యాశ్రమము లందన్నిటను జపము కోటిరెట్లగును.

వశ్యమునందు తూర్పు ముఖముగాను, అభిచారములో దక్షిణ ముఖముగాను, ధనమునకు పశ్చిమ దిక్కుగాను, శాంతులందుత్తర దిక్కుగాను జపించవలెను.

శ్లో॥ అగ్రే పృష్ఠే తథా వామే సమీపే గర్భమందిరే,
జపం ప్రదక్షిణం హోమం నకుర్యాద్ధి శివాలయే॥

శివాలయమందు ముందుభాగమునను, వెనుకభాగమునను, నెడమ భాగమునను, గర్భమందిరమునకు సమీపమునను జపము, ప్రదక్షిణము, హోమము, చేయరాదు.

## సంకల్పములు

జపము ప్రారంభించుటకుముందు పుణ్యాహవాచనాదులు కావించి, పైనఁజెప్పిన రీతిని గురుపూజాదులు కావించి గురువునకు గంధపుష్ప వస్త్రాద్యలంకారాదులచే సంతృప్తిపఱచి తర్వాత నాచమనము ప్రాణాయామము చేసి దేశకాలాదులను గీర్తించి తాను తిరుగఁ దలఁచిన భూమిని ముందుగానే సంకల్పించుకొనవలెను. దానిని దాఁటి ఆ జపము పూర్తియగు వఱకుఁ బోరాదు.

## సంచార యోగ్య ప్రదేశ సంకల్పము

'శ్రీరామ * షడక్షరీ మహామంత్ర పురశ్చరణ పర్యంతం మమ దేహ యాత్రార్థం ......... గ్రామస్య చతుర్దిక్షు ......... (క్రోశ, క్రోశార్ధ, మొదలగునవి సంకల్పించవలెను.) ప్రదేశ మతిక్రమ్య పాదాంతరం నాహం గచ్ఛామి'

తర్వాత ఫలానిచోట జపము చేతుననియు సంకల్పించవలెను. రోజున కొక స్థలమందు జపము చేయరాదు.

మఱల నాచమించి ప్రాణాయామ త్రయమును గావించి దేశకాలాదులను గీర్తించి యీక్రింది విధముగ ఫలాని చోటనే ప్రతిదినము జపము చేయుదు నని సంకల్పించ వలెను.

## జపముచేయు చోటుకు సంకల్పము

'అద్యారభ్య మయాకరిష్యమాణ శ్రీరామ షడక్షరీ మహామంత్ర పురశ్చరణ పర్యంత మత్రైవ జపం కరిష్యామి'

## పురశ్చరణ సంకల్పము

ఆచమించి, ప్రాణాయామముచేసి, దేశకాలాదులను గీర్తించి—

'మమ శ్రీరామచంద్ర ప్రసాద ప్రతిబంధకీ భూత సమస్త దురితక్షయ ద్వారా శ్రీరామచంద్ర ప్రసాద సిద్ధ్యర్థం షల్లక్ష సంఖ్యాక శ్రీరామ షడక్షరీ మహామంత్ర పురశ్చరణం కరిష్యే.' తదంగభూత నైమిత్తిక పూజాం కరిష్యే.' అని సంకల్పించ వలెను.

తర్వాత ప్రతిదిన మింత మంత్రజపము చేయుదునని కూడ సంకల్పింప వలయును.

## ప్రతిదిన మంత్రజప సంఖ్యా సంకల్పము

ఆచమించి, ప్రాణాయామము చేసి, మఱల దేశకాలాదులను గీర్తించి-

* సంకల్పములు ఉదాహరణమునకు షడక్షరికి వ్రాయబడు మన్నవి.

'మయా సమారబ్ధ శ్రీరామ షడక్షరీ మహామంత్ర పురశ్చరణే ప్రతిదినం ... ... ... ... (20000 వింశతి సహస్ర, 30000 త్రింశతి సహస్ర అని చేయు జపసంఖ్యను చెప్పవలెను.) సహస్ర సంఖ్యాక మంత్రజపం కరిష్యే'—

ఇట్లీ విధముగ సంకల్పించి జపనియమములను పాటించుచు మధ్యాహ్నము వఱకు జపించి మధ్యాహ్నమున మఱల స్నానము కావించి, సంధ్యావందనాదులు బ్రహ్మయజ్ఞము, దేవపూజాదులు నిర్వర్తించుకొని తర్వాత సాయంత్రము వఱకు జపము చేయవచ్చును. మరల సాయం స్నానమును నిర్వర్తించుకొని సంధ్యావందనాదులు కావించుకొని పూజచేసికొనవలయును. ఒకవేళ మూఁడు సార్లు స్నానము చేయలేకున్న ప్రాతః కాలమునను, మధ్యాహ్నమునను, ఆరెండు సార్లైనఁ జేయలేకున్న ప్రాతఃకాలమైనను స్నానము చేయవలెను. జపనియమములు ముందు చెప్పఁబడును.

ఏరోజున కారోజుగాని లేక అక్షరలక్ష జపమైన తర్వాతఁ గాని హోమ, తర్పణ, మార్జన, బ్రాహ్మణ భోజనములను గావింప వచ్చును. అనఁగా బ్రతిదినము ఇరువదివేలు జపించుచుండిన, దానిలోఁ పదవవంతు రెండు వేలు హోమమును తాంత్రికాగ్నియందుఁగాని, స్వశాఖోక్త వైదికాగ్నియందుఁ గాని చేయవలయును. కొందఱ మతమున తర్పణము రెండవ విషయముగా జపము తర్వాతఁ జేయఁబడును. తర్వాత హోమము. ఇదియు శాస్త్రీయమే. అనఁగా జపము, హోమము, తర్పణము, మార్జనము, బ్రాహ్మణ భోజనము యీ వరుసగఁ గాని, జపము, తర్పణము, హోమము, మార్జనము, బ్రాహ్మణ భోజనము యీ వరుసగఁగాని ఆచరించవచ్చును. మన యాంధ్రదేశమున జప తర్పణ హోమ మార్జన బ్రాహ్మణ భోజనమను వరుసనే చాల చోట్ల నవలంబించు చున్నారు. జపము అక్షరలక్ష చేయుట తప్పదు. ఒకవేళ హోమ, తర్పణ, మార్జన, బ్రాహ్మణ భోజనము వీనిని నెఱవేర్పఁ జాలకున్న వానికి బదులుగాఁ గూడ జపము చేయవచ్చును. అనుష్ఠానములోఁ గల భేదమే కాని ఫలములో నే భేదమునులేదు. ఎన్ని అక్షరములు మంత్రమున కుండునో (అది యెన్ని అక్షరముల మంత్రమో గురువే చెప్పును గదా!) అన్ని లక్షలు జపము చేయవలెను. మంత్ర మాఱు అక్షరములు కలదని యను కొనుఁడు. దానికి ఆఱు లక్షలు జపము చేయవలెను. దానిలో ($\frac{1}{10}$) పదవవంతు అఱువదివేలు (60000)

హోమము చేయవలయును. హోమ సంఖ్యలో ( $\frac{1}{10}$ ) పదవ వంతు ఆఱు వేలు ( 6000 ) తర్పణము చేయవలెను. (రెండవ విషయము తర్పణమను శాస్త్రము ననుసరించినచో తర్పణము 60000 న్నూ, హోమము 6000 న్నూ చేయవలెను.) తర్పణ సంఖ్యలో ( $\frac{1}{10}$ ) పదవ వంతు ఆఱు వందలు ( 600 ) మార్జనము చేసికొనవలెను. మార్జనములో ( $\frac{1}{10}$ ) పదవ వంతు అఱువది (60) మందికి బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. కొందఱిదియు నాలు వందలే నందురు. వారిలెక్క ప్రకారము మార్జనము వదలివేసి జప తర్పణ హోమ సంతర్పణములే పురశ్చరణములోని భాగములు.

ఒకవేళ వీటిని జేయఁజాలకున్న వీటికి బదులుగా జపము చేయవచ్చును. అసలు చేయవలసిన జపమెంతయో, ఆ విషయ మెన్నవదో దానిని బట్టి గుణించిన నెంత సంఖ్య వచ్చునో అంత జపము చేయవలయును. హోమము రెండవ విషయ మనుకొనుఁడు. హోమ సంఖ్య 60000. అనఁగా దీనికి రెట్టింపు $60000 \times 2 = 120000$ జపించిన హోమము చేసినట్లే యగును. తర్పణసంఖ్య 6000. తర్పణము మూఁడవ విషయము. కాఁబట్టి తర్పణమునకు $6000 \times 3 = 18000$ జపించిన తర్పణము చేసినట్లే యగును. మార్జన సంఖ్య 600. మార్జనము నాలవ విషయము. కాఁబట్టి మార్జనమునకు జపము $600 \times 4 = 2400$ జపము చేసిన మార్జనము చేసినట్లే యగును. బ్రాహ్మణ భోజనమునకు 60. అది అయిదవ విషయము కావున $60 \times 5 = 300$ జపించిన భోజనము పెట్టినట్లే. కొండఱు దీనికిని మార్జనమునకు వలె 2400 జపించవలె నందురు కాని అది సరికాదు.

కాఁబట్టి షడక్షరీ మహామంత్రజపమునకు మొత్తము జపించవలసినది —

| | | |
|---|---|---|
| ఆఱు అక్షరము లకును అక్షరమునకు లక్షవంతున | | = 600000 |
| తర్పణము 60000 లో $\frac{1}{10}$ వంతు | $6000 \times 3$ | = 18000 |
| హోమము 6 లక్షలలో $\frac{1}{10}$ వంతు | $60000 \times 2$ | = 120000 |
| మార్జనము 6000 లో $\frac{1}{10}$ వంతు | $600 \times 4$ | = 2400 |
| బ్రాహ్మణ భోజనము 600 లో $\frac{1}{10}$ | $60 \times 5$ | = 300 |
| మొత్తము పురశ్చరణ జపసంఖ్య | | = 740700 |

## హోమ సంకల్పము

ఆచమించి, ప్రాణాయామము చేసి దేశకాలాదులను గీర్తించి:—

'మయాకృత శ్రీరామ షడక్షరీ మహామంత్ర పురశ్చరణాఖ్య కర్మాంగ షల్లక్ష జపసంఖ్యాయాం తద్దశాంశేన హోమం సాక్షాత్కర్తు మశక్నువన్ తత్ప్రత్యామ్నాయ రూపం హోమసంఖ్యా షష్ట్యాయుత సంఖ్యా ద్విగుణం వింశతి సహస్రోత్తర లక్ష శ్రీరామ షడక్షరీ మహామంత్ర జపం కరిష్యే.'—

## తర్పణ సంకల్పము

ఆచమించి, ప్రాణాయామముచేసి, దేశకాలాదులను గీర్తించి—

'మయాకృత శ్రీరామ షడక్షరీ మహామంత్ర పురశ్చరణాఖ్య కర్మాంగ భూత శ్రీరామ షడక్షరీ షల్లక్ష సంఖ్యాక జప శతాంశేన షట్సహస్ర సంఖ్యా తర్పణం సాక్షాత్కర్తు మశక్నువన్ తత్సంఖ్యా త్రిగుణ సంఖ్యాకం అష్టాదశ సహస్రం శ్రీరామ షడక్షరీ మహామంత్ర జపం కరిష్యే'

## మార్జన సంకల్పము

ఆచమించి, ప్రాణాయామముచేసి, దేశకాలాదులను గీర్తించి —

'మయాకృత శ్రీరామ షడక్షరీ మహామంత్ర పురశ్చరణాఖ్య కర్మాంగ భూత శ్రీరామ షడక్షరీ షల్లక్ష సంఖ్యాక జపసహస్రాంశేన షట్శత సంఖ్యా మార్జనం సాక్షాత్కర్తు మశక్నువన్ తత్సంఖ్యా చతుర్గుణిత సంఖ్యాకం చతుర్వింశతి శత సంఖ్యా శ్రీరామ షడక్షరీ మహామంత్రజపం కరిష్యే.'

## బ్రాహ్మణ భోజన సంకల్పము.

ఆచమించి, ప్రాణాయామము చేసి, దేశకాలాదులను గీర్తించి—

'మయాకృత శ్రీరామషడక్షరీ మహామంత్ర పురశ్చరణాంగ భూత శ్రీరామ షడక్షరీ షల్లక్ష సంఖ్యాక జపాయుతాంశేన షష్టితమ సంఖ్యా బ్రాహ్మణ భోజనం సాక్షాత్కర్తు మశక్నువన్ తత్సంఖ్యా పంచ చతుర్గుణిత సంఖ్యాకం శతత్రయ సంఖ్యా శ్రీరామ షడక్షరీ మహామంత్రజపం కరిష్యే:—

ప్రతిదినము పూజచేయ వలసియున్నది గదా! అట్లు పూజ జరుపుటకు వీలులేకున్న దానికి బదులుగా కూడ జపము చేయవచ్చును. అట్లు రెండువేల సంఖ్యగాని, కనీసము రెండువందలైనను జపము చేయవలయును.

ఆచమించి, ప్రాణాయామము చేసి, దేశకాలాదులను గీర్తించి —

'మయాకృత శ్రీరామ షడక్షరీ మహామంత్ర పురశ్చరణాంగ భూత పూజా ప్రతినిధి రూపం ద్విసహస్ర సంఖ్యాకం (ద్విశత సంఖ్యాకం [200]) శ్రీరామ షడక్షరీ మహామంత్రజపం కరిష్యే :—

ఒకవేళ నీ రెండు వేలుగాని, రెండువందలుగాని జపింపఁ జాలకున్న మూఁడువేళల పురుషసూక్త పఠనమైనను జేయవలెను. జపించునపుడు మానసిక పూజ అవశ్యము చేయవలయును.

ఇఁక సాక్షాత్తుగ జపహోమ తర్పణ మార్జన బ్రాహ్మణ భోజనాదులు చేయఁగలవారు వాటి నియమముల నెఱుఁగవలెఁగదా! వాటిని గూర్చి కూడ యిచ్చట సూక్ష్మముగఁ జెప్పఁబడుచున్నది:

## జ ప ము

పైనఁజెప్పిన ప్రకారము తాను జపముచేయు క్షేత్రమును నిర్ణయించుకొని, ఆ క్షేత్రపాలకుని బూజింపవలయును. తర్వాత కూర్మచక్రముపై సాధకుని నామాక్షర మేగడిలో నున్నదో అచ్చట దీపస్థానము నేర్పాటు చేసికొని జపము ప్రారంభింపవలయును. వెనుక చెప్పినట్లు కూర్మచక్రమును లిఖించి తర్వాత దానిపై దీపము నుంచవలయును.

శ్లో॥ ముఖస్థో లభతే సిద్ధిం కరస్థః స్వల్పభోగభాక్
కుక్షిస్థిత ఉదాసీనః పాదస్థో దుఃఖమాప్నుయాత్॥
పుచ్ఛస్థ పీడయేన్మంత్రీ బంధనోచ్చాట నాదిభిః
దీపస్థానం తతః క్షేత్రే కృత్వా మంత్రీ శుచిర్భవేత్॥

కూర్మచక్రములో ముఖమునందు దీపస్థానము నేర్పాటు చేసిన సిద్ధి కలుగును. చేతులలో స్వల్పభోగముల నొసంగును. పుచ్ఛమునందు దీపమును బంధనోచ్చాట నాదులను జేసి పీడించునపుడు పెట్టవలయును. పై వాటిలో

నేకోరిక యుండిన నాయా స్థానములలో దీపమునుంచి మాంత్రికుఁడు శుచిగా జపింపవలయును.

'స్థానాధిపస్యాక్షరమస్తియత్ర తం దీపదేశం మునయో వదంతి' యని దేవ యామిళములోఁ జెప్పఁబడుటచే సాధకుని పేరు యొక్క మొదటి యక్షర మెచ్చట నుండునో అచ్చట దీపస్థానము నేర్పాటు చేయవలయును.

వేఱొకచోట దీపస్థానమును గూర్చి యిట్లు చెప్పఁబడినది.

శ్లో॥ కరస్థానే మహాక్లేశః కుక్షౌ దుఃఖ మవాప్నుయాత్
పాదో ర్హాని స్తథా పుచ్ఛే పీడా స్యాద్బంధనాదిభిః॥
మోక్షార్థీ వదనే కుర్యా ద్దక్షిణే త్వాభిచారికమ్
శ్రీరామః పశ్చిమే భూత్వా ఉత్తరే శాంతిదం భవేత్॥
ఈశానే శత్రునాశః స్యా దాగ్నేయే శత్రుదాయకమ్
నైరృత్యాం శత్రుభీతిః స్యా ద్వాయవ్యే తు పలాయనమ్॥
గ్రామే వా విపినే వాపి యత్రకుత్రావలోకయేత్
దీపస్థానే జపం కుర్యా త్సర్వకార్య మభీప్సు భిః॥
కూర్మచక్ర మవిజ్ఞాయ యః కుర్యా జ్జప యజ్ఞకమ్
తస్య జాప్య ఫలం నాస్తి సర్వానర్థాయ కల్పతే॥

హస్తముల మీఁద దీపము నుంచిన గొప్పక్లేశమును, కుక్షియందు దుఃఖమును, పాదములయందు హానియు, పుచ్ఛము నందు బంధనాదులచేఁ బీడయు కలుగును. మోక్షమును గోరువాఁడు ముఖమునందును, అభిచారికమునందు దక్షిణమునను, ధనమును గోరువాఁడు పశ్చిమమందును, శాంతిని గోరువాఁడు త్తరమందునను, దీపము నుంచవలయును. ఈశాన్యమునందు శత్రునాశమును, ఆగ్నేయమందు శత్రువులఁ గలుగఁజేయుటయు సంభవించును. నైరృతిని శత్రుభీతియు, వాయవ్యము నందు పలాయనమును కలుగును. గ్రామములోఁ గాని, అరణ్యములోఁగాని యింకెచ్చటనైనను సర్వకార్య సిద్ధిని గోరువాఁడు దీపస్థానమున జపమును జేయవలయును. కూర్మచక్రము నెఱుఁగక జపము చేయువానికి జపఫలము లేకపోఁగా సర్వానర్థములు కలుగును.

దీపమును బెట్టిన తర్వాత పుణ్యాహవాచనము, గణేశపూజ కావించి పైనఁ జెప్పిన సంకల్పముల ప్రకారము సంకల్పములు చేయవలెను. తర్వాత జపమాలను గ్రహించవలయును. మాలను కండ్ల కద్దుకొని దాని నభిమంత్రించవలెను.

శ్లో॥ త్వం మాతే సర్వదేవానాం సర్వసిద్ధి ప్రదామతా,
తేన సత్యేన మే సిద్ధిం మాతర్దేహి నమోస్తుతే॥

(అర్థము. ఓ జపమాలా! నీవు సమస్త దేవతలకును సమస్త సిద్ధుల నిచ్చుదానవు. నీకు నమస్కరించుచున్నాను. ఆ సత్యముచే నాకు సిద్ధిని ఓ తల్లీ! ప్రసాదింపుము.)

అను నీ మంత్రముతో మాల నభిమంత్రించ వలయును. ముందుగా 'జ్ఞానాజ్ఞానకృత పాపక్షయార్థం గాయత్రీ మహామంత్రజపం కరిష్యే:-' అని సంకల్పించి గాయత్రిని జపించవలెను. అట్లు ౧౦౦౦ గాని, 3000 గాని, కనీసము ౧౦౦౮ గాని జపించవలయును.

జపము చేయు మాలను శిరస్సునఁగాని, మెడలోఁగాని వేసికొనరాదు. చేతికి చుట్టుకొనరాదు. మెడలో వేసికొనిన మాలతో జపింపరాదు. జపమాలతో జపించునపుడు చూపుడు వ్రేలు తాఁకరాదు. మాలను అనామికమీఁద నుంచి మధ్యవ్రేలితోను బొటన వ్రేలితోను లోపలికి జరుపుకొనుచు జపించవలెను, ఇట్లు మేరుపూస వచ్చువఱకు జపించి మఱల వెనుకకు త్రిప్పవలెను. అనఁగా మేరుపూస దాఁటరాదు. ఎడమ చేతితో జపమాలను దాఁకరాదు. ఉపదేశము పొందనివాఁడు, అతఁడు బ్రాహ్మణుఁడైనను వానిని జపమాలను తాఁకనీయరాదు. అట్లు తాఁకినచో మఱల దానిని ఆవు పాలతోను, లేదా శుద్ధ జలముతోనైనను శుద్ధికావించవలయును. జపము చేసిన తర్వాత జపమాలను పవిత్రస్థలమున నుంచవలయును. జపమాలపైన నొక గుడ్డకప్పి జపింపవలయును. లేదా గోముఖము మొదలగు సంచులలో జపించవలెను. జపించునపుడు జపమాలను తాను జూడరాదు. చివరకు గురువునకైనను గనుపరుపరాదు.

శ్లో॥ కంపనా త్సిద్ధిహానిస్స్యా ద్ధూననం బహుదుఃఖకృత్,
శబ్దే జాతే భవేద్రోగో కరభ్రష్టా వినాశకృత్॥

ఛిన్నే సూత్రే భవేన్మృత్యు స్తస్మా ద్యత్నపరోభవేత్,
జపాంతే కర్ణ దేశేవా ఉచ్ఛ్రస్థా నేధవాన్యసేత్॥

జపించునపుడు మాల పణఁకిన సిద్ధికలుగదు, చిక్కుపడిన బహుదుఃఖములు కలుగఁజేయును, చప్పుఁడైన రోగమును, చేతినుండి జారిపడిన వినాశనమును, దారము తెగిన మృత్యువును కలుగును. కావున జాగ్రత్తగ నుండవలయును. జపమైన తర్వాత మాలను చెవికైనను (కుడిచెవిలో గంగ కలదు కావున నది పవిత్రమైనది.) తగిలించవలెను. లేదా ఉచ్ఛ్రస్థానములోనైన నుంచవలెను.

శ్లో॥ ఉష్ణీషీ కంచుకీ నగ్నో ముక్తకేశో మలావృతః,
అపవిత్రకరోఽశుద్ధః ప్రలపన్న జపేత్క్వచిత్॥

అప్రావృత కరా కృత్వా శిరసా ప్రావృతోపి చ,
చింతావ్యాకుల చిత్తోవా క్రుద్ధో భ్రాంతః క్షుధాన్వితః॥

అనాసనః శయనోవా గచ్ఛన్నుచ్ఛిష్ట ఏవ వా
రథ్యాయామ శివస్థానే నజపేత్తిమిరాంతరే॥

ఉపానద్గూఢ పాదో వా శయ్యాయాం చ గతస్తథా,
ప్రసార్య న జపేత్పాదౌ కుక్కుటాసన ఏవచ॥

పతితానామంత్యజానాం దర్శనే భాషణే శ్రుతే,
క్షుతేఽధోవాయుగమనే జృంభణే జపముత్సృజేత్॥

ప్రాప్తా వాచమ్య చైతేషాం ప్రాణాయామం పడంగకమ్,
కృత్వాసమ్యగ్జపేచ్ఛేషం యద్వాసూర్యాది దర్శనమ్॥
మార్జారం కుక్కుటం క్రౌంచం శ్వానం శూద్రం ఖరం కపిమ్,
దృష్ట్వాచమ్యాచరేత్కర్మ స్పృష్ట్వా స్నానం విధీయతే॥
అశుచిర్వా శుచిర్వాపి గచ్ఛం స్తిష్ఠన్స్వపన్నపి,
మంత్రైక శరణో విద్వా న్మనసైవ సదాభ్యసేత్॥

తలగుడ్డ (టోపీ) ను చొక్కాను ధరించియు, మొండి మొలతోను, తలవిరియ బోసికొనియు, ముటికితో నుండియు, నపవిత్రమైన చేతితోను నశుద్ధుఁడయ్యుఁ వాగుచు నెన్నటికిని జపింపరాదు. జపముచేయు చేతిమీఁద

గుడ్డ కప్పుకొనకయు, శిరస్సును గప్పుకొనియు, చింతతో వ్యాకులము చెందిన చిత్తముతోను, గోపముతోను, భ్రాంతుఁడయ్యు, నాఁకలి చెందియు, నాసనము లేకయు (కూర్చుండకయు), పరుండియు, నడచుచును, నెంగిలితోను జపింపరాదు. బజారులోను, శివస్థానమందును, చీఁకటిలోను జపింపరాదు, చెప్పులు తొడుగుకొనియు, ప్రక్కమీదఁ బరుండియుఁ, గాళ్లుజాచియు, గొంతుక కూర్చుండియు, పతితుల యొక్కయు, నంత్యజులయొక్కయు దర్శనము చేయుచును, వారితో మాటాడుచును, వారి మాటలు వినుచును, తుమ్ముచు, నపానవాయువు విడుచుచు, నావలించుచు, జపము చేయరాదు. అప్పు డాపివేయవలెను. అట్లొకవేళ పైవి జరిగిన నాచమించి ప్రాణాయామము చేసిగాని లేక సూర్యదర్శనము చేసిగాని జపమును బూర్తి కావింపవలయును. పిల్లిని, కోడిని, క్రౌంచమును, గుక్కను, శూద్రుని, గాడిదను, క్రోఁతిని, జపము చేయుచుఁ గాంచిన నాచమించి మిగిలిన జపము పూర్తి చేయవలయును. ఒకవేళ వీరిని తాఁకిన స్నానము చేయవలెను. అశుచియైగాని, శుచియైగాని, నడచుచు, నిలుచుండుచు, నిద్రించుచునైనను జ్ఞానియైనవాఁడు మంత్రము నొక్కదానినే శరణుపొంది మనస్సుతో జపించవలెను.

జపము మూఁడు విధములు. నాల్గు విధములని కొందఱు. వాక్కుతో జపము చేయుట వైఖరీ జపము. మెల్లఁగా నితరులకు వినఁబడకుండ చేయు జపము ఉపాంశు జపము. జిహ్వతోఁ జేయు జపము జిహ్వాజపము. మనస్సుతో మంత్రార్థ చింతనము చేయుచు జేయుఁ జపము మానసిక జపము. అన్నిటికంటె మానసిక జపము శ్రేష్ఠమైనది. జపము చేయునపుడు మలమూత్ర విసర్జనము చేయవలసి వచ్చిన జపము నాపి శాస్త్రవిధిని నీటితో శౌచము చేసికొనవలెను. మూత్ర విసర్జనము చేసిన వెంట నీటిని తీసికొనిపోయి మూత్రావయవమును ప్రక్షాళనము చేసికొని, కాళ్లు కడుగుకొని నాల్గుసార్లు పుక్కిలించి వేయవలయును. మల విసర్జనము చేయవలసి వచ్చిన. శాస్త్రవిధిని శౌచము చేసికొని కాళ్లుకడిగి యెనిమిది సార్లు పుక్కిలించి పైచి తర్వాత స్నానముగాని, లేకున్న కనీసము కటిస్నానమైనను చేయవలెను. జపించునపుడు నడుమునకు క్రిందనుండు యవయవములను తాఁకుట గాని, గోఁకుకొనుట గాని పనికిరాదు. దుష్టులతో వారు బ్రాహ్మణులైనను సరియే సంభాషింపరాదు. ఉమ్మి వేయరాదు. అట్లుమ్మి వేయవలసి వచ్చిన నుమ్మివేసి ఆచమనము చేయవలయును.

భయము, కోపము పనికిరాదు. పాంచభౌతిక దేహోహం భావనను వీడవలెను. ఉపాస్య దేవతా హంభావన కలిగియుండవలెను. శాస్త్రము నందును, గురువు నందును, దేవత యందును, మంత్ర మందును, అనుష్ఠాన ఫలమందును పరమ విశ్వాసముంచ వలయును. ఇంద్రియ నిగ్రహము, శీతోష్ణాది ద్వంద్వ సహిష్ణుత, అస్తిక్యము, కారుణ్యము, శ్రద్ధ, నిశ్చయము, సంతోషము, నియమము, ఉత్సాహము, వీనిని గలిగియుండి జపించవలయును. చపలచిత్తము, శోకము, దుఃఖము, కామక్రోధ లోభ మోహ మదమాత్సర్యములు వీనిని వదల వలయును. తృణచ్ఛేదనము, వివాదము, మనోరధ కథనము,పరిహాసము, మ్లేచ్ఛసంభాషణము మ్లేచ్ఛ భాషోచ్చారణము(ఇంగ్లీషు భాషకూడ పనికిరాదు.) ప్రలాపము వీనిని వదలవలెను. మనస్సు చెదరిపోవునప్పుడు అప్పుడప్పుడు ప్రాణాయామము చేయ వలయును. పైదోషములు సంభవించిన సూర్యునిఁగాని, గోవునుగాని, బ్రాహ్మణునిఁగాని, అగ్నిహోత్రమునుగాని దర్శించవలెను. గళశుద్ధి, ముఖశుద్ధి చాల ముఖ్యము. బాగుగా పండ్లుతోముకొనక జపము చేయరాదు. మెడకు గుడ్డ చుట్టుకొనరాదు.తాంబూలము వేయరాదు. క్షౌరము,అభ్యంగనము, కంచములో భోజనము, పగటిభోజనము, అనివేదితాన్న భక్షణము, సంకల్పించిన పదార్థములు గాక అన్యపదార్థములను దినుట, అసత్య సంభాషణము ఇవి పనికిరావు. ఒంటి వస్త్రముతో ననఁగా పైన నుత్తరీయములేక కట్టుగుడ్డతో జపము చేయరాదు. శిఖ ముడి వేసికొని, శాంతితోను, మడితోను, శాస్త్రానువర్తియై, నిష్కామియై పరాన్నమును, పరస్త్రీని, ప్రతిగ్రహమును (పరద్రవ్యమును గ్రహించుట.) వీనిని వదల వలయును. మంత్రమును అతి వేగముగఁ గాని, అతి మందముగఁ గాని జపింపరాదు. అతివేగముగ జపించుటచే రక్తము వేగముగ పారి రోగము రావచ్చును. చాల నెమ్మదిగ నుచ్చరించిన మంత్రము ఫలించదు. కుండలినీ జాగృతి చెందదు. హృత్కంపము, గ్రంథిభేదనము, ఆనందాశ్రుపాతము, పులకాంకురము, స్తంభనము, గద్గదికము మొదలగు సాత్త్వికభావములు రావచ్చును. అట్లు వచ్చుట అదృష్టము. దేవతావేశనము, మనస్సు నిలిచి పోవుట, గురు మంత్ర దేవతాద్యైక్యాను సంధానము పనికివచ్చును. అట్లు జరుగుట చాల ముఖ్యమని కూడ పెద్దలు చెప్పుదురు.

శ్లో॥ సుతరాం రామమంత్రోఽయం సంస్కృతిం నేచ్ఛతిక్వచిత్
రసనా స్పృక్ఫలత్యేవ పావకోఽసంస్కృతో యథా॥

ఈ శ్రీరామ మంత్రమునకు సంస్కృతి బొత్తుగా నవసరము లేదు. వాలుకకు తాకఁగానే అగ్నిసంస్కారము చెందనప్పటికిని అదిశుద్ధిగానే యున్నట్లు ఆ రామమంత్రముకూడ శుద్ధియై ఫలించును.

జపసమయమున మౌనము ముఖ్యము. గురువుగాని, గొప్ప సాధువుగాని, స్త్రీకి భర్తగాని జపసమయమున వచ్చుట తటస్థించినచో జపమాపి లేచి వారికి మర్యాదలు కావించి మరల వారనుజ్ఞ నిచ్చినఁ గూర్చుండి జపింప వచ్చును. గురువుతో, సాధు మహాపురుషునితో మాటలాడుటయే మౌనము. కావున వారితో మాటలాడిన మౌన భంగమైనదని చింతించవలసిన పనిలేదు.

శ్లో॥ సంధ్యయో రుభయో ర్జాప్యే భోజనే దంతధావనే,
పితృకార్యేచ దైవేచ తథా మూత్ర పురీషయోః॥
గురూణాం సన్నిధౌ దానే యోగేచైవ విశేషతః,
ఏషు మౌనం సమాతిష్ఠం త్స్వర్గ మాప్నోతి మానవః॥

రెండు సంధ్యల యందును, జపము చేయునెడలను, భోజనమునను' దంతధావనము చేయునప్పుడును, పితృకార్యము లందును, దైవకార్యములందును' మూత్ర పురీష విసర్జన సమయములందును, గురువుల సన్నిధిలోను, దానము చేయునప్పుడును, యోగము చేయునపుడును మౌనముండిన మానవునకు స్వర్గము కలుగును.

ఒకవేళ పొరపాటునఁగాని, కారణాంతరములచేఁగాని మౌనము విడువ వలసివచ్చిన ప్రాయశ్చిత్తము కలదు.

శ్లో॥ సకృదుచ్చారితే శబ్దే ప్రణవం సముదీరయేత్॥

ఒకవేళ శబ్దము నుచ్చరించినఁ బ్రణవమును బలుక వలయును.

జప మదేపనిగాఁ జేసిన నలుపు వచ్చును. అప్పుడు ధ్యానము చేయ వలయును.

శ్లో॥ జపశ్రాంతేస్తుతప ధ్యాయేత్ ధ్యానశ్రాంత స్తుతం జపేత్,
జపధ్యాన సమాయుక్తో మంత్రం సిద్ధ్యతి నాన్యథా॥

జపములో నలుపువచ్చిన ధ్యానించవలయును. ధ్యానములో నలుపువచ్చిన జపము చేయవలయును. జపధ్యానములతోఁ గూడిన మంత్రము త్వరగా సిద్ధించును గాని వేఱొక విధముగ సిద్ధింపదు.

మనస్సు బాగుగా భగవద్రూపమందు నిలుచుటకు ఈ క్రింది విధముగ ధ్యానించుచు జపించ వచ్చును.

౧౦౮ పూసలుగల జపమాలతో జపమును ప్రారంభించవలయును. పద్మాసనమునఁగాని, స్వస్తికాసనమునఁ గాని కూర్చుండి హృదయములో తన యిష్టదైవమును ధ్యానించుచు ముందుగా పాదములమీఁద నొక మాల (అనఁగా౧౦౮) పిక్కలమీఁద ౧౦౮, అట్లే వరుసగా మోఁకాళ్లు, తొడలు, నడుము, ఉదరము వక్షఃస్థలము, హస్తములు, కంఠము, ముఖము ఇట్లు పాదములనుండి శిరస్సు వఱకు క్రమముగా నీపైన జెప్పిన పది స్థానములందా యా యవయవములను వివరముగాఁ జూచుచు పది మాలలు జపించిన వేయి యగును. మరల నక్రిందకు వచ్చిన మరల వేయి యగును. ఇట్లే రెండు వేలకు నొకమ చేతి వ్రేలు నొకదానిని ముడువ వలయును. అట్లైదు వ్రేళ్లు ముడిచి, మఱల నైదు వ్రేళ్లు తెఱచు నప్పటికి ఇరువది వేలగును. కొందఱు చేసినట్లు ప్రతివేయికి నొక తులసీదళ మో; ఒక ఖర్జూరపుపండో పెట్టకుండ, జపధ్యానభంగము కాకుండ ఇరువది వేలకు వఱకు జపించుకొన వచ్చును. దీనిలో భగవద్రూపమందు మనస్సైకాగ్రముగ నిలుచును. ఒకవేళ నేదైన యవయవ స్థానమువద్ద ధ్యానము నిలువకున్న ఆ స్థానమున మరల జపింపవలయును. ఇట్లెంత జపమునైన నీధ్యాన పద్ధతితో జపించ వచ్చును. ఇది మంత్ర జాపకులకు చాలముఖ్యము.

ఇట్లు జపము మధ్యాహ్నము వఱకు చేసి, స్నానము, మాధ్యాహ్నిక క్రియలు, పూజాదుల నొనర్చుకొని తేలికగ పాలనుగాని, పండ్లను గాని, భుజించి (ఆఁకలితో జపింపరాదు. కనుక) మఱల జపము ప్రారంభించ వచ్చును. ఇట్లు సాయంసంధ్య వఱకు జపించి సాయం స్నానము, సంధ్యావందనాదులు కావించుకొని మరల జపము చేసి జాము ప్రొద్దు పోకమునుపే ముందు చెప్పఁ బోవు ఆహారమును గైకొనవలయును. లేదా మధ్యాహ్నము వఱకు జపించి తర్వాత మధ్యాహ్నికములు తీర్చుకొని భోజనము చేసి తర్వాత శ్రీమద్రామా

యణ పారాయణము, నామసంకీర్తనము, నామజపము మొదలగు సత్కాల క్షేపములు చేయవలెను.

## హోమము

హోమము ప్రత్యక్షముగ జరుప నశక్తుఁడగుచో వెనుక జెప్పినట్లు సంకల్పించి దానికి రెట్టింపు జపము చేయవలెను, శక్తి, అవకాశము గలవారు బాణము పొడవున స్థండిలమునఁగాని, కుండమునందుకాని హోమము చేయుట ముఖ్యము.

శ్లో॥ కుండేవా స్థండిలేవాపి కుండహోమః ప్రశస్యతే
హోమోక్త విధినాచైవ కుర్యాద్వై సాధకోత్తమః॥
కుండంతు నారదేనోక్తం హస్తమాత్రం శుభం మతమ్॥

— వాయవీయ సంహిత.

కుండములోఁ గాని స్థండిలములోఁ గాని హోమము చేయవచ్చును. వీనిలో కుండమునందు హోమము చేయుట శ్రేష్ఠమైనది. కావున హోమోక్త విధిచేత సాధకుఁడు హోమము చేయవలెను. చేయి యెంతపొడవో అంత కుండము శ్రేష్ఠమని నారద మతము.

శ్లో॥ గ్రీష్మే ఉచ్చాటనం కుర్యాత్ ప్రావృషి స్తంభనం తథా
శరది శాంతికం కుర్యాద్ధైమంతే మోహనం కురు॥
శైశిరే మారణం జ్ఞేయం వసంతే వశ్యకర్మణి॥

గ్రీష్మములో నుచ్చాటనమును, వర్షకాలమందు స్తంభనమును మఱియు శరదృతువు నందు శాంతిహోమమును, హేమంతమందు మోహనమును, శిశిరమందు మారణమును, వసంతమున వశ్యకర్మమును వీటిని గూర్చి హోమము చేయవలెనని చెప్పఁబడినది.

ఇంక నాయా ఋతువులలో నెప్పుడెప్పుడు హోమము చేయవలయునో చెప్పఁబడుచున్నది.

శ్లో॥ వసంతేచైవ పూర్వాహ్ణే మధ్యాహ్నే గ్రీష్మ ఉచ్యతే
అపరాహ్ణేతు వర్షాసు శరది త్వర్ధ రాత్రికే॥

ఉషో హేమంతకే చైవ సంధ్యాయాం శైశిరే స్మృతః॥

వసంతకాలములో పూర్వాహ్ణమందును, గ్రీష్మములో మధ్యాహ్న కాలమందును, వర్ష కాలమున నపరాహ్ణమునను, శరదృతువునం దర్ధరాత్రియందును, హేమంతమున నుషఃకాలమునను, శిశిర ఋతువునందు సాయంసంధ్యా కాలమందును హోమము చేయవలెను.

శ్లో॥ పాలాశపుష్పహోమేన సర్వజ్ఞత్వ మవాప్నుయాత్
అశ్వత్థస్య సమిద్ధోమా ద్బ్రహ్మణ్యం సుస్థిరం భవేత్॥
దూర్వా హోమా దవాప్నోతి దీర్ఘాయుష్యం న సంశయః
అన్నాజ్య హోమాదాప్నోతి మునేరాజ్యం ద్విజోత్తమ
కన్యాకామో లభేత్కన్యాం లాజహోమేన సువ్రత
వైరాగ్యకామో వైరాగ్యం లభతేఽమృత హోమతః॥
శ్రేయోర్థీ శ్రియమాప్నోతి బిల్వపత్రస్య హోమతః
పుత్రకామో లభేత్పుత్రం జీవపుత్రస్య హోమతః॥
ఆరోగ్యకామ ఆరోగ్యం లభతే తిలహోమతః
యద్యదిచ్ఛతి తత్సర్వం లభతే పుష్పహోమతః॥

మోదుగ పుష్పములతో హోమము చేసిన సర్వజ్ఞత్వము కలుగును. రావి సమిధలతో హోమము చేసిన బ్రహ్మత్వము సుస్థిరముగ నుండును. గరికతో హోమము చేసిన దీర్ఘాయుష్యము కలుగును. ఇందావంతయు సందేహము లేదు. అన్నము, నేయి వీనిని హోమము చేసిన రాజ్యము కలుగును. పేలాలు హోమముచేసిన కన్యక కావలసిన వానికి కన్యక లభించును. పాలతో హోమము చేసిన వైరాగ్యము లభించును. శ్రేయస్సును గోరువాఁడు మారేడు దళములను హోమము చేయుటవలన లక్ష్మి లభించును. జీవపుత్రయను నోషధితో హోమము చేసిన పుత్రులు కావలసిన వారికి పుత్రులు కలుగుదురు. నువ్వులను హోమము చేసిన నారోగ్యము కలుగును. పుష్పహోమము కావించిన నేకోరిక కోరిన నాకోరిక ఫలించును.

సన్న్యాసులకును, సాధువులకును హోమముగాని, బ్రాహ్మణ సంతర్పణముగాని చేయవలసిన పనిలేదు. హోమము చేయఁజాలకున్నచో బ్రాహ్మణులు రెట్టింపును, ఇతర వర్ణములవారు మూఁడు రెట్లును జపించవలయును.

'హుతం యన్ముద్రయాహీనం తత్సర్వం నిష్ఫలం భవేత్' ముద్రలు లేక చేసిన హోమము నిష్ఫలమగును. కావున మృగీ, హంసీ, సూకరీ యను మూఁడు ముద్రలలో నాయా సందర్భములందు నాయా ముద్రలు చూపవలెను.

శ్లో॥ శాంతికేచ మృగీజ్ఞేయా హంసీ పౌష్టిక కర్మణి,
సూకరీవ్యాభిచారేషు కార్యాతంత్ర విదుత్తమైః॥
సూకరీకరసంకోచీ హంసీ ముక్త కనిష్ఠికా,
ముక్తా కనిష్ఠ తర్జన్యా మృగీ ముద్రా ప్రకీర్తితా॥
అభిచారాదిహోమేషు సూకరీ కథితా బుధైః,
సూకరీ పుత్రకామాయ ధనకామాయ హంసినీ॥

మృగీ మోక్షే ప్రకర్తవ్యా ఆహుతి స్సర్వకామికా॥

శాంతికర్మలలో మృగీముద్రను, పౌష్టిక కర్మలలో హంసీముద్రను, అభిచారాదులందు సూకరీముద్రను, వేయవలెను. చేతులను సంకోచింపఁజేయుట సూకరీముద్ర. చిటికెన వ్రేలిని ముడిచిన హంసీ ముద్రయగును. చిటికెన వ్రేలిని, చూపుడు వ్రేలిని ముడిచిన మృగీ ముద్రయగును. అభిచారాది హోమములలో సూకరీముద్రను వేయవలెను. పుత్రసంతానమును గోరిన సూకరీ ముద్రను, ధనమును గోరిన హంసనీ ముద్రను, మోక్షమును గోరునెడల మృగీ ముద్రను వేయవలెను. ఏరోజున కారోజు జపము, హోమము, తర్పణము, మార్జనము, బ్రాహ్మణ భోజనము చేయవచ్చును.

## తర్పణము

తర్పణము హోమము చేసిన తర్వాత చేయుట ఒక సాంప్రదాయము. తర్పణమును ఆవుపాలతో చేయవలెను. దానిలో నీరు, పుష్పములు కలిపినను గలుపవచ్చును. ఆచమించి, ప్రాణాయామము చేసి, దేశకాలాదులను గీర్తించి, "మయాకృత శ్రీరామ షడక్షరీ మహామంత్ర పురశ్చరణాంగ భూత షలక్షసం

ఖ్యాక తజ్జపే శతాంశం షట్సహస్ర సంఖ్యాక తర్పణం కరిష్యే :_" అని సంకల్పించి తర్పణము చేయవలయును. 'మూలమంత్రమును జెప్పి శ్రీరామం తర్పయామి నమః' అని దేవతీర్థముతో పైనఁ జెప్పిన ఆవుపాలు, పూలుకలిసిన జలముతో నొక పళ్లెరము లోనికి వదలవలయును. ఒకవేళ నామంత్రము శక్తి మంత్రమగునెడల ' మూలమంత్రమును జెప్పి ......... దేవతాం తర్పయామి స్వాహా ' యని విడువవలయును. తర్పణమును జేయఁజాలకున్న వెనుకఁ జెప్పిన సంకల్పమును జెప్పుకొని తర్పణమునకుఁ జేయవలసిన జపమునకు మూఁడురెట్లు జపించవలయును.

## మార్జనము

తర్పణము చేసిన తర్వాత మార్జన మొనరింప వలయును. మార్జనముకూడ గోక్షీరోదకములచేతనే చేయవలెను. దానిలో జలమును, పుష్పములను గూడ పై విధముగానే కలుపవచ్చును. ఆచమించి, సంకల్పించి మార్జనమును కుశ దూర్వాగ్రములతో ఆ గోక్షీరోదకములో ముంచి యిష్టదేవతను స్మరించి 'మూల మంత్రమును జెప్పి 'శ్రీరామం మార్జయామి ' యని శిరస్సునఁ జల్లుకొనవలయును. ఒకవేళ మార్జనము చేయఁజాలకున్న వెనుక చెప్పిన సంకల్పమును జెప్పుకొని మార్జనమునకుఁ జేయవలసిన జపమునకు నాలుగురెట్లు జపించవలయును. మార్జనమునకు సంకల్పము—

" మయాకృత శ్రీరామ షడక్షరీ మహామంత్ర పురశ్చరణాఖ్య కర్మాంగభూత శ్రీరామ షడక్షరీ మహామంత్ర షట్లక్ష సంఖ్యాత జప సహస్రాంశేన షట్శత సంఖ్యా మార్జనం కరిష్యే :—

## బ్రాహ్మణ భోజనము

శ్లో॥ ఆదావంతేచ మధ్యేచ బ్రాహ్మణాన్ భోజయేద్బహూన్,
దినేదినే యథాశక్త్యా రామముద్దిశ్య భక్తితః॥
సుభోజితేషు విప్రేషు తత్సాంగం సఫలం భవేత్॥

పురశ్చరణమునకు ముందును, వెనుకను, మధ్యను చాలమంది బ్రాహ్మణులకు ప్రతిదినము యథాశక్తి భక్తితో భోజన మిడవలెను. బాగుగా బ్రాహ్మ

లఘు భోజనము పెట్టిన నాజపము సాంగముగ సఫలమగును. బ్రాహ్మణభోజనము నకును సంకల్పము చేయవలెను. ఆచమించి, ప్రాణాయామము చేసి, దేశకాలాదులను గీర్తించి—

'మయాకృత శ్రీరామ షడక్షరీ మహామంత్ర పురశ్చరణాఖ్య కర్మాంగ భూత శ్రీరామ షడక్షరీ మహామంత్ర షల్లక్ష సంఖ్యాక జపాయుతాంశేన షష్టితమ సంఖ్యా బ్రాహ్మణ భోజనం కరిష్యే.' అని సంకల్పించి అఱువదిమంది బ్రాహ్మణులను భోజనమునకు చెప్పి షడ్రసోపేతముగ భోజనమిడి తాంబూల దక్షిణాదులిచ్చి గంధపుష్పాక్షతలచేఁ బూజించి, వీవనలచే విసరి మర్యాదలు చేయవలయును.

## గుర్వనుగ్రహము

వీటి అన్నిటికంటె గుర్వనుగ్రహము పూర్తిగ నుండవలయును. గుర్వనుగ్రహించిన సర్వము సఫలమగును. గురువు పురశ్చరణము సఫలమైనదని యనినఁ జాలును. లోపము లన్నియుఁబోయి సర్వము సంపన్నమై మంత్రసిద్ధియగును. ఇందావంతయును సందేహము లేదు.

శ్లో॥ అథవా దేవతారూపం గురుంధ్యాత్వా ప్రతోషయేత్
తస్యేచ్ఛయాను సారీ స్యా ద్భక్తియుక్తేన చేతసా॥
గురుమూల మిదం సర్వం తస్మాన్నిత్యం గురుం యజేత్
పురశ్చరణ హీనోఽపి మంత్రసిద్ధ్యే న్న సంశయః॥

దేవతారూపమును, గురువును ధ్యానించి, ఆగురువుయొక్క యిష్టప్రకారము భక్తితోఁగూడిన మనస్సుతో ననుసరించి యాయనను సంతోషపెట్ట వలయును. దీనికంతకును గురువే మూలము కావున నెల్లప్పుడును గురువును బూజింప వలయును. పురశ్చరణ చేయని వాఁడైనను గురువును బూజించిన మంత్రము సిద్ధించును. ఇందు సంశయము లేదు.

కేవలము భగవంతుఁడు చెప్పిన వాక్యమును గనుఁడు—

శ్లో॥ సంతుష్టోహి గురుర్యస్య తస్య తుష్టం జగత్త్రయమ్
వాఞ్ఛాసాధ్యం జగత్యత్ర సుప్రసన్నే గురౌ మునే॥

గురువు సంతోషించిన మూఁడు లోకములు సంతుష్టి చెందినట్లే. గురువు పసన్నుఁడయ్యేనా యీమూఁడు లోకములలో నసాధ్యమైనది లేనేలేదు.

కావున గురువును చతుర్విధ శుశ్రూషలచే సంతోషింపఁజేసి మంత్రసిద్ధిని బొందవలయును. ఆయన యనుగ్రహమును యాచింపవలయును.

## నియమములు

ఏకార్యమునకైనను దానిని సిద్ధింపఁ జేసికొనుటకు నియమ పాలన మవస రము. నియమములు లేకున్న మంత్రము సిద్ధింపదు.

శ్లో॥ లవణం పలలంచైవ క్షారం క్షౌద్రరసాంతరం,
మాషముద్గ మసూరాద్యాః కోద్రవాం శ్చణకానపి॥
అసద్భాషణ మన్యాన్నం వర్జయే దన్యపూజనమ్,
వినాశ్రమోచితం కించిత్ నిత్యానైమిత్తికంచ యత్॥
స్త్రీశూద్ర పతిత వ్రాత్య నాస్తికోచ్ఛిష్ట భాషణమ్,
అసభ్యభాషణంచైవ కౌటిల్యంచ పరిత్యజేత్॥
నసద్భిరపి భాషేత జపహోమార్చనాదిషు,
వాగ్యతః కర్మభిర్నిత్యం నిఃస్పృహో వనితాదిషు॥
వర్జయే ద్గీత వాద్యాది శ్రవణం నృత్యదర్శనమ్,
తాంబూలం గంధలేపంచ పుష్పధారణమేవచ॥
మైథునం తత్కథాలాపం తద్గోష్ఠీః పరివర్జయేత్,
కౌటిల్యం క్షౌద్ర మభ్యంగ మనివేదిత భోజనమ్॥

ఉప్పు, మాంసము, కారము, తేనె వగైరా రసములు, మినుములు, పెసలు, అలచందలు మొదలైనవి, కొఱ్ఱలు, శనగలు, సత్పురుషులు కానివారితో మాటలాడుట, పరాన్నము, అన్యదేవతా పూజనము వదలవలయును. ఆశ్రమో చితముగాని నిత్యనైమిత్తిక క్రియలు, స్త్రీలు, శూద్రులు, పతితులు, వ్రాత్యులు, నాస్తికులు, ఉచ్ఛిష్టులు వీరితో సంభాషణమును మానవలయును. అసభ్యభాషణము, కుటిలత్వము వీనిని వదలవలెను. జపము చేయునపుడును, హోమము చేయునపుడును, పూజచేయునపుడును సత్పురుషులతోనైన మాటా

డరాదు. వాక్కును నియమించి యెల్లప్పుడును స్త్రీలు మొదలగు వారియందు నిస్పృహుండై యుండవలెను. గీతములు పాడుట, వినుట, వాద్యములను వాయించుట, వినుట, నృత్యమును దర్శించుట, తాంబూలము వేసికొనుట, గంధము పూసికొనుట, పుష్పధారణము చేయుట, స్త్రీ సంగమము చేయుట, తత్సంబంధమైన కథలువినుట, స్త్రీ గోష్ఠి వీనిని వదలవలయును. కుటిలత్వమును, తేనెను తినుటను, తలంటుకొని స్నానము చేయుటను, నివేదన చేయని భోజనమును చేయరాదు.

శ్లో॥ అసంకల్పిత కృత్యం చ వర్జయేన మర్దనాదికమ్,
త్యజేదుష్ణోదక స్నానం సుగంధమలకాదికమ్॥

సంకల్పింపని కార్యములను చేయుటయు, శరీరాదులను మర్దించుకొనుటయును, వేడినీటి స్నానమును, సుగంధ ద్రవ్యములను, ఉసరిక సంబంధమైన వాటిని వదలవలయును.

నేలమీఁద పరుండ వలయును. పరుపుల మీఁదఁ బరుండరాదు. మైథునము పనికిరాదు. వేఱొక శాస్త్రమున, ఋతుకాలమునఁ గూడకున్న భ్రూణహత్యాదోష మాపాదించును కావున నొకసారి స్వస్త్రీగమనము చేయవచ్చునని కలదు గాని అది శ్రేష్ఠము కాదు. బ్రహ్మచర్యము ముఖ్యము. ఋతుకాలమున గమనింపని దోషము పోవుటకు ఉఁరక ఆలింగన మొకసారి చేసినఁ జాలును. భ్రూణహత్యాదోషము పోవును. మితభాషణము, పొలిమేరదాఁటకుండుట, క్షౌరము చేయించుకొనకుండుట, గోళ్లు తీసికొనకుండుట చాల ముఖ్యము.

## ఆహార నియమములు

శ్లో॥ వైదికాచార యుక్తానాం శుచీనాం శ్రీమతాం సతామ్
సత్కులస్థాన జాతానాం భిక్షాస్యాదగ్ర జన్మనామ్॥
భుంజానో వాహవిష్యాన్నం శాకం యావక మేవ వా
పయో మూలం ఫలం వాపి యత్రయత్రోప పద్యతే॥

వైదికాచార యుక్తులును, శౌచాచారము గలవారును, శ్రీమంతులును, సత్పురుషులును, సత్కులములోఁ బుట్టినవారును నగు బ్రాహ్మణుల యింటిలో

భిక్షను గ్రహించవలెను. లేదా హవిష్యాన్నమును, కూరను, యవల సంబంధమైన యాహారమును, పాలను, దుంపలను, ఫలములను, యెచ్చట దొరికితే అచ్చట గ్రహించ నచ్చును.

శ్లో॥ భక్ష్యం మూలం ఫలం క్షీరం దధి భిక్షాన్న సక్తవః
శాకం చాష్టవిధం చాన్నం సాధకస్యోచ్యతే బుధైః॥

భక్ష్యములు (అప్పచ్చులు) దుంపలు, ఫలములు, పాలు, పెరుగు భిక్షాన్నము, పిండి, కూరలు ఇవి యెనిమిది రకములగు నన్నములు సాధకునకు మంచివని పెద్దలు చెప్పిరి.

మృదులమైనట్టియు, ఉప్పు, పులుసు, కారము, వగరు, చేదు లేనట్టియు, వేడి కలిగి నట్టియు, బాగుగా పక్వమైనట్టియు, శుద్ధసాత్త్వికాహారమునే తీసికొనవలయును. భోజనము లఘువుగ నుండవలయును. బ్రహ్మచారులు, వానప్రస్థులు, సన్యాసులు తప్ప గృహస్థులు భిక్షాన్నమును గొనరాదు. హవిరన్నము చాల ముఖ్యము. హవిరన్నమనఁగా బియ్యమునకు నేయిరాచి వండినది. దానిలో పాలు, చక్కెర వీటిని కలుపవచ్చును. ఆహారమునకు పాత బియ్యము, గోధుమసంబంధమైనది, దుంపలు, పండ్లు, ఆవుపాలు, చక్కెర, కలకండ, సాత్త్వికమగు కూరలు యివి చాల ముఖ్యములు.

## శయ్య

నేల మీఁద దర్భచాపయో, లేక విడి దర్భలో పఱచి దానిపైని గుడ్డ పరచుకొని భగవంతుని స్మరించుచు పరుండవలయును. నేల పడక యని కొందఱు పరుపులు వేసికొందురు. కాని అది సరికాదు. బల్లమీద పరుండ వచ్చును. దేవతాసన్నిధానము ముఖ్యము. ఆచమించి, ప్రాణాయామము చేసి దేశకాలాదులను గీర్తించి "ఏతత్పురశ్చరణ పర్యంత మత్రైవ స్వపామి" యని సంకల్పించి ప్రతి దినమొకే చోట పరుండవలయును. రంగుగుడ్డలను పక్కమీఁద వేసికొనరాదు. తెల్లని గుడ్డలనే పరచుకొనవలయును. తూర్పు తలాపియో, దక్షిణ తలాపియో పెట్టుకొని పరుండవలయును. దగ్గఱ నన్యులను బరుండఁబెట్టుకొనరాదు. తనలోని శక్తి వారికి పోవును.

## సమర్పణము

ఏదినమున కాదినము చేసిన సర్వకార్యములు భగవంతున కర్పణ చేయవలెను. చివరకు పురశ్చరణమంతయుఁ బూర్తియైన తర్వాత మరల భగవంతునకు సమర్పింపవలయును.



## * 15. ధ్యానము

మంత్రోపాసన చేయువాఁడు ధ్యానముకూడ చేయవలయును. ప్రత్యాహారమున నింద్రియ వృత్తులను లౌకిక విషయముల నుండి మఱలించి ధారణాభ్యాసమున నిష్టదైవముయొక్క దివ్యమంగళ విగ్రహమందు మనస్సును లగ్నము కావించి, క్రమముగ మూర్తియొక్క అవయవము లన్నియు మనస్సునకు రాఁగా ధ్యానాభ్యాసము గావింపవలయును. ధారణాభ్యాసమునకైనను ఒక్క యవయవమునుండి వేఱొక యవయవమునకుఁ బోవునుగాని, యీ ధ్యానాభ్యాసమున నట్లు పోరాదు. ఏదో నొక యవయవము మీఁదగాని, పాదముల మీఁదగాని, ముఖము మీఁదఁగాని మొత్తము రూపము మీఁదఁగాని మనస్సును నిల్పవలయును. మనస్సచ్చట నుండి కదలరాదు. అట్టి స్థితి కలుగుటకు ప్రతి దినము ఉదయమును, సాయంత్రము అభ్యాసము గావింపవలయును. అర్ధరాత్రి ధ్యానమునకు చాల అనుకూలమైనది. ధ్యానాభ్యాసమునకు పట్టుదల చాల ముఖ్యము. ఎన్ని యిబ్బందులు కలిగినను, విఘ్నములు సంభవించినను ఒకేవేళకు ప్రతిదినము విడువకుండ నియమిత ధ్యానకాల పరిమాణమునను తగ్గకుండ చేయుచుండవలయును. తోడుకావలెనని కాని, యేవో సౌకర్యములు కావలెనని గాని కోరరాదు. మౌనము ముఖ్యము. ఎంతటివాఁడు వచ్చినను ధ్యానమునుండి లేవరాదు. సాత్త్వికాహారమును దీసికొనుచు, శరీరారోగ్యమును, మనస్సును, ఇంద్రియములను ప్రశాంతిగ నుంచుకొనుచు అనన్య భావముతోఁ దన యిష్టదైవమగు శ్రీరామచంద్రమూర్తిని ధ్యానింపవలయును. ఇతర తలంపులు రారాదు. స్థలము తగినదై యుండవలయును.

* ధ్యానయోగమును గూర్చి పూర్తిగాఁ దెలియ వలెనని నాచే వ్రాయఁబడిన ధ్యానపద్ధతి యను గ్రంథమును జూడుఁడు.

ధ్యాన స్థలమేకాంతముగ నుండవలయును. అల్లరి పిల్లలు, పశువులు, చీమలు, దోమలు, నల్లులు, మిణ్ణల్లులు, గోమారులు, చెదలు, పాములు, తేళ్లు, ఇతర జంతువులు లేని స్థలముగను, దుర్గంధ మేమియును లేక పరిశుద్ధమైన స్థలముగను, గాలి వచ్చుచుఁ బోవుచుండునదిగను, పెద్దగాలి వీవకుండునదియు కావలెను. బొత్తుగా గాలి లేనిదియుఁ బనికిరాదు. నేల చదరమైనదై, బాగుగా గోమయముతో నలుకఁబడినదై యుండి రంగవల్లి (ముగ్గులు తీర్చినదై యుండ వలయును. అట్టి నేలమీఁద చిత్రాసనమునుగాని, ఇఱ్ఱి, జింక, పులి చర్మములలో నొకదానిని గాని, దర్భాసనమున, చిత్రాసనము, కంబళి వీనిలో దేనినైనను బఱచి, దానిపై పరిశుద్ధమైన ధౌతవస్త్రమును బఱచి భగవంతునకు శరణాగతి చేయవలయును. "స్వామీ! రామచంద్రా! నీ దివ్యమంగళ విగ్రహమును జూడ వలెనను కోరికచే, నీ ధ్యానము చేయవలెనని, నీ యాజ్ఞచే ఫలభారమును నీ పైవైచి ధ్యానింపఁ బూనుచున్నాను. నా మనస్సతిచంచలమైనది. రాగద్వేషాదులు నాకు స్వాధీనములు కానివి. నీవనుగ్రహించి, నీ స్వరూపమును నీదానుఁడగు వీనికి గోచరింపఁ జేయు భారము నీదే. ధ్యాన సాధన కావించి నిన్ను జూడఁగలనను నాశ నాకెంత మాత్రమును లేదు. కాని నీ యాధారమున, నీ అవ్యాజ కృపను నమ్ముకొని నీ యాజ్ఞప్రకారము ప్రయత్నము చేయుచున్నాను. తర్వాత నీ దయ" అని మొదట భగవంతునకును, తర్వాత గురువునకును, ధ్యాన విఘ్నములను తొలఁగించి త్వరగ స్వామి ప్రసన్నమగునట్లు చేయుటకు సీతా హనుమల్లక్ష్మణ భరత శత్రుఘ్నులకును, ఆది రామభక్తుఁడును, పరమ వైష్ణవుఁడునగు శంకరునకును మ్రొక్కులిడి కూర్చుండ వలయును.

ధ్యానమునకు పద్మాసనము ముఖ్యము. స్వస్తికాసనమైనను బనికివచ్చును. నడుము, మెడ, తల సమానముగ నుండునట్లు నిక్కి కూర్చుండ వలయును. ఎడమ అఱచేతిలో కుడి అఱచేతిని వెల్లకిల నుంచవలయును. ఇట్లుంచుటకు ముందు గురుముఖమునఁ దెలిసికొని పదికి తక్కువ లేకుండ ప్రాణాయామములు కావించుటవలన మనస్సేకాగ్రము కాఁగలదు. విషయ చింతలు తొలఁగగలవు. హృదయ పద్మము నాళము పైకి కోశము క్రిందకు ముడుచుకొని వ్రేలాడుచున్నట్లు భావించి, తర్వాతఁ బ్రాణాయామము చేయఁగా పుష్పము వికసించి పైకి తిరిగినట్లును, నాళము క్రిందనున్నట్లును భావింపవలయును. హృత్పద్మమున కెనిమిది దళము లున్నట్లును, ఎనిమిది దళము లెనిమిది దిక్కులకు వ్యాపించి

నట్లును, మధ్య కర్ణిక యున్నట్లును, ఆ కర్ణిక మధ్యమున నడుగున సూర్యమండలమును, దానిపై చంద్రమండలమును, దాని మధ్యమున వహ్ని మండలము నున్నట్లును, ఆ దివ్యప్రకాశ మధ్యమున దివ్యసింహాసన మున్నట్లును, ఆ సింహాసనముపై సీతాసమేతుఁడైన శ్రీరామచంద్రమూర్తి ఆసీనుఁడైనట్లును భావింపవలయును.

ఇంద్రనీల మణిని బోలి దివ్యకాంతులను వెదజల్లుచున్న దివ్యశరీరచ్ఛాయ కలవాఁడును, ఆజాను బాహువులు కలవాఁడును, హృష్టపుష్ట శరీరము గలవాఁడును, పాదనఖకాంతులచే దిక్కులను వెలిఁగింపఁజేయు వాఁడును, దివ్యమైన స్వర్ణచేలమును ధరించిన వాఁడును, మణులు కూర్చిన బంగారు మొలనూలును ధరించినవాఁడును, సకల భువనములను లోన నిముడ్చుకొనిన చిఱుబొజ్జ కలవాఁడును, విశాలమగు వక్షస్థలము కలవాఁడును, నవరత్నకాంతులచేఁ బ్రకాశించు వివిధ మంజుల మణిహారములు కలవాఁడును, దిక్కులను బ్రకాశింపఁజేయు దివ్య కౌస్తుభమణి కంఠమున గలవాఁడును, గుండ్రముగను, స్నిగ్ధముగనున్న ఉన్నత భుజములు కలవాఁడును, మెలితిరిగిన కండలు కల ఱెక్కలు కలిగినవాఁడును, ఆజానుబాహువులు కలవాఁడును, భుజములకు భుజకీర్తులును, బాజు బందులును, కరమునకుఁ గంకణములును గలవాఁడును, వళులు కలిగిన కంబుకంఠము కలవాఁడును, విశాల ముఖము, పద్మ పత్ర నేత్రములు, చిఱునవ్వులొలుకు నెఱ్ఱని పెదవులు కలవాఁడును, మణులు కూర్చిన కర్ణకుండలములు కలవాఁడును, వంకరలు తిరిగిన అలినీలాలకములు దివ్యముఖముపై శోభించుచుండ, నసంఖ్యాకములగు మణిరత్నములచే నిర్మింపఁబడి వివిధవర్ణములు కల దివ్యకాంతులను వెదజల్లెడు దివ్య కిరీటము ధరించినవాఁడును, దృఢమును, శోభాయమానము నగు ధనుస్సును, బాణతూణీరములను ధరించినవాఁడును, ఇట్టి దివ్యమూర్తి చుట్టును దివ్య తేజస్సు ప్రకాశించుచున్నట్లును భావింపవలయును. ధారణాభ్యాసము ఇదివఱకే కలదు కావున నిట్లు భావింపఁగానే స్వామి స్వరూపావయవములు చప్పున మనస్సునకు వచ్చితీరును. తన క్లిష్టమైన యవయవ సౌందర్యము మీఁదఁగాని, మొత్తము రూపము మీఁదఁగాని మనస్సును లగ్నము కావించి, తైలధారవలె నెడతెగక ధ్యానము చేయవలయును. ఇట్టి ధ్యానమువలన మనస్సెక్కడ నుండుననిన నక్కడనుండుటయే

గాక మూర్తి దర్శనమగును. ఆనందోద్భవ మగును. ఆనంద బాష్పములు, గగుర్పాటు రావలెను. ఇదియొక గుర్తు.

మనస్సు దేనిని జింతించిన నది యట్టి స్వరూపమును బొందును. ఒక పుస్తకమును జింతించిన నది పుస్తకాకారమును బొందును. కాశీ పట్టణమును జింతించిన కాశీ స్వరూపమును బొందును. అట్లే ఒక చెడ్డ వస్తువును స్మరించిన నది ఆవస్తువు స్వరూపమును జెందును. అట్లే భగవత్స్వరూపమును జింతించిన మనస్సు కూడ భగవత్స్వరూపమగును. అనఁగా శ్రీరామచంద్రుని ధ్యానించు వేళ మనస్సు శ్రీరామ రూపమును బొందును. ప్రాపంచిక విషయము లశాశ్వతములు. అంతవంతములు. అవి నిరంతరము మారుచుండును. అవి దుఃఖమయములు. విషయములలోఁగల సుఖమైనను ఆభాస సుఖమే కాని యథార్థమును శాశ్వతమునగు సుఖము కాదు, కావున మనస్సు విషయములను జింతించినంత వఱకు శాశ్వతానందమును బొందఁజాలదు. శ్రీరామ స్వరూపము శాశ్వతమును, నిత్యానందమయమును, నిత్యనూతనమును గావున మనస్సు శ్రీరామ స్వరూపమును జింతించుచో ఆ నిత్యానందము, ఆ శాంతిసౌఖ్యము, ఆ నిత్య నూతన సౌందర్యము మొదలగునవి తానుగూడ పొంది యానందానుభూతిని చెందును. ఈరుచి మఱగిన మనస్సు మరల విషయస్పర్శ చేయఁజాలదు. మనస్సెప్పుడు శ్రీరామ స్వరూపమును జెందినదో అప్పుడు దానికి మనస్సను ఖ్యాతి యుండఁజాలదు. సంకల్ప వికల్పాత్మక మైనది మనస్సు. శ్రీరామస్వరూపమును జెందిన తర్వాత నిఁక సంకల్ప వికల్పములకు అవకాశము లేదు కావున ఆస్థితిని అమనస్క మనవచ్చును. 'అకారేణోచ్యతే విష్ణుః' అని యుండుటచే 'అ' అనఁగా విష్ణువు. ఇప్పుడు మనస్సు 'అ' కార (విష్ణు) స్వరూపము చెందినది కావున భక్తిమార్గములో నీధ్యానస్థితికిని అమనస్క మనవచ్చును. అమనస్కమనఁగా నసలు మనస్సే లేకుండపోవుటకు జ్ఞానమార్గములో

కావున ధ్యానములో ధ్యేయాకారము భాసింపనంతవఱకు కేవలము శుద్ధ చైతన్యముగనే మనస్సుండును. ధ్యానములో నైనను ధ్యాత (ధ్యానించువాఁడు) ధ్యేయము (ధ్యానింపఁబడు పరమాత్మ) ధ్యానము మీఁదిపరకుఁగల సంబంధము. ఈత్రిపుటి ధ్యానముయొక్క ప్రాథమికావస్థలో నుండి తీరును. క్రమముగా ధ్యానము బలపడిన కొలది ధ్యాత ధ్యేయవస్తువు దగ్గఱకు చేరును. ఇట్లు క్రమ క్రమముగా ధ్యాత ధ్యానమందు లీనమగును. ధ్యాత స్వరూపస్థితిని మఱచి

పోవును. ఇట్లు పోయిపోయి ధ్యానము ధ్యేయములో లీనమగును. అనఁగా ధ్యాతృధ్యానములు రెండును ధ్యేయవస్తువులో లీనమగును. అప్పుడు ధ్యేయైక గోచరమగుటచే దానిని సమాధి యందురు.

ఈ ధ్యాన పద్ధతినిగూర్చి భాగవతములోని యీ క్రింద నుదాహరింపఁ బడిన విషయమును దెలిసికొనుట సాధకులకు చాల ముఖ్యము. ఇది స్వయముగ భగవంతునిచే ఉద్ధవునకుఁ జెప్పఁబడినది.

శ్లో॥ సమ ఆసన ఆసీనః - సమకాయో యథాసుఖమ్
హస్తావుత్సంగ ఆధాయ - స్వనాసాగ్ర కృతేక్షణః॥
ప్రాణస్య శోధయేన్మార్గం - పూరకుంభక రేచకైః
విపర్యయేణాపి శనై - రభ్యసే న్నిర్జితేంద్రియః॥
హృద్య విచ్ఛిన్న మోంకారం - ఘంటానాదం బిసోర్ణవత్
ప్రాణేనోదీర్య తత్రాథ - పునః సంవేశయేత్స్వరమ్॥
ఏవం ప్రణవ సంయుక్తం - ప్రాణమేవ సమభ్యసేత్
దశకృత్వ స్త్రిషవణం - మాసాదర్వాగ్ జితా నిలః॥
హృత్పుండరీక మంతస్థ - మూర్ధ్వనాళ మధోముఖమ్
ధ్యాత్వోర్ధ్వ ముఖ మున్నిద్ర - మష్ట పత్రం సకర్ణికమ్॥
కర్ణికాయాం న్యసేత్సూర్య - సోమాగ్నీ నుత్తరోత్తరమ్
వహ్ని మధ్యే స్మరే ద్రూపం - మమైత ద్ధ్యాన మంగళమ్॥
సమం ప్రశాంతం సుముఖం - దీర్ఘచారు చతుర్భుజమ్
సుచారు సుందరగ్రీవం - సుకపోలం శుచిస్మితమ్॥
సమాన కర్ణ విన్యస్త - స్ఫురన్మకర కుండలమ్
హేమాంబరం ఘనశ్యామం - శ్రీవత్స శ్రీనికేతనమ్॥
శంఖ చక్ర గదా పద్మ - వనమాలా విభూషితమ్
నూపురైర్విలసత్పాదం - కౌస్తుభ ప్రభయా యుతమ్॥

ద్యుమత్కిరీట కటక - కటి సూత్రాంగదా యుతమ్
సర్వాంగ సుందరం హృద్యం - ప్రసాద సుముఖే క్షణమ్॥
సుకుమార మభిధ్యాయే - త్సర్వాంగేషు మనోదధత్
ఇంద్రియాణీంద్రియార్థే భ్యో - మనసాఽఽకృష్య తన్మనః॥
బుద్ధ్యా సారథినా ధీరః - ప్రణయేన్మయి సర్వతః॥
తత్సర్వ వ్యాపకం చిత్త - మాకృష్యైకత్ర ధారయేత్
నాన్యాని చింతయేద్భూ యః - సుస్మితం భావ యేన్ముఖమ్॥
తత్ర లబ్ధ పదం చిత్త - మాకృష్య వ్యోమ్ని ధారయేత్
తచ్చ త్యక్త్వా మదారోహో - నకించి దపి చింతయేత్॥
ఏవం సమాహితమతి - ర్మామే వాత్మా న మాత్మని
విచష్టే మయి సర్వాత్మ - జ్యోతి ర్జ్యోతిషి సంయుతం॥
ధ్యానే నేత్థం సుతీవ్రేణ - యుంజతో యోగినో మనః
సంయాస్యత్యాశు నిర్వాణం - ద్రవ్య జ్ఞాన క్రియా భ్రమః॥

# అ ర్థ ము

మిక్కిలి యెత్తునుగాక, మక్కిలి పల్లమును గాక, సమముగానుండు ఆసనముపై శరీరమును సరిగానుండి సుఖముగాఁ గూర్చుండి, చేతులను దన తొడపై నుంచుకొని, దృష్టిని నాసికాగ్రమున నుంపవలయును. తర్వాత పూరక కుంభక రేచకములతో, మరల విపర్యయముగను (అనులోమ విలోమ గతిని) ప్రాణాయామము గావించి, నాడీ శోధనము చేయవలయును. ప్రాణాయామ మును మెల్లమెల్లగాఁ బెంచుచు నింద్రియ జయాభ్యాసముకూడ చేయవలయును. హృదయ కమల నాళగతమగు సన్నని దారమువలె ఓంకారమును జింతించి, ప్రాణము ద్వారా దానిని పైకి తెచ్చి, దానిలో ఘంటా నాదమువలె స్వర మును స్థిరము కావింప వలయును. ఆ స్వరనాదము తెగకుండునట్లు చూడవల యును. ఈవిధముగఁ బ్రతిదినము మూఁడు సారులు పది పది చొప్పున ప్రాణా యామములు గావించిన నెలలో వాయువు వశమగును. తర్వాత హృదయ

ములో నొక పద్మము కాడపైకిని, ముఖము క్రిందకు నున్నట్లును భావించి, అది పైకి ముఖము కలిగి యున్నట్లును, అది వికసించినట్లును భావింపవల యును. దాని కెనిమిది దళములున్నట్లును, మధ్యను (పసుపుపచ్చని) కర్ణిక యున్నట్లు భావించి, దానియందు సూర్య చంద్రాగ్నులను న్యాసము కావింప వలయును. ఆ యగ్ని మధ్యమున నా స్వరూపమును ధ్యానము చేయవలెను. ఈ నారూపము ధ్యానమునకు మంగళప్రద మైనది. నాయవయవములు సమ మైనవి. ప్రశాంత స్వరూపము. సుందర ముఖము. దీర్ఘములై యందముగనుండు చతుర్భుజములు. మిక్కిలి యందమగు కంఠము. సుందర కపోలము. మందహా సము. సమానముగనున్న కర్ణములకు వెలుగుచున్న మకర కుండలములు. బంగారు వన్నెగల వస్త్రము. మేఘశ్యామల విగ్రహము. శ్రీవత్సమును, లక్ష్మియు వక్షః స్థలమున నలంకరించియుండిన స్వరూపము. శంఖ చక్ర గదా పద్మ వనమాల విభూషితమగు స్వరూపము. నూపురములతోఁ బ్రకాశించు పాదము.కౌస్తుభమణి ప్రకాశముతోఁ గూడినవాఁడను, ప్రకాశించుచున్న కిరీట, కటక, కటిసూత్రాం గదములతోఁ గూడిన వాఁడను, సర్వాంగ సుందరుఁడను, హృదయంగమముగ నుండువాఁడను, ప్రసాదమగు సుముఖ నేత్రములుగల సుకుమారుఁడనగు నన్ను మిక్కిలిగ ధ్యానింపవల యును. సర్వాంగము లందును మనస్సును లగ్నము కావింపవలయును. బుద్ధిమంతుఁడగు వాఁడు మనస్సుద్వారా యింద్రియములను విషయములనుండి మరలించి, మనస్సును బుద్ధిరూపమగు సారథిద్వారా నాయం దుంచవలయును.ఒక్కొక్క యంగమునుధ్యానించుచుసమస్త శరీరమునుధ్యానించిన తర్వాత నేదో యొక యంగమునందే ధ్యానించి చివరకు నేదియును జింతింపక నొక్క మందహాస ముఖారవిందమును ధ్యానింపవలెను. ముఖారవిందముపై మనస్సు నిల్చిన తర్వాత నాకాశమందున స్థిరము గావింపవలయును. అక్కడ నుండి ఆకాశమును వదలి నాస్వరూపమందు మనస్సు నారూఢము గావింప వలెను. నన్ను తప్ప మ రేదియును జింతింపరాదు. ఈవిధముగఁ జిత్తము వశీ భూతముకాఁగా నొక జ్యోతిలో వేఱొక జ్యోతిని గలిపిన నేకమైనట్లు, నేనతనిలోను, నాలోనతఁడును నుండిన ట్లనుభవము కలుగును. ఈవిధముగ తీవ్రధ్యానయోగము ద్వారా నాయందే యతని చిత్తమును సంయమము కావిం చిన నతని చిత్తమునుండి వస్తుజ్ఞానము, ఆనేకత్వము, తద్వస్తు ప్రాప్తికై కర్మల యొక్క భ్రమయు శీఘ్రముగ నశించును.”

పైనఁ జెప్పిన భగవద్వాక్యము కంటె ధ్యానమును గూర్చి మనమేమి వ్రాయఁగలము? అభ్యాసమవసరము.

## 16. స మా ధి

సమాధు లనేక రకములు కలవు. పాతంజలి యోగశాస్త్రము ననుసరించి 'తదేవార్థమాత్ర నిర్భాసం స్వరూప శూన్యమివ సమాధిః' ధ్యానము స్థిరము కాఁగా మనస్సు ధ్యేయాకారమగును. అప్పుడు తన స్వరూపమును మఱచును. దీనినే సమాధి యందురు.

అన్నిటికిని మనస్సే కారణము. సమస్తేంద్రియముల తోడను, దేహము తోడను, అహంకారము తోడను, ఆత్మతోడను, పరమాత్మతోడను మనస్సు తాదాత్మ్యమును జెంది, దేనిని తాదాత్మ్యమును జెందుచున్నదో అదియే తానను కొని వ్యవహరించుచుండును. ఈ వ్యవహారమే మనలను సంసార గర్తములోఁ బడఁద్రోయుచున్నది.

వాసుదేవ మయముగాని పదార్థమొక్కటియును మనకుఁ గనఁబడు దానిలోఁగాని, కనఁబడని దానిలోఁగాని లేదు. వాసుదేవ (పరమాత్మ) స్వరూపమొక్కటియే యైనను, మనకు రెండుగ భాసించుచున్నది. ప్రత్యక్ చైతన్యము, బాహ్య ప్రపంచము. ఇవి యా రెండుగఁ గనఁబడునది. ప్రత్యక్ చైతన్యము పాలలోని వెన్నవలెఁ గనఁబడదు. బాహ్యప్రపంచము వెన్న, పాలు కలిసిన నెట్లుండునో అట్లు కనఁబడు చున్నది. దానిని తఱచినఁగాని వెన్న బయటపడదు. అట్లే సాధన వలనఁగాని చైతన్య స్వరూపము భాసింపదు. ఈ ప్రపంచ స్వరూపము కూడ పరమాత్మ పదార్థమే కాని యన్యముకాదు. బాహ్య రూపమును జూచి యన్యముగాఁ దలఁచుటచే మనకు బంధము కలుగు చున్నది. మట్టికిని కుండకును బోల్పవచ్చును. కేవలము మట్టి వంటిది పరమాత్మ వస్తువు. ఆ మట్టియే కుండ రూపముగ మారినది. మట్టికిని కుండకును భేదము లేనేలేదు. అయితే మనకు అజ్ఞానము వలన మట్టిది ఇది యని తోఁచక కుండ, చట్టి, బాన, మూఁకుడు ఇవన్నియు భిన్నములుగ తోఁచుచున్నవి. అనఁగా మనకు నామ, రూపములే తోఁచి భిన్నభావమునకు దారితీయుచున్నది. నిజమునకు మట్టియే యథార్థస్వరూపము గాని కుండగాదు. అది అల్పకాల ముండు నదియే. కావున నది మిథ్యారూపమైనది. మిథ్యాస్వరూపమగు కుండ, చట్టి

మొదలగునవి భాసింపక కారణభూతమగు మృత్తిక భాసింపవలయును. అనఁగాఁ బ్రపంచ రూపముననున్న యీ విషయములు మన మనస్సునకు రాక, కేవలము చైతన్యము మాత్రమే మనకు గోచరించ వలయును. అదియే సమాధి అనఁగాఁ బ్రపంచ విషయచింతనము మానవలయును. అనఁగా మనస్సు చేయుకార్యములు మనస్సు చేయరాదు.

ధ్యానములో మనస్సు శ్రీరామచంద్రునియొక్క స్వరూపమును ధ్యానించుచుండవలయును. ఆ శ్రీరామచంద్రమూర్తి తప్ప వేఱొక తలంపు గాని, వేఱొక స్వరూపముగాని మనస్సునకు రారాదు. ఇప్పుడు ధ్యాత (ధ్యానించువాఁడు); ధ్యేయము (ధ్యానింప బడునది) ధ్యానము (ధ్యాత చేయు కార్యము) ఈ మూఁడును (త్రిపుటి) కలవు. సమాధి స్థితిలో తీవ్రధ్యానము చేయుకొలఁది ధ్యాతధ్యానము నందును, ధ్యానము ధ్యేయమునందును లయమై ధ్యేయస్వరూపమొక్కటే నిలిచి యుండును. అనఁగా తాను ధ్యానము చేయుచున్న స్పృహ గాని, చేయునది ధ్యానమను స్పృహగాని లేక ఏకైక శ్రీరామస్వరూపమందే ధ్యానము పర్యవసింప వలయును. దీనికే సమాధి యందురు. ఈ త్రిపుటియొక్క యేకత్వమునకే సంయమ మందురు. ఇది అనుభవైక వేద్యమే కాని వ్రాతకు అందునది కాదు. ఈ విషయమున నింతకంటె వ్రాయ వీలుబడదు. కేవలము సాధన చేసి యనుభవపూర్వకముగఁ దెలిసికొనవలసిన విషయమిది. మంత్ర యోగమునఁ గలుగు సమాధికి మహాభావ సమాధి యని పేరు. ఇంకను వివిధ సమాధులు కలవు. ఈ విషయము ధ్యానపద్ధతి యను గ్రంథములో జర్చింపఁ బడినది. వలయువారు దానిలోఁ జూడుడు.

## ఉపసంహారము

ఇంతవఱకు చెప్పిన విషయమింతయును శ్రద్ధగా నాచరించుచో ఫల మబ్బుటలో నేవిధమగు సందేహమును లేదు. మంత్రసిద్ధి యగువఱకు ఈ నియమము లన్నియు నవసరము. మంత్ర శరణు డగువాఁడు తాను నిరంతరము శ్వాసశ్వాసకు శ్రీరామమంత్రమును నిద్రలోనైన జపించుచుండును. అతఁడు భౌతిక శరీరము కలవాఁడుగఁ దోఁచినను కేవలము మంత్రస్వరూపుఁడగును. అతని శరీరములోని ప్రత్యవయవము మంత్రమయ మగును. అట్టి స్థితి ప్రతివానికిని దుర్లభమైనది. అట్టి విలక్షణుఁడగు వఱకును నియమాను సారముగ మంత్ర

జపము చేయుట ఆవసరము. గ్రంథ విస్తరముచే దీనిలోఁ జెప్పఁబడని విశేష మంత్రార్థములను గురువువలనఁ దెలిసికొనవలయును. కొందఱు 'ఈ మంత్రము గొప్పది. ఇది హీనమైనది.' అనుచు గురువు నందును, మంత్రము నందును అవిశ్వాసము ప్రకటింతురు. వారికెన్ని జన్మలకైనను మంత్రము సిద్ధింపదు. అన్ని మంత్రములు నొక్కటే శక్తికలవి. ఈ శ్రీరామ మంత్రమునకు తోడుగా సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న మంత్రములను గూడ జపించుట వలన శ్రీరాముఁడు శీఘ్రముగఁ బ్రసన్నుఁడగును. ఈ శ్రీరామ తత్త్వము విషయములో శ్రీరామ రహస్యోపనిషత్, రామపూర్వతాపిన్యుపనిషత్, రామోత్తర తాపిన్యుపనిషత్ వీటిని అర్థముతోఁ జదువుట చాల ముఖ్యము. వానిని జదువుట వలనఁ జాల విషయము తెలియఁగలదు. మేమే కొలఁది దినములలో దానిని బ్రచురింపఁ గలము.

కావున మంత్రోపాసకులు శ్రద్ధాభక్తులతో నింతవఱకుఁ జెప్పిన విషయములను మనసున కవగాహనము కావించుకొని అనుష్ఠానము కావించు కొందురను పరమ విశ్వాసముతో దీని నింతటితో ముగించుచున్నాను. శెలవు.

శ్రీ సీతారామార్పణమస్తు.

—♦—



# సాధన గ్రంథ మండలి, తెనాలి.

స్థాపితము : 1945

## గ్రంథ మండలి ఆశయము

ఆంధ్రులయం దాధ్యాత్మిక వికాసమును కలిగించి వారి జీవితలక్ష్యమును చూపుటయే సాధన గ్రంథ మండలి యాశయము.

ఉత్తమమైన భారతీయ సంస్కృతికి, విజ్ఞానమునకు, ఆధ్యాత్మికసంపత్తికి, దివ్యచరిత్రములకు, పవిత్ర జీవితమునకు, సాధన గ్రంథ మండలి గ్రంథములు అద్దముల వంటివి.

పరమార్థమును బొందుటకు, ప్రాచీనులు త్రొక్కిన సాధనమార్గమును, మన పూర్వుల ఉత్తమ ఆదర్శములను, తెలిసికొనవలెనన్న సాధన గ్రంథ మండలి గ్రంథములే సాధనములు.

సం॥ కి క్రౌను 1/4 సైజులో 4 గ్రంథములు వెలువడును. షుమారు మొత్తము 500 పేజీలుండును.

| | | |
|---|---|---|
| మహారాజ పోషకులు : | శాశ్వతముగ | రు 116/- |
| రాజపోషకులు | ,, | రు 58/- |
| పోషకులు | ప్రతిసంవత్సరము | రు 25/- |
| సభ్యులు | ,, | రు 10/- |

పై నాలుగు తరగతులవారి నామములు ప్రతిగ్రంథమున ప్రకటించి గ్రంథములు ఉచితముగ పంపబడును.

అభిమానులు :— సామాన్య చందా సం 1కి రు 5/- లు మాత్రము. వీరికిని గ్రంథములు ఉచితముగ పంపబడును.

# మా ప్రచురణలు

పద్మపురాణము ఆదిమఖండము 1_8_0
,, భూమి ,, 2_0_0
,, బ్రహ్మ ,, 1_0_0
పై 3 పుస్తకములు కలిసి తీసుకొంటె 3_0_0
భారతీయ తత్త్వ శాస్త్రము 2_0_0
భక్తి తత్త్వము 0_12_0
అష్టాదశ శ్లోకగీత 0_12_0
పై 3 పుస్తకములు కలిపి తీసుకొంటె 2_8_0
రాధారహస్యము (40 గ్రంథముల సారము) 1_4_0
కల్యాణ పంజరము 1_4_0
మహాత్మా ఉపాసనీబాబా (సచిత్రము) 1_8_0
మానవధర్మము 1_0_0
సిద్ధాంత కల్పవల్లి 1_0_0
గురు శిష్యులు 1_0_0
(శ్రీ రామకృష్ణ వివేకానందులు)
సంకీర్తన మీమాంస 1_0_0
అర్థ పంచకము 0_12_0
పరమార్థ తత్త్వము 0_12_0
జడభరతుడు 0_12_0
శ్రీశుకుడు 0_12_0
గోవిందదామోదర స్తోత్రము 0_8_0
(విపులపీఠిక, సచిత్రము)
భక్తిరసాయనము 2_0_0
శ్రీ త్రిపురాంతకేశ్వర శతకము 0_4_0

ఈశ్వర సాక్షాత్కారము 0_3_
♦ హిందూకోడ్ బిల్లు సమీక్ష 1_0
♦ నరసదాసు కీర్తనలు 0_12_
♦ కాళహస్తీశ్వర శతకము 0_8
♦ శ్రీ సీతారామ శతకము 0_2
♦ సప్త మహావ్రతములు 0_6
♦ శ్రీ త్యాగరాజ చరిత్ర 0_4
♦ శ్రీరామ పూజావిధానము 0_6
♦ శ్రీరామనామప్రభావము 0_6
♦ ముక్తి గీత 0_6
హరినామ మహిమ శతకము 0_4
(2 వ కూర్పు)
భగవత్ప్రాప్తి ఉపాయములు 0_4
(2 వ కూర్పు)
పరమ సాధన (అచ్చులో) 0_12
గీతాప్రతిభ (అచ్చులో) 0_12
బదరీయాత్ర (3వ కూర్పు, 1_
* ఆశ్విని మాహాత్మ్యము 2
* భాగవత కథ 2_

♦ ఈ గుర్తువి కొలదిప్రతులు మాత్రమే గలవు.

* ఈ గుర్తువాటికి కమీషను లే
షరా:_ రు 1/_ కు లోపు వి.
లేదు. రు 5 _ లు మిం
రు 1 కి 0_3_0 లు కమీ
రు 25/ _ లకు 0_4_0
రు 100 /_ లకు 33_0_0
కమీషను.



శ్రీ రామశరణ్ కుందుర్తి వేంకటనరసయ్యగారిచే రచింపబడిన

## గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | భగవన్నామ ప్రభావము | 0-3-0 |
| 2. | శ్రీరామనామ ప్రభావము | 0-6-0 |
| 3. | నవవిధ భక్తులు | 1-8-0 |
| 4. | శ్రీరామ పూజావిధానము | 0-4-0 |
| 5. | కలిసంతరణోపనిషత్తు (వ్యాఖ్యానసహితము) | 1-0-0 |
| 6. | బ్రహ్మచర్యము (ప్రోద్దారుగారి హిందీగ్రంథమున కనువాదము) | 0-3-0 |
| 7. | పరమార్థతత్త్వము | 0-12-0 |
| 8. | శ్రీరామమంత్రానుష్ఠానము (బైండు 3-0-0) సాదా | 2-8-0 |
| 9. | గురుపూజా విధానము | 0-3-0 |
| 10. | అనుష్ఠాన క్రమము | 0-4-0 |
| 11. | ప్రశ్నోత్తరి (శ్రీశంకరాచార్యులవారి టీకాతాత్పర్యములతో) | 0-4-0 |
| 12. | శ్రీరామ పటలము (శ్రీరామోపాసకులకు చాలముఖ్యమైనది.) | 0-4-0 |
| 13. | భాగవత కథ (ప్రథమఖండము) | 2-0-0 |
| 14. | భారతీయదర్శనము (ప్రథమభాగము) | 1-8-0 |
| 15. | శ్రీరామమంత్ర పురశ్చరణము | 0-8-0 |
| 16. | నరసదాసు కీర్తనలు (1 భాగము) | 0-10-0 |

ప్రాప్తిస్థానము: శ్రీరామశరణ మందిరము, బుద్ధాం. యాజలి Post.
శ్రీరామనామ క్షేత్రము, గుంటూరు.

